## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పార్థసారథి ప్రవచనాలు

1. జీవనసూత్రాలు

2. అభయవచనాలు

రచన :


సారథి శ్రీ మోపిదేవి కృష్ణస్వామి

ఎమ్.ఎ., పి హెచ్.డి.






ప్రచురణ :

ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్టు

విశాఖపట్నం

# జీవన సూత్రాలు

పుట

# సారథి శ్రీ మోపిదేవి కృష్ణస్వామి



జీవితం మానవుని కాలక్షేపం కాకూడదు.

అది దేవుని కార్యక్రమం కావాలి!

— M. K.

# అక్షరపురుషునికి అక్షరాంజలి

అది ఫిబ్రవరి 12వతేదీ. మేమంతా మామూలుగా సాయంత్రం ప్రేయరు నిర్వహించాం. అయిపోగానే కాగితాలు పెన్ను తీసుకొని కూర్చో అన్నారు స్వామి. నేనాశ్చర్యపోయాను. ఆయన ఎప్పుడు ఏదయినా అడగవచ్చు అని ఇన్నేళ్ళుగా తెలిసిన మేము అన్నీ సిద్ధమే అన్నాం చాలా ఆనందంగా.

రచన ప్రారంభమైంది. అలా సాగిపోతోంది. హాస్పిటల్‌లో అందరూ కూడా ఇంత అనారోగ్యస్థితిలో కూడా ఈయన రచన చేస్తున్నారే అని ఆశ్చర్యపోయారు. డాక్టరు నాగేశ్వర్రావుగారు, సుధ "మాస్టరుగారూ! మీ భగవద్గీతకు మా హాస్పిటల్ వేదిక అయిందా! కొన్ని అనుకోని సంఘటనలను, భరించరాని బాధలను కూడా లోకానికి సందేశమివ్వడానికి వినియోగించే మిమ్మల్ని చూస్తుంటే మాకేమనాలో అర్థం కావటంలేదు. ఒక ఇంగ్లీషు రచయిత అన్నారు. "బిజీగా ఉన్న వాడికి పనిచెప్పండి. పని త్వరగా అవుతుంది" అన్నారు.

పని త్వరత్వరగా సాగిపోతోంది. వారం రోజులలో దానికొక సమగ్రమైన రూపం వచ్చింది. చెప్పింది వ్రాయటమేగాని అది ఏమిటి ఎందుకు వ్రాస్తున్నాను అన్నది నాకే అర్థంకాని సందిగ్ధస్థితి. నాకు ఆయనపైగల భయం భక్తి అంతటిది. క్రమంగా ప్రణాళిక నాకు అర్థమైంది. అవగాహనకు వచ్చింది. ఇదొక నూతన ప్రక్రియ. ఆఖరికి తానిప్పుడు జనన మరణాల మధ్యనుండి కూడ మిగిలిన శక్తిని ఇలా సద్వినియోగం చేస్తున్న ఆయనకు మనస్సులోనే శతసహస్ర వందనాలర్పించాను. మోక్షస్థితి అంటే ఇది కదా అని మనస్సుకు అనిపించింది. ఈ అక్షర యజ్ఞంలో పాలుపంచుకొనే అవకాశాన్నను గ్రహించిన అక్షరపురుషుడై అక్షర పురుషునిగా మనందరి హృదయాలపై చెరగని ముద్రవేసిన మన సారథికీ ఆయన ద్వారా తననుచేరే మార్గాన్ని మనకను గ్రహించిన ఆ పార్థసారథికీ ఇదే నా అక్షరాంజలి!

నమస్సుమాలతో

మంత్రి



# IV

# వెనుకనున్న విశేషం!

ఇ. కె. మాస్టరుగారి మంత్రగీతను మరొక్కసారి చేతబట్టి అలా అలా ముందుమాటలోనికి తొంగిచూశాను. అందులో ఒకచోట ఆయన ఒక సూక్ష్మాంశాన్ని వివరించారు. దాని సారాంశమిది : భగవద్గీత పూర్తిగా అర్థం చేసికోవాలంటే జననమరణాల మధ్య, వాటిలో దేనికైనా సిద్ధపడి, వాటికి అతీతంగా నిలబడినవాడు కావాలి!కురుక్షేత్ర మహాసంగ్రామంలో అర్జునుడికి అలాంటి పరిస్థితి ఏర్పడింది. ఘన విజయాన్నే సాధిస్తాడో, వీరమరణాన్నే పొందుతాడో- రెండింటికీ అతడు సిద్ధమై ఉన్నాడు. అలాంటిస్థితిలో ఉన్నవాడికి మాత్రమే భగవద్గీత ! మిగిలినవారికి అందేది అంతంతమాత్రం. ఎవరి మానసికస్థాయిని బట్టి వారికి అందుతుంది'- అన్న భావాన్ని వ్యక్తంచేశారాయన ముందుమాటలోవి వాక్యాలలో !

ఆ వాక్యాలు నన్ను ఆకట్టుకొన్నాయి. కారణం ఆ పుస్తకం చేతబట్టిన క్షణాలలో నేను అలాంటిస్థితిలోనే ఉంచబడ్డాను గనుక! పిన్నమనేని పాలీక్లినిక్‌లో మూత్రపిండాలకు శస్త్రచికిత్స నిర్ణయమయిన వేళ అది. అక్కడ ఆ బెడ్‌మీద పడుకొని మంత్రగీత తెరిచాను.

మూత్రపిండాల చికిత్స అన్నది కొంచెం సాహసంతో కూడిన విషయమే! దేనికయినా సిద్ధపడి ముందుకు అడుగు వేయవలసిన విషయమే ! జనన మరణాల నడుమ నిలచినస్థితి అది. వాటికి అతీతంగా నిలబడవలసిన స్థితి అది. సరిగా ఆ సమయానికి మంత్రగీత నా చేతికి అందడం అది ఒక అనుగ్రహవిశేషం.

1988 జనవరి 1వ తేదీన విజయవాడ నుండి బందరు స్కూటరుమీద వెళుతూ ఉండగా రోడ్డుప్రమాదం జరిగింది. ఆ ప్రమాదంలో ఎడమచేతి ఎముక

విరిగింది. అప్పటికి అదే గమనించబడింది. దానికి తగిన చికిత్స చేయించడం జరిగింది. ఇప్పుడు వైద్యులు తేల్చినదేమిటీ అంటే, ఆ యాక్సిడెంటు ఫలితంగానే క్రమంగా మూత్రపిండాలు దెబ్బతిని పోయాయని. ఇది డిసీజ్ కాదనీ, షాక్ అనీ! ఆపరేషన్ చేయాలనీ, రీప్లాంటేషన్ తప్పదనీ!

ఎక్కడ యాక్సిడెంట్, ఎక్కడ షాక్! విధి బలీయమయిన మలుపునేదో త్రిప్పుతూ ఉన్నది. దీనిని తపస్సుగా స్వీకరించడమే ఇక పరిష్కారమనిపించింది.

మరిప్పుడు జరగవలసిందేమిటి? ఆపరేషన్ వరకు కర్తవ్యమేమిటి? పేషంటులా పడుకోవడమేనా! ఇంకేమయినా ఉన్నదా?_ అన్న ఆలోచననాలో రగులుతున్న వేళ మంత్రగీత నాకు అందింది. ముందుమాట నాముందు నిలిచింది. భగవద్గీత గురించి వైవిధ్యం కలిగిన ఒక రచన ఈ సమయంలో వెలువడితే బాగుండును అనిపించింది. అనిపిస్తూ ఉండగానే నవ్వొచ్చింది.

మాష్టరుగారినుండి మంత్రపూతమయిన వ్యాఖ్యతో 'మంత్రగీత' వెలువడింది. శంఖారావమన్న పేరుతో భగవద్గీతకు కల్పవృక్షంలాంటి వివరణం దిగివచ్చింది ఇంత జరిగిన తరువాత ఇంక క్రొత్తగా చెప్పబడవలసినది ఏముంటుంది? కాని మనస్సునకు ప్రచోదనం కలుగుతూ ఉన్నది. మనస్సును మాష్టరుగారు తట్టి లేపుతున్నట్లున్నది. 'నీవుగా చేయవలసినది మరికొంత ఉన్నది' అని ఆయన ఆజ్ఞాపిస్తున్నట్లు అనుభూతికి అందుతున్నది,

ఆ తరువాత కొంతసేపటికి ఒక ప్రణాళిక దర్శనమిచ్చింది. 'భగవద్గీతను మొత్తంగాకాక, ఒక ప్రత్యేకమయిన పద్ధతిలో కొన్ని కూర్పులుగాచేసి వివరించడం బాగుంటుంది_ అన్నది ఆ దర్శనం. ఆ భాగాలు ఎలా ఎలా ఉండాలీ అన్నది కూడా క్రమంగా మనస్సునకు అందుతూ వచ్చింది. మొదటిభాగంగా జీవనసూత్రాలను కూర్పుచేయాలి!_ అని నిర్దేశింపబడింది.

అంతే! ఇక రచన ప్రారంభమైంది. శరవేగంతో సాగింది. సాగుతున్న రచన తృప్తిని అందించసాగింది. 'జరుగవలసినది జరుగుతున్నది' అనిపించింది.

వ్యాధిగ్రస్తుడనన్న స్పృహ జారిపోయింది. భగవద్గీత పైస్తుతు అది చే పోయింది.

సాధకుడి నిత్యజీవితాన్ని నియమించేటందుకుగాను శ్రీకృష్ణుడు భగ తలో అక్కడక్కడా జీవనసూత్రాలను ఉపదేశిస్తూ వచ్చాడు. ఇప్పుడీ రచన జీవనసూత్రాలు అన్నీ ఆయా అధ్యాయాలను దాటి ఒకచోటున చేరుకొంటాయి. వరుసగా ఏర్పడతాయి. ఒకమాలగా రూపుదిద్దుకొంటాయి. నిత్యజీవిత యోగసా నకు ఆయన నిర్దేశిస్తున్న నియమాలేమిటి? అన్నది ఈ గ్రంథం తెలియజెబుతుం మానవుడు తన ప్రవర్తనను తీర్చిదిద్దుకోవడ మెలాగు అన్నది- ఈ గ్రంథం అ భూతి ప్రదంగా ఉపదేశిస్తుంది.

రచన సాగుతూ ఉండగా, గతంలోని ఒక అంశం మనస్సు ముం తళుక్కున మెరిసింది. ఆరేడేళ్ళ క్రితం నాకొకలేఖ వచ్చింది. నెల్లూరునుండి శ్రీమ తుంగా లక్ష్మీకాంతమ్మ వ్రాసిన లేఖ అది. ఎక్కడెక్కడినుండో మన ప్రచుర లను సంపాదించి చదువుతూ ఉన్నదట ఆవిడ. ఆవిడ ఆ లేఖలో వ్రాస్తుందికద "భగవద్గీతపైన ఇప్పటికి ఎన్నో వ్యాఖ్యానాలు వచ్చిఉండవచ్చు. ఎందరెందరో పెద్ద ఘనంగా దానిని వివరించి ఉండవచ్చు. అయినప్పటికీ మీనుండి భగవద్గీతకు భాష్య వెలువడాలనీ, దానిని నేను చదవాలనీ కోరుకొంటూ ఉన్నాను. ఈ నా కోరిక కాదనరనుకొంటాను." అని.

నాకు ఆశ్చర్యానందాలు కలిగాయి. ఆనాడు ఆమె వ్రాసినప్పుడు భ వద్గీతకు నానుండి భాష్యం వెలువడుతుందని నేననుకోలేదు. ఆవిడ నామీద ఇష్ట కొద్దీ ఇలా వ్రాసిందిలే! ఎందరో పెద్దలు వ్రాసిన తరువాత, మరీ మాస్టరుగా వ్రాసిన తరువాత ఇంకా నేనుకూడా వ్రాసి, క్రొత్తగా చెప్పవలసినది ఏము టుంది- అనిపించిదప్పుడు. ఆమె వాక్కులు ఇప్పుడు నిజమయ్యాయి. ప్రక్క పెట్టిన ఆ లేఖ ఇప్పుడు ప్రక్క పైనుండి లేవలేని స్థితిలో ఇప్పుడు నాచేత ప చేయిస్తోందికదా- అనిపిస్తోంది.

మాస్టరుగారు అంటూ ఉండేవారు. 'సమాజరూపంలో అడుగుతూ ఉండే దైవమే అని మనం గ్రహించాలి : వారు అడిగినదానిని అందించడం మన క వ్యంగా భావించాలి ! సాధనలోనికి వెళుతూ ఉన్నకొద్దీ మనంచేయవలసింది ఏమి అన్నది సమాజంచేత నిర్దేశింపబడుతూ ఉంటుంది. సమాజం తనకు కావలసి

పనిని అడిగి మరీ మనచేత చేయించుకొంటూ ఉంటుంది.'- అని. అది అక్షరాలా నిజమేనని అనిపిస్తున్నది, రోజులు గడుస్తూఉన్నకొద్దీ !

ఈ గ్రంథాన్నిగూర్చి చెప్పవలసిన విశేషం ఇంకొకటి ఉన్నది. ఇందులో వివరించబడింది మానవధర్మం. మానవుడు తన జీవితాన్ని ఎలా మలచుకొంటే పరిపూర్ణతను పొందుతాడో, ఈ గ్రంథం వివరిస్తుంది. ఇది మానవులందరికీ సంబంధించినది. కులమతాలతో దీనికి సంబంధంలేదు. జాతిభేదాల ప్రసక్తి ఇక్కడ లేదు. ఆస్తికత్వ నాస్తికత్వాలతో దీనికి ప్రమేయంలేదు. వయస్సుల తారతమ్యాలతో దీనికి పనిలేదు. జీవించడం చేతకావాలీ అంటే ఈ గ్రంథాన్ని చదవాలి!అంత విశాలమయిన ప్రాతిపదిక ఈ గ్రంథానికుంది. మనస్సున్న ప్రతివాడూ చదవవలసినదే ! గ్రంథం చదువుతున్నకొద్దీ గీతాచార్యుడు ఎంతగా ఆచరణీయమైన సూత్రాలను మనకు అందించాడో, వాటిని పాటించడం ఎంత అవసరమో మనకు తెలుస్తుంది. మానవుడిని అతడు ఎంతగా పట్టించుకొన్నాడు అన్నది మనకు బోధపడుతుంది. మానవుడి యెడల అతడు ఎంతటి బాధ్యతపడ్డాడో మనకు దర్శనమిస్తుంది. అలాంటి సూత్రాలు ఈ గ్రంథంలో వరుసగా కూర్పుచేసి వివరించబడ్డాయి.

దేవుని గురించి స్తోత్రాలు చేయడం మంచిదే ! కాని ఈ సూత్రాలను పాటిస్తున్నప్పుడే ఆ స్తోత్రాలు అక్కరకు వస్తాయి. సాధకులు దీనిని గమనించాలి !

ఆధునిక మానవుడికి జీవితంపైన పట్టుదొరకడం లేదు. అతడు రాజీపడుతున్నాడు. లేకపోతే ఘర్షణ పడుతున్నాడు. రెండూ కాదనుకొన్నప్పుడు నిరాశలో మునిగిపోతున్నాడు. అతని జీవితం అతని వశంలో ఉండటంలేదు. ఇది ఒక దయనీయస్థితి. ఈ స్థితినుండి మానవుడు బయటపడాలి! అతని జీవితం అతని వశంలోనికి రావాలి ! అందుకు ఈ గ్రంథం దోహదం చేస్తుంది, చదువరిని కర్తవ్యోన్ముఖుడిగా తీర్చిదిద్దుతుంది. అతడిని నిలబెడుతుంది.

రచన మొదలవుతున్నవేళ ఒక భావన కలిగింది. 'గదిలోని ఈ బెడ్ నుండి థియేటర్‌లోని ఆపరేషన్ బెడ్‌ను చేరేలోపున ఈ గ్రంథం పూర్తి చేయబడాలి !' అని, అలాగే జరిగింది. అందుకు సంతోషంగా ఉంది. శ్రేయోభిలాషులు,సోదరులు వరుసగా వస్తూ,చూస్తూ, వెళుతూ ఉన్నప్పటికీ కూడసందులోసందు చేసికొంటూ రచన సాగిపోయింది. పాలీక్లినిక్ నిర్వాహకులు, డాక్టర్ సుధ, డాక్టర్

నాగేశ్వరరావు దంపతులు మనకు ఆత్మీయులు, చిరకాలమిత్రులు, ఉద్యమ భాగస్వాములు. మన రచనలయెడల ఎనలేని మక్కువ గలవారు. అందువలన వారి క్లినిక్‌లో మనకు కావలసినంత స్వేచ్ఛను కలుగజేశారు. తగిన వాతావరణాన్ని కూడ రూపొందించిపెట్టారు. నిజం చెప్పాలంటే ఇక్కడ ఉన్నంతకాలం ఇంటిలో ఉన్నట్లే ఉన్నది నాకు.

ఆ గదిలోనే ప్రేయరు నిర్వహణ. ఆ గదిలోనే రచన. గదికి ఎప్పుడూ వస్తూ పోతూ ఉండే సోదరబృందం. ఇంత హడావిడినీ కూడ వారు ఆనందంగా స్వీకరించారు. వారితో మాట్లాడుతూ ఉండగానే ఒక చిత్రం జరిగింది. 'ఇప్పుడేం డిక్టేట్ చేస్తున్నారు?' అన్నారాయన. 'పార్థసారథి ప్రవచనాలనండీ!' అన్నాను అప్రయత్నంగా! ఆయన వెళ్ళిపోయిన తరువాత అనిపించింది నాకు. 'ఇదే గ్రంథానికి పేరయితే బాగుంటుంది కదా! అని అంతే' 'పార్థసారథి ప్రవచనాలు' అన్న పేరు ఖాయమయింది. నాగేశ్వరరావుగారు పార్థసారథి ప్రవచనాలకు మంచిప్రచారం చేశారు. కనబడ్డ వారందరికీ చెప్పుకొంటూ వెళ్ళిపోయారు. దానితో గ్రంథమింకా వెలువడకుండానే గ్రంథానికి ఎనలేని ప్రశస్తి వచ్చేసింది.

1994 జనవరి 10వ తేదీన పాలీక్లినిక్‌లో చేరడం జరిగింది. జనవరి 29వ తేదీన ఈ ప్రణాళిక అందడం ప్రారంభమైంది. ఫిబ్రవరి 12 నుండి రచన ప్రారంభమైంది. మార్చి 29 వచ్చేటప్పటికి ముందుమాటతో సహా మొదటిభాగం పూర్తయ్యింది. గ్రంథరచన మొత్తం బెడ్‌పైనుండే సాగింది. ఈవిధంగా పిన్నమనేని పాలీక్లినిక్ మన కథలో భాగమైంది.

ఈ పార్థసారథి ప్రవచనాలు కొన్ని సంపుటాలుగా వెలువడతాయని చెప్పాను. ఆ సంపుటాలలో మొదటి సంపుటి ఇది. మిగిలిన సంపుటాలు క్రమంగా వెలువడతాయి. అంతా ఆ ప్రణాళిక ప్రకారం జరుగుతుంది.

మంద్రగీతలోని ముందుమాట రూపంలో నన్ను ముందుకు నడిపించిన ఇ. కె. మాస్టరుగారి పదాలకు ప్రణమిల్లుతూ ఈ గ్రంథాన్ని మీకు అందిస్తున్నాను. స్వీకరించి అనుసరించే ప్రయత్నానికి నాతోబాటుగా మిమ్మల్ని కూడ ఆహ్వానిస్తున్నాను.

పిన్నమనేని పాలీక్లినిక్
విజయవాడ
29-3-94.

మోపిదేవి కృష్ణస్వామి.

# 1. ఎవరినీ ద్వేషించకు!

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ॥
(12అ॥-13శ్లో॥)

'ఎవరినీ ద్వేషించవద్దు. స్నేహము, కరుణలను అభ్యసించు!'

కర్తవ్య నిర్వహణలో నిజమునకు ద్వేషించడానికి చోటులేదు. అటువంటి సన్నివేశమునుబట్టి తగిన విధంగా ప్రవర్తించడం కర్తవ్యమవుతుంది. దానికి ద్వేషించవలసిన పని ఏమున్నది? ఎవరికి ఎలా చెప్పాలో వారికి అలా చెప్తున్నావు. ఎక్కడ ఏమి చేయాలో అక్కడ అది చేస్తున్నావు. నిష్పక్షచిత్తతో కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నప్పుడు రాగద్వేషాలకు చోటెక్కడ? ఇది ఆలోచించవలసిన విషయం.

ఒకరిని ద్వేషిస్తున్నప్పుడు ఆ భావనలు ఆ ద్వేషిస్తున్న వానిని దగ్ధం చేస్తాయి. కత్తులకన్నా, బాణాలకన్నా, ఈటెలకన్నా, తుపాకీగుళ్ళకన్నా ఎక్కువ బాధపెడతాయి. ఆ భావనలు భావిస్తున్నకొద్దీ భావిస్తున్నవానిని బలి తీసికొంటూ ఉంటాయి. ఇది గ్రహించాలి! అలాకాక ఎదుటివారిని గూర్చి మంచి భావనలు కలిగి ఉన్నాయనుకోండి. మంచి భావనలు చేస్తున్నామనుకోండి. అప్పుడు మన మనస్సు ప్రశాంతమవుతుంది. ఆ మంచి భావనలు ఆ ఎదుటివారి వరకూ వెళ్ళి వారిని చుట్టుముట్టి, వారి లోనికి ప్రసరించి వారికి సుఖశాంతులను కలుగజేస్తాయి.

ఇలా సృష్టిలో ఒక ఏర్పాటు ఉన్నది. ఎదుటివారిని గూర్చి మంచి భావనలు చేసినప్పుడు ఆ ఎదుటివారికి అవి అంది మేలు జరిగేటట్లుగాను, ఎదుటివారిని గూర్చి చెడ్డభావనలు చేసినప్పుడు అవి తిరిగివచ్చి చేసినవారినే ఇబ్బంది పెట్టేటట్లుగానూ ఈ సృష్టిలోనే ఒక ఏర్పాటు ఉంది. దీనిని మనం గమనించాలి!

ఈ సృష్టిలో రెండు తరగతులుగా మానవులు మనకు కనబడతారు. సరిగా బ్రతుకగలిగినవారు మొదటి తరగతి. సరిగా బ్రతకలేకపోతున్నవారు రెండవ

తరగతి. సరిగా జీవిస్తున్నవానిని చూస్తున్నప్పుడు అతనిలో రంధ్రాన్వేషణ చేయాలనిపిస్తుంది. ఎక్కడో అక్కడ అతడిలో తప్పు దొరకకపోతుందా, వెతుకుదాము అనిపిస్తుంది. సరిగా జీవించలేనివానిని చూచినప్పుడు జీవించలేకపోతున్నందుకు అతన్ని హేళన చేయాలనిపిస్తుంది. ఎకసెక్కమాడాలనిపిస్తుంది. ఎడంగా ఉంచాలనిపిస్తుంది. ఈ రెండు ప్రవర్తనలు ద్వేషంనుండి పుడుతున్నవే! దీనిని మానవుడు సరిజూచుకోవాలి! ఈ అవలక్షణాలనుండి తన దినచర్యను పవిత్రం చేసికోగలగాలి!

ఈ సందర్భంగా శ్రీకృష్ణుడు ఒక సూచన చెబుతున్నాడు. 'ఇలా చేయండి. ద్వేషం మీనుండి జారిపోతుంది'. అంటున్నాడాయన. అదేమిటంటే సరిగా జీవిస్తున్నవారితో మైత్రిని చేయండి! వారికి స్నేహితులుకండి! అప్పుడు వారిలోని మంచి గుణాలను అభినందించినవారూ అవుతారు. అలవరచుకొన్నవారు కూడ అవుతారు! కనుక ఎవరు సరిగా జీవిస్తున్నా వారితో మానసికమయిన స్నేహాన్ని ముందుగా కలిగి ఉండండి. ఆ స్నేహభావన మిమ్ములను దివ్యలోకాల వైపుకు నడిపిస్తుంది.

సరిగా జీవించలేని వారుంటారు. వారియెడల కరుణ చూపండి! జాలి పడండి. అయ్యో! వీరు సరిగా బ్రతకలేపోతున్నారే! వీరుకూడా జీవితాన్ని సరిజేసికోగలిగితే బాగుంటుందికదా- అన్న భావనలు వారిపై గుమ్మరించండి, వారికొరకు దేవుని ప్రార్థించండి. మైత్రి, కరుణలను ఇలా అభ్యసించండి. ఇక ఆ జీవనం ఎంత దివ్యంగా ఉంటుంది అన్నది మీరే రుచి చూస్తారు.

మానవులనేకాదు. సర్వజీవరాసులనూ ఒకే భావనతో చూడాలి మనం. అన్నిటా ఉన్నది అతడేకదా. అతడిలో మనం ఎక్కువ తక్కువలను చూడటం భావ్యమా? కనుక సకలజీవరాసుల ఎడల ద్వేషభావనను వీడి ప్రేమభావనలను కలిగి, మైత్రీ కరుణలతో మనం వర్తిల్లవలసి ఉంది.

ఒక్కసారి మన ఋష్యాశ్రమాల వైపుకు చూడండి. ఋషులు, వారి అనుచరులు, సర్వజీవరాసుల యెడల ఎలా ప్రవర్తించారు? వారితో అవి ఎలా ప్రవర్తించాయి? వారి సన్నిధిలో వాటిలోఅవి ఎలా ప్రవర్తించాయి? ఎంత ద్వేషరహితస్థితి అది! మానవజన్మకు పరమావధి అదికదా! అంతవరకూ మనం పయనిద్దాం!

* * *

# 2. తగినరీతిని వర్తించు!

యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।
యుక్త స్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా॥

సాధకుడయినవాడు తన దినచర్యను తగిన పద్ధతిలో తీర్చిదిద్దు కోవాలి ! యీ దిద్దుకోవడమనేది ఆహారవిహారాదులతో ప్రారంభమయి నిద్రాదులవరకు కూడా కొనసాగాలి !

దినచర్యను దిద్దుకోనివాడు దేవునితోడి అనుసంధానాన్ని కోరడం అది అత్యాశే కాగలదు. దినచర్యను తగినవిధంగా దిద్దుకొంటున్నవానికి దైవమే తానుగా దగ్గర కాగలడు.

రాగి కాగుగా ఉన్నప్పుడు నీళ్ళను మాత్రమే కాచిపెట్టగలదు. అది తీగగా సాగదీయబడి విద్యుత్ ప్రసరణకు నోచుకొన్నప్పుడు మహాకార్యములే సాధించి పెట్టగలదు. కాగువంటి స్థితినుండి తీగవంటి స్థితికి మనను మనం మలచుకోవలసి ఉంది. అప్పుడు దైవశక్తి అను విద్యుత్ ప్రసరణ మననుండి సాగుతూ విశ్వ శ్రేయస్సును సాధించగలదు.

సాధన అనగానే దడుసుకోవలసిన పనిలేదు. తెలుసుకోవలసినఅవసరం మాత్రమున్నది. లేచింది మొదలు ఏదో ఒకపనిని మనం చేస్తూనే ఉంటాం. ఊరికే కూర్చునే వారెవరుంటారు. అయితే ఆ పనులను తోచినట్లుచేస్తూ ఉంటాం. చేతనయి నట్లుచేస్తూ ఉంటాం. ఇంతకంటే ఏం చేయగలములే అనుకొంటాము. ఎవరయినా ఇంతకంటే ఏం చేస్తారు?- అని సమర్థించుకొంటూ ఉంటాం. ఇది మాత్రం మనం మానాలి !

ఒక పనిని నిన్న చేసినట్లే ఇవాళకూడా చేస్తే అర్థమేమిటి? మొక్క లాంటిది నిన్నటికన్నా ఇవాల్టికి కొంచెం పెరుగుతోంది, మరి మనలో అలాంటి

పెరుగుదల కనబడనక్కరలేదా? మొక్కుబడి చేయమా మనం? మొక్కుబడి చేయ నప్పుడు దేవుడికి ఎన్ని మొక్కులు మొక్కి ఏమి లాభం ?

మన భక్తి ఎలా ఉంటుందంటే, ఏ పని ఎలా చేయాలో నీవు తెలుసు కొంటూ ఉండాలి— అని దేవుడు చెబుతూ ఉంటాడు. ఏమో, ఏ పనీచేయలేకపోతు న్నాను. నీవు తలుచుకొంటే సాధ్యం కానిదంటూ ఏమయినా ఉంటుందా? నా పను లన్నీ నీవే చేసిపెట్టు'— అని భక్తుడంటూ ఉంటాడు. అలా 'చేసిపెట్టకూడదయ్యా!' అంటాడు దేవుడు. 'సర్వశక్తిమంతుడవు. చేసిపెడితే నీ సొమ్మేం పోయింది?' అంటాడు భక్తుడు. ఇలా జరుగుతూ ఉంటుంది మన అర్చన. ఇది అర్చన చేయ డమో. ఆయనకు అర్జీలు పెట్టడమో!

ఇంతకూ చేయవలసింది ఏమీలేదు చేస్తున్న పనులమీద కాస్తంత శ్రద్ధ పెట్టాలి. సర్వసాధారణంగా పనులను మనం అలవాటు చొప్పున చేసేస్తుంటాం నిర్లక్ష్యంగా చేసేస్తుంటాం. యాంత్రికంగా చేసేస్తుంటాం. అలసిపోయామని పడి పోతూ ఉంటాం. ఒక్కటి గుర్తుంచుకోండి. ఈ అవలక్షణాలతో మీరు పనిచేయక పోతే ఎన్నడూ అలసిపోరు, పనిని చేయవలసినవిధంగా చేసున్నప్పుడు కావలసిన శక్తి మీకు పనినుండే అందుతూ ఉంటుంది. మిగిలినవారికి అది అందదు అంతే !

శ్రీకృష్ణుడు చాలా చిన్నచిన్న విషయాలు చెబుతున్నాడు. 'ఈ చిన్న విషయాలను సర్దుకొంటూ వెళితే, పెద్ద అంశాలున్నాయే అవి వాటికవిగా అల వడతాయి' అంటున్నాడు.

ఆహారవిహారాలలో తగిన రీతిని అవలంబించండి అన్నాడు. ఏ దేహానికి ఎలాంటి ఆహారం అవసరమో, అలాంటి ఆహారాన్ని అందించండి. ఎలాంటప్పుడు ఎలాంటి ఆహారం అవసరమో అలాంటి ఆహారాన్ని అందించండి. ఎంతవరకు అవ సరమో, అంతవరకు అందించండి, వేళలు తప్పకండి. వయస్సునుబట్టి ఆహా రాన్ని మలచుకొంటూ వెళ్ళండి. ఆహారస్వీకరణను భగవానుని యజ్ఞశేషస్వీకరణగా పరిగణించండి. అన్నం పరబ్రహ్మ స్వరూపమన్నమాట మరువకండి ఆహారాన్ని వృథా చేయకండి. ఆహారాన్ని నిందించకండి. మీ అవకాశాన్నిబట్టి ఎంతో కొంత ఆహారాన్ని పండించి. జాతికి అందించే ప్రయత్నం చేయండి. ఆహారస్వీకరణ సమయం అది ధ్యానసమయం వంటిదని గమనించండి. సాధ్యమైనంతవరకు

మౌనాన్ని పాటించండి. సరససల్లాపాలాడినా సభ్యతను మీరకండి. మీఆహారస్వీకరణ విచిత్రంగా ఉండకుండా చూచుకోండి. మీ ప్రక్కన కూర్చొని భోజనం చేయడానికి మరొకరికి ఇబ్బంది కలుగనిరీతిలో ప్రవర్తించండి. మీ ఆహారస్వీకరణ విధానం ముచ్చటగ ఉండేటట్లు అభ్యాసం చేయండి. మీరున్న శరీర మానసికస్థితులనుబట్టి, ఏ విధమయిన ఆహారం ఎంతవరకు అవసరమో ఆ ఆహారాన్ని అంతవరకే స్వీకరించండి. మొహమాటపడకండి. తోటివారు బలవంతం చేసినా నాజూకుగా తప్పించుకోండి. ఎదుటివారి విషయంలో కూడ ఇలాగే ప్రవర్తించండి. వారికి తగినవిధంగా వారికి ఆహారాన్ని అందించి, వారిని తృప్తిపరచండి. మనవలన ఏ విధంగానూ వారు ఇబ్బంది పడకుండా చూడండి. ఆహార విషయంలో ఇలాంటి శ్రద్ధను పెట్టండి.

ఇక విహారవిషయానికి వద్దాం విహారమెవరికి? పని చేయడంలో అలసిన మనస్సుకూ ఇంద్రియాలకు. వాటికి విశ్రాంతి కావాలి వాటికి విహారం కావాలి. వాటికి కావలసిన ఉల్లాసాన్ని మనం అందించగలగాలి. అప్పుడవి శ్రమనుండి కోలుకుంటాయి. పని చేయడానికి మేము 'రడీ' అంటూ పచ్చ జండాను చూపిస్తాయి.

అయితే ఎలాంటి విహారాలు మనకు కావాలి. అది మనయొక్క పరిణామంపైన ఆధారపడిఉంటుంది. మనమందరము సమకాలికులమే అయినా, ఒకే భూమిపైన తిరుగాడుతున్నా ఎవరి పరిణామం వారిది. ఎవరి అభిలాషవారిది. విహారాలు అనేసరికి ఎవరి దృక్పథాలు వారివి. ఇలా ఉండటం తప్పుకాదు. నిజానికి ఇలా ఉండటం సహజం. వైవిధ్యం సృష్టియొక్క లక్షణం. అయితే కృష్ణుడంటున్నది ఏమిటి అంటే నీ పరిణామాన్నిబట్టి, నీలో కలుగుతున్న అభిలాషలను విహారాలను గూర్చిన ఆలోచనలను క్రమబద్ధం చేయి. వాటివలన నీకు మేలు జరగాలి తప్ప, కీడు జరుగకూడదు. నీ విహారాల వలన వ్యక్తిగతంగాగాని, కుటుంబగతంగాగాని, సమాజగతంగాగాని, సృష్టిగతంగాగాని ఎలాంటి నష్టమూ వాటిల్లకూడదు. ఈ నా సూచనను ప్రమాణంగా చూసుకో. ఇక నీ విహారాలను తీర్చిదిద్దుకో. విహారాలు వద్దని నేననడంలేదు. వాటివలన నీకు మేలు జరగాలిగాని, కీడు జరగకూడదని నేను అంటున్నాను. మేలు కలిగించే విహారాలన్నీ యుక్త

మైనవే. నీ పరిణామాన్నిబట్టి, నీ మానసిక స్థితిగతులనుబట్టి, నీకు హాయినిచ్చే విహారాలను నీవు తృప్తిగా చేయవచ్చు.

ఇంత విశాల విశ్వమున్నది. దీనిని నేను సృష్టించింది ఎవరికోసం? మీ విహారంకోసమే! మీ ఆనందంకోసమే! ఈ వైవిధ్యం, ఈ వైభవం ఇదంతా మీ కోసమే! అయితే దెబ్బతినకుండా అనుభవించడం నేర్చుకోండి! అదొక్కటే నేను మిమ్మల్ని కోరేది, గమనించారా! ఒక సూర్యోదయమున్నట్లు ఒక సూర్యోదయ ముండదు. ఒక చంద్రోదయమున్నట్లు ఒక చంద్రోదయముండదు. ఒక తారక ఉన్నట్లు మరో తారక ఉండదు. ఒక మొక్క ఉన్నట్లు మరొక మొక్క ఉండదు. ఒక కొండ ఉన్నట్లు మరొక కొండ ఉండదు. ఒక మనిషి ఉన్నట్లు మరొక మనిషి ఉండడు. ఇంతసృష్టి ఎవరికోసం? మీ కోసం, మీరు మురియడంకోసం, ఇంతటి విశాలవిశ్వంలో మీ పరిణామస్థాయిబట్టి యుక్తమయినరీతిలో విహరించండి! ఒక చిన్నమాట. విహరిస్తున్న క్షణాలలో ఈ విశాలవిశ్వమంతా, మీ విహారాల వైభవమంతా 'నేనే' అని గ్రహించుకోవాలి! నేను గుర్తున్నంతవరకు మీరు జారిపోరు, నన్ను మరచినవేళ మీకు దారిలేదు, ఇదే విహారరహస్యం. ఇక విహరించండి. యుక్తమైన పద్ధతిలో విహరించండి.

మనయొక్క ప్రతి కదలిక ఒక చేష్ట అవుతుంది. ఆ కదలికలను యుక్తమయిన రీతిలో మనం మలచుకొంటూ, ఉండాలి. ఒక కుర్రవాడు రోడ్డుమీద ఇటునుండి అటు, అటునుండి ఇటూ నడుస్తున్నాడు. ఇంతకూ అతడు ఎటుగా వెళుతున్నాడో తెలియడం లేదు. మొత్తంమీద అతడు అందరికాళ్ళకూ అడ్డం పడుతున్నాడు.

ఒక ఇంటిలో గాజుగ్లాసు పగిలింది, వెంటనే అది ప్రహరీమీదుగా రోడ్డుమీద వేయబడింది. రోడ్డుమీద వెళ్లేవారితో పాటుగా వేసినవాళ్ళ ఇంట్లో పిల్లలు ఆ పెంకులు తొక్కారు. వైద్యులకు రద్దీ పెంచారు. కొంచెందూరాన కుండీఉంది. అక్కడిదాకా వెళ్ళే ఓపిక ఆ వేసేవారికి లేకపోయింది. పగిలిన ఈ గ్లాసు మనకు సంబంధించిన స్థలంలో లేకుండా ఉంటే చాలు- అన్నది ఆ వేసినవారి అభిప్రాయం,

ధూమపానం చేస్తున్నవాడు ఆ నిప్పును ఆర్పకుండానే, అవశేషాన్ని రోడ్డుమధ్యన పడవేసి వెళ్ళిపోతున్నాడు. వెనుకగా వస్తున్న పాప ఎటో చూస్తూ

దానిని తొక్కింది. ఇక ఆ ఏడుపులను ఆపగల వారెవ్వరు? ధూమపానమే తప్పు. కనీసం దానిని ఆర్పిఅవతల పడేయాలని కూడా తోచలేదు. చెబితే ఆశ్చర్యపోతారు. అతడొక గుడిలో పూజారి !

ఒక్కొక్కనగరం రోడ్డుపైన ఇటుప్రక్క, అటుప్రక్క నెత్తురుమరకల లాంటి చారలు. కారాకిళ్ళీల స్రావాల ప్రవాహాల చారకల ఫలితమిది! ఇప్పుడువాటి మీదుగా నడవాలా, మధ్యగా నడవాలా? మధ్యగా నడవానికంటూ ఏమైనా మిగిలిందా! ఇదీ పరిస్థితి!

పిల్లల, పెద్దల కూడని ప్రవర్తనలతో నడవడానికి వీలులేకుండా పోతున్న రోడ్లెన్నో! ఇలా చేయవచ్చునా? చేయకూడదని వారికి తెలియదా? కాని ఏదో బాధ్యతారహితప్రవర్తనం ! సాధనారహిత దుర్భరజీవనం! మనిషిగా పుట్టికూడా మనిషిగా ఉండలేని స్థితి ఇది! ఆహా! ఎంత దురదృష్టకర పరిణామమిది ।

సాధకుడయినవాడు సమాజంలోని ఇలాంటి దుస్థితులన్నీ గమనించుకోవాలి, అందరితోటే మనమూను. అనుకొంటూ, వారిలాగానే ప్రవర్తించడానికి తోక ఆడించుకొంటూ వెళ్ళకూడదు. వారలా ప్రవర్తిస్తున్నారు నిజమే! వారి చేష్ట ఇలా ఉన్నది. నిజానికి ఈ చేష్ట ఎలా ఉండాలి? అలా ప్రవర్తిద్దాం, మనకు తెలియక పోతే పెద్దలనడిగి తెలుసుకొందాం. అంతేగాని గతానుగతికో లోకః అని మనం కొట్టుకుపోకూడదు. మన చేష్టలు యుక్తమైనవి కావాలి. అన్న దీక్షను మనం స్వీకరించాలి. స్వీకరించండి, దీక్ష తప్పక ఫలిస్తుంది.

ఇక కర్మల దగ్గరకువద్దాం. దేహానికి చేసిపెట్టవలసిన కర్మలుకొన్ని ఉంటాయి. కుటుంబానికి చేయవలసిన కర్మలు కొన్ని ఉంటాయి. వృత్తి, వ్యాపారాలలో నిర్వర్తించవలసిన కర్మలు కొన్నిఉంటాయి. బంధుమిత్రాదులయెడల నిర్వర్తించవలసిన కొన్నికర్మలు ఉంటాయి. సమాజశ్రేయస్సును కోరి నిర్వహించవలసిన కర్మలు కొన్ని ఉంటాయి. వీటన్నింటినీ కర్మపద్ధతిలో నిర్వహించడానికిగాను దైవంయెడల మనం నిర్వహించవలసిన నిత్యదేవతార్చన, పవిత్రగ్రంథపారాయణ యోగసాధన మొదలయిన కర్మలు కొన్ని ఉంటాయి. ఈ కర్మలన్నింటినీ పెద్దల అడుగుజాడ

లలో క్రమపద్ధతిలో మనం నిర్వహించాలి. మనం చూపవలసిన ధర్మాచరణవైభవం ఎక్కువశాతం ఈ అంశందగ్గరే ఉంటుంది. ధర్మం మొక్కుబోకుండా అందరికీ తృప్తికలిగేటట్లుగా ఈ కర్మల నిర్వహణ జరగాలి! ఇందుకు చాలా శిక్షణ అవసరం. అయితే సృష్టిలో ఒక ఏర్పాటు ఉంది. నీవు శిక్షణ పొందగోరాలేగాని, నీకు శిక్షణ తప్పక లభిస్తుంది. అలాంటి ఏర్పాటు జరుగుతుంది. కనుక నీవు నిశ్చింతగా ఉండవచ్చు. ఇక్కడ కావలసినది సంసిద్ధత సమర్పణ మాత్రమే. మిగతావన్నీ అందించబడతాయి. అయితే అందుకోవడంలో శ్రద్ధ తగ్గకూడదు. ఏమాత్రం ఏమరుపాటు ఆవహించకూడదు. ఇదొక్కటే దీనికి నియమం!

అసలు 'వాడికి' నిద్రతో పనిలేదు. కొసరువాడు నిద్రపోనిదే ఉండలేడు. అలసిన మనస్సు మళ్ళీ పనిచేయాలంటే నిద్రపోనిదే పని చేయలేదు. అందుకే భగవంతుడు పని చేయడానికి పగలు, పవళించడానికి రాత్రి ఏర్పాటు చేశాడు మనకు ఏమేమి కావాలో అతడు ఎలా కనిపెట్టి చూచుకొంటున్నాడో చూచారా! మరి మన్నివాడు పెట్టుకోడా, కనిపెట్టుకోడా!

దేవుడు నిద్రను ఎందుకు ఏర్పాటు చేశాడు. గ్రహించుకోవాలి! మనస్సుకూ, ఇంద్రియాలకు ఎంతవరకు అవసరమో, అంతవరకే నిద్రను అందించాలి! నిద్ర తక్కువయితే అలసట మిగులుతుంది. నిద్ర ఎక్కువయితే అలసత్వం పెరుగుతుంది. గమనించాలి, సమతూకం తెలియాలి. ఆ సమతూకంగా సమపాళంగా ప్రవర్తించడాన్నే యుక్తమయినరీతి అని శ్రీకృష్ణుడన్నాడు. అలాంటి వాడికి కలలువచ్చినా తగిన పద్ధతిలోనే వస్తాయి. కనుక దినచర్యను యుక్తమయిన రీతిలో నడుపుకోవడంలో మనం శ్రద్ధ పెట్టవలసిఉంది. ఈ యుక్తమయిన రీతే మనను ముక్తిమార్గం వరకు నడిపించగలదు, అంతేకాదు ఈ ముక్తిమార్గానికి మొదటిమెట్టు ఈ యుక్తమయిన రీతియే! ఎవరు ప్రయాణించినా ఈ మెట్టుమీదుగా ప్రయాణించవలసిందే !



# 3. సేవలోన ఒడలు వంచు !

దేవద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవం ।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥
(17అ॥-14శ్లో॥)

మోక్షస్థితిని అనుభవించవలసినది భూమిమీదనే ! యీ భూమి మీద సాగుతున్న జీవనయాత్ర మోక్షస్థితిలో సాగాలి! మోక్షము సిద్ధించాలీ అంటే త్రికరణశుద్ధి లభించాలి ! త్రికరణశుద్ధి జరగాలీ అంటే మనం తపస్సులో నిలవాలి! త్రికరణాలను తీర్చిదిద్దుతూ నడిపించడమే తపస్సు !

మనస్సు, వాక్కు, శరీరకర్మ- ఇవి మూడూ త్రికరణాలు. ఇవి శుచి చేయబడాలి! వీటిమధ్య సఖ్యత కుదరాలి! ఒకదానితో ఒకటి అనుసంధానం కలిగి ఇవి ప్రవర్తించగలగాలి! మనస్సునకూ, వాక్కునకూ, శరీరానికీ మధ్య పొరపొచ్చాలు ఉండకూడదు.

సుమతీ శతకకారుడు ఇద్దరు కరణాలు కలిసిఉండటమే కష్టమన్నాడు. కరణాన్ని కరణం నమ్మితే సిద్ధించేది మరణమే!- అని అతడు నవ్వించాడు. అలాంటిదిక్కడ ముగ్గురు కరణాలు కలిసి పనిచేయాలి?- అంటూ చెణుకు విసురుతూ ఉండేవారు ఇ. కె. మాస్టరుగారు. ఈ చెణుకులో హాస్యంతోపాటు యదార్థంకూడా లేకపోలేదు. సుమతీశతకకారుడు చెప్పింది గ్రామకరణాల గురించి. మన లోపలి కరణాలు మాత్రం అంతకంటే చేస్తున్నదేమిటి:- అంటున్నారు మాస్టరుగారు. ఈ కరణాలమధ్య సఖ్యత కుదరడం మాత్రం సామాన్యమా । ఆలోచించండి. అంటున్నారు. ఈ కరణాలకు శిక్షణ కావాలి ! ఆ శిక్షణే తపస్సు!

దినచర్యలో మనం ఒడలు వంచాలి! శరీరాన్ని వంచి పనిచేయించాలి ! **సుఖంపేరిట సోమరితనాన్ని అలవాటు చేసికోకూడదు.** పనిచేస్తున్న శరీరమే పది

కాలాలపాటుహాయిగా నిలబడగలదు. పనితగ్గితే దానికి పట్టు తగ్గుతుంది, ఊరికేఅలా కూర్చోబెడితే ఊరుతూ ఉంటుంది. పనికిరాకుండా పోతుంది. రోగగ్రస్థమవుతుంది. మంచాన పడుతుంది. ఒకావిడ ఒక క్రొత్తచీర కొంది. కాని, దానిని దాచిపెట్టింది. ఎప్పుడు దానిని తీసినా ఇది చాలా మంచిచీర.' అనితీసి మళ్ళీ దాచిపెట్టింది.చివరకు ఒకసారి బయటకు తీసింది కట్టుకొందామని, చీరకు బదులు ముక్కలు మిగిలాయి. చీరలాంటిది కడితే ఉంటుందిగాని దాస్తే ఉండదు. అంటే ఏమిటి? భగవంతుడు దేనినీ దాచిపెట్టడానికి ఒప్పుకోవడంలేదు, ఒకపండు దాచిపెట్టండి. అది కుళ్ళిపో తుంది. బియ్యాన్ని దాచిపెట్టండి. అవి ముక్కిపోతాయి. సృష్టిలో ప్రతిదీ విని యోగించడానికే! వినియోగించడానికి బద్ధకించకూడదు. బద్ధకిస్తే ఇక అది నిలబ డదు. కనుక శరీరాన్ని వినియోగించడంలో మనం శ్రద్ధపెట్టాలి. ఎవరినో ఉద్ధ రించడానికి మనం పని చేస్తున్నామనుకోకూడదు. మనం పని చేస్తున్నది మనం ఉద్ధరింపబడటానికే! ఇది స్పష్టంగా తెలియాలి!

శారీరకంగా జరుగవలసిన తపస్సును గూర్చి ఇప్పుడు చెప్పుకొందాం. మొదట దేవతలను పూజించడం మనకు చేతకావాలి. దేవతలు రెండు తరగతులుగా వ్యక్తమవుతూ ఉంటారు. దేవతలు, పితృదేవతలు. అన్నవి ఆ తరగతులు. సూర్యునినుండి వ్యక్తమయ్యేవారు దేవతలు. వీరు ఈ సృష్టికి రూపకల్పన చేస్తూ ఉంటారు. చంద్రునినుండి వ్యక్తమయ్యేవారు పితృదేవతలు. వీరు సృష్టి నుండి సృష్టిని తీసికొస్తూ ఉంటారు. దేవతలవలన సృష్టి కనబడుతున్నది. పితృదేవతల వలన ఈ సృష్టి నిలబడుతున్నది. దేవతలవలన సృష్టికార్యం అనగా ప్రొడక్షన్ జరుగుతున్నది. పితృదేవతల వలన సృష్టినుండి సృష్టి వస్తున్నది. అనగా రీప్రొడ క్షన్ జరుగుతున్నది వీరిని పూజించడం చేతకావాలి!

దేవతలను పూజించడమెలా అన్నది చూద్దాం. ఈ సృష్టి నిర్మాణం వారినుండి జరుగుతూ ఉన్నది కనుక సృష్టిని గౌరవిస్తే వారిని గౌరవించినట్లే. గృహాన్ని పరిసరాలను పవిత్రంగానూ, పరిశుభ్రంగానూ ఉంచుకోవాలి. వాతావర ణాన్ని కలుషితంచేసే పనులను చేపట్టకుండా జాగ్రత్తపడాలి! చేతనయితే వాతా వరణం పునీతమయ్యేటందుకు యజ్ఞయాగాది క్రతువులను చేపట్టగలగాలి! ప్రకృతిని వికృతిగామార్చి హాహాకారాలు చేయించే అసురసంపత్తిలోనికి మనం దిగజార కూడదు. సృష్టిలోని మన ప్రవర్తన ఆ సృష్టికి ఒక క్రొత్తకళను సంతరించి

పెట్టేటట్లుగా ఉండాలిగాని. సృష్టికి ఉన్నకళను తగ్గించేలా చేయకూడదు. సృష్టితో మనం ప్రవర్తించేటప్పుడల్లా మనం ప్రవర్తిస్తున్నది దేవతలతోనని మనకు తెలియాలి! వారియెడల పూజ్యభావంతో మన దినచర్య సాగాలి! ఈ పూజ్యభావం కలగడానికి పెద్దలు నిర్దేశించిన నిత్యానుష్ఠానాన్ని మనం ఒక వ్రతంగా అనుష్ఠించాలి !

పితృదేవతలను గౌరవించాలి! అంటే సృష్టిలోని దాంపత్యధర్మంలోని పవిత్రతను గ్రహించి మెలగాలి! జీవులనుండి జీవులు దిగిరావడం ఇది పితృదేవతల కృషివలన జరుగుతున్నది. మానవులుకూడ ఆ కృషిలో పాలుపంచుకొంటూ ఆ పాలుపంచుకొంటున్నవేళ, దానిని ఒక ఆరాధనగా నిర్వహించగలగాలి. ఆ ఆరాధనాభావం అలవడటానికిగాను, కావలసిన క్రతుకాండను పెద్దలు నిర్దేశిస్తూ ఉంటారు. దానిని నిష్ఠతో అనుష్ఠించాలి. దేవపూజ ఇలా జరగాలి,

బ్రాహ్మణపూజ జరగాలి! బ్రహ్మజ్ఞానం కలిగిన వేత్తలను సేవించడంలో ఈ శరీరం పునీతంకావాలి: వారి స్పర్శలో మన శరీరంలోని అణువణువు సంస్కరింపబడుతుంది. అలాంటివారి సన్నిధినికోరి స్వీకరించాలి! వారి శుశ్రూషలో శరీరాన్ని సద్వినియోగం చేయాలి. వారికి కావలసిన సేవ మననుండి జరుగుతున్నప్పుడు మనకు కావలసిన బోధ వారినుండి అందుతూ ఉంటుంది. ఆ బోధ భవబంధాలను తొలగిస్తూ జీవితాన్ని వెలిగిస్తుంది.

గురు పరంపరను సేవించాలి. మన గురుమూర్తికి శరణాగతి చెందాలి. దేవుడు కనబడితే గురువనబడతాడు. అన్నసత్యాన్ని తెలియాలి. ప్రమిదలాంటి మనను దేవునిముందు దీపారాధనగా రూపొందిస్తున్నవాడు గురుమూర్తి. జీవితానికి వెలుగునిచ్చేవాడూ, జీవితాన్ని వెలిగించేవాడూ ఆయన! అలాంటి గురుమూర్తి సేవలో ఒదిగినప్పుడు లభించే ఎదుగుదల ఉన్నదే, అది అనుభవించదగినది. అలాంటి గురుమూర్తుల శుశ్రూషలభించడం అరుదైన అనుగ్రహవిశేషం. ఆ అవకాశాన్ని భక్తిశ్రద్ధలతో వినియోగించడం మన కర్తవ్యం.

పెద్దలను సేవించాలి : వారియెడల విధేయత కలిగి మెలగాలి వారి అవసరాలను మనం గమనించి, నెరవేరుస్తున్నకొద్దీ వారి అనుభవాలు మనకు అందుతూ మనకు కావలసిన దక్షతను అందిస్తాయి.

ఏరంగంలోనయినా నిష్ణాతులయిన వారుంటారు. వా
తగినవిధంగా వారిని సేవించాలి! లోకానికి కావలసిన విద్యా
స్వీకరించి బయటకు ప్రసరిస్తున్నాయి వారిని సేవించడమంటే ఆ
డమే! ఇవి మనకు తెలియాలి!

ఇన్ని పూజలకు కావలసినది ఒకటి ఉన్నది. అది
అంటే శుచిగా ఉండటం! శరీరాన్ని ఎప్పటికప్పుడు శుచిగా
త్రంగా నిలుపుకోవాలి పై పూజలకు కావలసిన అర్హతలను
నిలుపుకోవాలి! పరిపవిత్రతను పాటించడంలో అశ్రద్ధ జరుగ
దారిద్ర్యచిహ్నం అది ఒక దుర్భరస్థితి! ఆ స్థితిలో ఉన్నవారి
ప్రసరించడం కష్టమవుతుంది. కనుక కోరి శౌచాన్ని అభ్యసించాలి

శౌచాన్ని పాటించడం వలన దేహం పైనున్న వా
తుంది అంటే ఏమిటో తెలుసునా! 'ఈ దేహం మనది'- అన్న దా
ఇది దేవునిచేత అందింపబడిన ఒక ఉపకరణమని తెలిసివస్తుంది
గించడం అనగా సద్వినియోగం చేయడంలో శ్రద్ధ పెరుగుతుం
చెప్పాలి అంటే శరీరం ఎందుకీయబడిందో తెలుస్తుంది. అ
చాలి అన్నదికూడ బోధపడుతుంది శౌచాన్ని పాటించడంవల్ల
జనమిది. కనుక ఒక వ్రతంగా శౌచాన్ని పాటించాలి!

శౌచంతోపాటుగా ఆర్జవముండాలి! ఆర్జవమంటే
మంటే సూటిదనం. అంటే. ఈ శరీరం చేయకూడని పనులు
లేదు. చెప్పకూడని పనులలో ఇది పాల్గొనలేదు. అన్న ని
ఆర్జవం.

బ్రహ్మచర్యంలో ఉండాలి. బ్రహ్మచర్యమంటే
రం చరించడం! బ్రహ్మసృష్టికార్యాన్ని ఎలా నిర్వహిస్తున్నా
కార్యాన్ని అలా నిర్వహించడం!

సృష్టిలో స్త్రీ పురుష విభాగమన్నది దేనికొరకు
రకు. ఆ దివ్యమయిన ప్రయోజనం కొరకు దాంపత్యాన్ని
మనం చేసుకోవాలి. పవిత్రమైన సంతతినికోరి ఈ సృష్టికి స
ఇదే బ్రహ్మచర్యం.

చతురాశ్రమాలకు ఆయువుపట్టయిన గృహస్థాశ్రమంలో బ్రహ్మచర్యాన్ని ఎలాంటి దివ్యక్రతువుగా నిర్వహించాలో ముందుగా చెప్పుకొన్నాం. ఇప్పుడిక మిగిలిన మూడాశ్రమాలలో బ్రహ్మచర్యాన్ని ఎలా ఆచరించాలి అన్నది బోధపరచుకొందాం!

బ్రహ్మచర్యాశ్రమంలో అనగా మానవుడు విద్యార్థిగా ఉన్నప్పుడు నిష్ఠ గలిగి ప్రవర్తించాలి! స్త్రీ పురుష సంబంధాన్ని గురించిన ప్రస్తావనకు అక్కడ తావుండకూడదు. విద్యాభ్యాసముపైననే అతడి దృష్టి ఏకాగ్రమయి ఉండాలి! నీ విద్యాభ్యాసం పూర్తి అయినది. నా అనుమతి మేరకు ఇక నీవు గృహస్థువు కావలసినది అని గురుమూర్తి ఆశీఃపూర్వకమయిన ఆజ్ఞను అనుగ్రహించం వరకు వివాహమన్న తలపే అతనికి కలుగనంతటి స్థితిలో అతడి విద్యాభ్యాసం సాగాలి! అప్పుడే అతడు విద్యలో పరిపూర్ణతను పొంది, సమాజానికి పనికివచ్చే పౌరుడిగా, జాతి గౌరవాన్ని నిలబెట్టే ధీరుడిగా, మానవజన్మను సార్థకం చేసికోగలిగిన దివ్య సాధకునిగా రూపొందగలుగుతాడు. అలాకాక, విద్యాభ్యాస సమయంలో మనస్సు చెదిరి పరిస్థితుల ప్రభావానికి గురిఅయి సహవాసదోషాలకు ఎరఅయి ఏ మాత్రం కొంటెవేషాలు వేసినా. ఆ తరువాతికాలంలో దాని ఫలితం పెద్దఎత్తున కనబడుతుంది. అతని జీవితం అనేకవిధాలుగా కుంటుబడుతుంది. ఈ సూక్ష్మాన్ని గమనించగలగాలి! ఈ సత్యాన్ని దర్శించగలగాలి! జీవితకాలంలో ఏ భాగం ఎందుకు కేటాయించబడిందో, ఆ భాగాన్ని అందుకే మనం వినియోగించగలగాలి! అప్పుడే మనం అందుకోవలసినది అందుకోగలుగుతాం. అందుకు తగిన దీక్ష మనకు అలవడాలి! [illegible]ంముసుగాను తరుగని శ్రద్ధ యొకటి మనలో నిలబడాలి!

గృహస్థాశ్రమంలో బ్రహ్మప్రకారం అనగా బ్రహ్మ ఉద్దేశించిన ప్రకారం స్త్రీ పురుష సంబంధాన్ని దాంపత్యయజ్ఞంగా నిర్వహించి, దివ్యమూర్తులను తరువాతి తరంగా ఈ భూమికి ఆహ్వానించి, వారి బాగోగులను పూజ్యభావంతో చూచి వారిని పరిపూర్ణులుగా తీర్చిదిద్ది, ఆదర్శప్రాయులయిన గృహస్థులుగా వారిని నిలబెట్టి మానవుడు ఇక వానప్రస్థాశ్రమంలోనికి ప్రవేశిస్తాడు.

వానప్రస్థాశ్రమంలో దంపతులు మిత్రులుగా మెలగాలి! శారీరక సంబంధమనే స్థితినుండి, మానసికమయిన అనుబంధానికి, దానినుండి ఆత్మానుసంధానానికి ఆ దంపతులు ఎదిగిరావాలి! ఆత్మవంతులయి, అంతవరకు తాము పొందిన అనుభవాలను, అనుభూతులను సమన్వయించుకొని లోకహితకార్యాచరణలో నిమగ్నులయి, తమ జీవితాలను ధన్యం చేసికోవాలి!

శరీరాల కలయికలో సుఖమన్నది అప్పటికప్పుడు కనబడి వెళ్ళిపోతున్నది. మెరపులా మెరసి కనుమరుగవుతున్నది. వానప్రస్థాశ్రమంలో మనస్సులకు కలయిక సిద్ధించి, ఆత్మానుసంధానం అందివచ్చిననేళ దివ్యమయిన ఆ సుఖమన్నదే ఇక నిండిపోగలదు, అలా ఉండిపోగలదు ! మనలో సుఖముండటకాక, సుఖములో మనముండుట జరుగగలదు ! తరుగని సుఖమది. మానవుని తరింపజేయగలిగినది ! వానప్రస్థాశ్రమస్థితిలో బ్రహ్మచర్యమన్నది ఇంతటి పరిపక్వతను చెందుచున్నది.

ఇక చివరిది యత్యాశ్రమం ! వానప్రస్థాశ్రమంలో అనుభవానికివచ్చిన ఆత్మీయమయిన స్థితి ఉన్నదే, అది ఆత్మ సాక్షాత్కారంగా రూపొందె. దంపతులు ప్రజ్ఞామయమూర్తులయి నిలబడగా కాలధర్మాన్ని అనుసరించి శరీరాలు పండుటాకులవలే అవలీలగా, అలవోకగా రాలిపడి పోవటమన్నది జరిగే సందర్భమిది!

బ్రహ్మచర్యమన్నది ఇలా నాలుగు ఆశ్రమాలలోనూ నాలుగు విధాలుగా సాగిసాగి మానవునికి పరిపక్వతనూ పరిపూర్ణతనూ అందిస్తున్నది. స్త్రీ పురుష సంబంధాన్ని చతురాశ్రమ విధానంతో మేళవించి దివ్యమయిన తపస్సుగా, దుర్లభమయిన ఈ మానవజీవితాన్ని మనం మలచుకోవలసి ఉన్నది! పెద్దల అడుగుజాడలలో పవిత్రీకరించుకోవలసి ఉన్నది !

ఇక, తమ జీవితాన వివాహమన్నది తలపెట్టక, స్త్రీ పురుష సంబంధానికి జీవితాంతం దూరంగా ఉండిపోయి. దైవం తమకప్పగించిన కార్యక్రమాన్ని నిష్ఠగా నిర్వహించే నైష్ఠిక బ్రహ్మచారులు కొందరుంటారు. వారు స్త్రీ పురుష సంబంధానికి వ్యతిరేకులుకారు: దైవయోగం చేత, ఒక ప్రత్యేక జీవన విధానం వారికి నిర్దేశింపబడిన కారణాన ఆ జన్మను వారలా నిర్వహిస్తారు. కనుక వారిని ఒక ప్రత్యేకమయిన దృష్టితో మనం గౌరవించవలసి ఉంటుంది. చతురాశ్రమ విధానంలోని పవిత్రతను, సార్థకతను పూర్తిగా ఎరిగినవారు వారు! దీనిని మనం గుర్తించాలి ! వారికి అప్పగించబడిన బాధ్యతనుబట్టి మాత్రమే వారలా ప్రవర్తిస్తున్నారని మనం గమనించాలి ! అంతేగాని, వారు పెళ్ళి చేసికోలేదుకదా, కనుక మనంకూడా చేసికోకుండా ఉంటే బాగుంటుందేమో అని అనుకోకూడదు. అనుకొంటే అది పొరపాటు అవుతుంది. ఏది, ఎందుకు, ఎలా జరుగుతున్నదో మనకు తెలియాలి ! తెలిసి వివేకంతో మనం ప్రవర్తించగలగాలి ! అప్పుడు దైవం మనను మెచ్చుతాడు.

అహింసను అవలంబించాలి. హింసలోపాల్గొన్న శరీరం ధ్వంసం చేయడానికి పనికివస్తుందిగాని, నిర్మాణం చేయడానికి పనికిరాదు. ఒక ఆహారస్వీకరణకు తప్ప హింస అన్నది పనికిరాదు. ఆహారస్వీకరణలో కూడ ఎంత తక్కువ హింస జరిగితే అంత మంచిది. ఈ చేతులు ఉన్నది పెంచడానికేగాని, తుంచడానికికాదు. అన్నట్లు మనం ప్రవర్తించాలి.

ఇదీకథ. ఈ మొత్తం కలిసి శారీరకమైన తపస్సు. శరీరాన్ని మానవుడు ఇలా నడుపుకోవాలి. ఇలా నిలబెట్టుకోవాలి. ఇలా తీర్చిదిద్దుకోవాలి. అప్పుడది దివ్యోపకరణమై భాసిస్తుంది. మహాకార్య నిర్వహణకు కావలసిన పాత్రతను సంతరించుకొంటుంది, దైవం వెలగడానికి కావలసిన ప్రమిదగా రూపుదిద్దుకొంటుంది.

***

# 4. ప్రేమతోడ పలుకరించు!

**అనుద్వేగ కరం వాక్యం సత్యం ప్రియహితం చయత్।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తపఉచ్యతే॥**
**(17అ॥-15శ్లో॥)**

ఎదుటివారు ఏమాత్రం ఉద్వేగం చెందకుండా ఉండేటట్లుగా మనం మాట్లాడే తీరుఉండాలి! చెప్పబడేది సత్యమై ఉండాలి! దానిని ముచ్చటగా వారికి నచ్చేటట్లుగా మనం చెప్పగలగాలి ఆ చెప్పబడుతున్నవాక్యాలు వారికి శ్రేయస్సును అందించగలిగేవై ఉండాలి! పవిత్రగ్రంథాలను గొంతెత్తి, చదవడంలో మనగొంతు ఎప్పటికప్పుడు పునీతమవుతూఉండాలి! వాఙ్మయమయిన తపస్సు ఇలా జరగాలి!

మన మాటలు ఎదుటివారికి ఉద్వేగాన్ని కలిగించకూడదు. ఉత్సాహాన్ని కలిగించాలి. సత్కర్మాచరణకు వారిని ఉన్ముఖులను చేయాలి. మరింత మేలయిన

జీవితానికి ఎదుటిమనిషిని మరలించగలిగినవి కావాలి మన మాటలు, ఎదుటివారు తిరగబడేటట్లుగాక, ఎదుటివారు తెలుసుకొనేటట్లుగా మనం మాట్లాడగలగాలి. జటిల పరిస్థితులలో కూడ ఈ ఒడుపు కొనసాగాలి. ఎదుటివారు రియాక్ట్ కాకూడదు. రియలైజ్ కావాలి.

ఒక పల్లెటూళ్ళో అన్నదమ్ములు వాటాలకొరకు కుస్తీలు పడుతున్నారు. వారి భార్యలు సుస్తీలకు గురి అవుతున్నారు. విషయం తెమలడంలేదు. అది అలా అలా ఆ గ్రామ పెద్దచెవిని పడింది. ఒక మంచిరోజున ఆయన వారిని చేరవచ్చాడు. 'నాన్నా' ఒక అమ్మకన్న బిడ్డలురా మీరు, ఒకే రక్తాన్ని పంచుకుపుట్టినవారు. ఒకటిగా ఉండవలసినవారు. మీ బాధేమిటో నాకు చెప్పండి ఇది వీధిన పడవలసిన విషయం కాదు. అన్నాడు ఆర్ద్రంగా. అన్నదమ్ములు కరిగిపోయారు. 'తాతా; నీవు అందరికీ కావలసినవాడివి నీవెలా చెబితే అలా నడుచుకొంటాం మా కథను నీ ఇష్టానికి వదిలేస్తున్నాం అన్నారు కథ వీధినుండి దారికి వచ్చింది

ఇక్కడొక చిత్రముంది గమనించారా ! ఆ పెద్దాయన మాటలకు వారు రియాక్ట్ కాలేదు రియలైజ్ అయ్యారు అంటే తిరగబడలేదు తెలుసుకొన్నారు అలా నిజస్థితిని వారు తెలుసుకొనేటట్లుగా అక్కడినుండి వాక్కు వెలువడింది వాక్కును ఒకతపస్సుగా వినియోగిస్తున్నవాడు మాత్రమే ఇలాంటి మార్పును ఎదుటి వారిలో తీసికొనిరాగలడు. ఇలాంటి చైతన్యాన్ని ఎదుటివారిలో కలిగించగలడు. చీకటిలో చిందులు వేస్తున్నవారిని వెలుగులో పట్టాపట్టాలు కట్టించగలడు. వాక్కు పునీతం కావాలేగాని, అది అంతటిది అవుతుంది ఎంతటి పనినయినా ఇక అది సాధించగలుగుతుంది.

వాక్కును తపస్సుగా వినియోగించడమంటే ఎలా ? అదికూడా ఆ పెద్దాయన మాటలలోనే దాగిఉన్నది చూడండి ఆయన వాక్కు అనుద్వేగకరంగా సాగింది. అంటే అది వారికి ఎలాంటి ఒత్తిడినీ కలిగించలేదు. పైగా వారిలోఉన్న వత్తిడులను తొలగించింది. వారికి నచ్చచెప్పడానికి అతడు వేరేమీ చెప్పలేదు. ఉన్న సత్యాన్ని వారిముందు ఉంచాడు అయితే ప్రియమైన రీతిలో ఉంచాడు. సత్యాన్ని వారికి నచ్చేవిధంగా చెప్పగలిగాడు. ఆ చెప్పడంద్వారా అతడు వారి శ్రేయస్సును కూడ సాధించాడు. తపస్సు అంటే ఇది ! వాక్కును ఇంతటి దివ్యస్థితిలో విని యోగించడం అన్న అంశంలో శ్రద్ధ కలిగిఉండటం! అలా వినియోగించడాన్ని

అభ్యాసం చేయడం. అలాతప్ప ఇంకొకలా మాట్లాడలేని స్థితికిరావడం, 'మీమాటలు మంత్రంబులు' అన్నవాక్యం అప్పుడు సార్థకమవుతుంది మనపట్లకూడా!

కొంతమంది అవతలివారి మెప్పుకోసం ప్రియమైనరీతిలో మాట్లాడటాన్ని అలవాటు చేసికొంటారు. వారి మెచ్చుకోలుకోసం ఉన్నవీ, లేనివీ కలిపి, కలగలుపు చేసి చెబుతూ ఉంటారు. ఎంత ప్రియమైనవాక్కు అయినా ఇక్కడ అది వ్యర్థమవుతున్నది- అని వారు గమనించాలి! ప్రియంగా మాట్లాడటం మనిషి బ్రతకడానికి పనికిరావచ్చుగాని, మనిషి తరించడానికి పనికిరాదు. కాలక్షేపానికి పనికివస్తుంది గాని సార్థకతను అందించలేదు. ఆశ్చర్యపరుస్తుందిగాని, ఆనందింపజేయలేదు. ఉల్లాసాన్నిస్తుందిగాని, ఉత్సాహాన్నీయలేదు. ప్రియంగా మాట్లాడటం ఏదో పని గడుపుకుపోవడానికి మాత్రం పనికి వస్తుంది. అంతకుమించి అది సాధించే పరమార్థంగాని, ప్రయోజనంగాని కనబడదు. అప్పుడు వాక్కును వాడుకొన్నవాళ్ళమవుతున్నాంతప్ప వినియోగించినవాళ్ళమవడంలేదు. ఆలోచించండి!

కొంతమంది ప్రాణంపోయినా అబద్ధమాడరుకాని సత్యాన్ని కటువుగా, కుండ పగలగొట్టినట్లుగా, చెబుతూ ఉంటారు. మేం చెబుతున్నది సత్యమైనప్పుడు మీరు వినితీరాలి! సత్యమెప్పుడూ కటువుగానే ఉంటుంది. చేదుగానే ఉంటుంది- అంటూ హెచ్చరిస్తూ ఉంటారు. ఏం చెబుతున్నాము అన్న దాని మీద వారిదృష్టి ఉన్నది, ఆ విషయంలో వారు జాగ్రత్తపడుతున్నారు. కాని ఎలా చెబుతున్నాము అన్నచోట వారు పట్టించుకోవడంలేదు. అక్కడ శ్రద్ధపెట్టడంలేదు. అందువల్ల చెబుతున్న అంశం ఎంత సత్యమైనప్పటికీ, ఎంత గొప్పదైనప్పటికీ అది అవతలివారికి ఇబ్బంది కలిగిస్తున్నది. సత్యమే అయినప్పటికీ దానిని ఇంతఇదిగా చెప్పాలా ఇంత వెటకారంగా చెప్పాలా? ఇంత పరుషంగా చెప్పాలా?- అంటూ ఎదుటివారు తల్లడిల్లుతారు. కనుక సత్యాన్ని ప్రియమైనరీతిలో చెప్పడం అవసరం. అవతలివారికి నచ్చే విధంగా వారు స్వీకరించేవిధంగా మలచి అందించడం అవసరం.

సత్యాన్ని ప్రియంగా చెప్పడమే చాలదు, ఆ చెప్పబడుతున్నది ఎదుటివారికి శ్రేయస్సును కలిగించేదిగా ఉండాలి. మనుషులు ఎదురయినప్పుడు మనం

ఏదేదో మాట్లాడుతూ ఉంటాం. ఏదేదో మాట్లాడకూడదు. ఏది మాట్లాడాలో అదే మాట్లాడాలి! సత్యాన్ని ప్రియంగా చెబితే చాలుననుకొని లోకాభిరామాయణాన్ని చెప్పకూడదు. ఆ చెప్పబడేది అర్థవంతంగా ఉండాలి. సమయోచితంగా ఉండాలి. ఎదుటివారికి సంబంధించినదై ఉండాలి వారికి మేలును కలిగించేదై ఉండాలి అప్పుడు ఆ మాట్లాడటానికి సార్థకత!

ఆ పెద్దాయన మాటలనే మరొక్కసారి చూడండి! ఇన్నిటినీ కలుపుకొని ఆయన గొంతునుండి వ్యక్తమయ్యింది. ఏమిటి? ప్రేమ! ప్రేమ ఒక్కటే ఇన్నిటినీ కలుపుకొనగలిగినది. అన్నిటినీ కలుపుకొనగలిగినది కూడ అదే! అది అకారణంగా వ్యక్తమవుతుంది, అపారంగా వ్యక్తమవుతుంది, ఆర్ద్రంగా వ్యక్తమవు తుంది. ఎదుటివారి హృదయాన్ని తాకుతుంది, అలాంటి ప్రేమ వాఙ్మయమైన ఈ తపస్సుకు నేపథ్యంగా ఉండాలి! ఆ నేపథ్యం అందాలీ అంటే స్వాధ్యాయం కొన సాగాలి. స్వాధ్యాయమంటే పవిత్రగ్రంథ పఠనం. మనకు నచ్చిన పవిత్రగ్రంథాన్ని రోజూ ఒక సమయాన్ని నిర్ణయించుకొని అధ్యయనం చేయాలి, గొంతెత్తి పవిత్ర గ్రంథాన్ని గానం చేయడం, పఠనం చేయడం ఎంతయినా శ్రేయస్కరం ఆ గాన పఠనాలు మనవాక్కును సంస్కరిస్తాయి. మనవాక్కును తీర్చిదిద్దుతాయి. కాని మాటలను మన నోటినుండి రానీయవు. ప్రతిమాటనూ ప్రయోజనకరంగాపరమార్థ బోధకంగా రూపొందేలాగున చూస్తాయి. మననుండి వాఙ్మయమయిన తపస్సు అఖండంగా సాగడానికి పవిత్రగ్రంథ పఠనం ఎంతయినా అవసరం.

పవిత్రగ్రంథాన వ్యక్తమవున్నదేమిటి! ఋషివాక్కు. అది అయస్కాం తం లాంటిది. అయస్కాంతం ఇనుపముక్కను ఏం చేస్తుంది? మరొక అయస్కాం తంగా మేల్కొలుపుతుంది అలాగే ఋషివాక్కు మన వాక్కునుకూడ అంత ఉదాత్తమయిన స్థితిలోనికి మేల్కొలుపుతుంది. అలా మేల్కొలుపబడిన వాక్కు అనుద్వేగకరంగా వర్తిల్లుతుంది. సత్యమై తీరుతుంది. ముచ్చట కలిగిస్తుంది శ్రేయ స్సును సాధిస్తుంది. ధన్యతను అందిస్తుంది,

# 5. హాయిలోన మనస్సు నిలుపు!

మనః ప్రసాద సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానసముచ్యతే॥
(17అ॥-16శ్లో॥)

మనస్సు తనకు తాను నిరంతరమయిన హాయిని అనుభవిస్తూ, తోటివారియెడల సౌమ్యంగా వర్తించగలగాలి! కాని వాటి యెడల మౌనం వహించాలి! ఇంద్రియాలను అలవోకగా తనలోనికి స్వీకరించగలిగినదై ఉండాలి! పవిత్రమైన భావాలతో తేలియాడుతూ ఉండాలి! మనస్సు ఇలా తపస్సు చేయాలి!

ప్రతి చిన్నదానికి చిరాకుపడే వారుంటారు. అంతలోనే చికాకుపడే వారుంటారు, చిర్రుబుర్రులాడుతుంటారు! లేహ నిట్టూరుస్తారు. విషాదవదనాన్ని పెడతారు. ఇన్నికష్టాలు ఇంకెవరికీలేవు. పగవారికికూడా ఇలాంటి జీవితం వద్దు- అనుకొంటూ ఉంటారు, అలా అనుకోవడంతో ఒకానొక సంతృప్తినిపొందజూస్తారు. ఇవన్నీకూడ మాటిమాటికీ చెదిరిపోతున్న, జారిపడుతున్న మనస్సుయొక్క స్థితులు. అలాకాక మనస్సును ప్రసన్నంగా ఉంచుకోవడం చేయకావాలి. హాయిగా ఉండటాన్ని అభ్యసించాలి. హాయిగా ఉన్నప్పుడే ఎటువంటి కార్యాలనైనా మనస్సు సాధించ గలదు అది అలాఉంచి, ప్రతిచిన్న అంశము మనహాయిని చెదరకొడుతోంది అంటే ఏమనుకోవాలి! ప్రతిచిన్న అంశానికి పడిపోవడమే! ఇది కూడనిపని. ఎటువంటి అంశమైనప్పటికీ మన స్థితినుండి జారకుండ మనం సాధించగలగాలి. సన్ని వేశపు తాకిడికి మనస్సు హాయిని కోల్పోవడం జరగకూడదు. హాయిని కోల్పోయిన తరువాత మనస్సు సాధించగలిగినదిలేదు.

నిజానికి సమస్యలున్నాయా? లేవు। మనం తట్టుకొంటే అది సన్నివేశ మంటున్నాం. మనం తట్టుకోలేకపోతే అదే సన్నివేశాన్ని సమస్య అంటున్నాం. మనం హాయిని కోల్పోయినవేళ సన్నివేశంసమస్యగా మనకు గోచరిస్తుంది. గమనించండి! కనుక తట్టుకోవడంలో ఒడుపును చూపాలి. సన్నివేశాలేగాని సమస్యలు లేవని మనకు స్పష్టంకావాలి! మనస్సు హాయిని కోల్పోకుండా, స్థాయిని కోల్పోకుండా ముందుకు సాగడమన్నది మనకు అభ్యాసం కావాలి, అది మన స్వభావం కా వా లి !

తోటివారి యెడల ప్రవర్తించేటప్పుడు సౌమ్యంగా ప్రవర్తించాలి అంటే వారిని అర్థం చేసికొనేటందుకు ప్రయత్నించాలి! వారిలోని తప్పులు పట్టడం, వారిని చీదరించుకోవడం తగ్గాలి ! అలా జరిగినప్పుడు తోటివారు మానసికంగా ఎంత బాధపడతారు అన్నది మనకు తెలియాలి! సౌమ్యంగా వారికి తెలియజెప్పడం- అన్న ఒడుపును మనం అభ్యసించాలి !

అలాగే తోటివారిని గూర్చికానివి ఊహించకూడదు. పుకార్లు మొదలయినవి తొందరపడి నమ్మకూడదు. వారిని చిన్నచూపు చూడకూడదు. కొంతమంది ఎదుటివారు ఎక్కడ దొరుకుతారా, తప్పులెంచడానికి అని చూస్తుంటారు. ఆ అవకాశం కోసం కనిపెట్టుకొని కాచుకొంటారు. అలాంటివి చేయకూడదు. ఒకరిమీద పెట్టి ఒకరిని నిందించే వారుంటారు. వ్యంగ్యార్థాలతో సన్నాయినొక్కులు నొక్కే వారుంటారు. నవ్వుతూ నవ్వుతూనే అవతలివారిని కుళ్ళబొడిచేవారుంటారు. మరొకరి గురించి చెడు చెప్పడంలో ఆనందించే వారుంటారు. ఇలాంటివాటినుండి బయటపడాలి. మనస్సు ఎదుటివారి యెడల సౌమ్యస్థితిని పొందాలి. వారూ మనలాంటివారేనని తెలిపి తప్పొప్పుల పట్టికను ప్రక్కకుపెట్టి ప్రేమతో వారిని పలకరించడం మనకు చేతకావాలి. వారిలోని మంచివైపుకు చూస్తూ, దానిని పెంచే మార్గాన్ని అన్వేషించాలి, వంకాయలాంటి దాంట్లో పుచ్చును తీసివేసి మిగిలినదానిని పుచ్చుకుంటున్నాం. మనిషి, తోటిమనిషి ఒక వంకాయపాటికూడా చేయరా? ఆలోచించండి! తోటివారిని ఆదరించండి.

మనవికాని అంశాలయెడల మనస్సు మౌనాన్ని వహించడం మరొక అంశం. ఏది కర్తవ్యమో అది మనస్సు ముందు నిలుస్తూ ఉండాలి. కర్తవ్యం కానిది

మనస్సునకు కనబడేస్థితి ఉండకూడదు. లోకంలో అనేక అంశాలు ఉంటాయి. అందులో మన కర్తవ్యానికి కావలసిన అంశాలను మాత్రమే మనస్సు స్పృశించాలి. మిగిలిన అంశాలయెడల మౌనాన్ని పాటించాలి.

గిన్నెను పొయ్యిమీద పెట్టి గభాలునవెళ్ళి కావలసిన నూనెను పట్టుకు రమ్మన్నది తల్లి. ఆ కొడుకు సీసా పట్టుకొని బయలుదేరాడు. కొద్దిదూరం నడిచే టప్పటికి అక్కడ గారడీవాడు గారడీ చేస్తున్నాడు. కుర్రవాడు అక్కడ నిలబడి పోయాడు. కాసేపటికి ఒకచేతిలో సీసా వ్రేలాడుతున్నది. మరొకచేతినేమో నోట్లో పెట్టుకొని పీకుతూ ఉన్నాడు వాడు. ఏ పీకూ చింతా కనబడటంలేదు. ఇక్కడ గిన్నె మాడుతున్నది. నూనెరాదు. ఈ సన్నివేశంలో ఏం జరిగింది. కుర్రవాడి మనస్సు గారడీయెడల మౌనాన్ని వహించలేకపోయింది. దానితో కర్తవ్యం మనస్సునుండి జారిపోయింది. మనలో ఎక్కువమందిలో జరుగుతున్నదిదే. కాని అంశాలలో మనస్సు తేలియాడుతుండగా, కర్తవ్యం కనుమరుగైపోతూ ఉంటుంది.కనుక మౌనం అత్యంత ఆవశ్యకం! ఏది మన జీవితకార్యమో, దానియెడలమనస్సు నిలబడాలి! మిగిలిన వాటియెడల మౌనాన్ని వహించాలి. అప్పుడు మాత్రమే మనం జీవిత కార్యాన్ని సాధించగలుగుతాం !

పైకి చూడటానికి అన్నీ పనులలాగానే కనబడతాయి. ఏదో చేస్తున్నట్లే ఉంటుంది. ఊరికే కూర్చున్నామా అనిపిస్తుంది. ఏదో జరుగుతున్నట్లే ఉంటుంది. సాధింపబడుతున్నట్లే కనబడుతుంది. కాని పరిశీలనగా చూడాలి! రోజు మొత్తం మీద మన కర్తవ్యంయెడల మనం ఎంతవరకు శ్రద్ధకలిగి ఉన్నామో గమనించగల గాలి। ఎంత సమయాన్ని దానికి కేటాయించగలిగామో గమనించగలగాలి ! అప్పుడు తెలుస్తుంది- మనకు మౌనం ఎంతవరకు చేతనవుతున్నది- అన్నది.

మౌనం మానసికమైనదేగాని కంఠగతమైనదికాదు. గొంతుతో మాట్లాడక పోవడం మౌనమనిపించుకోదు. మన మునులందరూ చక్కగా మాట్లాడారు. విద్యార్థులకు పాఠాలుచెప్పారు. గ్రంథరచనలు చేశారు. గమనించండి. మరి మునులు అంటే మౌనాన్ని వహించేవారుకదా ఏమంటారు? వారు మానసికంగా తమవికాని అంశాలయెడల మౌనాన్ని వహించగలిగిన మహనీయులు. ఇది తెలియక కొందరు వారానికొకరోజు మాట్లాడటం మానేసి, మనస్సుపెట్టే గోలకు తట్టుకోలేక బాధపడు తుంటారు. చీటీలమీద వ్రాసిస్తూ ఉంటారు. చీటికిమాటికి సైగలుచేస్తూ ఉం

టారు. ప్రక్కవాళ్ళకు అవి తెలియక గోల చేస్తుంటారు అదికాదు. ఇది అని సైగలుచేస్తూ త్రిప్పలు పడుతుంటారు. అప్పుడేం చేయాలి! వారియెడల మనం మౌనం వహించాలి! అంతే!

ఒకాయన వారానికొకరోజు మాట్లాడకూడదు అనుకొన్నాడు, ఆ రోజు ఏమిటి అన్నది ప్రకటించాడు. ఆ ప్రకటన చదంవల్ల కథ వికటించడం జరిగింది. ఒకడను ఇతని దగ్గర డబ్బుతీసికొని ఎంతకూ ఇవ్వడంలేదు. వెతికినా కనబడడు. అలాంటివాడు ఈయన మౌనవ్రతాన్ని గమనించాడు. ఆ ఒక్కరోజున మాత్రం ఆ ఇంటిముందు నిర్భీతిగా నడవసాగాడు. నిదానంగాకూడా నడవసాగాడు. ఇప్పుడు మౌనవ్రతమేం కావాలి? ఎన్నడూ దొరకనివాడు దొరుకుతున్నాడు. వ్రతం అడ్డు వస్తోంది వ్రతం చెడకూడదు. అప్పు మాత్రం రావాలి! ఏం చేయాలి? మనస్సు వత్తిడి పడుతోంది సైగలతో ప్రక్కనున్నవాడి పిలుస్తాడు రోడ్డుమీదఉన్నవాణ్ణిచూపిస్తాడు. వాడికేమో ఏమీఅర్థంకాలేదు. ఇంకాఅర్థంకాలేదా అని గుడ్లురిమిచూస్తాడు.కళ్ళు ఎర్ర బడుతున్నాయితప్ప, పని జరగడంలేదు. రక్తపోటు పెరుగుతున్నది. ప్రయోజనం మాత్రం దక్కడంలేదు. ఆ మనస్సు ఎప్పటికి కోలుకొంటుంది? కోలుకొనేలోపు మళ్ళీ ఆరోజు వస్తుంది. మళ్ళీ అతను రోడ్డుమీద నుండి వెళుతుంటాడు. మళ్ళీ ఇంతకథా జరుగుతుంది. ఇంత వ్యథా అనుభవానికి వస్తుంది. దీనినంతటినీ మౌన మందామా? కాదూ అతనిని మౌనమందామా? మీరే చెప్పండి! మనస్సు సిద్ధం కాకుండా మాటను ఆపితే, కథ ఇంత దుర్భరంగా ఉంటుంది. ఇంతకూ మౌనాన్ని అభ్యసించవలసినది మనస్సు!

మనస్సు మౌనం వహించాలి అంటే పంచేంద్రియాలు దానివశంలో ఉండాలి. అలవోకగా అనాయాసంగా మనస్సు వాటిని తనలోనికి స్వీకరించగలిగి ఉండాలి. తాబేలును చూడండి! కాని పరిస్థితులు వచ్చినప్పుడు తన అవయవాలను తనలోనికి తక్కున ముడుచుకొంటుంది. పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయని గమనించగానే మళ్ళీ చరచరా నడిచిపోతూ ఉంటుంది. మనం ఆ తాబేలుగా ఉండాలి! ఇంద్రియాలు తాబేలు అవయవాలలా సమయాన్నిబట్టి. సందర్భాన్నిబట్టి మన మాట వినాలి! ఆ వినడం అనాయాసంగా జరగాలి! అప్రయత్నంగా జరగాలి, జరుగుతున్నట్లు తెలిసేలోపల జరగాలి. ఏమాత్రం శ్రమ కలుగకూడదు. వ్యవ ధానం ఉండకూడదు. అలాంటిస్థితి అభ్యాసం కావాలి. సందర్భోచితమైన ప్రవ

ర్తన అన్నది అప్పుడే సాధ్యమవుతుంది. పాత్రపోషణ అప్పుడే రక్తి కడుతుంది, లేకపోతే ఈ శిక్షణ లేకపోతే కొంతదూరం వెళ్ళిపోయాకగాని, దారితప్పామని తెలియదు. అప్పుడు సర్దుకోవడం కష్టమవుతుంది. ప్రతిసారీ సన్నివేశం ఇలా దారితప్పుతోంది అనుకోండి. జరిగిన తప్పులు దిద్దుకోవడానికే జీవితం చాలదు. స్వధర్మాన్ని నిర్వహించేటందుకు ఇక సమయముండదు. చేసిన తప్పులను దిద్దుకొంటూ, దిద్దుకోలేక క్రిందా, మీదా పడుతున్నవారు మనలో ఎంతమందిలేరు. మనస్సు సమయానికి తగినట్లుగా ఇంద్రియాలను నడపకపోవడంచేత ఇలాంటి ఇబ్బందులు వస్తూ ఉంటాయి. నడపడం చేతనయినకొద్దీ తప్పులు తగ్గుతాయి. కర్తవ్యనిర్వహణ జరుగుతుంది. కర్తవ్యనిర్వహణ జరుగుతున్నకొద్దీ మనస్సునకు తృప్తి దొరుకుతుంది. ముక్తస్థితి అనుభవానికి వస్తుంది. దైవానుసంధానానికి దారి దొరుకుతుంది.

ఇంతవరకు చెప్పబడిన దివ్యమయిన లక్షణాలన్నీ మనస్సునకు అలవడాలి అంటే మనస్సు పవిత్రమైన భావనలలో నిరంతరం తేలియాడుతూ ఉండాలి. మహనీయుల వాక్యాలు మనస్సులో మెదులుతూ ఉండాలి. వారి జీవిత సన్నివేశాలు నిరంతరం మనస్సుచేత స్మరింపబడుతూ ఉండాలి. దివ్యగాథలు, దివ్యబోధలు మనస్సును ఎల్లవేళలా పొదుగుతూ ఉండాలి. అప్పుడు ఆ మనస్సునుండి వచ్చే ఆలోచనలు కూడా దివ్యమైనవై ఉంటాయి. సవ్యమైనవై ఉంటాయి. లోకశ్రేయస్సును ఒనగూర్చగలిగినవై ఉంటాయి. దేవుని ప్రణాళికనుండి అందుకొంటున్నవై ఉంటాయి. అలాంటి దివ్యస్థితిలో మనస్సు తన తపస్సును కొనసాగించాలి !

అగరువత్తిని వెలిగిస్తే చుట్టుపట్టుల వాతావరణం ఎలా పరిమళిస్తుందో మనకు తెలుసు. మంచిపూవు వికసిస్తే ఆ చుట్టుపట్టులు ఎంత ఆహ్లాదకరంగా రూపొందుతాయో మనకు తెలుసు. పవిత్రమైన భావనలతో తేలియాడుతున్న మానవుడు అలాంటివాడు. తన పరిసరాలను వెలుగులతో నింపగలిగినవాడు. తెలియని హాయిని ఆ ప్రాంతానికి చేకూర్చగలిగినవాడు. సుఖసంతోషాలతో ఆ పరిసరాలను పరవశింపజేయగలిగినవాడు. శాంతిసౌభాగ్యాలను అందించగలిగినవాడు. వారున్న చుట్టుపట్టుల ఏదో ఒక తెలియని తృప్తి— అందరి మనస్సులకు అందుతూ ఉంటుంది. భావసంశుద్ధివలన ఇంతటి పరమార్థం ఒనగూడుతుంది. ఇంతకంటే తపస్సు ఇంకేముంటుంది !

• • •

# 6. స్వధర్మాన్ని విడువకు!

శ్రేయాన్ స్వధర్మో విగుణః పర ధర్మాత్స్వ నుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥
(3అ॥-35శ్లో॥)

స్వధర్మ నిర్వహణ అన్నివిధాలా శ్రేయస్సును అందించగలదు. పరధర్మ నిర్వహణ ఎన్నోవిధాల వికటించగలదు. స్వధర్మ నిర్వహణలో మరణించినప్పటికీ అది ఒక సంతృప్తి. పరధర్మ నిర్వహణలో రాణించి నప్పటికీ అది మనకు అందించేది తీరని అసంతృప్తి.

నాటకంలో ఎవరి పాత్రవారికి ఉన్నట్లు ఈ సృష్టిలో ఎవరిపని వారికి కేటాయించబడి ఉంటుంది. మరి ఈ సృష్టి జగన్నాటకంకదా! నాటకంలో ఎవరి పాత్రను వాళ్ళు పోషిస్తూనే మిగిలిన నాటకంతో శ్రుతికలిపి నాటకం మొత్తాన్ని రక్తి కట్టించినట్లుగా మనం మన పాత్రపోషణతో మిగిలిన జగన్నాటకంతో శ్రుతి కలిపినవారమై ఆ నాటకాన్ని రక్తి కట్టించవలసి ఉన్నది. నాటకంలో ప్రయోజనం లేని పాత్ర ఉండనట్లు ఈ సృష్టిలోనూ పనికిరానిజీవి అంటూ ఉండదు. ఏ ఒక్కడు లేకపోయినా, ఆ మేరకు నాటకానికి లోపమేకదా! జగన్నాటకం కూడా అంతే! ఈ జగ న్నాటకంలో మనం పోషించవలసినపాత్ర ఉన్నదే- అది మన స్వధర్మం. దానిని నిర్వ హించడం మనకర్తవ్యం! ఎంతశ్రద్ధతో నిర్వహిస్తాము అన్నది మన సాధనపైన ఆధారపడిఉన్నది. నాటకంలో చూడండి! ఒకొక్కప్పుడు చిన్నపాత్రను వేసిన వాడు శ్రద్ధగా నటించి మనకు ఎల్లకాలం గుర్తుండిపోతాడు. అలాగే పెద్దపాత్రను వేసినవాడు నిర్లక్ష్యం చూపించాడనుకోండి. అంతపాత్రనూ రాణింపజేయలేని వాడయి నవ్వులపాలవుతాడు. మనకీయబడిన పాత్ర చిన్నదా, పెద్దదా అన్నది ప్రశ్నకాదు. దానినిబట్టి రాణింపు ఉండదు. దానినిబట్టి గుర్తింపు లభించదు. మన

కీయబడిన పాత్రను మనమెలా పోషిస్తున్నాము అన్నది ముఖ్యం. ఆ పోషించ డంలో మనం చూపుతున్న సాధన ముఖ్యం. ఆ పాత్రపోషణలో మనకు శిక్షణ నిచ్చేటందుకే ఈ ఆర్షవాజ్మయమంతా ఆవిష్కరింపబడి ఉంది. అవతారమూర్తులు, మహనీయులు ఆ పాత్రపోషణను మనకు నేర్పేటందుకే దిగివస్తున్నారు. మనను ఎదిగిరమ్మంటున్నారు.

ఈ సృష్టిలో మనకు ఎలాంటిపని అప్పజెప్పబడింది- అన్నది ప్రశ్నకాదు. దానిని మనము ఎలాగ నిర్వహిస్తున్నాము అన్నది ప్రశ్న. ఆ నిర్వహించడంలో మనం ఎలాంటి నేర్పును వ్యక్తం చేస్తున్నాము అన్నది ప్రశ్న. ఎలాంటి ఓర్పును మనం వహించగలుగుతున్నామన్నది ప్రశ్న.

ప్రతిపనిలోనూ కష్టమూ ఉంటుంది. సుఖమూ ఉంటుంది. అందువల్ల ఈ పనికాదని ఆ పనీ, ఆ పనికాదని ఈ పనీ మనం మార్చకూడదు. దేనిలో ఉండే రిస్కు దానిలో ఉంటుంది. రిస్కుగా పనిచేసికొంటూపోవడం మనకు చేత కావాలి ! రిస్కు ఉన్నదికదా ఈ పనిలో, పోనీలే మరొకటి చూద్దాము అనుకొంటే ఆ పనిలో ఉండే రిస్కు ఆ పనిలోనూ ఉంటుంది. కనుక చేయగలిగిన పనిని శ్రద్ధగా చేయడమే ఉత్తమము. అయినా ఒక్కమాట! రిస్కుకు బదులు చెప్ప డంలోనే మనిషి ఎదుగుతాడు. తనకు మించిన కేసులు వస్తున్నప్పుడే వైద్యుడు ఎదుగుతాడు అన్నీ తనకు లోబడినవే వచ్చినప్పుడు ఇంక అతడు ఎదిగేదెక్కడ ? అందుకు అవకాశమెక్కడ? కనుక కష్టాలు ఎదురవుతాయని కంగారుపడకండి ! బాధ్యత పడవలసివస్తుందని బెదిరిపోకండి ! ధీరులై మెలగండి ! ధన్యతను పొందండి !

తెలిసీ తెలియని సమాజంలో కొన్నిపనులు ఎక్కువజేసి గౌరవింపబడుతూ ఉంటాయి. కొన్నిపనులు తక్కువజేసి నిరాదరింపబడుతూ ఉంటాయి. సామాన్యంగా మానవుడు గౌరవాన్ని కోరుకొంటాడు కనుక గౌరవింపబడుతున్న పనులకే అతడు ఇష్టపడటానికి అవకాశముంది. నిరాదరింపబడుతున్న పనులను చేయడానికి చాలా మంది నిరాకరిస్తూ ఉండటం జరుగుతూ ఉంటుంది. ఇదంతా తెలిసీతెలియనితనం! సృష్టిలో అన్నిపనులూ సృష్టికి సంబంధించినవే! వాటిలో ఎక్కువలేదు. తక్కువ లేదు. పందిరిపేయడం దగ్గరినుండి పరమాన్నం వడ్డించడంవరకూ అన్నీ పెళ్ళి పనులే! పురికొస అందించడం దగ్గరినుండి తాంబూలం చేతపెట్టడంవరకూ అన్నీ

పెళ్ళిపనులే! పెళ్ళిపనులు కానివేవి ఇందులో ! అలాగే సృష్టికథలో కూడా! మనం దీనిని జగత్కళ్యాణం అంటున్నాంకదా! అలాంటప్పుడు అన్నిపనులూ జగత్కళ్యాణానికి సంబంధించినవేకదా! ప్రతిపనీ సృష్టికి అవసరమే! ఏ పని జరగకపోయినా ఆ మేరకు ఆ లోటు కొట్టవచ్చినట్లు కనబడుతూనే ఉంటుంది. సామాజిక అవసరాలలో ఎక్కువ, తక్కువలు చూడటం సమాజశ్రేయస్సుకు మంచిదికాదు. అప్పుడు తక్కువచేసి చూడబడేపనులకు క్రమంగా మనుషులు దొరకనిస్థితి ఏర్పడుతుంది. దానితో సామాజికజీవనం తాత్కాలికంగా కుంటుపడుతుంది. కనుక వివేకవంతుడు ఏ పనినీ చిన్నదిగా చూడడు. అన్నిపనులూ అవసరమే అని గ్రహించి అన్నిటినీ ఒకేలా గౌరవిస్తాడు. కనుక మనం చేయగలిగిన పనికి సమాజంలో ఎక్కువ గౌరవం లభించడంలేదు కాబట్టి, దానిని మానివేద్దాం, గౌరవం లభించే మరొక పనిలోనికి వెళ్ళిపోదాం అని అనుకోకూడదు. చేతనయితే చేస్తున్న పనియొక్క అవసరాన్ని సమాజంచేత గుర్తింపజేయాలి. సమాజాన్ని చైతన్యవంతం చేయగలగాలి. అంతేగాని మనం పెడదారిని పడకూడదు. ఒకసారి పెడదారినపడితే, ఇక జీవితం దారిని పడటం కష్టం. నేను చేస్తున్నపనికి విలువ ఈయబడటంలేదా, అయితే దాని విలువను నేను పెంచుతాను అనగలగాలి ! ఇ. కె. మాస్టరుగారు హోమియోవైద్యం చేపట్టేనాటికి హోమియోవైద్యం మనప్రాంతంలో నిరాదరింపబడుతోంది. హోమియో వైద్యులు ఎగతాళి చేయబడుతున్నారు. ఎక్కడోతప్ప నిలద్రొక్కుకొన్నవైద్యులు లేరు. అలాంటి సమయంలో మాస్టరుగారు దానిని చేపట్టి దిగ్విజయంగా నిర్వహించారు. హోమియో ప్రతిష్ఠను ప్రపంచ పరివ్యాప్తం చేశారు. అలోపతి వైద్యులు వందలమంది వారిముంగిట హోమియోవైద్యంకొరకు ఆర్తితో బారులుకట్టి నిలిచారు. మరి, ఇవాళ హోమియోవైద్యం చేయడం ఒకగొప్ప, హోమియో నేర్చుకోవడం ఒక విశేషం, ఇంతటి సామాజిక పరివర్తనను ఒక్కచేతిమీదుగా తీసుకొచ్చారాయన. పని చేయడమంటే అలాచేయాలి! అంతేగాని చేతనయిన పనిని వదిలి ఇంకేదో, ఎక్కడో ఉన్నదని ఎండమావులవెంట పడిపోకూడదు.

విద్యార్థుల తల్లిదండ్రులు కూడ ఒకటి గమనించాలి. దేనికి డిమాండ్ ఉన్నదో దానిలో పిల్లలను చేర్పించడంకాదు, మన పిల్లలకి దేనిపయిన కమాండ్ ఉన్నదో దానిలో చేర్పించాలి! డిమాండ్‌కన్నా కమాండ్ ముఖ్యం, డిమాండ్ ఇవాళ ఉంటుంది, రేపు పోతుంది. పనిపయిన మనకు వచ్చిన కమాండ్ ఉన్నదే

అది మనతో నడిచివస్తుంది. 'గతానుగతి కోలోకః' అన్నట్లుగా పదిమంది దేని వెంట పడుతుంటే. మనమూ దానివెంట పడకూడదు. మన పిల్లవాడి జీవలక్షణం ఏమిటి, వీడు దేనిలో రాణించగలడు, అన్న అంశాన్ని గమనించుకోవాలి ! అతడి అభిరుచిని అనుసరించి అతడికి కావలసిన విద్యను నేర్పించాలి. ఆ విద్యకు తగిన పనిలో అతడిని ప్రవేశపెట్టాలి. అంతేగాని అందరూ అటుపోతున్నారని పోవడం గాని, ఏదో ఒకటి దొరికితే చాలు అని చేరడంగాని జరుగకూడదు.

చూడండి చెబుతాను. కొంతకాలం తల్లిదండ్రులు పిల్లలను ఇంజనీరింగ్ వెంట పరిగెత్తించారు. ఇవాళ ఇంజనీయరు అంటే పిల్లనీయరు అన్నస్థితికి వచ్చింది. కొంతకాలం ఎం.బి.బి.యస్ వెంట పరుగెత్తించారు ఇవాళ వాళ్ళు బోర్డు పెట్టడానికి చోటులేక బాధపడుతున్నారు. ఆపైన ఎన్నెన్నో కోర్సులు చదివితే గాని. పొట్టనిండని స్థితి ఏర్పడుతోంది. ఉత్త ఎం.బి.బి.ఎస్‌లను ఎవరు పట్టించు కొంటున్నారో చెప్పండి. ఇలా ఒక్కొక్కదానివెంట పడుతూ ఉండటం, దానికికూడ విలువలేకుండా చేస్తూ ఉండటం మనం చేస్తున్నాం. ఇప్పుడందరూ కంప్యూటర్ అంటున్నారు. ఇప్పుడు మోజంతా అటువైపే ఉంది. అందరూ కంప్యూటరే ఇప్పుడు దీనికధకూడా పైపాటికిలాగానే క్రమంగా అటక ఎక్కుతుంది. ఇక అటుకేసి చూసేవాడుండడు. తాత్కాలికమయిన ఈ వ్యామోహాలను వదిలి, పిల్లల జీవలక్షణాలకు అనుగుణమైన విద్యనూ, వృత్తినీ వారికి అందించండి ! అప్పుడు వారు స్వధర్మపరాయణులవుతారు.

పూర్వకాలంలో ఉపనయనంతో విద్యాభ్యాసం ప్రారంభమయ్యేది. ఉపనయనము అంటే గురువును సమీపించడం విద్యకొరకు సమీపించడం, బ్రహ్మోపదేశంతో విద్యప్రారంభం. అటుపైన ఆ గురుమూర్తి ఆ కుర్రవాని జీవలక్షణాన్ని అనుక్షణం గమనిస్తూ ఉండేవాడు. తనకున్న దివ్యజ్ఞానంతో ఆ కుర్రవానికి ఈ సృష్టిలో కేయబడిన పాత్రను దర్శించేవాడు. ఆ పాత్రపోషణకు అనుగుణంగా అతని విద్యాభ్యాసాన్ని నడిపించేవాడు. అతణ్ణి అన్నివిధాలా స్వధర్మనిర్వహణలో సామర్థ్యాన్ని చూపగలవానిగా తీర్చిదిద్ది, స్నాతకోత్సవం జరిపి సమాజానికి ఒక

కానుకగా అతణ్ణి సమర్పించేవాడు. సమాజం అతణ్ణి చూసిమురిసిపోయేది. అతని సామర్థ్యం సమాజసేవలో మెరిసిపోయేది. నేడుకూడ ఆ గురుమూర్తుల వంటివారు లేకపోలేదు. అలాంటివారు ఎప్పుడూ ఉంటారు. అలాంటివారి సన్నిధిలో మన బిడ్డల భవిష్యత్తును మనం తీర్చిదిద్దుకొనవచ్చు. వారి సారథ్యంలో మన పట్టెలను నడిపించవచ్చు. మళ్ళీ నేటికాలానికి తగినట్లుగా గురుకుల వాతావరణాలను మనం రూపొందించుకోవచ్చు. అదేమంత కష్టంకాదు. మన మనస్సుకు అది ఇష్టంకావాలి అంతే ! ఇతరేతర వ్యామోహాలను వదిలి సృష్టిచక్రానికి అనుగుణంగా నడవాలని దానికి అనిపించాలి! అనిపిస్తేచాలు. దారి అదే కనిపిస్తుంది.

పరిపాలనా యంత్రాంగంలో తనకు తగిన పదవిలో రాణిస్తున్న ఒక నడివయస్కుడు, వ్యాపారస్థులయిన మిత్రులను చూచాడు. వారు తనకు సమవయస్కులు. కాని వారు సంపాదించిన సంపద అపారం. నడివయస్కునికి ఒక ఆలోచన వచ్చింది. 'ఎన్నాళ్ళు ఉద్యోగం చేసినా, ఇది గొర్రెతోక బెత్తెడు వ్యవహారమేకదా! మనంకూడా వ్యాపారంలోనికి పోదాం. లక్షలు కళ్ళజూడవచ్చు.' అనుకొన్నాడు. మిత్రులను సంప్రదించాడు. వారు ఇతణ్ణి భాగస్వామిగా స్వీకరించారు. తొలిరోజులు ఉల్లాసంగానే గడిచాయి. వ్యాపారంగూర్చి తనకు పెద్ద అవగాహన లేకపోవడంతో వ్యాపారం మొత్తం తన మిత్రులకే వదిలాడు అతను. వచ్చినవారిని సత్కరించడం మాత్రం స్వీకరించాడు. ఒకరోజు మిత్రులు పిలిచారు. సత్కారం మధ్యనుండి లేచివెళ్లాడు. వ్యాపారం దివాళా తీసింది. అన్నారు. ఏవేవో లెక్కలు చూపారు. ఆ వ్యవహారం క్రొత్తగా ఉందతనికి. అతనేం చేయగలడు. తూర్పుకు తిరగడంతప్ప. ఉద్యోగానికి రాజీనామా చేశాడు. వ్యాపారమా దివాళా తీసింది. చేసేది లేక ఇంటికి తిరిగాడు. చేసిన ఫర్నిచర్ వ్యాపారానికి గుర్తుగా ఆరుకుర్చీలు రెండు బల్లలు వారింటిదగ్గర మిగిలాయి. క్రమంగా అతనికి గుండె దెబ్బతింది. ఆ బెంగతోనే శరీరాన్ని విడిచిపెట్టడం జరిగింది. ఆ శరీరం విడిచిపుచ్చేటప్పుడు 'పరధర్మో భయావహః' అన్న గీతవాక్యం గుర్తుకువచ్చింది. వచ్చే జన్మలోనయినా ఈ పొరపాటు చొర్లకూడదు, అనుకొంటూ అతడు దేహంనుండి నిష్క్రమించాడు.

అధ్యాపకధర్మం కలిగిన ఒకవ్యక్తి దానికి చెందిన చదువులన్నీ చదివాడు. అంతవరకూ బాగానే ఉంది. ఆ వృత్తికోసం ప్రయత్నం చేశాడు. ప్రయ

త్నాలు పెద్దగా ఫలించలేదు. వేచి ఉండలేక బ్యాంకు ఉద్యోగిగా మారాడు. మారినా అతని లక్షణం ఎక్కడికి పోతుంది. క్యాషియర్‌గా అతను ఉన్నప్పుడు కష్టమర్లం దరూ ఈయన ఒకపట్టాన క్యాష్‌ఈయరు అనుకోసాగారు. కారణం నోట్లు లెక్క పెడుతుండగా నోట్లోంచి మను చరిత్రపద్యం వచ్చేది. ఇక అంతే ! ఆ పద్యాన్ని పాడుకొంటూ అలా నిలబడిపోయేవాడతను. ఇక ఎదురుగా నిలుచున్న కష్టమర్ కష్టమంతా మాదేమరి, అనుకొంటూ 'బాబూ ! మనుచరిత్రనుండి మనచరిత్రలోకి ఎప్పుడొస్తారు' అని అడిగేవాడు. కానీ క్యాషియర్‌గా ఉన్న ఆ మానవుడుమాత్రం కాసేపు ఆగలేరా అన్నట్లు చూసేవాడు. రససిద్ధికి భంగం కలిగితే ఎలా అన్నట్లు చూసేవాడు. 'నీ రససిద్ధికి భంగంసరే, నాకు నీరసం సిద్ధిస్తోంది అనేవాడు కష్టమర్.' ఇలా నడుస్తూ ఉండేది అతని దినచర్య. బ్యాంకులో ఉద్యోగం మంచి జీతం నిజానికి అధ్యాపకవృత్తిలోకన్నా ఎక్కువజీతాన్నే అందుకొంటున్నాడు. ఎదిగేందుకు అవకాశాలున్నాయి. అయినాసరే, ఏదో అసంతృప్తి. ఏదో కోల్పోయినట్లు ఇక ఈ జీవితానికి ఇంతే ! అన్నట్లు. కారణం? తనదికాని ధర్మంలో తానున్నాడు. అది అతనికి సంతృప్తినీయడంలేదు. ఆ జీవి దప్పిక తీరడంలేదు. చూశారా ? ప్రయోజనాన్ని అధికంగా కలిగిస్తున్నప్పటికీ పరధర్మం తృప్తిని అందించలేక పోతోంది.

తన ధర్మాన్ని తాను నిర్వర్తిస్తున్నప్పుడు తాను చేయవలసినదాన్నీ, తాను చేయగలిగినదాన్నీ, తానుచేస్తున్న మానవునికి ఒకతృప్తి కలుగుతోంది. ఈ తృప్తి కన్నా ఏ ప్రయోజనాలూ అధికమైనవికావు. అప్పుడు అతనిలోని శరీరకోశాలు, ఇంద్రియాలు, మనస్సు అవన్నీకూడాచిత్రమైన ఆనందానుభూతిని అనుభవిస్తాయి. మేము ఇతడిచేత ఎందుకు వినియోగింపబడాలో అందుకే విని యోగించబడుతున్నాముకదా అని అవి అనుభూతిలో సొక్కుతాయి. ఇలాంటి అనుభూతి వేరెక్కడా అవి పొందలేవు. ఇలాంటి అనుభూతిని మరి ఏ సమయంలోనూ అవి పొందలేవు. ఇంద్రియాలకు, మనస్సుకూ. ఆ అనుభూతి లభిస్తున్నప్పుడు, ఆ కర్మాచరణం ఒకగానంగా సాగిపోతుంది. జీవితం మంచిపాటగా రూపొందు తుంది. సన్నివేశాలు ఆ పాటలోని చరణాలవుతాయి. అలాంటి గానాన్ని ఆల పించడానికే ఈ భూమిమీదకు మనం వచ్చేది. మనం ఆలపించాలి! మిగిలినవారంతా ఆలకించాలి! దేవదేవుడు దానిని అవలోకించాలి! ఆహా! అంటూ అతడు ఆనందిం

చాలి! అదే జీవితానికి సార్థకం! అదే జీవితానికి ధన్యత : మనపెద్దలు దీనినే 'జీవన్ముక్తస్థితి' అన్నారు. తీరుగా నిర్వహింపబడిన స్వధర్మాచరణం ఇంతటి దివ్యస్థితిని అనుగ్రహించగలదు, హరిపదాన్ని అందించగలదు!

అలాంటి స్వధర్మాచరణలో నిలచిఉండగా మృత్యువుకూడ ఒక సన్నివేశ మనిపించదు. అది అతడిని ఏమాత్రం బాధించదు. స్వధర్మాచరణ జరుగుతుండగా శరీరం దానికదిగా రాలిపోతుంది, వ్రాలిపోతుంది. అతడు మాత్రం ఆ అనుభూతి లోనే ఉంటాడు. ఆ అనుభూతిగానే ఉంటాడు.

* * *

# 7. పని చేయడమే నీ వంతు !

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన !
మా కర్మఫల హేతుర్భూర్మా తే సంగోఽస్త్వ కర్మణి॥
(2అ॥-47శ్లో॥)

మానవునకు పనిని చేయుటయందే అధికారమున్నది. ఫలితమును నిర్ణయించుటలో అతనికి అధికారము లేదు. కర్మఫలానికి తాను హేతువుగా నిలబడుటకూడ మంచిదికాదు. ఇన్ని ఆంక్షలు ఉన్నాయికదా అని పని చేయడమనే పవిత్రస్థితినుండి ఎన్నడూ తప్పుకొనరాదు. అలాంటి ఆలోచనకూడ మనస్సున రారాదు. పని మననుండి జరుగుతూ ఉండ వలసినదే :

దైవం మనకు శరీరాన్ని ఇచ్చాడు, కర్మాచరణకు కావలసిన కర్మేంద్రియాలనిచ్చాడు, జ్ఞానస్వీకరణకు కావలసిన జ్ఞానేంద్రియాలనిచ్చాడు. ఈ

రెండు గుంపులచేత పని చేయించగలిగిన మనస్సును ఇచ్చాడు. పని చేయిస్తున్న మనస్సునకు కావలసిన సూచనలిచ్చేటందుకు బుద్ధిని ఏర్పాటు చేశాడు. ఇలా మనలో కర్మాచరణకు కావలసిన బలగమంతా రూపొందింపబడిఉంది. ఇక కర్మాచరణం జరగడమే తరువాయి. కర్మాచరణమెలా జరుగుతున్నది ఆపైన 'తాను' ప్రశాంతంగా నిలబడిచూస్తూ ఉంటాడు. అలా మనలో నిలబడి మన కర్మాచరణాన్ని గమనిస్తున్న దైవాన్ని సాక్షీమాత్రుడు అంటారు. స + అక్షి= సాక్షి. కన్నుగలిగినవాడు. మన ప్రవర్తనను నిరంతరం గమనించగలిగిన కన్నుగలవాడు మనలోనే, ఆ లోపల, ఆ మూలసౌధంలో ఉన్నాడు.

పని చేయడానికి కావలసిన బలగమంతా ఈయబడింది కాబట్టి మానవునికి పనిచేయడంపైన అధికారమీయబడినట్లయింది. అనగా మనం పనులుచేసి తీరవలసినస్థితిలో పెట్టబడ్డాము. కొందరికి అది ఇబ్బందిగా అనిపించవచ్చు. కొందరికి అది అవకాశంగా అనిపించవచ్చు. మొత్తంమీద మానవులు పని చేసితీరాలి! అయితే ఫలితాన్నిగూర్చి అతడు ప్రశ్నించకూడదు. ఫలితం ఇలాఉంటే బాగుంటుందని దేవుడికి ఉచిత సలహాకూడ ఈయకూడదు. కోరిన ఫలితం లభిస్తేనే మేం పనిచేస్తాము. లేకపోతే చేయము. మేముకోరిన ఫలితం రానప్పుడు మేమెందుకు చేయాలి? ఎవరినికోరి ఈ పనిని ప్రారంభిస్తున్నామో, ఆ దేవుడే మమ్మల్ని కాదు పొమ్మన్నాడు. కనుక అతనికి మహిమలేదంటాము. ఉంటే మేమాశించిన ఫలితం రావాలికదా- అని మడతప్రశ్నవేస్తూ ఉంటాం. అలాంటి మొండివేషాలు వేయకూడదు. ఆశించిన ఫలితం రాలేదని కృంగిపోయేవాళ్ళుంటారు. అదీ తప్పే! అనుకొన్నట్లుకాకపోతే తట్టుకోలేనండి! అంటాడు ఒకడు కాని తప్పదు. తట్టుకోవాలి !

ఇంతకూ నిజమేమంటే- పనిని చేయడంలో మనకు ప్రసక్తిఉంది గాని, ఆ పనివలన కలిగే ఫలితం విషయంలో మనకు ప్రసక్తిలేదు. ఉండటం మంచిదికూడ కాదు. అలా ఉండటంవల్ల నష్టమే జరుగుతుంది తప్ప లాభం ఒనగూడదు.

ఒక విద్యార్థి పరీక్షలో ప్రశ్నలకు జవాబులు వ్రాస్తున్నాడు. ఒక్కొక్క ప్రశ్నకూ జవాబును పూర్తిచేసిన తరువాత. ఇంతకూ దీనికి ఎన్ని మార్కులు పడతాయి. అని ఆలోచిస్తున్నాడు. ఎన్నిమార్కులు వస్తే తనకు క్లాసువచ్చే అవ

కాశముంది- అని బుర్ర గోక్కుంటున్నాడు. ఈ ఆలోచనలకు పది నిముషాలు పట్టింది. అప్పుడు స్పృహలోనికి వచ్చి రెండవప్రశ్న మొదలుపెట్టాడు. ఈసారి వ్రాస్తూఉండగానే 'ఈ ప్రశ్నకు షుమారు ఎన్నిమార్కులు పడతాయంటారు'? మనం అనుకొన్నమార్కులు పడతాయా? ఈ పేజీలన్నీ మొత్తం అక్కడిదాకా వెళ తాయా?'- వ్రాతకి వేగం తగ్గింది. ప్రశ్నలు మాత్రం వ్రాయాల్సినవి చాలా ఉన్నాయి. 'ఇంకా అరగంట మాత్రమే ఉన్నది-' అని హెచ్చరిస్తున్నాడు పర్య వేక్షకుడు. కంగారుపడుతున్నాడు క్లాసు కావాలనుకొంటున్న మన విద్యార్థి, పని జరుగుతూ ఉండగానే, ఫలితాన్నిగూర్చి ఆలోచించినందువల్ల అతనికి కలిగినది లాభమా? నష్టమా చెప్పండి! కనుక ఫలితాలపైదృష్టితో పని చేస్తున్నవాడు ఇటు పనికిన్యాయం చేయలేడు, అటు ఫలితాన్నీ పెద్దగా పొందలేడు. ఏమంటారు!

అర్ధరాత్రివేళ ఊహింపలేనంత వేగంగా వెళుతోంది లారీ. లారీనిండా లోడు. లోడుపైన పడుకొన్న మనుషులు, నరసంచారంలేని రోడ్డది. ఎక్కడా ఆపవలసిన అవసరం కనబడటంలేదు. హారన్‌కు కూడా పని తగలడంలేదు. ఇటూ, అటూ పరిగెత్తే వాహనాలుమాత్రం పరిగెత్తుకొని పోతున్నాయి. ఆ సమయం వాహనాలకే కేటాయించబడిందా అన్నట్లుగా ఉంది ఆ పరిస్థితి! ఉన్నట్టుండి డ్రైవరుకు ఒక ఆలోచన వచ్చింది. 'ఈరోజు బలేస్పీడు మీద వెళుతున్నాం. బహుశా ఎవడూ ఇంత స్పీడుగా వెళ్ళలేదేమో! ఈ కాస్త సమయంలో ఎన్ని కిలో మీటర్లు వచ్చి ఉంటాను? అంటూ లెక్కలు కడుతున్నాడు. మరుక్షణంలో రక్త పాతాలమధ్య వాహనాలభాగాలు, మానవుల అవయవాలు! అటూ, ఇటూ బారులు తీరిన వాహనాలు. ఏమిటీ దుస్థితి? ఫలితాన్నిగూర్చి ఆలోచించేటప్పటికి సాక్షాత్క రించిన ప్రమాదపరిస్థితి ఇది! కనుక పనిచేస్తున్నవాడికి 'ఇంతవరకూ మనం ఎంత సాధించాం! ఫలితాన్ని ఎంతవరకూ సాధించి ఉంటాం మొదలయిన ఆలోచనలు రావడం మంచిదికాదు. మాశాయగా ఆ ఆలోచనలు కూడ ఎంతటి దుస్థితిని సృష్టిం చాయో ! పనిని చేసికొంటూ పోవడమే మానవుని కర్తవ్యం : ముందు వెనకలు అతనికి అనవసరం !

అది ఒక కుగ్రామం. ఆ కుగ్రామంలో ఒక కడజాతి కుటుంబం అందులో వృద్ధదంపతులు. వారికొక్కడే కొడుకు. వాణ్ణి నానాశ్రమపడి తాము కడుపు కట్టుకొని, వాడికిన్ని మెతుకులు పెడుతూ, అలా అలా వాడిని చదివించి పెద్దజేశారు. వాణ్ణి పెద్దజేయడంలో వారి శరీరాలు చెమటగా మారి జారిపోయాయి.

బొమికెల గూడులుగా మారాయి. కుఱ్ఱవాడు దూరాన ఎక్కడో మనదికాని దేశంలో పెద్దపని చేస్తున్నాడు. ఇంటిదగ్గర దంపతులు కదలలేనిస్థితిలో ఉన్నారు. ఒకళ్ళ వైపు ఒకరు చూచుకొంటున్నారు. మొదటినుండీ వాళ్ళకు ఒకకోరిక ఉండేది. పెద్ద అయ్యేంతవరకే ఒక కష్టం. ఆ తరువాత అంతా వాడే చూచుకొంటాడు. ఇంత పెద్ద యిన తరువాత ఆ మాత్రం తల్లిదండ్రులను చూచుకోలేకపోతాడా అని వాళ్ళ విశ్వా సం. అబ్బాయితోపాటు మనంకూడా అటూ, ఇటూ కూర్చొని క్రొత్త క్రొత్త కార్లలో అలా తిరుగుతూఉంటే ఎంత బాగుంటుంది ! అంటూ కలలు కన్నారు వాళ్ళు.

కొడుకు దగ్గరినుండి ఎప్పుడయినా కొంత మనియార్డర్ మాత్రం వస్తుంది. కాని వీరి మనియూద మాత్రం తీరడంలేదు. బాబూ'! డబ్బులు మాకెందుకురా! నీవు కావాలి! నీతో కలిసి నీ తల్లిదండ్రులుగా ఆనందంగా గడ పాలని ఉంది. వచ్చి మమ్మల్ని తీసుకువెళ్ళరాదా? ఇంకా ఎంతకాలముంటాం ? కాస్త కాలూ చేయి ఆడుతూ ఉండగానే మమ్మల్ని తీసికొని నాలుగూ చూపరాదా ! మమ్మల్ని అక్కడికి తీసికొనిపో! అంతా ఒకచోటే ఉందాం! ఉత్తరం వ్రాయిం చారా తల్లిదండ్రులు. ఎంతో ప్రేమగా ఇక కొడుకు వచ్చేస్తాడనుకొంటున్నారు. సర్దాల్సినవేమున్నాయి అని చూస్తున్నారు. కారులో కొడుకు రాలేదుకాని కార్డుముక్క మాత్రం వచ్చింది. 'ఇక్కడ నేనుండేది మహానగరం. అక్కడ మీరుండేది కుగ్రామం. నేను అక్కడికి రావడానికి తీరికలేదు. మీరు ఇక్కడికి రావడానికి ప్రయత్నించకండి! ఇక్కడ మీరు ఇమడలేరు. మీ వేషభాషలనుచూచి ఇక్కడి వారు అసహ్యించుకొంటారు. మీరు మీ అలవాట్లను మానుకోరు. దానితో ఇక్కడివారు మిమ్మల్ని త్రోసేస్తారు. అన్నిటినీమించి, మీరు నాతోఉంటే ఇంటికి వచ్చే ప్రతివారికీ మిమ్మల్ని నా తల్లిదండ్రులుగా చూపించవలసి ఉంటుంది. నేను అలా చూపించలేను. అది నాకు ఇష్టంలేదు. ఇప్పటి నా స్థాయికి అది చాలా భంగ కరం : వీరేనా ఈయన తల్లిదండ్రులు అని వారు అసహ్యించుకొంటారు. మళ్ళీ ఇంటికిరారుకూడాను ! నేనూ, కోడలు పిల్లలు మంచిగా బ్రతకాలని ఉంటే ఇక్క డికి రాకండి : మీ కోడలు మిమ్మల్నిచూసి ఇష్టపడుతుందని కూడ నేను అను కోను. మీ జీవితాలు, ఇష్టాలు, అలవాట్లు ఆలాంటివి. మీ మొరటుదనం అలాం టిది. నేను చేయగలిగింది కూడ అప్పుడప్పుడు డబ్బుమాత్రం పంపిస్తుంటాను.

దానితో తృప్తిపడండి. ఇదీ ఆ ఉత్తరంలోని సారాంశం. గుంటలుపడిన వాళ్ళకళ్ళు కన్నీళ్ళతో నిండాయి. కన్నీటి గుంటలయ్యాయి. వాళ్ళకల అలా చెదిరిపోయింది. కొడుకేనా ఇలా వ్రాసింది, కన్నకొడుకేనా?- అంటూ గుండెలు బాదుకొన్నారు వాళ్ళు. అంతే ఆ బాధతో మంచంపట్టారు. ఇక్కడ జరిగింది ఏమిటి ? ఆ దంపతులు ఒక ఫలితాన్ని ఆశించారు. దాన్నిగూర్చి తమ జీవితాన్ని ధారవోశారు. కొడుకును పెద్దవాణ్ణిచేసి, ప్రయోజకుడిని చేశారు, కాని వారికి ఫలితం దక్కలేదు. వారు కృంగి మంచానపడ్డారు. ఇంతచేసినదానికి ఇదా ఫలితం అని వారికి అనిపించింది. మనకు అనిపిస్తుంది. కాని విశేషమేమంటే ఎలాంటి ఫలితం ఆశించకుండా 'వీడు మన కడుపున పుట్టాడు. వీడిని పెంచి, పెద్దజేసి, ప్రయోజకుడిని చేయడం మనధర్మం'- అనుకొని ముందుకు సాగాడనుకోండి. అప్పుడుకూడ కొడుకు పెద్దవాడై, ప్రయోజకుడై, ఇందాకటిలాగానే తల్లిదండ్రులను మరచిపోయాడనుకోండి. ఈ తల్లిదండ్రులకు బాధకలగదు. మనధర్మం మనం నిర్వర్తించాము, నిర్వర్తించినందుకు వాడు పైకివచ్చాడు. భార్యాపిల్లలతో హాయిగా జీవిస్తున్నాడు అంతకంటే మనకు ఇంకేం కావాలి!- అనిపిస్తుంది.

మొదటి తల్లిదండ్రులు ఫలితాన్ని ఆశించి దుఃఖాన్ని మిగుల్చుకొన్నారు. రెండవ తల్లిదండ్రులు ఫలితమన్నదానితో ప్రసక్తిలేకుండా, ధర్మంగా ఆచరించి తృప్తిని పొందారు. గమనించండి. ఫలాపేక్ష ఇక్కడ ఎలాంటి దుఃఖాన్ని కలిగిస్తున్నదో !

గాంధీమహాత్ముడు దేశస్వాతంత్ర్యం కోసం తపించాడు. పరితపించాడు వస్తున్నాడు. దెబ్బలు తిన్నాడు. చాలీచాలని బట్టతో జీవితకాలమంతా గడిపాడు. ఎప్పుడూ కదులుతూనే కనిపించాడు, వందల వేలమంది యువకులను నాయకులుగా తీర్చిదిద్దాడు. కోట్లమంది ప్రజలను చైతన్యవంతులుగా చేశాడు. జాతిని పవిత్రీకరించడానికి ప్రయత్నించాడు. జాతికి క్రమశిక్షణ నేర్పాలని తాపత్రయపడ్డాడు. ఎట్టకేలకు స్వాతంత్ర్యాన్ని సాధించాడు. జీవితాంతం అహింసను బోధించిన ఆయన జీవితం హింసతో అంతమైంది, రక్తపుమడుగులో ఆయన ఒరిగిపోయాడు. మనకు స్వాతంత్ర్యాన్ని ఇచ్చిపోయాడు. ఎటువంటి తపస్సుతో ఈ ఫలితాన్ని సాధించాడాయన. తలచుకొంటే కళ్లు చెమరుస్తాయి. కాని ఇప్పుడున్న పరిస్థితులేమిటి? ఆలోచించండి. ఇప్పటి దేశాన్ని గురించి ఆలోచిస్తే, గాంధీమహాత్ముని తపస్సుకు

ఫలితమిదేనా అనిపించదూ! ఇంతకాడికి ఆయన అంత తపస్సు చేయడమెందుకు? అనిపించదూ! కాని ఆయన చేశాడు. భగవద్గీతను చేబట్టుకొని మరీ చేశాడు అనుక్షణం గీతను అధ్యయనం చేస్తూ మరీచేశాడు. చేయవలసిన తపస్సును చేస్తున్నాను. ఇక జాతి ఈ తపఃఫలితాన్ని ఎలా వినియోగించుకొంటుందో అన్నది ఇటు జాతికీ, అటు దైవానికీ వదిలిపెడుతున్నాను- అన్న దృఢనిర్ణయంతో చేశాడు. అలా వదిలిపెట్టేశాడు. జాతి క్రిందా మీదా పడుతున్నది. దైవం పైనుండి క్రిందకు మాస్తున్నాడు. దీనికేం చెబుతాము మరి? జరిగిన తపస్సేమిటి? నడుస్తున్న ఫలితమేమిటి? అంత మంచిపనికి ఇంతటి దుష్ఫలితమా? అని అనిపిస్తుంది.

ఒక్కటి గమనించాలి. ఫలితం ఎప్పుడూ ఒకవ్యక్తినిబట్టిగాని ఒకజాతిని బట్టిగాని నిర్ణయం కాదు. మొత్తం సృష్టికథలో అప్పుడు జరుగవలసిన దానినిబట్టి నిర్ణయమవుతుంది. దానికను గుణంగా ఒక స్థితి మనకు అందవచ్చు. అనేక పర్యాయాలు మనకు అందకపోవచ్చు. ఇది చాలా నిగూఢమయిన విషయం. ఏవి ఎందుకు జరుగుతున్నది అన్నది ఒకపట్టాన తెలిసేదికాదు. అందరికీ బోధపడేది కాదు.

మనం చేస్తున్నపనిని మన పని అనుకొంటున్నాము. దానినుండి మనకు కావలసిన ఫలితం రావాలని కోరుకొంటున్నాము. నిజానికి మనం సృష్టిలో ఒక భాగం, సృష్టికి చెందినవాళ్ళం. మనమీదుగా నడుస్తున్నది సృష్టికార్యం. ఫలితం సృష్టికి సంబంధించినదే. సృష్టి అనే పెద్దకథలో బుల్లి ఉపకథ మనది. కనుక మనమనుకొన్నట్లుగా పెద్దకథ నడవదు, అసలింతకూ పెద్దకథ ఏమిటో బోధపరచుకొనగలిగినవారు తక్కువ. మనమీదుగా సాగుతున్న కర్మలూ, ఫలితాలు ఆ పెద్ద కథకు అనుగుణంగా సాగిపోతుంటాయి. సాగిపోవాలికూడా! అలా పెద్దకథ ప్రకారం మన ఈ బుల్లిఉపకథ సాగుతున్నప్పుడు కొన్ని మనం అనుకొన్నట్లు జరుగుతాయి. కొన్ని మనం అనుకొన్నట్లు జరగవు. అనుకొన్నట్లు జరిగాయి అంటే పెద్దకథకు తగినట్లుగా అనుకోవడం మనకు అప్పుడు చేతనయిందన్నమాట! అనుకొన్నట్లుగా జరగలేదు అంటే, పెద్దకథకు తగినట్లుగా అనుకోవడం మనకుచేతకాలేదన్నమాట! ఇది గ్రహించాలి!

సృష్టికథనుబట్టి కర్మాచరణ జరుగుతున్నప్పుడు ఒకసారి వెంటనే ఫలితం కనిపిస్తుంది, ఒకసారి కొద్దిగా కనిపిస్తుంది. ఒకసారి అనుకొన్నంత కనిపించదు. ఒకసారి ఊహించనంతకనిపిస్తుంది, ఒకసారి అసలు కనిపించదు. ఒకసారి విరుద్ధంగా ఒకసారి వక్రిస్తుంది. ఒకసారి ఇంకెప్పుడో అనుభవానికి వస్తుంది. కనుకకర్మఫలితాన్ని మనం సృష్టికథకు వదిలివేయాలితప్ప, దానిపై మనమెలాంటి అధికారాన్నికూడ ఆపేక్షించకూడదు. మనప్రకారమే జరగాలి అని పట్టుపట్టకూడదు. ఎందుకు జరగలేదని మథనపడకూడదు. జరగకపోతేఇంకెందుకు అని విషాదదృశ్యాలను సృష్టించకూడదు. కర్తవ్యకర్మను నిర్వహించుకొంటూ వెళ్ళిపోవాలి! ఫలితం ఉంటుంది. లేకపోవడమనేది ఉండదు, అది ఎప్పుడు ఎలా అనుభవానికి రావాలి అనేది మాత్రం సృష్టికథ ప్రకారం నిర్ణయమవుతుంది. కనుక మనం ఫలితాన్ని అటువదిలి పనిని చేసికొంటూపోవడమే పద్ధతి !

ఫలితాన్నిగూర్చి ఆలోచిస్తున్నవాడు పనికి న్యాయం చేయలేకపోతున్నాడు దీనిని మనం విద్యార్థి ఉదాహరణలో చూశాం. ఫలితాన్నిగూర్చి ఆలోచిస్తూ పని చేస్తున్నవాడు పనియెడల ఏమరుపాటుచెంది, ఆ ఏమరుపాటువల్ల ప్రాణాంతకస్థితినే సృష్టించుకోగలుగుతున్నాడు. దీనిని మనం లారీ డ్రైవరు సన్నివేశంలోచూశాం. ఫలితాన్నిగూర్చి ఆలోచించుకొంటూ, ఫలితాన్ని ఆకాంక్షిస్తూ, మంచి పనినిచేసి, ఆ మంచిపనికి జీవితమంతా ధారపోసి, ఫలితాన్ని ఆశించడంవల్ల చివరకు మంచమెక్కిన వారిని, తల్లిదండ్రులు కొడుకు కథలో చూశాం. ఫలితాన్ని ఆశించినందువల్ల వారు మంచి పనిచేసి చేసి చివరకు మంచమెక్కారు. ఫలితాన్ని ఆపేక్షించకుండా కొడుకును తీర్చిదిద్దిన తల్లిదండ్రులు ఎలా తృప్తిగా చరమజీవితాన్ని గడిపారో ఆ ప్రక్కనే చెప్పుకొన్నాం. ఫలితాన్ని ఆపేక్షించడంవల్ల, ఫలితాన్ని ఉద్దేశిస్తూ పని చేయడంవల్ల మనిషి ఎలాంటి ఇబ్బందులకు గురిఅవుతున్నాడో చూడండి ఈ ఇబ్బందులకు మానవులు గురికాకుండా ఉండాలని ప్రేమమయుడయిన భగవానుడు 'మీరు పనిని చక్కగా చేయండి. ఫలితం సంగతి నాకు వదిలేయండి. నేను చూచుకొంటాను.' అన్నాడు. నేను చూసుకొంటాను అన్నాడుతప్ప, నేను తీసుకొంటాను అనలేదు ఆయన. ఈ సూక్ష్మాన్ని గమనించండి! నేను చూసుకొంటాను అంటే మీరు చేస్తున్న కర్మకు ఎప్పుడెప్పుడు ఏ కర్మకు ఎలాంటిరూపంలో, ఎంతంతగా ఫలితాన్ని అందించవలసిందీ నా సారథ్యంలో మీకు అందించబడుతూనే

ఉంటుంది' అని అర్థం. ఆ ఫలితాలను ఎప్పుడు, ఎలా అందించవలసిందీ నాకు తెలుసును- అని అర్థం. కనుక కంగారుపడవలసిన పనిలేదు అన్నది ఆయన ఆజ్ఞ.

ఇక గాంధీమహాత్ముని కథ దగ్గరకు వచ్చేటప్పటికి మనకు తెలిసిన దేమిటి? కర్మకు ఫలితమనేది సృష్టికథతో ముడివడిఉంటుంది. దానిని గెలుపు అనుకోలేము. ఓటమి అనుకోలేము. కేవలం ఒక కోణంనుండి గమనిస్తే అందే అంశంకాదిది. కర్మఫలితం, అనేది వ్యక్తిగతం కాదు. సృష్టిగతం! కనుక మన మీదుగా జరిగిన కర్మయొక్క- ఫలితం సృష్టికథకు అనుగుణంగానే సాగిపోతుంది తప్ప, మనమనుకొన్నట్లుగా సాగాలనిలేదు. అలాసాగాలని మనం అనుకోకూడదు కూడా! అని మనం గమనించాం!

ఫలితంపై ప్రత్యేకమైన దృష్టిలేనివాడు తానుచేస్తున్న పనికి పరిపూర్ణమైన న్యాయాన్ని చేకూర్చగలుగుతాడు. శ్రద్ధగా, తృప్తిగా, సమర్థవంతంగా పని చేయగలుగుతాడు. అతని దృష్టిమొత్తం పనిమీదనే లగ్నమై ఉంటుంది. అప్పుడు పని రాణిస్తుంది. అతడు ఆ పనిలో మరింత సమర్థుడవుతాడు.

మనం సృష్టిలోని భాగం. సృష్టికార్యం మనమీదుగా సాగిపోతున్నది. మనం చేస్తున్నది మన పనికాదు. సృష్టికి సంబంధించిన పని, కర్మ మనవలన జరగడంలేదు. మనద్వారా జరుగుతున్నది. మనమీదుగా జరుగుతున్నది. కాబట్టి ఫలితాలుకూడా సృష్టికి సంబంధించినవే అవుతున్నాయి. అవి సృష్టికే సమర్పితం కావలసిఉంది. అటువంటప్పుడు మనకొరకు వాటిని వినియోగించుకోవాలనుకోవడానికే ఈకర్మలను మనం చేస్తున్నామనకోవడం సరికాదు. ఏ ఫలితమయినా కృష్ణార్పితం కావలసినదే! మరి మన సంగతి ఏమిటి? కంగారుపడవలసిన పనిలేదు. ఈసృష్టిలో మనకొరకని మనం జాగ్రత్తపడడం, అనవసరమన్నమాట. అంటే, జాగ్రత్తపడుతున్నాము అంటే సృష్టిని గురించి మనకు తెలిసింది అంతేనన్నమాట! ఎంత తేలికగా ఉన్నది మనచూపు! మన కర్తవ్యాన్ని మనం నిర్వహిస్తూఉంటే, మనకు కావలసినవన్నీ అవే అమరుతూ ఉంటాయి. వాటికై మనం ప్రత్యేకంగా తడుముకోవలసిన పనిలేదు. పరీక్షలకు శ్రద్ధగా చదువుకొంటున్న పిల్లవానికి తల్లిసరిగా సమయానికి హార్లిక్స్‌ను అందిస్తున్నదికదా! దానికి అతడు లేచివెళ్ళి అడగవలెనా!

అదే చదవని పిల్లవాడు పదిసార్లు అడిగినప్పటికీ తల్లి, 'చేతిలోనని ఉన్నది ఇస్తాను ఆగు'. అంటున్నదికదా! కర్మభ్రష్టుల సంగతి ఇలా ఉంటుంది. అని మనకు తెలియాలి! కనుక స్వధర్మాచరణలో నిరంతరం సాగిపోతున్నవాడికి అవాంతరం ఉండదు. తీరని అవసరముండదు. లభించని సుఖభోగాలుండవు. అన్నీవచ్చి, అతణ్ణి వరిస్తాయి. కర్మాచరణంలోని వైభవమిది అని వివరిస్తాయి. ఇది అనుభవం నుండి చెబుతున్నమాట !

కనుక ఫలితాలనుగూర్చిగాని, జీవితాన్నిగూర్చిగాని, భవిష్యత్తునుగూర్చి గాని చింత అక్కరలేదు. ఫలితముపై మనకు అధికారము లేదుకదా అని పని చేయుట మాననక్కరలేదు. అలా మానటంవలన మనం సోమరులమవుతాం! భ్రష్టత చెందుతాం! వ్యర్థజీవుల మవుతాం! కొరగాని వారమవుతాం! కనుక మానవుడు ఏ వంకనాకూడ పనిచేయడంమాత్రం మానకూడదు. ఏ వంక పెట్టినా అతడు భ్రష్టుడే అవుతున్నాడు. అలాకాక కర్మనిష్ఠుడయి సాగిననాడు అన్నివిధాలా పరిపూర్ణమైన జీవితాన్ని అనుభవించగలుగుతాడు. ఇహపరాల రెండింటినీ సమన్వయించుకొని ముందుకు సాగగలుగుతాడు. అతడు దేనినీ వదలడు. అతడు దేనికీ అంటుకోడు.

***

# 8. లభించినదానితో తృప్తిపడు !

**యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః।**
**సమః సిద్ధావ సిద్ధౌచ కృత్వాపిన నిబధ్యతే॥**

**(4అ॥-22 శ్లో)**

ఫలితము యెడల దృష్టిలేకుండా పనిని చేసికొంటూ పోయేవారికి సరియయిన ఫలితం ఎప్పుడూ లభించగలదు. ఆ లభించిన ఫలితాన్ని తృప్తిగా సంతోషంగా స్వీకరిస్తూ సాగిపోవాలి ! సుఖదుఃఖాలు లాభ

నష్టాలు ఇలాంటివి ద్వంద్వాలు. వీటిని ఒకటిగా స్వీకరించగల స్థితికి రావాలి ! ఎదుటివారిని చూచి, వారి సుఖసంతోషాలను చూచి వెష్టపడటం మాత్సర్యం, అది తొలగిపోవాలి ! సిద్ధి, అసిద్ధి అది ఏదయినా ఒకటిగా గోచరించాలి !

చేసినదానికన్న ఎక్కువ ఫలితాన్ని కోరేవారుంటారు. చేస్తున్నట్లు నటిస్తూ ఫలితాన్ని పొందుదామనుకొనేవారుంటారు. అసలు చేయకుండానే ఫలితం అప్పనంగా వచ్చేస్తే అనుభవిద్దామనుకొనేవారుంటారు. ఎన్నిపూజలు చేసినా ఈ మూడువిధాల వారు తమ బుద్ధిని సరిజేసికోనిదే దేవునికి దగ్గరకాలేరు.

చేసినపనికి తగిన ఫలితం లభిస్తూ ఉంటుంది. అది ఎప్పుడెప్పుడు ఎంతెంతగా లభించాలి అన్నది దైవంచేత నిర్ణయింపబడుతూ ఉంటుంది. ఆ ఫలితాన్ని ఆనందంగా అందుకొంటూ జీవితాన్ని దేవుని ప్రసాదంగా అనుభవించాలి !

ఒక్కొక్కప్పుడు మన మెతకదనంవలన తగిన ఫలితం లభించని స్థితి ఏర్పడుతూ ఉంటుంది. అప్పుడు మెతకదనాన్ని వదలిపెట్టి దేవుని ప్రార్థనతో తగిన ఫలాన్ని సాధించుకోవాలి! మంచిదనమంటే మెతకదనంకాదు. మెతకదనం ఏ విషయంలోనూ మంచిదికాదు.

ఒకవేళ తగిన ఫలితాన్ని మనంతటమనం సాధించుకోలేని స్థితులు ఏర్పడ్డాయి అనుకోండి. అప్పుడు దైవమే ఏదో ఒకరూపంలో మనమధ్యకు వచ్చి సారథ్యం వహించి, తగిన ఫలితాన్ని అందేటట్లుగా చేసి మరీవెళతాడు. అలా వచ్చిన మూర్తులనే మనం పెద్దలు, నాయకులు, మార్గదర్శకులు అంటున్నాం.

ఏ విధంగా చూచినా మనిషికి అతడు చేసిన పనికి తగిన ఫలితం ముట్టజెప్పబడుతుంది. అది అప్పుడే కాకపోవచ్చు. అప్పుడప్పుడు అందించబడవచ్చు. ఎప్పుడో మనం మరచినరోజున ఎదుట ఉంచబడవచ్చు. దైవంమాత్రం నీవుచేసిన దానికి ముట్టజెప్పకమానడు. ఈ సృష్టిలో ఎవరికృషీ వృథాపోదు. అతడు పోనీయడు. ఫలితంమీద దృష్టిని వదిలి, కర్తవ్యకర్మను నిర్వహించుకొంటూ వెళ్ళిపోవడమే మనం చేయవలసినది. పనిమీద పరిగెత్తుతున్న వాహనానికి ఇంధనమే

అందదా ! దానికొరకు అది వెతుక్కోవాలా? కర్తవ్యమువెంట సాగిపోతున్న మని షికి కావలసినవన్నీ అవే అందుతాయని వేరేచెప్పాలా?

ద్వంద్వాలు అంటే జంటలు. సృష్టిగతమయిన ద్వంద్వాలు కొన్ని ఉన్నాయి శీతోష్ణాలు మొదలయినవి. జీవితగతమయిన ద్వంద్వాలు కొన్నిఉన్నాయి సుఖదుఃఖాలు మొదలయినవి. వీటిమెడల మనకు సమదృష్టి కలగాలి! వాటినిగూర్చి బోధపడినకొద్దీ సమదృష్టి అదే కలుగుతుంది. సృష్టివ్యూహంలో వీటియొక్క అవ సరమేమిటో ఎరిగినకొద్దీ అవి దేవుని లీలలుగానే మనకు భాసిస్తాయి.

శీతాకాలం. వేసవికాలం రెండూ అవసరమే! కాని రెండుకాలాలలోనూ ఏవో కొన్ని ఇబ్బందులు మనకు కలుగుతూనే ఉంటాయి. ఇబ్బందులు కలుగు తున్నాయికదా అని వాటిని వద్దు అందామా అంటే కాలచక్రం తిరగదు. సృష్టికథ నడవదు. కనుక ఆ కాలాలపరమార్థాన్ని ఎరిగి, ఏకాలంలో ఎలా నడవాలో ఆ ఏర్పాట్లు చేసికొంటూ వాటికి అతీతంగా సాగిపోతున్నాం.

అలాగే కొన్ని సుఖాల్ని కలిగించే సన్నివేశాలు వస్తాయి. కొన్ని దుఃఖాన్ని కలిగించే సన్నివేశాలు వస్తాయి. సుఖమొచ్చినప్పుడు బాగానే ఉంటుంది. దుఃఖమొచ్చినప్పుడు తట్టుకోలేనిస్థితి ఏర్పడుతుంది. సుఖమేమిటో దుఃఖమేమిటో మనకు తెలియాలి; తెలియకపోతే సుఖమొచ్చినప్పుడు ఆ సుఖంలో ఆదమరచి కర్మ భ్రష్టులమవుతాం. అంటే ఆ సుఖాన్ని అనుభవిస్తూ పనిచేయకుండా సోమరిపోతు లమై ఏదో కాలక్షేపం చేసేస్తూఉంటాం. అలాగే దుఃఖమొచ్చినప్పుడుకూడా! ఇంక ఇదంతా ఎందుకు? ఎవరికోసం? అంటూ నిశ్చేష్టులమయి, కర్తవ్యంవైపుకు మళ్ళ కుండా, కన్నీరుకారుస్తూ ఉండిపోతాం. కనుక వివేకం కోల్పోయినవేళ సుఖ దుఃఖాలు రెండూ కర్మభ్రష్టతకే దారితీస్తున్నాయి, ఇది ఎంత దుష్పరిణామం ! ఆలోచించండి !

అలాకాక సుఖదుఃఖాల స్వరూపస్వభావాలను గమనించండి! సుఖం మన ఇంద్రియాలనూ, మనస్సునూ ఉల్లాసపరుస్తుంది. ఆ ఉల్లాసంలో కర్తవ్యాన్ని నిండుగా నిర్వహించడంద్వారా మరింత మంచిఫలితాలను సాధించడం జరగాలి! ఉద్యోగికి ప్రమోషనిచ్చేది మరింత బాగా పనిచేయమనా? ఆ సంతోషంలో ఇంటి దగ్గర శెలవుపెట్టి పడుకోమనా? మీరే చెప్పండి !

దుఃఖం మనస్సునూ ఇంద్రియాలనూ కల్లోలపరుస్తుంది. అవి అతలా కుతలం అవుతాయి. తల్లడిల్లుతాయి. ఈ దుఃఖం రెండురకాలు. కాలధర్మంగా మనకు ప్రాప్తించేది ఒకటి. మనకు మనంగా సృష్టించుకొనేది మరొకటి. ముసలి తనం_ మరణం మొదలయినవి కాలగతమైనవి, అవి దుఃఖాన్ని కలిగించినా, మన కొరకు ఆగవు. ఇక మనం చేసుకొనే అవకతవకవల్ల కొన్నిదుఃఖాలు వస్తాయి. అప్పుడు ఆత్మపరిశీలనతో ఆ అవకతవకలను సరిజేసికోవాలి! మనస్సును కూడ దిసుకోవాలి! ఆత్మపరిశీలనతో కూడిన దుఃఖంవల్ల మనస్సు వికసిస్తుంది. తప్పును తెలుసుకొంటుంది. జ్ఞానాన్ని అందుకొంటుంది. ఇలా సుఖదుఃఖాల స్వరూప స్వభా వాలను గమనించుకొంటూ ముందుకు సాగుతున్నవేళ ఇటు సుఖంలోనూ, అటు దుఃఖంలోనూ కూడ మనకు దైవమే గోచరిస్తాడు. రెండూ అతని స్వరూపాలే అని మనకు తెలుస్తుంది.

లాభనష్టాలు, జయాపజయాలు మొదలయినవికూడ ఇలాంటి ద్వంద్వాలే! మనిషి లాభం కలిగినవేళ పొంగిపోతాడు. నష్టం కలిగినవేళ కృంగిపోతాడు. రెండు సందర్భాలలోనూ పని చేయకుండా కూర్చుండిపోవడానికి అవకాశముంది. రెండిటిలోనూ దైవాన్ని చూచినప్పుడు లాభంనుండి ప్రోత్సాహం లభిస్తుంది. నష్టం నుండి గుణపాఠం లభిస్తుంది. అలాగే జయాపజయాల్లో దైవాన్ని చూచినప్పుడు జయంవల్ల ఉత్సాహం పొంగుతుంది, అపజయంవల్ల ఇంకా మనం సంతరించుకో వలసింది ఏమిటో తెలుస్తుంది. కనుక అన్నీ అతడి లీలలే! అన్నీ అతడి లోనివే!

సమదృష్టి కలుగుతున్నకొద్దీ మన మనస్సు తోటివారిని చూపి వెప్పపడ టం మానేస్తుంది. వీరు ఇలాగ, వారు అలాగ అనుకోవడం తగ్గిస్తుంది. ఎవరి పరిణామాన్నిబట్టి వారి ప్రవర్తనముంటుంది అనీ, అదే సమయంలో ఎవరికి కావల సిన శిక్షణవారికి అందుతూ ఉంటుందనీ గ్రహించుకొంటుంది. సృష్టి ఒక శిక్షణ శిబిరంగా దానికి గోచరిస్తూ ఉంటుంది. ఎవరికి కావలసిన శిక్షణ వారు ఇక్కడ పొందుతున్నట్లు దానికి తెలుస్తుంది. ఆ శిక్షణలోని వైవిధ్యం భగవంతుని లీలా విశేషంగా గోచరిస్తుంది.

మనం అనుకొన్నవి కొన్ని జరుగుతాయి, అప్పుడు దైవం మనపట్ల ఉన్నాడని సంతోషం కలుగుతుంది. కొన్ని జరగవు. అప్పుడు ఇంత నమ్మినా

ఇదేమిటా అని బాధ కలుగుతుంది. అన్నీ జరిగితే బాగుండును అని మన ఉద్దేశం. కాని ఎప్పుడూ అలా జరగదు. కొన్ని జరగనివి ఉంటాయి. మరేమిటి, అప్పుడు దైవం మనపట్లలేనట్లా? మనకు భక్తి చాలనట్లా? ఆయనకు శక్తి చాలనట్లా? ఆ పనులెందుకు జరగడంలేదు.

మనఇంట్లో చిన్నబాబు ఉంటాడు. వాడు మనచుట్టూ తిరుగుతూ ఉంటాడు. మనంచేస్తున్న ప్రతిపనినీ గమనిస్తూ ఉంటాడు. ప్రతిదాంట్లోనూ ఎంతో కొంత వాడూ వేలుపెట్టాలని చూస్తూ ఉంటాడు. తెల్లవారిలేస్తే మనం అనేకరకాలయిన వస్తువులతో పనిచేస్తూఉంటాం. వాడు వెంట తిరుగుతూ 'అమ్మా! నాకు ఇదివ్వవా, అదివ్వవా? అని అడుగుతూ ఉంటాడు. ఒకసారి చూస్తాడు. చూసి ఇస్తాను, ఏది నేనూ చేస్తాను- అని గారాంపోతాడు. ఆ అడగబడినవి ప్రమాదం లేనివి అయితే మనం వాడికిస్తాం. ఇచ్చేటప్పుడు రెండు ఆలోచిస్తాం. ఈ వస్తువు వల్ల వీడికి ప్రమాదం జరగకూడదు. వీడివల్ల వస్తువు పాడుకాకూడదు. అలాంటి వస్తువులను ఎంచి వాడికి ఇస్తూఉంటాం. వాటితో వాడు ఆడుకొంటూ ఉంటాడు. వాడు అంతటితో ఊరుకోడు. ఆడుతూ ఆడుతూ తండ్రిగడ్డం గీసుకోవడం చూస్తాడు వాడు. 'నాన్నా! నాకుకూడా అదివ్వవా?' అని అడుగుతాడు. తండ్రి ఆ రేజర్‌ని ఇస్తాడా? ఈయగలడా? ఇస్తే ఆ తరువాత ఆ పిల్లాడిపరిస్థితి ఏమిటి? తండ్రి ఈయడు. పిల్లవాడు ఏడుస్తాడు. అప్పుడు తండ్రికి కొంచెం బుద్ధిపని చేస్తుంది. వాడికి కనబడకుండా రేజర్‌లోని బ్లేడు మాయంచేసి ఉత్తరేజర్‌ను వాడిచేతిలో పెడతాడు. దీన్ని మోసం అందామా? రక్షణ అందామా? సరిగా దేవుడి చర్యలు ఇలా ఉంటాయి. మనం అడిగినవాటిలో మనకు ప్రమాదంలేనివి, నిజంగా అవసరమైనవి అతడు తప్పక ఇస్తాడు. ప్రమాదకరమైనవి, అవసరంలేనివి అడిగినప్పుడు అతడు మౌనం వహిస్తాడు. మనం మరీ గోలచేస్తే ఇస్తున్నట్లు నటిస్తూ మనలను రక్షించుకొంటూపోతాడు. వైష్ణవమాయను చూపుతాడు. ఇప్పుడు చెప్పండి. దేవుడు ఇలాచేయడం ధర్మమా! కాదా! మనం మన చిన్నపిల్లవాడితో ఎలా ప్రవర్తిస్తున్నామో, దేవుడు మనతో సరిగ్గా అలానే ప్రవర్తిస్తున్నాడు. ఏమంటారు? ఆలోచించి చూడండి.

రవీంద్రుడు ఒకచోట అంటాడు. «స్వామీ! నిన్ను నేను చాలా అడుగుతూ ఉంటాను. అందులో కొన్నిటిని ఇస్తావు నీవు. కొన్నిటిని ఈయకుండా

తప్పించుకొంటావు. "స్వామీ! ఇచ్చినవాటికి కృతజ్ఞుడను. ఈయనివాటికి మరింత కృతజ్ఞుడను. ఎందుకనో తెలుసా? నాకు తోచినట్లా నేను నిన్ను అడుగుతూ ఉంటాను. నీవు ఓర్పుగా ప్రేమతో వింటూ ఉంటావు. అందులో నాకు ఈయదగినవి ఏవో నీవే ఎంచి మరీ ఇస్తావు. ఈయకూడనివి ఏవోకూడా ప్రేమతో నీవే గుర్తించి, వాటిని నాకు ఈయకుండా రక్షిస్తూ ఉంటావు. ప్రభూ! ఏమి నీ కరుణ! తెలిసీతెలియని మానవుణ్ణి ఎంత ఓర్పుతో, నేర్పుతో నడిపించుకొంటూ వస్తున్నావయ్యా! అడిగింది ఈయడం నీ ప్రేమకు చిహ్నం. అది మానవుడు గుర్తిస్తాడు. అతడు నిన్ను కీర్తిస్తాడు కూడా! అడిగింది ఈయకుండా ఉండటం ఉన్నదే అది నీ మరింత ప్రేమకు చిహ్నం. దానిని సామాన్యంగా మానవుడు గుర్తించలేడు. గుర్తించలేక నీవైపు కోపంగా చూస్తాడు. కాని తరువాత ఎప్పటికో తెలుస్తుంది. అప్పుడు అది నీవెందుకు ఈయలేదో అన్నది. 'ఓహో! అందుకా ఈయబడనిది' అని అప్పుడు ఆశ్చర్యపోతాడు. నీ ముందుచూపును తాను ముందుగానే గ్రహించనందుకు నొచ్చుకొంటాడు. స్వామీ! నీ ప్రేమకు నా జోహార్లు!" ఇలా పవిత్రమనిలా మనసారా దేవుని ముందు మోకరిల్లుదాం! ఆయన ఇచ్చినదే ప్రసాదంగా స్వీకరిద్దాం. ఆయన భాషను గమనించుకొంటూ, అవధులెరుగని ఆ ప్రేమను అనుభవిద్దాం!

***

# 9. ఉద్వేగపడవద్దు - ఉద్వేగపరచవద్దు!

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్ష భయోద్వేగైః ర్ముక్తోయస్సచమే ప్రియః॥
(12అ॥-15శ్లో॥)

ఎదుటివారిని ఇబ్బంది పెట్టకు. ఎదుటివారి వలన ఇబ్బంది పడకు. సంతోషము, రోషము, భయము వలన ఉద్వేగము చెందని జీవితాన్ని గడుపు.

శిక్షణలేని మనస్సు పరిపరివిధాల పరుగెత్తుతూ ఉంటుంది. ఇంద్రియాలను పరిగెత్తిస్తూ ఉంటుంది. ఊరికే ఉద్వేగానికి గురిఅవుతుంది. శిక్షణపొందుతున్న కొద్దీ హడావిడి తగ్గుతుంది. జీవితకార్యం నిర్వహింపబడుతుంది. ఒక్కటి గమనించండి. హడావిడి తగ్గేవరకూ మనం జీవితకార్యాన్ని సక్రమంగా నిర్వహించలేము. కాని చాలామందికి హడావిడిపడకుండా పనులెలా జరుగుతాయి అనిపిస్తుంది. ఇంకా శిక్షణపొందని మనస్సు యొక్క ప్రవచనమిది. దానిని విశ్వసించి పొర్లా పడకండి !

ఒక్కమాట చెప్పనా ! ఒకరివలన ఉద్వేగానికి గురికాకుండా, మరొకరిని మనవలన ఉద్వేగపడేటట్లు చేయకుండా, జీవించగలిగామనుకోండి. అంతకంటే మోక్షమేముంటుంది. ఆలోచించండి !

కాని ఏమిటో ఇబ్బంది పడుతున్నాం. ఇబ్బంది పెడుతున్నాం. మనం ఇబ్బంది పెడుతున్నామని వారంటున్నారు. వారు ఇబ్బంది పడుతున్నారని మనమంటున్నాం. ఈ ఇబ్బందుల పైనాలనుగూర్చి చుట్టూఉన్న సిబ్బందికి చెప్పుకొంటూ అప్పుడప్పుడు పమిటచెంగులకూ, జేబురుమాళ్ళకూ పనిచెబుతూ జీవితాన్ని గడిపేస్తున్నాము. ఎవరికివారు ఎదుటివారిని ఇబ్బందిపెట్టేవారుగా చూస్తున్నారు. ఇలాంటి ఇబ్బందులు పగవారికికూడా వద్దు'అంటూ తెగవేసి చెబుతున్నాము ఇలాంటి సమయంలో కృష్ణుడంటాడుకదా -ఇబ్బంది పెట్టకుండా ఉండటమూ నీచేతిలోనే ఉంది. ఇబ్బంది పడకుండా ఉండటమూ నీ చేతిలోనే ఉంది. కాన గమనించు'- అని.

ఈమాట మాత్రం విచిత్రంగా ఉంటుంది. ఇది సాధ్యమా అనిపిస్తుంది. పెద్దల అడుగుజాడలలో మనస్సుకూ, ఇంద్రియాలకూ శిక్షణనీయగలిగితే సాధ్యమే!- ఇది తెలియాలి !

ఒకమాట చెబుతాను. ఒకపూవు ఉంది. ఉన్నంతసేపూ సృష్టికి శోభను కలిగిస్తుంది. ఒక చెట్టుఉంది. ఉన్నంతసేపూ సృష్టికి నిండుదనాన్ని కలిగిస్తుంది. చెట్టు పైన చిలుకఉంది. అది సృష్టినే మురిపింపజేస్తుంది. నది ఉంది.

ఆహ్లాదపరుస్తుంది. సముద్రముంది. అది ఆశ్చర్యానందాలను అందిస్తుంది. మరి మనం? మనమీ సృష్టికి ఏమందించి వెళుతున్నాం? ఇది ఆలోచించుకోవలసినఅంశం కాదా! 'జంతూనాం నరజన్మ దుర్లభం' అన్నారుకదా!. మరి అలాంటి నరజన్మతో కనీసం ఒకపువ్వులా, ఒకచెట్టులా, ఒకచిలుకలా ఒకనదిలాకూడ మనం ఈసృష్టిని అలరింపజేయకపోతే, ఆలరింపజేయలేకపోతే అది ఎంతటి దీనస్థితి ! ఎంతటి ఘోరస్థితి ! మానవుడు సృష్టికీయవలసిన బదులు ఇదేనా ? ఆలోచించండి! వాటి అన్నిటికన్నా తక్కువగా వాటిపాటి ప్రశాంతతనుకూడ మనం అనుభవించ లేనప్పుడు ఈ నరజన్మకు అర్థమేమిటి?పరమార్థమేమిటి ?

ఖనిజాలనుండి చెట్లు వస్తున్నాయి. అటుపైన జంతువులు, అటుపైన మానవులు. అంటే ఏమిటి? ఖనిజాలు, చెట్లు, జంతువులు వీటన్నిటికీ మానవుడు అగ్రజుడు. అవన్నీ మానవుని సోదరవర్గం. మానవుని సంస్పర్శతో, ప్రోత్సాహంతో ఎదిగిరావలసినవి. కాని అలాంటి మానవుడు నిరంతరం వెస్టపడట మేమిటి? తాను ఉద్వేగానికి గురిఅవుతూ, ఇతరులను ఉద్వేగానికి గురిచేయడ మేమిటి ? ఏమిటీ చేతకానితనం ! ఏమిటీ దీనత్వం ! నిత్యకళ్యాణం పచ్చతోరణంలా ఉండవలసిన జీవితం అల్లకల్లోలమై అలమటించడమేమిటి? ఈ చేతకానితనంనుండి. ఈ దీనత్వంనుండి మానవుడు బైటపడాలి !

ఇతరులు మనను ఉద్వేగానికి గురిచేయడానికి ప్రయత్నిస్తున్నారు. అంత మాత్రాన మనం ఉద్వేగపడాలని ఉందా ? వారి ప్రయత్నాన్ని గమనించాలి ; ఏయే త్రిగుణదోషాలవల్ల వారలా ప్రవర్తిస్తున్నారో బోధపరచుకోవాలి; ప్రవర్తన ఎప్పుడూ గుణమయమయినదే ! చేతనయితే వారిని ఆ గుణదోష స్థితినుండి ప్రక్కకు నడిపించండి. వారుకూడ సంతోషించేటట్లుగా చేయండి! అప్పుడు వారూ, మనమూ కూడ ఉద్వేగంమాట అటుంచి, ఉత్సాహంగా గడపగలుగుతాము. ఇలా వారి గుణప్రవర్తననుండి వారిని ఈవలకు లాగగలగడం ఒకకళ ! లోకంలో ఈ కళ కొందరిలో కనబడుతూనే ఉంటుంది. వారు ఎంతటివారినయినా క్షణాలలో మామూలుస్థితికి తీసుకురాగలుగుతారు. అంటే ఏమిటి? ముందు వారు చెదరలేదు. ఇవతలి వారి చెదురుబాటును కూడ క్షణాలలోనే సర్దుబాటు చేయగలిగారు.

మా మేనమామగారు ఒకాయన ఉండేవారు. ఆయనతో ఎలాగయినా పోట్లాడాలని కొందరు రిహార్సలు వేసికొని మరీ వచ్చేవారు. వారు రాగానే మా

మామయ్య, ఒక చిరునవ్వు నవ్వేవాడు. 'ఏం బాబాయ్, ఇలా వచ్చావ్ ? రాకూర్చో!' అనేవాడు. ఏం జరిగేదో, ఏమో, వచ్చినవాడు చల్లబడిపోయేవాడు. చిరునవ్వులు నవ్వేవాడు. చివరకు నవ్వుకొంటూ వెళ్ళేవాడు. ఇలాంటిఘట్టాలు కొన్నివందలు చూశాను ఆయన దగ్గర. ఆహా! ఏమి కళ ఇది!_ అనుకొనేవాడిని. ఆయన ఉద్వేగం చెందడు. ఇతరులను ఉద్వేగం చెందనీయడు. చాలాచిత్రంగా ఉండేది. మా అత్తయ్యతో ఆయన మాట్లాడేటప్పుడుకూడ అంతే! లోపలికిరాగానే విషయమేదో తేల్చాలనుకొనేది ఆమె. ఆయన లోపలకు రావటమే మిటి. ఏదో లోకాల్లో తేలియాడేది. ఆయన ఆవిడను ఆటపట్టించి, ఆవిడ ఏమేమి అనదల్చుకుందో, కూడ ఆయన చెప్పేసి, ఏది ఎప్పుడు జరుగుతుందో కూడ చెప్పేసేవాడు. ఇక ఆవిడకు ఆరడిపెట్టే అవకాశమేది? లోపలకు రావటమే ఆ, రడీ_ అనేది.

ఒకసారి ఒక దగ్గరిచుట్టం. చాలా దగ్గర చుట్టంవచ్చి, ఆయన దొడ్డి గుమ్మానికి ఎదురుగా నిలబడి ఆయన్ని దుమ్మెత్తిపోస్తోంది. మా అత్తయ్యకు ఇక ఎలా ఉంటుందో ఊహించండి ! మా మావయ్య తన కార్యాలయంలో ఇంటి ముందు వరండాలో ఉన్నాడు. ఆయన్ని పిలిచి ఈ దృశ్యం చూపించాలని మా అత్తయ్య ఎంతో ఇదైపోతోంది. ఎట్టకేలకు ఆయన్ను లోపలికి రప్పించింది. దొడ్డి గుమ్మం దగ్గరకు రప్పించింది. 'చూడండి ఆ పరిస్థితి'_ అంటూ బోరున ఏడ్చింది. 'దేవుడులాంటి మనిషిని ఎలా అంటుందో చూడండి. మీరెలా ఉన్నారోగాని, నేను వినలేకపోతున్నాను, ఏమిటండీ దారుణం !' అంటూ ఆర్తనాదాలు చేసింది. మా మామయ్య సన్నివేశంవైపుకు ఒక్కసారి చూశాడు. ఒక అయిదు నిముషాలు అలా నిలబడ్డాడు. ఆయన అలా నిలబడ్డాడో లేదో ఆవిడ నోరు తగ్గిపోతోంది. ఆయన ఏమీ అనలేదు. చివరకు ఒక్కమాట అన్నాడు 'అది మాత్రం ఎవరు? నాకేమయినా కానిదా ? దానికేవో బాధ కలిగింది. ఇప్పుడు తిడితే ఏమయిందట, నాకేమన్నా పరాయిదా ఇది ! ఊరికే హడావిడి పడతావు. చనువుకొద్దీ అంటోంది. అననీ''_ అని మరి రెండు నిముషాలు నిలబడి తన కార్యాలయంలోనికి వెళ్ళిపోయాడు. ఇక తిడుతున్న ఆవిడకు నోరు పెరగలేదు. కాలూ, చేయి ఆడలేదు, అక్కడే కూర్చుండిపోయింది. ఆయన వెళుతున్నవైపు చూస్తూ, కాసేపు ఆగి తలదించుకొని మౌనంగా లేచి వెళ్ళిపోయింది. ఇక్కడ చూడండి ఏం జరిగిందో

ఎదుటివారి వలన ఆయన ఉద్వేగాన్ని చెందలేదు, సరికదా, ఎదుటివారి ఉద్వేగాన్ని కూడా చల్లబరిచాడు.

ఈ లక్షణం ఆయనకు చిన్నప్పటినుండీ ఉండేది. పధ్నాలుగేళ్ళ వయస్సులో పొలాన రాత్రిపూట వడ్లరాశిపైన ఒక్కడే పడుకొని ఉన్నాడు. పదిహేను, ఇరవై మంది దుండగులు దుడ్డుకర్రలను తీసికొని, 'కుర్రవాడు ఒక్కడే ఉన్నాడు. కొట్టి, వడ్లుతీసికొని వద్దాము' అని బయలుదేరారు. కర్రలు వెనక్కు పెట్టుకొని నడుస్తున్నారు. దగ్గరకు వెళ్ళిన తరువాత, ఒక్కసారిగా కర్రలను ఎత్తికొట్టేయాలని వారి ప్రయత్నం. వారు దగ్గరకు వస్తున్నారు. ఈ కుర్రవాడులేచి కూర్చున్నాడు. వడ్లరాసి చాలా పెద్దదిగా, వెడల్పుగా ఉంది. 'ఏం బాబాయ్, ఇలా వచ్చారు రండి! అందరం కూర్చుందాం" అంటూ ఆహ్వానించాడు కుర్రవాడు. ఆశ్చర్యం! వారి దుడ్డుకర్రలు చేతినుండి జారిపోయాయి. వారి దుడుకుతనం మనస్సునుండి జారిపోయింది. వారందరూ ఆ వడ్లరాసిపైన చుట్టూతా కూర్చున్నారు. చెప్పిన కబురు చెప్పకుండా చెబుతున్నాడు కుర్రవాడు. ఇంతలో తెల్లవారిపోయింది. వారు పశ్చాత్తాపపడి, తప్పు ఒప్పుకొని, క్షమించమనికోరి వెళ్ళిపోయారు. కనుక మానవుడు ప్రేమమయుడయి, అంతటా దైవాన్నిచూస్తూ, మనస్సుకూ, ఇంద్రియాలకూ తగిన శిక్షణనందిస్తూ జీవించిననాడు ఇంత హాయిగా జీవించగలడు. అప్పుడు మానవజన్మను మనం సార్థకం చేసికొన్నట్లవుతుంది.

అలాంటి అమృతమూర్తికి అంతిమ ఘడియలు వచ్చాయి. దేహాన్నివిడిచి పెట్టవలసివచ్చింది. ఊరిపెద్దలందరూ ఉన్నారు. అప్పుడుకూడా ఆయన ఉద్వేగాన్ని చెందలేదు. పెద్దలందరికీ పేరుపేరునా వీడ్కోలు చెప్పాడు. 'వెళ్ళొస్తాను బాబాయ్' అంటూ శెలవు తీసికొన్నాడు. మా అత్తయ్యకు ఏడుపొస్తోంది. ఆయనిలా అన్నాడు. 'ఏడుపు రావడం సహజం. నిన్ను నేను తప్పుపట్టను. నన్ను మాత్రం ప్రశాంతంగా వెళ్ళనీ! తరువాత కథ ఎలాగూ తప్పదు.' అంటూ మా అమ్మను చేరబిలిచాడు. 'చెల్లీ! నారాయణశబ్దాన్ని నాచెవిలో వినిపించమ్మా! నా ఈ ప్రయాణం పూర్తయ్యేవరకు!' అన్నాడు. మా అమ్మనుండి స్మరణ ప్రారంభమైంది. ఆయన ప్రయాణం నారాయణమయమైంది. చుట్టూఉన్న పెద్దలు శోకానికి బదులుగా భక్తిశ్రద్ధలతో 'మీరు ధన్యులు! వెళ్ళిరండి. మీరు ధన్యులు. మీతో జీవించగలిగిన మేము ధన్యులం!' అంటూ నమస్కరించారు. చూడండి. చివరి

క్షణంలోకూడా ఆయన ఉద్వేగం చెందలేదు. తోటివారినికూడ ఉద్వేగంలో ఉంచ లేదు. అందరినీ ధన్యులను చేశారు. తోటివారివలన మనం ఉద్వేగపడకూడదు. తోటివారిని మనం ఉద్వేగపరచకుండా ప్రేమమయజీవనం గడపాలి! మానవుడికి అది సాధ్యపడాలి! అందరూ గీతాచార్యుని అడుగుజాడలలో ముందుకుసాగాలి ! ఆ అడుగుజాడలు చాలు, ఆ దివ్యస్థితిని మనకు అలవోకగా అందించడానికి!

మానవుని ప్రవర్తన త్రిగుణాలపైన ఆధారపడి ఉంటుంది. త్రిగుణాల నిష్పత్తినిబట్టి అతని ప్రవర్తన అనేకవిధాలుగా వ్యక్తమవుతూ ఉంటుంది. సాధకు డయినవాడు ఈ త్రిగుణాల పూర్వాపరాలను సాకల్యంగా గమనించుకొంటాడు. అవి తనలో ఎలా పనిచేస్తున్నాయి. తోటివానిలో ఎలా పని చేస్తున్నాయి— అన్నగమనిక కలిగిఉంటాడు. అంతటా దైవమే అతనికి గోచరిస్తూ ఉంటుంది. కనుక ఈ త్రిగుణాల నిష్పత్తిని ఇటు సర్దుకొని, అటుకూడ సర్దగలుగుతాడు. తెలియక మనం ప్రవర్తన మనిషిది అనుకొంటున్నాము. అది సరికాదు. కేవలం మనిషిలోని త్రిగుణాలకు సంబంధించినది. దాని అనుపానులను తెలిసినవాడు అనుభవజ్ఞుడు ఒకయంత్రాన్ని అవలీలగా ఎలా నడుపుతున్నాడో, యోగి అయినవాడు తనను, తన ప్రవర్తనను అలాగే నడపగలుగుతున్నాడు. అప్పుడు ఉద్వేగము చెందే మానవుడుగాకాక, ఉత్తమ మానవుడిగా జీవించి, తన జీవనయాత్రవలన ఈ సృష్టికి ఒక సరిక్రొత్త శోభను అందించి వెళతాడు. ఉన్నంతకాలం అందరినీ ఆనందింప జేస్తాడు. శరీరం విడిచిన తరువాత అందరికీ ఆదరం అవుతాడు. శ్రీకృష్ణుడు ఇలా ఆడుతూ, పాడుతూ అందరినీ ఆటపట్టిస్తూ ఆటకట్టిస్తూ జీవించినవాడే! జీవితమే ఒక క్రీడ! జీవితమే ఒక లీల! జీవితమే ఒక ఉత్సవం అన్నట్లు జీవించాడు. చివరకు అతడు జరిపిన సంహారాలలో కూడ లీల కనబడుతుంది, తప్ప ఉద్వేగముకానరాదు. సంహారసమయాన ఆ సంహరింపబడుతున్నవారు నిజస్థితిలోనికి మేలుకొనడమే చాలా చోట్ల కనబడుతుంది. ఇక ఉద్వేగానికి తావెక్కడుంటుంది. అంతా ఒక క్రీడ! అంతా ఆనందప్రదమయిన ఒక ఉపదేశం! ఇలా గడిచిపోయిందతని జీవితం. చివరకు కురుక్షేత్రంలో కూడ అతడు వ్యక్తులను శిక్షించలేదు. వారి త్రిగుణాల నిష్పత్తికి మాత్రమే బుద్ధిచెప్పాడు. వారిని మాత్రం తనలోనే నిలుపుకొన్నాడు. తనకన్నా వేరైనదిఏమున్నది? అంతా తానే అయినచోట ఉద్వేగమునకు చోటెక్కడ ఉన్నది? సరిగా మా మేనమామగారుకూడ ఇలాగే చేసేవారు. ఒక్కొక్కప్పుడు

గుణనివృత్తి ప్రభావంవల్ల, ప్రేరేగినవేళ శిక్షణ నిస్వవలసివచ్చేది. శిక్షణనిచ్చే వారు. శిక్షణ ఇవ్వగానే, అవతలివారికి సత్యదర్శనం కలుగగానే అక్కున జేర్చు కొనేవారు. 'పిచ్చివాడా! నిన్ను నేను వదిలిపెడతానట్రా!, అనేవారు. అతడు కదిలి పోయేవాడు. కరిగిపోయేవాడు. తాదాత్మ్యస్థితిని అనుభవించేవాడు. లోకంలో మన కథకూడా అలా సాగాలి !

జీవితంలో హర్షాన్ని కలిగించే సన్నివేశాలు వస్తాయి. రోషాన్ని కలి గించే సన్నివేశాలు వస్తాయి. భయాన్ని కలిగించే సన్నివేశాలు వస్తాయి అప్పుడు కూడా మనం ఉద్వేగం చెందకూడదు. సంతోషాన్ని దేవుని ప్రసాదంగా స్వీకరిం చండి! రోషానికి తగిన శిక్షణపొందాలని తెలుసుకోండి। భయానికి భయపడవల సిన పనిలేదని గ్రహించాలి! అంతటా ఉన్నది దైవమే అయినప్పుడు, ఇక భయా నికి చోటెక్కడ ? ఎక్కడ మనం దైవాన్ని చూడటానికి ఏమరుపాటు చెందు తామో, అక్కడనుండి భయం పుడుతుంది. దైవాన్ని చూసిన మరుక్షణంలో భయం తొలగిపోతుంది. నిజానికి అంతటా ఉన్నది అతని అభయమే !

సన్నివేశాల స్వరూపస్వభావాలు తెలిసినప్పుడు ఉద్వేగానికి అవకాశమే మున్నది.

ఇంతకూ మనం సృష్టిలోనికి దిగివచ్చింది, ఉద్వేగపడటానికి కాదు. ఉద్వేగపరచడానికీ కాదు. ఉద్యోగాన్ని నిర్వహించడానికి, తోటివారితో నిర్వహింప జేయడానికి. ఉద్యోగమంటే ప్రయత్నం. మానవుడు నిరంతరం ప్రయత్నం చేయాలి ! దేవుని యాజ్ఞకు అనుగుణంగా అతని ప్రయత్నం అఖండంగా కొన సాగాలి ! ఈ సృష్టికి దేవుడు మరింత పరిపూర్ణతను ఇవ్వాలనే ప్రయత్నంలో ఉన్నాడు. అందుకు మన ప్రయత్నం తోడుకావాలి। దేవుని సంకల్పానికి అనుగు ణంగా మానవప్రయత్నం సాగినరోజున ఆ మాధుర్యాన్ని ఇక వర్ణింపతరమా? ఆ అనుభూతికి ఇక అవధులుంటాయా? దివ్యజీవనమంటే అదే! దేవుని ప్రకారం జీవించగలగడం ! భక్తి అంటే దేవునిగూర్చి ప్రచారం చేయడంకాదు. దేవుని ప్రకారం జీవించగలగడం !

***

# 10. సామాన్యుని కలవరపెట్టకు !

"న బుద్ధి భేదం జనయేత్ అజ్ఞానాం కర్మ సంగినామ్॥"
(3అ॥-26శ్లో॥)

ఫలితముల యెడల వ్యామోహము గలవారు ఉంటారు. ఆ వ్యామోహంతోనే వారు నిరంతరం పనిచేస్తూ ఉంటారు. నిజానికి వారిది అజ్ఞానమే ! అయినప్పటికీ వారిని ఒక్కసారిగా బెదరకొట్టడం పద్ధతి కాదు. కనుక ఆ పని ఎన్నడూ చేయవద్దు.

వేదాంతము పేరిట కనబడిన వారిని కనబడినట్లుగా ఊదరబెట్టటం మంచిదికాదు. అలా ఊదరబెట్టి, వారు వినలేదు అనీ, వినిపించుకోవడం లేదనీ పెదవి విరుస్తూ ఉంటాం : అదికూడ పొరపాటే ! పరిణామంలో ఎవరిస్థాయి వారుంటారు. వారి స్థాయినిబట్టి వారితో మాట్లాడాలి? అందరితోనూ ఒకేలాగున మాట్లాడతామంటే ఎలాగ ? మన యింటిలో అనేక వయస్సుల వారుంటున్నారు, వారందరితోనూ మనం ఒకేలాగున మాట్లాడుతున్నామా? ఎవరికి తగినట్లుగా వారితో మాట్లాడుతున్నాము. మనయింటిలోని వయస్సులవంటివే, సమాజంలోని పరిణామాల స్థాయిలుకూడా ! ఇది మనం గ్రహించాలి ! అందరినీ ఒకేలా ప్రేమిస్తూ, ఎవరికి తగినట్లుగా వారితో ప్రవర్తించాలి ! ప్రేమలో ఎక్కువ తక్కువలు ఉండకూడదు. ప్రవర్తనలో మాత్రం తగినపద్ధతి ఉండాలి ! దీనిని మనం అభ్యసించాలి !

ఒక తండ్రి తనబిడ్డలే సమస్తమూ అనుకొన్నాడు. వారిని ప్రయోజకులను చేయాలి అనుకొన్నాడు. ఆ తరువాత వారు తనను గౌరవస్థానంలో నిలిపితే, ఆ స్థితిని అనుభవించాలి ! అనుకొన్నాడు, ఇక అందుకొరకు తన పొట్ట కట్టుకున్నాడు. అంతా బిడ్డలకొరకే ప్రోగుచేయసాగాడు. వారిమీదే ఖర్చు పెడుతున్నాడు బస్సీ వెళ్ళినప్పుడు దాహంవేస్తే, షోడా త్రాగితే పావలా అయిపోతుందనీ, ఉంటే

ఆ పావలా తనబిడ్డలకే ఉంటుందని సోడా త్రాగకుండా వీధి కుళాయిదగ్గర దాహం తీర్చుకొంటున్నాడు. భోజనంవేళకు హోటలులో భోజనంచేస్తే పదిరూపాయలవుతుందని, ఉంటే తనబిడ్డలకే ఉంటుందని ఆ మధ్యాహ్నం రెండుపళ్ళు కొనుక్కుతింటున్నాడు. రాత్రి ఏకంగా ఇంటికివెళ్ళి అన్నం తినవచ్చులే, ఈ ఒక్కపూటకీ ఏమవుతుంది అంటూ సరిపెట్టుకొంటున్నాడు. ఇలా ఎక్కడికక్కడ తన సుఖభోగాలను కత్తిరించుకొంటూ, తన అవసరాలను కూడా కుదించుకొంటూ, పిల్లలను ప్రయోజకులను చేయాలని, వారేదో పెరిగిపెద్దై, తనకు కీర్తి తలకెత్తుతారని తాపత్రయపడుతున్నాడు. అతనికి ఏం చేస్తున్నా తనబిడ్డలే కనబడుతున్నారు. వాళ్ళను పైకి తీసికొని రావడమెట్లాగ అన్నదే కనబడుతున్నది. మరొక ధ్యేయం లేదు. మరొక గమ్యంలేదు. అదీ అతని పరిస్థితి !

ఇంతలో కాస్తంత వేదాంతం నేర్చుకొంటున్నవాడు ఆ తండ్రిని చూచాడు. ఏమిటి తను? ఇన్నేళ్ళొచ్చాయి. బిడ్డలమీద ఇంత వ్యామోహమేమిటి?- అని ఆశ్చర్యపోయాడు. అతణ్ణి చేరి తను ఎరిగిన వేదాంతాన్ని అతనికి చెప్పాలి అనుకొన్నాడు. ఏమిటా వేదాంతం?- ఈ సృష్టిలో తల్లెవరు ? తండ్రెవరు ? బిడ్డలెవరు ? ఎవరికి ఎవరు? ఇవన్నీ మనం కల్పించుకొన్నవి. ఇవన్నీ బంధాలు, బంధనాలు ! వీటితో మన ఇళ్ళు బందిఖానాలవుతాయి. ఇవేవీ శాశ్వతంకావు ఇవేవీ మనతోరావు. ఈ వ్యామోహాన్ని విడిచిపెట్టి దైవస్మరణ చేసికో ! మోక్షమొస్తుంది. నీవు తరిస్తావు- ఇదీ అతడు చెప్పదలిచింది. నిజంగా ఇలాగేవెళ్ళి ఇలానే చెప్పాడనుకొందాం ! అతడు శ్రద్ధగా విన్నాడనుకోండి- ఏం జరుగుతుంది? చేస్తున్న పని యెడల విలువ తగ్గిపోతుంది ఇదంతా అబద్ధమనిపిస్తుంది. దైవస్మరణకా మనస్సు సిద్ధంగాలేదు. కనుక అది సాధ్యపడదు. అప్పుడేం జరుగుతుంది! అతడు కర్మభ్రష్టుడవుతాడు. ఎటూకాకుండా పోతాడు. అతని మనస్సు అశాంతికి గురి అవుతుంది. అతనికి ఏదీ అందదు. అసలు చేసినది పొందలేడు. ఉన్నది పోయింది. ఆ మరొకటి అందదు. ఇలా చేయవచ్చునా అన్నది ప్రశ్న. చేయకూడదు అన్నది సమాధానం !

బుద్ధిమంతుడైన వాడేం చేస్తాడు. ఆ తండ్రిని చేరదీస్తాడు, అతడి ఆశలన్నింటినీ వినిపించుకొంటాడు. బిడ్డలను ప్రయోజకులుగా చేయాలన్న అతడి

కాంక్షను మెచ్చుకొంటాడు. తండ్రిగా మీరు మీ బాధ్యతను చక్కగా నిర్వర్తిస్తున్నారు- అని ప్రశంసిస్తాడు. బిడ్డలనుగూర్చి కూడ తెలిసికొని, ఏ బిడ్డను ఎలాతీర్చి దిద్దితే బాగుంటుందో తెలియజెపుతాడు. దానితో ఆ తండ్రి బుద్ధిమంతునికి దగ్గరవుతాడు. అతడి సలహాలు తీసికొంటూ ఉంటాడు. కొడుకులు వివిధరంగాలలో ప్రయోజకులవుతారు. సమాజాన్ని అనేకవిధాలుగా సేవించగలవారయి వర్ధిల్లుతారు. తండ్రి బుద్ధిమంతుడిని సమీపిస్తాడు- "బాబూ! మీ సలహాలతో మా పిల్లలందరూ తల గలవాళ్ళయ్యారు. తలొకచోటా స్థిరపడ్డారు. ఏ లోటూలేకుండా జీవిస్తున్నారు. ఇదంతా మీ చలువేనండీ!" అంటాడు. అప్పుడు బుద్ధిమంతుడు "ఇదంతా దైవానుగ్రహం! వాళ్ళు పదిమందికి పనికివచ్చే వాళ్ళయ్యారు. సంతోషించు. శేషజీవితాన్ని దైవస్మరణలో విశేషంగా గడుపుకో!"- అంటూ అతడి జీవితాన్ని మలుపు త్రిప్పుతాడు.

చూశారా! వేదాంతం చెప్పడం వేరు, సారథ్యం వహించడం వేరు. వేదాంతం చెప్పేవారుకాదు, సారథ్యం వహించేవారు కావాలి! వేదాంతులారా! మీరు సారథులు కాగలరా? జాతికి కావలసింది సారథులు!

సృష్టి క్రియాశీలమైనది. సృష్టిక్రియ నిరంతరము జరుగవలసిందే! సృష్టిలోనికి వచ్చినవారు ఎవరివంతు పాత్ర వారు పోషించవలసిందే! అందరూ పని చేయవలసినవారే! అందరూ పని చేస్తున్నవారే! పనిచేయని వారెవరు? అయితే కొందరు పనిని ఫలితంకొరకు అని చేస్తున్నారు. కొందరు పనిని దైవంకొరకు అని చేస్తున్నారు. అంతే తేడా! ఇరువర్గాలవారూ పని చేస్తున్నవారే, పని చేయవలసిందే. పని జరుగవలసిందే. అది ఆగకూడదు.

ఫలితంపై దృష్టితో పనిచేస్తున్నవాడు సుఖదుఃఖాలకు లోనయ్యే అవకాశముంది. దైవాన్నిచూసి పనిచేస్తున్నవాడు నిశ్చింతగా బ్రతకగలుగుతాడు. కనుక నిశ్చింతగా బ్రతకాలి అంటే ఫలితాన్ని చూచిగాక దైవాన్నిచూస్తూ పనిచేయాలి. చేస్తున్నదంతా దైవంకొరకు అన్న సమర్పణబుద్ధితో చేయాలి! అప్పుడు హాయిగా ఉంటుంది. నిజమే!

కాని ఫలితాలపై దృష్టితో పని చేస్తున్నవాడు ఒక్కసారిగా దైవంపై దృష్టి మళ్ళగలుగుతాడా! అందరికీ అది సాధ్యం కాదుకదా! ఇది క్రమంగా జరుగవలసిన పని. పిందికాయ అయి, కాయ పండు అయినట్లుగా జరగాలి! దానికి తోడ్పడాలి

ప్రోత్సాహం కావాలి ! అతడి దోహదమూ, రక్షణ అన్నీ కావాలి. అలాగే ఫలితాల వైపు దృష్టి కలిగి నడుస్తున్నవానిని క్రమంగా దైవంవైపుకు మళ్ళించగలగాలి. ఈ విషయంలో మనం తోటమాలిలా ప్రవర్తించగలగాలి. అతడిలోని మంచిని ప్రోత్సహిస్తూ, ఆ మంచిని పెంచుతూ, క్రమంగా అతణ్ణి ముందుకు నడిపించాలి. దోహదం మనం అందించినవేళ కాయ దానికదిగా పండు అవుతున్నది. అలాగే మానవుడుకూడా పండగలడు. నడవలేనివానికి నడకవచ్చేటట్లు చేయండి. అప్పుడతని చేతిలోని కర్రను అతడే పారవేస్తాడు. మీరు లాగివేయనక్కరలేదు. నడవడం చేత వచ్చేలోపున మీరు తొందరపడి కర్ర లాగివేశారనుకోండి, అతడు కూలబడి పోతాడు. చూడండి! ఈ సృష్టిలో ఫలితం ఆ కర్రలాంటిది. నడవలేని లోకం దానిని పట్టుకునడుస్తున్నది. ఫలాపేక్షలేనిదే సగటుమనిషి పని చేయలేడు. దాన్ని మీరు ప్రక్కకు నెడితే, అతడు కర్మభ్రష్టుడవుతాడు. ఇది అతడికీ మంచిదికాదు. సృష్టికీ మంచిదికాదు. కనుక భగవంతుడే ఈ ఏర్పాటు చేశాడు. తనను చూపి పని చేయడం చేతనొచ్చేవరకూ ఈ ఫలితం అనే చేతికర్ర అతడికి అవసరమని ఆయనే ఏర్పాటు చేశాడు. కనుక ఫలాపేక్షకూడ దేవుని ప్రణాళికలోని భాగమే. ఇంతకూ కావలసినది మానవుడు మానకుండా పనిచేయడం. వాడు ఫలాన్ని చూపి పనిచేసినా, పరమాత్మనుచూసి పనిచేసినా పనిచేయడం మాత్రం మానకూడదు. ఇది దేవుని నిర్ణయం. తనను చూడటం చేతనయ్యేవరకు తనస్థానంలో ఫలితాన్ని పెట్టి పనిచేయిస్తాడు. తాను గోచరించే సమయమొచ్చేటప్పటికి తానే గోచరిస్తాడు. ఈ లీలనుమనం గమనించాలి. వ్యామోహితులయిన వారిని ప్రేమతో తగినవిధంగా ప్రోత్సహించాలి. దేవుడి ప్రణాళికను ఎరిగి ప్రవర్తించాలి. దేవుని ప్రతినిధులమై, వారిని సేవతీరుస్తూ దరిజేర్చగలగాలి.

• • •

# 11. ఎదుటివారి స్థానంలో నిలబడిచూడుము!

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖంవా యదివా దుఃఖం సయోగీ పరమోమతః ॥
(6అ॥-32శ్లో॥)

తోటివారిని సాటివారుగా చూడాలి! వారూ తనలాంటి వారేనని గ్రహించుకోవాలి! కష్టసుఖాలలో వారి స్థానంలో మనం నిలబడి చూడాలి! అప్పుడు వారుగా ఉన్నదికూడ మనమేనని అనుభూతమవుతుంది. వారి కష్టసుఖాలలో పాలుపంచుకొనగలుగుతాం. ధన్యత చెందుతాం!

ఎదుటివారి స్థానంలో మనం నిలబడి చూసినప్పుడు, ఆ స్థానంలోమనని మనం ఊహించుకొన్నప్పుడు పరిస్థితియొక్క నిజస్వరూపం మనకు బోధపడుతుంది. మన కర్తవ్యం పట్టాలను దాటకుండ సాగుతుంది. అంటే ధర్మాచరణ మనేది అలవోకగా సాధ్యమవుతుంది. అధర్మం మననుండి జరగమన్నా జరుగదు. ఎందువల్లనంటే ఏది ఏమిటి అన్నది మనకు తెలుస్తూనే ఉన్నదికదా, తెలియక పోయినప్పుడుకదా మనం దారితప్పేది. ఇది ఒక చిత్రమయిన సాధన. ఈ సాధన మానవుణ్ణి పరిపూర్ణుణ్ణి చేస్తుంది. ఎదుటివారిని వేరుగా చూడకూడదు. వారిస్థానంలోనూ మనమే నిలబడాలి. అప్పుడు మనస్సునకు అందేదే ధర్మం. కష్టంలోనూ, సుఖంలోనూ కూడా మనం ఇలాగే భావించుకోవాలి. అప్పుడు నిజంగా ఏదికష్టమో ఏది సుఖమో తెలుస్తుంది. మనకు ఏది కష్టమో తెలుస్తుంది కనుక ఎదుటివారిని కష్టపెట్టము. మనకు ఏది సుఖమో తెలుస్తుంది కనుక ఎదుటివారినికూడ సుఖపెడతాము. కష్టసుఖాలు అందరికీ ఒక్కటే। అసలందరుగా ఉన్నది ఆ 'ఒక్కడే' కదా। అంతవరకూ వెళుతుంది ఈ మన అనుభూతి.

చూశారా. ఒక మంచిభావన మానవుణ్ణి ఎంత ఉద్ధరిస్తున్నదో। ఎదుటి వారి స్థితిలో మనని మనం ఊహించుకొందాము. అన్న భావన మానవుడికి ఎంతటి ధన్యతను అందిస్తున్నదో చూశారా !

ప్రక్కయింటిలో అమ్మాయి నొప్పులు పడుతున్నది. వాళ్ళ యింటిలోని వాళ్ళు గాబరా పడుతున్నారు. అది అర్ధరాత్రి. రవాణాసౌకర్యం కష్టం. ఇవతలి ఇంటాయనకి కారు ఉన్నది. కారు గ్యారేజిలోనే ఉన్నది. కండీషన్‌లోనే ఉన్నది. కాని అతనే కండీషన్‌లో లేడు. అతనికి మెలకువ వచ్చింది. ప్రక్కయింటిలోని హడావిడి చూస్తున్నాడు. వారి అవసరం అతనికి తెలుసు, కాని కదలడు. "కొంపదీసి కారు అడగరుకదా, వీళ్ళకోసం రాత్రి పూట వెళ్ళిరావాలి. పెట్రోలుధరలు చూస్తేనా మండిపోతున్నాయి. డబ్బులు వాళ్ళనేమని అడుగుతాం ? ఈ గొడవంతా ఎప్పుడౌతుంది. మనం సహకరిస్తేకదా। వారొచ్చి అడిగితే కారు చెడిపోయింది అని చెబితే సరిపోలే. ఇక నిశ్చింతగా పడుకోవచ్చు. ఏమిటో ఇవన్నీ లేనిపోని అబ్లిగేషన్స్. ఒక్కొక్కప్పుడు సౌకర్యాలు ఉండటంకూడ తప్పే! అందరి కళ్లు ఇటే ఉంటాయి."అనుకొంటూ నిద్ర నటిస్తున్నాడు. ఇంతలో తలుపు చప్పుడయింది. వాళ్ళు హడావిడి పడుతున్నారు. అర్థిస్తున్నారు. వాళ్ళకళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. వాళ్ళు నిస్సహాయులయి ఉన్నారు. కాని ఇతని దగ్గర సమాధానం సిద్ధంగా ఉంది. 'కారు చెడిపోయింది' అన్నాడు. వారి కన్నీరు అతని కారును కదపలేకపోయాయి., వారు వెనుదిరిగారు. చిమ్మచీకటిలో అటు, ఇటు తడుముకొంటూ అయోమయంగా నలుగురు నాలుగువైపులకు పరుగెత్తుతున్నారు, ఎవరయినా, ఏమయినా చేయగలరేమోనని. అతడు తలుపులు వేసుకొన్నాడు. ఇంటికే కాదు మనస్సుకు కూడా ।

అతడు వారి స్థానంలో నిలబడలేకపోయాడు. వారి బాధ అతనికి బోధపడలేదు. వారిది వారికే, తనకేమిటి అనిపించింది. వారి బాధ. తన బాధకాదా । తనకూ అలాంటి అవసరమొస్తే, అప్పుడు ఆ ప్రక్కింటివారూ ఇలాగే ప్రవర్తిస్తే అతనికి ఏమనిపిస్తుంది ? తట్టుకోగలడా। మరి ఈ సంగతి అతడు ఆలోచించాడా ।

ఒక గుమస్తా తన భార్యను వెంటబెట్టుకొని తెలిసినవారి కారడిగి తీసికొని సంతోషంగా తన ఆఫీసరు ఇంటిముందు దిగాడు. దిగి నమస్కరించాడు,

నమస్కరిస్తూ చేతికి ఒక ఆహ్వానాన్ని అందించాడు. 'మీవంటి పెద్దల దయవల్ల, దైవానుగ్రహంవల్ల నేనొక ఇంటిని కట్టుకోగలిగాను. ఆ ఇంటి గృహప్రవేశం, మీరు సపరివారసమేతంగా తరలిరావాలి। మీరొస్తే మాకు నిండుదనం. మీరొస్తే అది మాకొక పండుగ'- అంటూ మరింత సంతోషాన్ని వెలిబుచ్చాడు.

'అలాగే, దానికేమిటి- తప్పకుండా। ఏమాత్రం వీలున్నా అందరం వచ్చేస్తా' మంటూ సాగనంపాడు. సాగనంపి, వెనుదిరుగుతున్న అతనికి ఏమాత్రం సంతోషంగాలేదు. ఏమిటోగా ఉంది. " ప్రతివాడూ ఇల్లు కట్టేవాడే ఇలా చూస్తుంటే అలా కట్టేస్తున్నారు. ఎవరో కట్టడం వేరు. మరీ తన క్రింద గుమాస్తా! వీడూ ఇల్లు కట్టేవాడేనా ! కట్టాడే అనుకో, అంత సంబరపడిపోవాలా! ఆ సంబరంలో తాను కట్టాను అన్నదానికి సంతోషంకన్నా, నేను ఇంకా కట్టుకోలేకపోయాను. అన్న వెక్కిరింత కనబడుతోంది. వాడికి ఇల్లు కట్టడం ముఖ్యం. కట్టుకొన్నాడు. నేను దానికంత ప్రాధాన్యం ఇవ్వలేదు. అందుకని కట్టలేదు. అంతమాత్రానికే వెక్కిరించాలా? 'మాశారా! మీరు ఇప్పటికీ కట్టలేకపోయారు. నేను ఇప్పటికే కట్టేశాను' అన్నట్లు చూస్తున్నాడు. నిజంగా ఆ చూపులెంత దుర్భరంగా ఉన్నాయి— గుమాస్తాపాటి చేయలేకపోయావు- అన్నట్లుగా లేవూ ? ఆఫీసులో ఇవ్వొచ్చుకదా ఆహ్వానం! పనివేళా ఇంటికివచ్చి మరీ ఇచ్చాడు. ఇంట్లోవాళ్ళకికూడా నేను దొరికిపోవాలి అన్నట్లు. ఏమి జాణతనం! పైగా సపరివారంగా రావాలట ! అంటే పనివాళ్ళకికూడ నేను దొరికిపోవాలన్నమాట! ఏం పిలుపు? పైకి పిలిచినట్లే కనిపిస్తున్నాడు. లోపల నన్ను దొలిచేస్తున్నాడు."

అతనికి ఏమీ తోచడంలేదు. తొలచబడుతున్నవానికి ఇక తోచేదేమిటి? ఏమీ పాలుపోవడంలేదు. ప్రేమపాలు తగ్గినవానికి ఇక పాలుపోయేదెక్కడ ? పిచ్చెత్తినట్లవుతోంది సహించలేనిస్థితిలో అంతకన్నా జరిగేదేమిటి? అతడు భరించలేకపోతున్నాడు, దేనిని? దేనిని భరించలేకపోతున్నాడు? ఎదుటివాడు సుఖంగా ఉండటాన్ని భరించలేకపోతున్నాడు. ఎంత ఆశ్చర్యం ! అతని బాధ తాను ఇల్లు కట్టుకోనందుకు కాదు. గుమాస్తా ఇల్లు కట్టుకొన్నందుకు ! విచిత్రంగా లేదూ!

నిజానికి తన తోటివాడు ఒక ఇల్లు కట్టుకొన్నాడూ అంటే ఎంత సంతోషంగా ఉంటుంది. మరి, ఇక్కడ ఇదేమిటి ? అదే లోకచిత్రం. ఎదుటివాని

స్థానంలో తనను తాను నిలుపుకొన్నప్పుడుగాని ఈ దుస్థితులూ, దుర్భరస్థితులూ తొలగిపోవు.

అదే సహృదయుడూ సజ్జనుడయిన వానికి ఏమనిపిస్తుంది. తానే ఇల్లు కట్టుకొన్నంత సంబరం కలిపిస్తుంది. కౌగలించుకొని మనసారా అభినందిస్తాడు. వెళ్ళి కార్యక్రమానికి ఆధ్వర్యం వహిస్తాడు. తనదే అదంతా అన్నట్లుగా సంబర పడిపోతాడు. తన తోటివాడు తనవాడుకాడా? వాడిలో తానులేడా ? నిజానికి తానే వాడుకాడా ? ఇలా ఉంటుంది ఆ అనుభూతి. అమృతప్రదంగా ఉంటుంది. అమృతాన్ని వర్షిస్తుంది. ఇక్కడ సహృదయుడు ఏం చేస్తున్నాడు ? తనను ఎదుటి వాని స్థానంలో నిలుపుకొంటున్నాడు. తానే అతనై ఆనందిస్తున్నాడు. ఆస్థితిమనకు అందాలి ! కష్టసుఖాలలో తోటివారితో మనం అలా ప్రవర్తింపగలగాలి! అప్పుడు ఒకరికొకరు తోడుగా ఉండగలుగుతారు. అది చేతనయ్యేటంతవరకూ ఒకరినొకరు తోడుతూ ఉంటారు. అంటే వాడు అలా, వీడు ఇలా అని ఎంచుతూ ఉంటారు. సాధనలో ఇది వదిలిపోయి వాడిలా, వీడిలాగాక అందరూ మనలా కనబడే మంచి రోజు రావాలి ! మనమే అంతటా నిలవాలి ! కష్టసుఖాలన్నీ మనవే కావాలి ! అనగా అంతర్యామిస్థితితో నిలబడాలి ! అలా నిలబడితేనే నరజన్మకు సార్థకత ! అదే నరజన్మకు పరమావధి !

# 12. శాస్త్రాన్ని ప్రమాణంగా తీసికో !

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ।**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార్హసి॥**
**(16అ॥-24శ్లో॥)**

దైవం గురురూపమున గోచరించువరకు మానవునకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రము చెప్పినట్లుగా నడచుకొనుచు, పాత్రతను సంతరించుకొనుట మానవుని కర్తవ్యము.

గురువు గోచరించుట, అతడు మనతో సహచరించుట. అతని సాహచ ర్యమున జీవితము పరిమళించుట. అదొక అనుగ్రహవిశేషం. ప్రతి మానవునికి జన్మల పరంపరలో జీవప్రయాణం సాగుచుండగా, ఎప్పుడో ఒకప్పుడు అనుభవము నకు వచ్చేటటువంటి అమృతఘట్టం !

సద్గురుని సాహచర్యము లభించేవరకు లేదా అతడు గోచరించేవరకు మానవుడు ఎవరి ప్రకారం నడుచుకోవాలి ? దేని ప్రకారం నడచుకోవాలి ? తనకు తోచినట్లు బ్రతికితే సరిపోతుందా? లేదా పరిస్థితులు త్రోసినట్లు బ్రతికితే సరి పోతుందా ! ఎలా బ్రతకాలి ? తన జీవితాన్ని ఎలా మలచుకోవాలి ! ఏదోలా బ్రతికేస్తే ఎలా ? విలువయిన జీవితం వృథా అయిపోదూ ! మరి ఏం చేయాలి' శాస్త్రం చెప్పినట్లు నడవాలి ! వేదాలనుండి ధర్మశాస్త్రాలవరకు చెప్పబడినదానిని ఆదర్శంగా తీసికొని జీవితాన్ని మలచుకొంటూ సాగాలి ! మానవజాతి కొరకుఋషులు ధర్మాన్ని అనేకవిధాలుగా పొందుపరచిపెట్టారు. కాపీ పుస్తకాలలోని మేలుబంతుల వంటివవి ! వాటి ప్రకారంక్రింద మనం మన జీవితగాథను ఒద్దికగా వ్రాసుకొంటూ పోవాలి !

వేదాలు వెలువడ్డాయి. వేదాలను అనుసరించి ధర్మశాస్త్రాలు రూపుదిద్దు కొన్నాయి. ధర్మశాస్త్రాలు మానవునికి ధర్మాధర్మాలనుగూర్చి వివరించి చెబు తున్నాయి. ఇలా జీవించు. ఇలా జీవించకు అని వివరిస్తున్నాయి. మనను పవరిస్తు న్నాయి. వాటి ప్రకారం నడుచుకొంటూ ముందుకుసాగాలి మనం. వేద, ధర్మ శాస్త్రాలు ఒంటబట్టడానికి పురాణేతిహాసాలు వెలువడ్డాయి. వాటిని పారాయణంచేస్తూ ఉండాలి మనం. ఇలా జరుగుతూ ఉన్నప్పుడు మన జీవితం క్రమంగా సంస్కరింప బడుతుంది. ఆర్షసంస్కృతి మనకు అలవడుతుంది. అన్నివిధాల దివ్యజీవనానికి తగిన పాత్రత మనకు సిద్ధిస్తుంది.

అయితే శాస్త్రాలలో కొన్నికూడని అంశాలు మనకు కనబడుతూ ఉండ వచ్చు. ఏమిటీ, శాస్త్రాలు ఇలా చెబుతున్నాయి, అని మనకు అనిపించవచ్చు. అవి మన మనస్సుకు ఇబ్బందిని కలిగిస్తూ ఉండవచ్చు. మిగతాశాస్త్రంలోని సూత్రా లకూ, వీటికీ పొంతన కుదరకపోవచ్చు. ఏం జరిగిందంటే మహర్షులు ధర్మ శాస్త్రాలు రచించారు. వారికి కావలసింది లోకశ్రేయస్సు మాత్రమే! వారికి లోకం దైవస్వరూపం, వేదస్వరూపం ! వారివాక్కు అమోఘం. అయితే కాలక్రమంలో

పండితులనబడేవారు కొందరు తమ ఇష్టానిష్టాలను ధర్మశాస్త్రాలలో అక్కడక్కడ చొప్పిస్తూవచ్చారు. మనం చెప్పామంటే జనం వినరు. శాస్త్రాలు చెప్పాయంటే వింటారు'- అని వాళ్ళ భావన ! కొంతమంది విదేశీయులు కూడా మన పండితులను చేరదీసి, వారిచేత ఇలా మరికొంత కలుషితం చేయడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నం ఇలా ఒక ప్రక్కనుండి సాగుతూనే ఉంటుంది. పని గట్టుకొని బియ్యంతో రాళ్ళను కలిపేవాళ్ళుండరూ! అలాంటివాళ్ళే వీళ్ళుకూడా ! మీరు గమనించారో లేదో ఆరాళ్ళుకూడా బియ్యంలాగానే ఉంటాయి దూరానికి. వాటిని తయారు చేయడానికి ప్రత్యేకమయిన యంత్రాలుంటాయి. ఆ యంత్రాలకు యజమానులు, కార్మికులుకూడ ఉంటారు. వీరంతా పూనుకొని తెల్లనిరాళ్ళను బియ్యంలో కలగలుపు చేస్తారు. ఏమంటాము. ఇది ఒక లోక చిత్రం! అయితే మనమేం చేస్తాం. ఎలాగో ఒకలా ఆ రాళ్ళను ఏరుకొని, బియ్యాన్ని వేరుచేసికొని మన వంటకు వినియోగించుకొంటాం. ఇంకొక చిత్రమేమంటే ఈ బియ్యంలో కలపబడే రాళ్ళను ఒడుపుగా జల్లించేవాళ్ళుంటారు. వాళ్ళూ ఈ లోకంలోనే వస్తారు. ఇంతకూ వేరు చేసిపెట్టే వారిలాగానే కాలకాలాల్లో మహనీయులు పుట్టుకొస్తారు. ఏవి మహర్షుల వాక్యాలో, ఏవి పండితులనబడే వారి అభూతకల్పనలో మనకు విడమరిచి చెబుతారు. కాలం కావలసిన ఏర్పాట్లను ఎప్పుడూ చేసి పెడుతుంది. మనం కంగారు పడవలసిన పనిలేదు.

ఇలా శాస్త్రానుసారం ఆర్షసంస్కృతిని అవలంబిస్తూ ముందుకు సాగుతూ ఉండగా, ఏదో ఒకక్షణాన గురుదేవుని దివ్యసాక్షాత్కారం మనకు లభిస్తుంది. భగవానుడు మనకొరకు గురుదేవుడై సాక్షాత్కరిస్తాడు. మానవరూపుడై మనతో సహచరిస్తాడు. సందేశమిస్తాడు. సల్లాపమాడతాడు. సరససరసంగానే మనని సంస్కరించి వేస్తాడు. ఆ సాహచర్యంలో నవరసాలను అనుభవింపజేస్తాడు. నిత్యనూతన జీవితాన్ని అనుగ్రహిస్తాడు. ఇక ఆ నూతనత్వం అది శాశ్వతం. జన్మలు గడుస్తున్నా ఆ స్పర్శ, ఆ అనుభూతి, ఆ నిత్యనూతనత్వం కొనసాగుతూనే ఉంటాయి. సృష్టికథ అర్థమప్పుడు తెలుస్తుంది. పరమార్థమప్పుడు బోధపడుతుంది. పరమానందం అప్పుడు అనుభవానికి వస్తుంది. ఆ అనుభూతి- అది ఆయన విభూతి !

క్రమంగా ఆయన అంతటా గోచరించడం మొదలుపెడతాడు. దినచర్యలో అడుగడుగునా గోచరిస్తాడు. క్రమంగా అన్నీ తానుగానే కనబడతాడు. జగత్తంతా తానేనన్న అనుభవం వస్తుంది. గురుదేవుడు జగత్తంతటాగోచరిస్తాడు. జగద్గురువుగా సాక్షాత్కరిస్తాడు.

మన శరీరాన్ని రథంగా స్వీకరించి, తాను సారథియై, జీవితాన్ని ఒక ధర్మలీలా విశేషంగా నడిపిస్తాడు. ఆ సారథ్యం అనుభవైకవేద్యం ! ఇక మన జీవితం ఆయనకు నైవేద్యం !

***

# 13. వినియోగాన్నే గమనించు !

......సమలోష్టాశ్మ కాంచనః।
(14అ॥-24శ్లో॥)

'రాయి, మట్టిబెడ్డ, బంగారపు ముద్ద' యెడల కూడ సాధకునకు సమదృష్టి అలవడుట అవసరము.

సాధారణంగా మానవుడు వస్తువుల విలువలనుబట్టి చూస్తాడు. ఏది విలువైనదిగా పరిగణింపబడుతున్నదో దానిని మరింతపొందాలని కాంక్షిస్తాడు. దానిని గౌరవిస్తాడు, పూజిస్తాడు. అదే సర్వస్వమన్నట్లు చూస్తాడు. ఇదంతా అతడు విలువనుబట్టి చేస్తున్నాడు. సృష్టిలో ఏవి విలువయిన వస్తువులుగా పరిగణింపబడుతున్నాయో వాటికొరకు వెంపరలాడటం, వాటిని సమకూర్చుకోవడానికి అహర్నిశలు ప్రయత్నించడం సమకూర్చుకొనినవేళ ఏదో విజయం సాధించినట్లుగా ఉప్పొంగిపోతూ ఉండటం జరుగుతూ ఉంటుంది,

ఇక్కడొక చిత్రముంది. మనిషి విలువలపైపు చూస్తున్నాడు. దైవం వినియోగంవైపు చూస్తున్నాడు. నిజానికి విలువ ముఖ్యమా, వినియోగం ముఖ్యమా ఆలోచించండి! ఈ సృష్టిలో ఒకవస్తువు చేయగలిగిన పని ఇంకొక వస్తువు చేయ గలదా? మరి ఆ పని జరగాలంటే ఆ వస్తువే కావాలికదా! వినియోగమంటే అది. మట్టిబెడ్డ చేసినపని రాయిచేసిన పని, బంగారము చేయలేదు. ఎవరిపని వారు చేయ వలసిందే! సృష్టిలో అన్నిపనులు జరుగవలసినవే! కనుక సాధకుడి మనస్సు విలువల మీదనుండి వినియోగంమీదకు మళ్ళాలి! అప్పుడతడు అన్నిటినీ గౌరవించ గలుగుతాడు, ఈ సృష్టిలో దేనిస్థానం దానికిఉందని తెలుసుకొంటాడు. దేనిస్థానంలో అది ఉంటే తప్ప సృష్టియజ్ఞం నడవదని తెలుసుకొంటాడు.

సామాన్యమానవుని మనస్సు వస్తువులయొక్క విలువలపైపుకు చూస్తుం డగా దేవునియొక్క దృష్టి వస్తువులయొక్క వినియోగంపై ఉంటుంది. అసలు ఇన్ని విధాల వినియోగాన్ని సాధించడానికే అతడిన్ని రూపాలు ధరిస్తున్నాడు. బంగారం ఉండగా, ప్రక్కనున్న మట్టిబెడ్డను మనం చిన్నచూపు చూస్తాం. కాని దేవునికలా అనిపించడంలేదు. అతడు ఏకకాలంలో ఇటు బంగారంగాను, అటు మట్టిబెడ్డగాను కూడ ఉంటున్నాడు. ఎలా ఉండటంవల్ల ఎలాంటి వినియోగాన్ని అందించగలము! ఈ సృష్టియజ్ఞాన్ని సక్రమంగా ఎలా నడపగలము అన్నదే అతడి దృష్టి. దాని కొరకు అతడు ఇన్నిటిగా అన్నిటిగా ఎన్నిటిగానో రూపొందుతున్నాడు ఈ సత్యాన్ని గ్రహించలేని మనం కొన్నిటిని విలువగా చూస్తున్నాము. కొన్నిటిని తక్కువగా చూస్తున్నాము. కొన్నిటిని త్రోసి అవతల పారేస్తున్నాము. కానిఅతడు మాత్రం చిరునవ్వుతో అన్నిటిగానూ వ్యక్తమవుతూనే ఉన్నాడు. సృష్టికథను నడుపు తూనే ఉన్నాడు.

ఒకమాట అడుగుతాను చూడండి! ఈ విలువలు ఎవరిచ్చుకొన్నవి? మనమిచ్చుకొన్నవి. అవి విలువయినవని ఎవరు చెప్పుకొన్నారు? మనమే చెప్పు కొన్నాం. మనమే తుమ్మి మనమే చిరంజీవ అనుకోవడంలాంటి కథ ఇది. ఇప్పుడు బంగారం చాలా విలువైంది. కొద్ది సంవత్సరాలలో అది విదేశాలనుండి అదేపనిగా వచ్చేస్తుంది అనుకోండి. దాని విలువ ఏమవుతుంది. చెప్పండి మీరు అలాగే విద్యుత్ పరికరాలు క్రొత్తగా వచ్చినప్పుడు వాటివిలువ లక్షలు. ఓహో, ఓహో! ఇది ఎంత విలువైనది? అన్నాడు మానవుడు. ఇప్పుడు వేలకొద్దిగా దిగి

వచ్చాయి. మరి వాటి విలువలు ఏమయ్యాయి ? కాని ఒకటి గమనించండి, విలువ మీరిచ్చినప్పుడూ దాని వినియోగం అదే ! విలువ తగ్గినప్పుడూ దాని వినియోగం అదే! అంటే ఏమిటి? విలువలు మారుతూఉంటాయి. వినియోగాలుమాత్రం మారవు విలువలు మానవుని మనస్సునుండి పుడుతున్నాయి, వినియోగాలు దేవుని చేత నిర్ణయింపబడుతున్నాయి.

మట్టి ఇందుకు వినియోగపడుతుంది. రాయి ఇందుకు వినియోగపడు తుంది. బంగారం ఇందుకు వినియోగపడుతుంది. ఫలానా లోహం ఫలానా అందుకు వినియోగపడుతుంది. అన్న ఈ వినియోగాలు మాత్రం శాశ్వతాలు. అవి అలా వినియోగపడుతూనే ఉంటాయి. మరి, మనమిచ్చే విలువలు. అవి పూట పూటకూ మారిపోతూ ఉంటాయి. గంటగంటకూ ఫోన్లుచేస్తూ ధర ఎలా ఉంది, ధర ఎలా ఉంది అంటూ దడదడలాడిపోతూ ఏ బొంబాయి ధరల మార్కెట్టుకో ఫోనుచేసి అడుగుతూఉండే వ్యాపారులెందరులేరు! అంటే మన విలువలకు ఉన్న నిలకడ అంతమాత్రమన్నమాట !

సాధకుడయినవాడు లోకరీతిని కాదననక్కరలేదు, లోకంలో ఉంటు న్నాడు గనుక, లోకంలో వర్తిస్తున్నాడు గనుక వారిలా తానూ, విలువలూ కథలూ గమనించడంలో దోషంలేదు, కాని అతనికిమాత్రం విలువలకన్న వినియో గమే ప్రధానమని తెలియాలి. ఆ వినియోగాన్ని అతడు గౌరవించాలి! అప్పుడన్ని టినీ అతడు సమంగా గౌరవించగలుగుతాడు. ఏది లేకపోయినా బండి నడవదని అతనికి స్పష్టంగా తెలుస్తుంది, విలువల భ్రమలనుండి వినియోగాల సత్యదర్శనం లోనికి మేలుకొని సకలవస్తువులను సమదృష్టితో గౌరవించడం జరగాలి. అప్పుడే మనకు దేవుని సృష్టి అర్థమైనట్లు. అప్పుడే మనకు దేవుని దృష్టి బోధపడినట్లు!

నీళ్ళపనిని పాలు చేయగలవా ? కాని మనం నీళ్లకన్న పాలకు వెల ఎక్కువ కడతాము. కాని భగవంతుడు మాత్రం మన వినియోగాన్ని గమనించు కొని, విలువ ఎక్కువ ఇచ్చినా, నీళ్ళగా ఉండటానికికూడ సిగ్గుపడటంలేదు. అత డికి కావలసింది మనదేహాలు నిలబడటం కదామరి !

మనం చిన్నచూపు చూస్తున్న పదార్థాలుగా ఉండటం దేవుడు మానేశాడ నుకోండి. ఏం మనమైందుకుండాలి ! వాళ్ళు విలువ ఇచ్చిన పదార్థాలుగానేఉందాం—

అనుకొని విలువిచ్చిన పదార్థాలుగా ఉండి, మనం విలువనీయని పదార్థాలుగా ఉండటం మానేశాడనుకోండి. అప్పుడు మనమేమవుతాం !

ఒక చిత్రం గమనించండి ! అన్నిటా అతడే ! అన్నీ అతడే ! ఏ వస్తువుకుగాని, ద్రవ్యానికిగాని మూలానికి వెడితే గోచరించేది అతడే! మరి అలాంటి దైవం మనయెడల అపారమైన ప్రేమతో, కోటానుకోట్ల రూపాలతో మనకు అంది వస్తున్నాడు. కోటానుకోట్ల వినియోగాలు అందిస్తున్నాడు. ఆ వినియోగంలో ఎంత వైవిధ్యం ! ఎంత వైభవం ! చెప్పండి చూడాలేగాని ఎంతటి లీల ఇది ! అతడేపాలు. అతడే పంచదార రెండూ కలిపితేనే మనం త్రాగడం! అతడే బియ్యం, అతడే నీళ్ళు, అతడే అగ్ని. ఆ మూడూ కలిపితేనే ఈ మూడుముద్దలు మనంతినడం. అతడే మంచం, అతడే పరుపు, అతడే దిండు, అతడే దుప్పటి అన్నీ కలిసి వస్తేనే మనకు సుఖనిద్ర పట్టేది. ఇలా మన కథ నడవడంకోసం కోటానుకోట్ల వినియోగాలను ఏకకాలంలో అందజేస్తున్న ఈ వైభవాన్ని చూడగలిగినవేళ మనస్సు వస్తువునకు ప్రత్యేకించి విలువనిస్తుందా! విలువలు అన్నస్థితిని అసలు తన దగ్గరకు రానిస్తుందా ! ఇక అక్కడ ఎల్లవేళలా గోచరించేది నానావిధవస్తువుల వినియోగ వైభవమే! ఆయారూపాలలో దైవం ప్రకటిస్తున్న లీలావిశేష అనుభవమే !

వస్తువులలోనే విలువలనుగాక వినియోగమును గమనించండి- అని చెబుతున్నప్పుడు ఇక వ్యక్తుల సంగతి వేరేచెప్పవలెనా! కాని తెలియని మానవుడు వ్యక్తులమధ్య కూడ విలువలను ఎంచుతున్నాడుకదా ! ఇట్లు చేయవచ్చునా? ఇట్లు చేసినప్పుడేకదా తక్కువగా చూడబడేవారు తిరగబడే ప్రయత్నంచేసేది. అసలు ఆ స్థితిని మనమెందుకు తెచ్చుకోవాలి! సమస్యలను కావాలని ఎందుకు సృష్టించుకోవాలి !

ఒక్కటి గమనించండి. ఈ సమాజంలో ఒకవస్తువు పని ఇంకొక వస్తువు చేయలేదు. ఒకవ్యక్తి పని మరొకవ్యక్తి చేయలేడు. ఎవ్వరిపని వారు చేయవలసినదే ! ఎవరు పనిచేయకపోయినా ఆ లోటు తీరదు. ఈ సృష్టిలో ఎవరికి ఎవరూ కార్బన్‌కాపి కారు. నీవు లేకపోతే ఏమిటి నేను చేసేస్తాను. ఎవరు చేయవలసింది వారికి నిర్దేశింపబడి ఉంది. అది వారు మాత్రమే చేయగలిగిఉంటారు. కనుక ఎవరి వినియోగము వారిదే, ఇంకొకరు వారిలా వినియోగపడలేరు. అయితే ఇందరి

వినియోగాలూ, ఇందరి సేవలూ సమాజానికి కావాలి ! ఇక్కడకూడ మన మనస్సు నుండి విలువలు జారిపోయి, వినియోగమన్నది దేవుని నిర్దేశంగా భావించాలి ! ఇలాంటి సాధన మనలో జరుగుతున్ననాడు ఒకమనిషి మనకు కనబడగానే భగవంతుడు ఇతనినుండి ఉద్దేశిస్తున్నదేమిటి? ఎలాంటి వినియోగాన్ని ఇతనినుండి దైవం అపేక్షిస్తున్నాడు. ఈ సృష్టిలో ఇతనిపాత్ర ఏమిటి అన్నది స్పష్టంగా తెలుస్తుంది. తెలిసినప్పుడు మనం అతనికి దోహదం చేయవచ్చు. తెలియజెప్పవచ్చు. ముఖ్యంగా ఎవరిపాత్ర ఏమిటి అన్నది గోచరిస్తుంది కాబట్టి పెద్దచూపులు, చిన్నచూపులు, త్రోసివేయడాలు, అణిచివేయడాలు ఇక ఉండవు. అలా ఎవరయినా ప్రవర్తిస్తే వారికి జవాబు చెప్పుకోవలసిన సమయం తప్పకవస్తుంది. ఒకటి గుర్తించండి! దేవుని రాజ్యాన్ని మానవుడు ఎక్కువకాలం కల్లోలపరచలేడు. ఎక్కువకాలం కలుషితం చేయలేడు. ఏదో ఒకరూపంలో కల్పించుకొంటాడు. కథను మళ్ళీ దారికి తెస్తాడు. నామరూపాలు ఏమయితే ఏమిటి, అక్కడ పనిచేస్తున్నది దైవమని గమనించండి. చేతులెత్తి నమస్కరించండి! అయితే అతడు దిగివస్తాడుకదా అని మనం ఊరికే కూర్చోకూడదు. ఉపేక్ష చేయకూడదు. బద్ధకించకూడదు. ఇది ఇంతేలే అని సరిపెట్టుకోకూడదు. ఎవరికర్మ వారు అనుభవిస్తారని ఉచితవచనాలు పలుకకూడదు. మన వంతు ప్రయత్నం మనం చేస్తూనే ఉండాలి. సన్నివేశానికి తగిన శిక్షణ మనం పొందుతూనే ఉండాలి ! అప్పుడు దైవం మనందరినీ వినియోగించుకొంటాడు. మనలోనుండే వ్యక్తమవుతాడు. ధర్మసంస్థాపన జరుగుతుంది. విలువల స్థితినుండి వినియోగాలస్థితికి మానవజాతి మేల్కొంటుంది. కనుక వస్తువునేకాదు. ఏ వ్యక్తిని కూడ తక్కువచేసి చూడకూడదు. ఆ చూస్తున్నది దేవుడు చూస్తున్నాడని గమనించండి. నిజానికి అతడినే మనమలా చూస్తున్నామని గుర్తించండి. భగవంతుడు అప్పగించిన వినియోగం దైవదత్తమైనది. అది పవిత్రాతిపవిత్రమైనది. కనుక నానావిధ వినియోగాలకు మనం చేతులెత్తి నమస్కరిద్దాం. మనసారా వాటిని గౌరవిద్దాం। హృదయపూర్వకంగా వాటిని దేవునిలీలలుగా అనుభవిద్దాం ! సహస్రశీర్షాలతో సహస్రపాదాలతో ఈ సృష్టికథను ఇలా నడుపుతున్న ఆ వైభవాన్ని నిరంతరం కీర్తిద్దాం !

అయితే లోకవ్యవహారంలో ఎవరిపాత్రనుబట్టి వారిని తగిన విధంగా పిలుస్తూ ఉండవచ్చు. తగినవిధంగా వారితో వర్తిస్తూ ఉండవచ్చు. నిజానికి

వర్తించాలి కూడా ! మనకు జ్ఞానం కలిగిందని వారందరికీ తెలియవలసిన పనిలేదు కదా ! అలవాట్ల ప్రకారం, వారి వరుసల ప్రకారం, లోకరీతుల ప్రకారం ఎవరితో ఎలా వర్తించాలో వారితో అలాగే వర్తిస్తూ ఉండాలి! ఆ ప్రవర్తనలో విలక్షణత ఉండనక్కరలేదు. అయితే దైవదర్శనం మాత్రం నిరంతరం కొనసాగాలి! విలువలు కాదు. వినియోగం ముఖ్యం! విలువలు మానవుని రాజ్యం. వినియోగం దేవుని రాజ్యం. దేవునిరాజ్యంలో వినియోగానికే చోటున్నది అన్న సత్యదర్శనం సర్వకాల సర్వావస్థలయందు మన ప్రవర్తనరూపంలో వ్యక్తమవుతూ ఉండాలి! దైవంఅప్పుడు మెచ్చుతాడు. అతని హస్తాన్ని నీపైన ఉంచుతాడు.



# 14. నరక ద్వారాలను తడమకు!

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః।
కామక్రోధ స్తథా లోభ స్తస్మాదేత త్త్రియం త్యజేత్!।
(16అ॥-21శ్లో॥)

సాధకుడు విడిచిపెట్టవలసినవి మూడు. అవి కామ క్రోధ లోభాలు. ఈ మూడూ నరకానికి ద్వారాలు.

కామ, క్రోధ, లోభాలు మూడుగా కనబడుతున్నాయి. కాని లోతుకు వెళ్లి చూడగలిగితే కామానికి అనుబంధంగా వ్యక్తమవుతున్నవే క్రోధ, లోభాలు ! కామం లేకపోతే క్రోధలోభాల ప్రసక్తి లేనేలేదు.

కామం అంటే ఏమిటి? కావాలనిపించడం ! ఎదురుగుండా ఉన్నవస్తువు గాని వ్యక్తిగాని తనదికావాలి, తనకుకావాలి అనిపించడం. దానిని పొందాలనుకోవడం, దానికొరకు బెంగపెట్టుకోవడం ।

కావలసినది దొరకలేదు అన్నప్పుడు కలిగేది క్రోధం. ఇది ఒక కపి లాంటిది. మనిషిని నిలువనీయని స్థితి దీనిలో ఉంటుంది. తాను కావాలనుకొన్నది మరొకరికి దక్కిందనుకోండి. వారియెడల పొంగుకొచ్చే దారుణమైన స్థితిఉన్నదే అదే క్రోధమంటే!

కావలసినది దొరుకుతుంది. ఆ దొరికినది తనది కావాలి! తనదే కావాలి! తనకే వినియోగపడాలి! మరొకరికి చెందకూడదు. చెందనీయకూడదు. తాపత్రయ పడిఅయినాసరే, తగాదాపడి అయినాసరే, అది తనకు మాత్రమే చెందేలా చూచు కోవాలి ! ఇది లోభం !

కావాలనిపించడం కామం. కావాలనుకొన్నది అందకపోతే కలిగేది క్రోధం, కావాలనుకొన్నది లభిస్తే మొలకెత్తేది లోభం! ఇంతకీ కావాలి అన్న దానిచుట్టూ ఈ మొత్తం కథ తిరుగుతోంది. ఆ కావలసినదానికి కావలికాయడంలో మానవుని జీవితం అయిపోతుంది. జీవితం ముగిసేలోపల కావలికాస్తున్న మానవుడు అనుభవించేదే నరకయాతన. కనుకనే ఈ మూడూ నరకానికి త్రోవలుగా చెప్పబడ్డాయి.

జరిగిన కథ ఒకటి చెబుతాను ఆలకించండి ! ఒకచోట యువతీయువకులు ప్రేమించుకొన్నారు. ఊహలలో తేలారు. భవిష్యత్తునుగూర్చి ప్రణాళికలు వేశారు. హాయిగా ఆడుతూ, పాడుతూ కొన్నాళ్ళపాటు అలా తిరిగారు. ఎన్నాళ్ళ పాటు తిరుగుతారు. పెళ్ళి చేసికొందామనుకొన్నారు. పెద్దలకు అప్పుడు చెప్పారు. పిల్లవాడు ఒప్పించగలిగాడు కాని పిల్ల ఒప్పించలేకపోయింది, యథార్థాన్ని గమనించమన్నారు. అంతస్థులను చూడమన్నారు. కలనుండి ఇలకు రమ్మన్నారు. ఏవిధంగా చూపినా మేం ఇష్టపడలేమన్నారు. ఆ అమ్మాయిని ఇక విషయం మరిచిపొమ్మన్నారు. ఆ విషయం ఆమె అతనికి బాధతో చెప్పింది. అతడు క్రుద్ధుడయ్యాడు. ఊగిపోయాడు. తట్టుకోలేని స్థితిలో తల్లడిల్లాడు. నేనేం చేస్తానో నాకే తెలియదు అన్నాడు. పిచ్చివాడిలా ప్రవర్తించాడు, ఆమె జాలిగా చూసింది, చేసేదిలేక నిష్క్రమించింది.

ఆమెకు పెళ్ళి నిశ్చయమైంది. శుభలేఖలు వచ్చేశాయి. పెళ్ళిబట్టలకని ఆమెను తీసికొని దగ్గరివారు కారులో బయలుదేరారు. కారుబయలుదేరింది. ఇంతలో

ఆమె ముఖం కాలిపోయింది. ఆమె ముఖంపైన యాసిడ్ గుమ్మరించబడింది. గుమ్మరించింది ఎవరోకాదు ఇంతవరకూ ఆమెను ప్రేమించిన ఆ యువకుడే! ఆమె తనకు కావాలి. ఆమె అందం తనది కావాలి. అనుకొన్నాడు. అది అందలేదు. యాసిడ్‌ను ఆమెపైన చింపించాడు. ఎందుకు చిందించాడు! తనకు అందనిది ఇకెవరికీ అందకూడదు. తనది అనుకొన్నదానిని ఇంకెవరూ పొందకూడదు. పొందితే తను పొందాలి! లేదా అది ధ్వంసమైపోవాలి! ఇంకెవరికీ దక్కకూడదు. క్రోధమంటే ఇది ఇలా ఉంటుంది,

మరో చోట జరిగింది చెబుతాను వినండి. ఒకచోట యువతీయువకులు ప్రేమలో పడ్డారు. ఆడుతూ, పాడుతూ తిరిగారు. ఇరువురూ కలిసి పెద్దలను వేడుకొన్నారు. సహృదయులయిన ఆ తల్లిదండ్రులు అందుకు అంగీకరించారు. వారి వివాహం జరిగింది.

కావాలి అనుకొన్నది అతనికి లభించింది కనుక ఇక క్రోధానికి తావు లేదు. అంతవరకూ అతడు బతికిపోయాడు. కాని మరొక అనుకోని ఇబ్బందిలో పడ్డాడతను కాపురానికి వచ్చిన తన భార్య ఎక్కువకాలం అత్తమామల సేవలో గడుపుతూ ఉన్నది అత్తగారికి కావలసినవి అమర్చిపెడుతున్నది. మామగారికి కావలసినవి అందిస్తున్నది. సంప్రదాయానుసారం పూజలు. వ్రతాలు పసుపు కుంకుమలతో పేరంటాలతో కళకళలాడుతూ ఉన్నది. కాని మనవాడికే ఇదంతా చాలా ఇబ్బందిగా ఉన్నది ఏదో ఒకవంకన అతడు ఆమెను పిలుస్తూ ఉండేవాడు. ఏదో విలువయిన కారణంచెబుతూ ఆమె తప్పుకొనేది. పెద్దల తరువాతే ఏవయినా! నిజానికి మీరూ నేనూ కలిసిచేయాలి. నేను చేసినా మీరు చేసినట్లేకదా అని భావించి మరీ చేస్తున్నాను. వారికి కావలసింది చూడకుండా, ఆ వయస్సులో వారినలా వదిలిపెట్టి మనమిలా తలుపులు వేసుకొంటే బాగుంటుందా! మీరే చెప్పండి. చేసేది లేక నిట్టూరుస్తూ అతడు విడిచిపెట్టేవాడు.

రానురాను అతనికి సహనం తగ్గిపోతోంది. అతడు భరించలేకపోతున్నాడు. ఒకరోజు రాత్రి ఆమెను నిలదీశాడు. నేను నిన్ను పెళ్ళి చేసుకొన్నది ఎందుకు. నన్ను సుఖపెడతావనా. మా అమ్మకూ, నాన్నకూ సేవ చేస్తావనా! కావాలంటే ఒక పనిమనిషిని పెట్టు. ఎంత డబ్బు కావాలంటే అంతా పడేస్తాను. సేవ

పేరిట నీవెంత కష్టపడుతున్నావో తెలుసునా। ఎంతగా నలిగిపోతున్నావో తెలుసునా ! నీవిలాగే చేసికొంటూపోతే నీ అందచందాలు ఇక ఎక్కువకాలం నిలువవు ! అలసిసొలసిన ముఖంతో నా దగ్గరకు ఏ రాత్రివేళకో వస్తున్నావు. ఆ అలసటలో, శ్రమలో ఉన్న నిన్నుచూసి నేను అనుభవించగలిగిందేమిటి, బాధపడుతూ ఉండటంతప్ప। వివాహమంటే ఇదే అయితే నేనసలు చేసికొని ఉండేవాడిని కాను, ఎన్ని కలలుకన్నాం మనం ! పెద్ద ఆరిందలాగా మాట్లాడుతున్నావు. నాకే నీతిపాఠాలు చెబుతున్నావు. తల్లిదండ్రులను చూచుకోవాలని నాకు ఆమాత్రం తెలియదా. ఇన్నాళ్ళూ నీవే చూశావా! చాదస్తానికి పోకు. నీ అందచందాలు అలా పనులలో కరిగిపోతూఉంటే నేను భరించలేను. అవి నాకు అందకుండానే జారిపోతున్నాయి. నేను పొందీపొందని వాడినవుతున్నాను. ఇంతెందుకు? నీవు మరొకరికి సహకరించడం నాకు ఇష్టంలేదు. ఏమయినాసరే నీవు నాతోనే ఉండాలి ! నా పనులే చేయాలి ! నీ సేవలు మరొకరికి అందడం నాకిష్టంలేదు. నీవేమయినా అనుకో! నాదయిన వస్తువు నాకే చెందాలనుకోవడం నాదోషం కాదనుకొంటాను. కొన్నాళ్ళపాటు నాగురించి తప్పితే ఇతరుల గురించి పట్టించుకోవడం నాకిష్టంలేదు నేను పెళ్ళిచేసికొన్నది నాగురించిగాని. అందరి గురించికాదు. ఆ మాటలకు ఆమె నిర్ఘాంతపోయింది. అలా అతనివైపు చూస్తూఉండిపోయింది. లోభమంటే ఇలా ఉంటుంది. తనదైనది మరొకరికి చెందకూడదు అనిపిస్తుంది. అది తనకే దక్కాలి అనిపిస్తుంది.

అతడి కోరిక ఎలా తీరుతుంది? ఇప్పుడు అత్తమామలను సేవించాలి ! కొన్నాళ్ళుపోతే కన్నబిడ్డలను సేవించాలి! కనుక అతడు అనుకొన్నది అవడం అరుదు. కనుక ఆమె ఎప్పుడూ తనకు పూర్తిగా దక్కదు. దక్కలేదే అన్న నరకం అతనికి నిరంతరం తప్పదు.

ఇలా కామ క్రోధ లోభాలు మూడూ నరకస్థితికి మూడుద్వారాలుగా పని చేస్తున్నాయి. ఈ నరకస్థితికి మనం బలికాకుండా ఉండాలీ అంటే ఈ మూడింటికి లోనుకాకుండా ఉండాలి. అసలు సూక్ష్మం ఏమిటంటే కామానికి గురికాకుండా ఉంటే క్రోధ లోభాల కవకాశముండదు. కనుక ముందు కామాన్ని త్యజించాలి! కావాలీ అనుకోవడం మానాలి !

కావాలీ అనుకోవడం మానినప్పటికీ మనకు ఇబ్బంది ఏమీ ఉండదు. పైగా హాయిగా ఉంటుంది. కర్తవ్యనిర్వహణలో ఉన్నవారికి అవసరమైనవి అవే అందుబాటులోనికి వస్తాయి. కనుక మానవుడిదృష్టి కర్తవ్యనిర్వహణపైన ఉండాలి! స్వధర్మనిర్వహణలో అతడు నిపుణుడు కావాలి! ఆ నిపుణత అతడు చూపుతున్న వేళ అతడు దేనినీ కావాలని కోరనక్కరలేదు. సముద్రంలోనికి నదులువచ్చి చేరినట్లుగా సకలవనరులు ఆ పాత్రపోషణమేరకు అతడిని చేరుతూ ఉంటాయి,

అలాకాక కావాలీ అనుకోవడం మొదలుపెడితే ఇక దానికి అంతుఉండదు. ఒకటి అందిన తరువాత మరొకటి కావాలనిపిస్తుంది. అది అందితే ఇంకొకటి కావాలనిపిస్తుంది. నేయిపోస్తున్నకొద్దీ మంటలేస్తున్నట్లుగా కోరికలు తీర్చబడుతున్నకొద్దీ కోరికలు మరింతగా విజృంభిస్తాయి. కనుక తీర్చడంద్వారా మానవుడు కోరికలకు అతీతుడు కాలేడు. దానియెడల మౌనం వహించడంద్వారానే అతడు అతీతుడు కాగలడు.

కోరికలు వేరు, అవసరాలు వేరు, అవసరాలను దైవం ఆమోదిస్తాడు. అనుగ్రహిస్తాడు. కోర్కెలను అవి ధర్మబద్ధమయితే అంగీకరిస్తాడు. లేకపోతే ప్రక్కకు తప్పిస్తాడు. అయినా మనకేమికావాలో మనకన్నా దైవానికే బాగా తెలుసు కదా ! మనపనిలో మనం ఉండక పనిగట్టుకొని అతణ్ణి అడగడమేమిటి ? ఆలోచించండి. మనకు ఎప్పటికి ఏది అవసరమో మనకన్నా అతడికే బాగా తెలుసునని గ్రహించండి !

యోగసాధనలోఉన్న సాధకుడు క్రమంగా కావాలనుకోవడం కట్టిపెడతాడు. దేవుడు అందిస్తున్నవాటిని భక్తిశ్రద్ధలతో స్వీకరిస్తూ ఉంటాడు. ఎప్పుడు ఏది అవసరమైనా అందించబడుతుంది అని తెలిసినవాడై కర్తవ్యనిర్వహణలో నిమగ్నుడయిపోతాడు.

దేవుని అనుగ్రహంగాజీవితంలో అందివస్తున్నవాటిని, ఆ దేవుని ప్రణాళికకు అనుగుణంగా మాత్రమే వినియోగిస్తాడు. అది తనది అనుకోడు. దేవుని చేత ఈయబడినది అని ఎరుక కలిగిఉంటాడు. ఏది ఎందుకు ఈయబడిందో అది అందుకు వినియోగించడంలో శ్రద్ధపెడతాడు. ఈ దేహమే తనదికాదనీ, అది దైవమిచ్చిన ఉపకరణమనీ గ్రహించిన సాధకుడు, సృష్టిలో మిగిలిన వస్తువులను

వ్యక్తులనూ తనవిగా అనుకోగలడా! అనుభవించగలడా? ఆ వ్యక్తులలో, వస్తువులలో అతనికి దైవమే సాక్షాత్కరిస్తాడు. దైవమే భార్యగా ఉన్నాడు దైవమే బిడ్డలుగా ఉన్నాడు. దైవమే తల్లిదండ్రులుగా ఉన్నాడు. దైవమే ఈ వస్తుసముదాయంగా ఉన్నాడు— అన్న దర్శనాన్ని పొందుతున్న వేళ, ఆ మానవుని ప్రవర్తన కామాదులకు అతీతంగా, దివ్యాతిదివ్యంగా సాగిపోతూ ఉంటుంది. ఇక కావాలను కోవడం ఉండదు. అనుకొన్నది అందలేదని ఉండదు. అందినది తనకే చెందాలని ఉండదు. అంతా అతడి ఆజ్ఞ ప్రకారం జరుగుతుంది. ఆ దేవదేవుని ప్రణాళిక ప్రకారం సాధకుని జీవితం సార్థకంగా సాగిపోతుంది.

* * *

# 15. సమదృష్టిని కలిగి ఉండు!

**సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః**
**శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః॥**
**(12అ॥-18శ్లో)**

శత్రువుల యెడల మిత్రుల యెడల సమబుద్ధి వహించు! మానావమానముల యెడలకూడ అట్లే వర్తించు! శీతోష్ణములు, సుఖదుఃఖములు సహజమని గ్రహించు! సమబుద్ధితో ప్రవర్తించు! దేనికీ అంటుకొనకు! అన్నిటినీ సమబుద్ధితో అనుకొనుటలో అందెవేసిన చేయిగా రూపొందు!

సాధకుడు శత్రువునుకూడ వినియోగించుకోవాలి! శత్రువు మనలోని లోపాలను ఎప్పటికప్పుడు పనిగట్టుకొని ఎంచిచూపుతూ ఉంటాడు. ఇది నిజంగా

మనకు సహకారమే కదా! మనలోని లోపాలనతడు చూపుతున్నాడు. వాటిని సరిజేసి కొందాము, సాధనలో ముందుకు సాగుదాము. భగవంతుడే శత్రువు రూపంలోకూడ నిలబడి, ఇలా మన యోగసాధనకు కూడ సహకరిస్తున్నాడని మనం గ్రహించు కోవాలి !

అయితే కొందరు అకారణంగా మనమీద శత్రుత్వాన్ని పొందుతారు. దానికి కారణముండదు. ఏమిటిరా ఈ దారుణం అనిపిస్తుంది, మనతో ఏమీ లేక పోయినా ఇలా అంటున్నారేమిటి ? ఇలా కక్ష కడుతున్నారేమిటి- అనిపిస్తుంది. అప్పుడు- అది వారి స్వభావం, వారిలోని త్రిగుణదోషంవల్ల వారలా ప్రవర్తిస్తు న్నారని మనం గ్రహించుకోవాలి. త్రిగుణాల కలగలుపేకదా ప్రవర్తన । ఆ గుణదోషం వలన అతడు మనని అలా చూస్తున్నాడు. రంగుటద్దాలలో నుండి చూచేవాడికి దృశ్యం ఎలా కనబడుతుంది. ఇదీ ఇంతే! అయితే మనం అప్పుడేం చేయాలి? మనకేమీ ఇబ్బంది కలుగనంతవరకూ అతణ్ణి ఉపేక్షించాలి. అతడు మరీ ఇబ్బంది కలిగిస్తున్నాడనుకోండి. ధర్మప్రకారం అతనియెడల ఎలాప్రవర్తించాలోఅలా ప్రవర్తించాలి. అలా ప్రవర్తించేటప్పుడు మనలోని ధర్మం మేల్కొనాలి తప్ప మనలోని రాగద్వేషాలు రాజుకోకూడదు. రాజుకొంటే మనమూ అతనిలాగే ప్రవ ర్తించినవాళ్ళమవుతాం. ధర్మవశంలోంచి గుణవశంలోకి వెళ్ళిపోతాం. అతడికి బుద్ధిచెప్పాలి అంటే అతణ్ణి మనం శత్రువుగా చూడనక్కరలేదు. వైద్యుడు రోగికి చికిత్స చేసినట్లు చేయాలి ! అలాంటి స్థితిలో మనముండాలి! మన స్థితినుండి మనం జారనక్కరలేదు, మెల్లగా అతడు మనస్థితికి చేరేటట్లుగా చూడాలి!

ఆదిత్యహృదయంలో 'ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రు వినాశనం' అని ఉంటుంది తెలియనివారు అనుకొంటారుకదా- 'ఈ ఆదిత్యహృదయం చది వితే, ఇక మనకున్న సర్వశత్రువులూ నశించిపోతారని'- అలా అవతలివాడు కూడా చదివాడనుకోండి, మనను దృష్టిలో పెట్టుకొని, అప్పుడు మనమేమవుతాం? ఆలో చించండి ఇక్కడ, ఇలా అనడంలోని అర్థమేమిటి ?

మనం ఒకణ్ణి శత్రువు అంటున్నాం. బాగానే ఉంది. అతను మన దృష్టిలో శత్రువుకాని మరొకడికతడు తండ్రి, ఇంకొకడికి బిడ్డ, ఇంకొకరికిప్రాణ స్నేహితుడు. ఆ ప్రక్కవాడికి ఆత్మబంధువు. కాని మనకతడు శత్రువు. నిజా నికి శత్రువులు అని వేరే ఉన్నారా? లేదు. మన మనస్సు కొందరిని శత్రుభావంతో

చూస్తోంది. ఆదిత్యహృదయం చదివినప్పుడు అలా చూడటమన్నది ఇక కరిగిపో తుంది, ఎవరూ శత్రువులుగా కనబడరు. ధర్మాధర్మాలనుబట్టి నిర్ణయాలు జరుగు తాయి. అదుపు చేయవలసిన వారిని అదుపుచేస్తాం. అక్కున జేర్చుకోవలసిన వారిని అక్కున జేర్చుకొంటాం. ఇదంతా ధర్మదృష్టితోనే జరుగుతుంది, దీనికి పనివేళా శత్రుదృష్టి అలవడటం ఎందుకు? మనస్సు చెదరడం ఎందుకు? కథ అడ్డం తిరగడం ఎందుకు ? ఇవేవీ అక్కరలేదు మనం సూటిగా సాగిపోవచ్చు.

అయితే ఈ అకారణంగా అన్నవాళ్ళు ఎందుకంటున్నారు ! దీనికొక కార ణముంది. మనలో రాగద్వేషాలు ఏమాత్రం ఉన్నాయో, అవి ఏవిధంగా ప్రవ ర్తిస్తున్నాయో చూద్దామన్న దేవునిలీల ఇది. కనుక దీనిని అకారణమనగలమా ? సృష్టిలో అకారణంగా ఒకటి జరుగుతుందా? ప్రతిదాని వెనుక దేవునిలీల దాగి ఉం టుంది. గమనిస్తున్నకొద్దీ అది గోచరిస్తుంది.

కనుక సకారణంగా శత్రుత్వాన్ని వహించినప్పుడు వారు మనలోని లోపాలను గమనిస్తున్నారు గనుక వాటిని గ్రహించుకొని, మనస్సును కాస్త నిగ్ర హించుకొని, మనని మనం దిద్దుకోవాలి ! వారు అకారణంగా శత్రుత్వం వహిస్తు న్నప్పుడు మనలోని రాగద్వేషాలు ముందుకుదూకుతున్నాయా, మనలోని ధర్మస్థితి మేలుకొంటున్నదా అన్నది గమనించుకొంటూ సాధనను కొనసాగించాలి। కర్తవ్యాన్ని నిర్వహిస్తూనే ఉండాలి। సాధన జరుగుతూనే ఉండాలి! కర్తవ్యనిర్వహణమే సాధ నగా సాగాలి। శత్రువు మనలోని లోపాలను ఎంచినట్లుగా, మిత్రుడు మన లోని మంచిని ప్రోత్సహిస్తాడు. మనలోని సద్గుణాలనుచూపి మురుస్తూ, వాటిని పెంపొందించడానికి దోహదం చేస్తాడు. కర్తవ్యనిర్వహణలో అక్కరకు వస్తాడు. అండదండలనందిస్తాడు. చేదోడు వాదోడు అవుతాడు. చేయిచేయి కలుపుతాడు. ఎప్పుడూ మన శ్రేయస్సును కాంక్షిస్తాడు మన సామర్థ్యం, దక్షత, తెలివితేటలు మొదలయినవన్నీ పెరగడానికి ఎంతగానో దోహదం చేస్తాడు, ఆపద వస్తే ఆదు కొంటాడు. 'పద నేనున్నాను' అంటాడు. మనను గుండెలమీద చేయి వేసుకొని నిద్రపోయేలా చేస్తాడు, 'అతడు నాకున్నాడు. అతడు నా కుడిభుజం' అతడు నా ఊపిరి, అతడు నా ఆరవప్రాణం, అనిపిస్తూఉంటాడు. అలా కనిపిస్తూ ఉంటాడు. ఇలా మన సుఖసంతోషాలకు మన శక్తిసామర్థ్యాల విస్తృతికి ఎన్నోవిధాలతోడ్పడ తాడు. మిత్రుడుగా దైవం మన ఎదుగుదలకు దోహదం చేస్తున్నాడు. ఇది మన్నం

గమనించాలి ! మిత్రుడుగా ఉన్నది అతడే, శత్రువుగా ఉన్నదీ అతడే! మిత్రుడుగా అతడు వెన్ను తడుతున్నాడు. శత్రువుగా అతడు వేలెత్తిచూపించి, మనను సరిజేస్తున్నాడు. నిజం చెప్పండి. ఇద్దరూ అవసరమేకదా! అందుకని భగవంతుడు ఇద్దరుగానూ మనతో ఉంటున్నాడు. మిత్రులుగా చెట్టాపట్టాలు కడుతున్నది అతడే! శత్రువుగా తిట్లు, శాపనార్థాలతో కాలెత్తివస్తున్నది అతడే। ఒకచోట చేయికలుపుతున్నాడు. ఒకచోట కాలెత్తుతున్నాడు, మనకోసం ఎన్ని అవతారాలెత్తుతున్నాడు చూశారా మరి. చూడండి లీల, చూడగలిగితే లీల, చేతకాకపోతే గోల! గోల అనే స్థితినుండి లీల అనేస్థితికి మనం అవలీలగా చేరుకొందాం, గీతాచార్యుని అభయంతో.

కొందరు మనను గౌరవిస్తారు. కొందరు మనను తిరస్కరిస్తారు ! కొందరు మనమంటే ఇష్టపడతారు. కొందరు మనమంటే ద్వేషపడతారు. అయితే మన కేమనిపిస్తుంది. ద్వేషపడేవారిని చూచినప్పుడు వీరు మనను తిరస్కరిస్తున్నారు. మనను అవమానిస్తున్నారు— అని బాధ కలుగుతుంది. ఆ బాధ మనకు ఉక్రోషాన్ని కలిగిస్తుంది, ఆ ఉక్రోషం మనలో రాగద్వేషాలను కలిగిస్తుంది. దానితో మనస్సు అనవసరంగా కలతపడుతుంది. కలుషితమవుతుంది, కల్లోలస్థితి ననుభవిస్తుంది. ఇందరిలో నన్నవమానించారా? అని ఎంతో నొచ్చుకొంటుంది, ఒక్కొక్కప్పుడు పగ, ప్రతీకారానికి పూనుకోవడానికి సిద్ధపడుతుంది. కాని సాధకుడయినవాడు మానావమానాలు సమదృష్టితో స్వీకరించాలి. రెండు సందర్భాలలోనూ ఒకేలా వర్తించగలగాలి !

గౌరవిస్తున్నవారు ఎవరిని గౌరవిస్తున్నారు, మనలోని మంచి గుణాలని. ఆ సంగతి మనకు తెలియాలి. మంచిగుణాలకు గౌరవం లభిస్తుంది- అని మనం గుర్తించాలి ! ఆ మంచిగుణాలు మనలో మరింతగా పెంపొందించుకొనే ప్రయత్నం చేయాలి! ఆ మంచిగుణాలనే పుష్పాలతో హృదయస్థుడయిన దేవుణ్ణి నిరంతరం మనంపూజించాలి! అప్పుడు మన జీవితమే మనపూజ। ఈలోపల పూలను కోయడం, పూజలు చేయడం, ఇవన్నీకూడా ఈ దివ్యస్థితికి దగ్గర కావడానికి మార్గాలే । ఎప్పటికయినా సద్గుణపుష్పాలతో అఖండమయిన పూజ జరగాలి ఆ

హృదయస్థునికి! ప్రజలు ఆ గుణాలను గౌరవిస్తున్నారు. తెలియనివారు మనను గౌరవిస్తున్నారు అనుకొంటున్నారు. బోల్తాపడతారు. 'నాకు సమాజంలో ఎంతగౌరవమండీ! ఈ ఊరురండి, ఒకసారి అంటూ మీసం మెలివేస్తారు ఇలా మోసపోకూడదు. ఆ గౌరవం మనలోని సద్గుణాలకు. అది మనకు తెలియాలి! ఆ గౌరవిస్తున్నవారు వాటిని మరింతగా పెంచుకొమ్మని మనను ప్రోత్సహిస్తున్నారు అంటే దైవమే ఆ రూపంలో ఆ పనిని చేసేపడుతున్నాడు. ఇది మనం గ్రహించాలి. అతడికి నమస్కరించాలి.

ఇక అవమానిస్తున్నవారు వారు మనలోని అవగుణాలను ఏకరువుపెడుతున్నారు. దానికి వారిపై ద్వేషపడకూడదు. ఆ అవగుణాలు నిజంగా మనలో ఉన్నాయా లేవా ఆత్మపరిశీలన చేసికోవాలి! అవి ఏమాత్రంఉన్నా పశ్చాత్తాపపడాలి! తిరిగి వాటికి గురికాని స్థితికి జీవితాన్ని మలచుకోవాలి. చూశారా! వారు అవమానించడంవల్ల కూడా మనకు అభివృద్ధే లభించింది. కనుక ఇక్కడ అవమానిస్తున్న వారి స్థితిలో ఉన్నవారు కూడ దైవమే! అతడికి మనం నమస్కరించాలి!

కారణం లేకుండానే అవమానిస్తారు. కొందరు వారు ఎందుకలా అవమానిస్తున్నారు- అని మనకు అనుమానం వస్తుంది. మనమేం చేశామని! ఎందుకీ వెంటాడటం. వేటాడటం, మనల్ని ఇలా బ్రతుకనివ్వరా ! మన మానాన మనం బ్రతుకుతున్నా ఈ అవమానాల పరంపర ఏమిటి ?' ఇటువంటప్పుడు జాగరూకత వహించాలి ! రాగద్వేషాలను రగులనీయకుండ, ధర్మాన్నిబట్టి తగినవిధంగా ప్రవర్తించాలి! మనకు అంతుబట్టకపొతే రాగద్వేషాలకు అతీతులయిన పెద్దలసలహాలను తీసికొని బయటపడాలి! కర్తవ్యనిర్వహణ! కర్తవ్యనిర్వహణమే! రాగద్వేషాలకు లోనయితే ఒకటి చేయబోయి ఒకటి చేస్తాము. చివరకు మనమేమి చేస్తున్నామో మనకే తెలియనిస్థితి వస్తుంది. దానితో దుర్పస్థితి అనుభవానికొస్తుంది. దుర్భరస్థితి మనకెందుకు ? పెద్దల అడుగుజాడలలో జీవిస్తూ నిబ్బరంగానే జీవిద్దాం. అప్పుడు మానావమానాలు మనకు ఒకేలా గోచరిస్తాయి. రెండూ మనస్థితిని పెంచుతాయేతప్ప తగ్గించవు. సృష్టిలోని ప్రతీదీ మానవుణ్ణి పెంచడానికి ఏర్పాటు చేయబడి ఉంటుంది. ఈ రహస్యం మానవుడు గ్రహించాలి! దేనియెడల ఎలా ప్రవర్తిం

చాలో అతడికి తెలియాలి ! తత్త్వజ్ఞానమంటే అదే! ఏది ఏమిటో, ఏది ఎందుకో దేనియెడల మనం ఎలా ప్రవర్తించాలో మనకు తెలియడమే తత్త్వజ్ఞానం !

కాలాలు మారుతూ ఉంటాయి ప్రతికాలంలోనూ కొంత హాయి ఉంటుంది. కొంత ఇబ్బంది ఉంటుంది. ఆ ఇబ్బందులకు గురికాకుండా తగినవిధంగా ప్రవర్తించడమే మనం చేయవలసింది. అంతేగాని, కాలాలను కాదనకూడదు. అవి సృష్టిధర్మాలు. సృష్టిసహజాలు. సృష్టి లక్షణాలు! అవి అలా తిరక్కపోతే సృష్టి నడవదు. మన జీవనయాత్ర ఇలా హాయిగా సాగిపోదు. అవి రావలసిందే ! వర్తించాల్సిందే ! వాటిని మనం సమదృష్టితో, వాటివాటి ప్రయోజనమెరిగి గౌరవించవలసిందే । వేసవికాలంలో ఎండలు మండకపోతే నీరు ఆవిరై ఆకాశానికి చేరదుకదా ! అలా చేరితేనేకదా వర్షాకాలంలో మనకు వానలు కురిపించి భూమిని సారవంతంచేసేది. వర్షాకాలంలో వానలు కురిపిస్తేనే శీతాకాలంలో మనం కోసుకొని కుప్పలు వేసుకొనేది. అయితే ఈ ఎండలవల్ల, వర్షాలవల్ల, చలివల్ల తాత్కాలికంగా ఇబ్బంది అనిపిస్తుంది. కాని వాటివెనుక కథ తెలిసినప్పుడు ఆ ఇబ్బందిని మనం సమదృష్టితో స్వీకరించగలగడం సాధ్యమవుతుంది. అప్పుడు మనస్సు దానికి సిద్ధపడుతుంది. సమదృష్టిని అలవరచుకొంటుంది. దేవుని లీలగా కాలచక్రాన్నిచూస్తూ పరవశిస్తుంది.

జీవితంలో సుఖాలువస్తూ ఉంటాయి కష్టాలువస్తూ ఉంటాయి. సుఖ దుఃఖాలు రెండూ కూడ మనస్సుకూ, ఇంద్రియాలకు సంబంధించినవి. నిజానికి మనస్సు, ఇంద్రియాలు మనకెంతో పనిచేసి పెడుతున్నాయి. ఆ పనికి మనం విలువ కట్టలేము. అలాంటి మనస్సు ఇంద్రియాలను హాయిగా ఉంచవలసిన బాధ్యత, సుఖపెట్టవలసిన బాధ్యత మనకు ఉన్నది. అలా సుఖపెట్టడం వాటికి కృతజ్ఞత తెలియజేయడమవుతుంది. నోటికి మంచి ఆహారాన్ని అందించినా, కంటికి మంచి దృశ్యాన్ని చూపించినా, చెవికి మంచి గానాన్ని వినిపించినా, ముక్కుకు మంచి సువాసనలను చూపించినా చర్మానికి చక్కటి స్పర్శను అందించినా- ఇదంతాకూడా వాటిని అలరింపజేయడమే! వాటిని సుఖపెట్టడమే! ఇది అవసరం! మనకు పని చేస్తున్నవాళ్ళు సుఖంగా వర్తిల్లేటట్లు మనం చూసుకోవద్దూ! మనస్సునూ, ఇంద్రియాలను సుఖపెట్టలేనివాడు, ఇతరులను సుఖపెట్టగలడా? తన సుఖం తెలియని

వారికి ఇతరుల సుఖం తెలుస్తుందా? ఆయితే ఆ సుఖం మితిమీరకూడదు. అతిగాకూడదు. ఎంతవరకు అవసరమో అంతవరకు అప్రయత్నంగా అందించబడాలి! చూడండి. మనవారు దేవుని పూజలోకూడ మనస్సు, ఇంద్రియాలు ఆనందించేటట్లుగా అన్నిఏర్పాట్లూ చేశారు. దేవుని అలంకరించమన్నారు. కళ్ళుఆనందిస్తాయి. అగరొత్తులు వెలిగించమన్నారు. ముక్కులు పరవశిస్తాయి. గంధాదులను పూయమన్నారు శరీరానికి. చర్మం సంతోషిస్తుంది. వేదాలనుగాని, మంత్రాలనుగానిచెవులు పరవశించేటట్లు గానం చేయమన్నారు, దానితో చెవులు మురిసిపోతాయి. పూజ అనంతరం అద్భుతమయిన ప్రసాదాన్ని ఏర్పాటుచేశారు. దానితో నాలుక దివ్యస్థితిని అనుభవిస్తుంది. ప్రసాదానికున్న రుచి దేనికుంటుంది? వీటన్నిటిద్వారా మనస్సు పరవశిస్తుంది, 'నేను' చెప్పినట్లుగా ఇంద్రియాలు పనిచేసిపెడుతున్నాయి. 'నాకు, ఇంద్రియాలకు దేవునిపూజలో తృప్తి లభిస్తోంది.' అని మనస్సు అనుకొంటుంది. దైవాన్ని మరల మరల తలచుకొంటున్నది. 'దైవమా! ఈ రుచిరూపంలో ఉన్నది నీవేనయ్యా! ఈ సుఖరూపంలో ఉన్నది నీవేనయ్యా! నీవే సుఖపెడుతున్నావు. నీవే సేద తీరుస్తున్నావు' అని మురిసిపోతున్నది. భారతీయ సంప్రదాయం మనస్సునూ, ఇంద్రియాలను ఎంత సుఖపెట్టగలదో అన్నది మానవజాతికి నొక్కిచెప్పింది. ధర్మబద్ధంగా సుఖపెట్టడంలో ఒడుపును చూపమంటుంది. నిరంతరం మనకోసం పనిచేస్తున్న వాటికి ఈ దివ్యసుఖం అవసరమని తెలియజెప్పింది.

అలాగే ఉత్సవాలు వస్తాయి. పండుగలు వస్తాయి. మన ఇళ్ళలో పెళ్ళిళ్ళు, పేరంటాలు వస్తాయి. తెలియనివారు 'వాటినంత హడావిడిగా చేసికోవడమెందుకు?' అంటారు. ఇదిగో, ఇందుకే! మనస్సు, ఇంద్రియాలు ముచ్చటపడేటందుకే! వాటికి కావలసినంత సంబరస్థితి లభించేటందుకే। నిజంగా చెప్పండి. అలాంటివి లేకపోతే, అప్పుడప్పుడూ అలాంటివి రాకపోతే జీవితం ఒట్టిపోదూ! ఓడిపోదూ. కనుక ముచ్చట కావాలి! ఆ ముచ్చట దివ్యంగా ఉండాలి! సవ్యంగా ఉండాలి! రమ్యంగా ఉండాలి! నవ్యంగా ఉండాలి!

అలాగే జీవితంలో ఉన్నట్టుండి దుఃఖకరమైన సన్నివేశాలు వస్తాయి. మనస్సు విలవిలలాడుతుంది. ఇంద్రియాలు అలసిపోతాయి. అవిసిపోతాయి. తట్టుకోలేనిస్థితి అది. దైవమా? ఈ స్థితి ఎందుకు వచ్చింది? అయ్యో! ఇది రాకుండా ఉంటే బాగుండునుకదా! వచ్చినా ఇంతటిస్థితి రావాలా? ఇంత కష్టం, ఇంత నష్టం

రావాలా తండ్రీ! నీవు ప్రేమస్వరూపుడివే! మరి, మమ్మి దుఃఖాలపాలు ఎలా చేయగలుగుతున్నావు? చేసి ఎలా చూడగలుగుతున్నావు? అని అనాలనిపిస్తుంది. అలా అని ఆయనను అడగాలనిపిస్తుంది. ఒకొక్కప్పుడు ఆయనమీద కోపం వస్తుంది. మరి ఇదేమిటి ? సుఖమయితే బాగున్నదికాని, మరి ఈ కష్టమేమిటి ? సృష్టి పరిణామశీలమిది. దానికి కొన్ని లక్షణాలుంటాయి. కొన్ని ధర్మాలుంటాయి. వాటినవి వ్యక్తంచేస్తూ వెళుతున్నాయి. వాటికి తట్టుకొనలేక మన మనస్సు కష్ట పడుతుంది. కష్టపెట్టుకొంటుంది. అయినా అవి ఆగవు. ఆదుఃఖకరమయిన సన్నివేశాలు నడిచిపోతూనే ఉంటాయి. అవి ప్రకృతిధర్మాలు. వాటిని ఆపడానికి వీలుపడదు. కొన్ని మన ప్రవర్తనతో మనం తెచ్చుకొన్న కష్టాలు దుఃఖాలుకూడ ఉంటాయి. దుఃఖకరమైన సన్నివేశాలు మన ప్రవర్తనవల్ల వచ్చినప్పుడు గ్రహించు కొని ఆ దుఃఖాన్ని ధీరత్వంతో స్వీకరించి, ప్రవర్తనను సరిజేసికొని, మళ్ళీ అలాంటివాటికి అవకాశం కలగకుండా చూడాలి! అలాకాక, ప్రకృతిధర్మాలుగావచ్చే కష్టాలున్నాయి. వాటిని, ప్రకృతికి ఇవి సహజమని, సహించడమే మార్గం. సహిం చక తప్పదు. అయితే శోకకర సన్నివేశాల వలన మనస్సు, ఇంద్రియాలకు శిక్షణ లభిస్తుంది. ఆ శిక్షణ ఎదుగుదల నందిస్తుంది. మనస్సూ, ఇంద్రియాలకూ బుద్ధి వైపుగా మళ్ళడమంటే ఏమిటో శోకకర సన్నివేశాలలో చేతనవుతుంది. యోగ సాధన అప్రయత్నంగా జరుగుతుంది. కనుక సుఖాలు వచ్చినప్పుడు మనస్సూ, ఇంద్రియాలు సుఖపడుతున్నాయి. దుఃఖాలు వచ్చినప్పుడు మనస్సూ, ఇంద్రియాలు సంస్కరింపబడుతున్నాయి. రెండూ అవసరమేకదా! ఇలా మనస్సు ఒకవైపు సుఖ పడేలా, మరోవైపు సంస్కరింపబడేలా జీవనయాత్రలో దేవునిచేత చిత్రమయిన ఏర్పాటు జరిగింది. చూశారా! సుఖదుఃఖాల కథ ఎంత లోతయినదో!

ఇలా అర్థం చేసికొంటూ పోయినకొద్దీ జీవితం జీవనయాత్రగా రూపొం దుతుంది. ఈ ప్రయత్నం ప్రారంభమయ్యేవరకు యాతన. ఈప్రయత్నం ప్రారంభ మయినప్పటినుండీ యాత్ర ! అప్పుడు సమదృష్టి అప్రయత్నంగా అలవడుతుంది. దేవుడిచ్చినవాటిని అందుకోవడం ఉంటుంది తప్ప, ఈయబడినవాటికి అంటుకోవడం ఉండదు.

* * *

# 16. సమదర్శనాన్ని సాధించు!

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః॥

(5అ॥-18శ్లో॥)

జీవనయాత్రలో మనకు విద్యావంతులు దర్శనమిస్తారు. వినయ సంపన్నులు గోచరిస్తారు. బ్రాహ్మణులు ఆశీర్వదిస్తారు. గోవులు చరిస్తాయి. ఏనుగులు కనబడుతూ ఉంటాయి. కుక్కలు, ఆ కుక్కను చంపి తినేవాళ్లుకూడా మనకళ్లబడుతూ ఉంటారు. అయితే వీరందరిలోనూ మనం ఒకే దైవాన్ని చూడగలగాలి! వారిని చూచినప్పుడు ఒకేలా స్పందించగల గాలి! మన మనస్సు ఆ స్థాయికి ఎదిగిరావాలి! ఆ దర్శనంలో మనం పండాలి! అప్పుడే మనం పండితులమనబడతాం! అలా పండినవాడే పండితుడు- అని మనకు తెలియాలి!

దైవముతప్ప వేరొకటిలేదు- అని మనకు తెలుసును. ఈ లోకము ఆ దైవస్వరూపమని కూడ తెలుసు. అయితే మనం అనుక్షణం ఆ దైవాన్ని అనుభవించగలుగుతున్నామా!- అన్నది ప్రశ్న. తెలియడంవేరు, అనుభవానికి రావడం వేరు. పెద్దలు చెప్పినందువల్ల వినికిడి జ్ఞానం వస్తుంది. మనకది ఒంటబట్టాలి! మనకది గోచరించాలి! మనమా అనుభూతిని చెందాలి! అప్పుడే అది నిజమయిన జ్ఞానమవుతుంది. దీనికి అభ్యాసం కావాలి! లోకంలో దైవాన్ని పొడగట్టించుకోవడం మనకు అభ్యాసం కావాలి! జీవిత నిర్వహణ సాగుతూ ఉండగానే, నిరంతర దైవ సాక్షాత్కారం కొనసాగుతూ ఉండాలి!

విద్యావంతులలో దైవాన్ని చూడటం కొంతవరకు సాధ్యం! అలాగే వినయసంపన్నులలోకూడా। లోకశ్రేయస్సును కోరి వర్తించే బ్రాహ్మణులలో

కూడ దైవాన్ని చూడటంలో మనకు అభ్యంతరముండదు. ఇక గోవు దైవస్వరూప మన్నది మనకు అనాదిగా వస్తున్న విశ్వాసం ! కనుక అందులో దైవాన్ని చూడ టంలో మనకు అభ్యంతరముండదు. ఏనుగున్నది. దానిబలం, దాని కథ చూచిన ప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. కాబట్టి దానిలోకూడ దైవాన్ని చూడవచ్చు. ఇంత వరకు బాగున్నది. ఆ ప్రక్కనే ఒకకుక్క ఉన్నది. అది మొరుగుతున్నది. దానిని ఛీ, ఛీ, పో, పో, అనాలనిపిస్తుంది దానిలోకూడా దైవాన్ని చూడాలి. అంటే మామూలుస్థితిలో కొంచెం ఇబ్బందిగానే ఉంటుంది. ఇక ఆ కుక్కను చంపితినే వాడుంటాడు. కుక్కే నీచమయినదికదా, దానిని చంపి తింటున్నాడు. వీడెంత నీచుడు ! ఛీ ఛీ వీడిమొహం చూడకూడదు. అని అనిపించే అవకాశమున్నది. ఇలా కొన్నిచోట్ల దైవాన్ని చూడటానికి సాధ్యమవుతున్నది. కొన్నిచోట్ల దైవాన్ని చూడటానికి కష్టసాధ్యమవుతున్నది. చెప్పేటప్పుడు అంతా దైవమే అని చెబు తున్నాం. చూసేటప్పుడు అంతటా దైవమే అనగలుగుతున్నామా ? మరి ఈ వ్యత్యాసమేమిటి ?

కుక్క నీచమైనదని ఎవరు చెప్పారు. అది మన భావనమాత్రమే! అలాగే గోవు మనకు దైవస్వరూపం ! ఇంకొకరికి అది తినుబండారం! ఏం చెబుతాంమరి? ఇవన్నీ మనం కలిగించుకొంటున్న భావనలే! నిజానికి అక్కడ ఉన్నది దైవం. అతడే ఇన్నిరూపాలతో గోచరిస్తున్నాడు. తిరుగాడుతున్నాడు. సృష్టికథను నడుపు తున్నాడు. సృష్టికి ఈ రూపాలన్నీ అవసరం. ఆ రూపాన్ని ధరించడానికి అతనికే అవమానమనిపించనప్పుడు అందులో అతణ్ణి చూడటానికి మనకు సంకోచమెందుకు? పంది ఉన్నది. అతడు పందిగాకూడ ఉన్నాడు. కాని మనం పందిని భరించలేక పోతున్నాము. అతనికిలేని అభ్యంతరం మనకేల ! సృష్టికి తగినవిధంగా అతడే అన్నిరూపాలుగా ఒదిగిపోతున్నప్పుడు మనమెలా ప్రవర్తించాలి? అతడికితగినట్లుగా మనంకూడా ఒదిగి ప్రవర్తించవద్దూ ! సృష్టిలోని ఏ రూపాన్ని తక్కువగా చూచినా, 'అతణ్ణి' తక్కువగా చూచినట్లే అవుతుంది. ఏ రూపాన్నికాదన్నా, 'అతణ్ణి' కాద న్నట్లే అవుతుంది. ఎవరిని మనం హేళనచేసినా. అతణ్ణి హేళనచేసినట్లే అవు తుంది. ఎవరిని త్రోసిపారేసినా అతణ్ణి త్రోసిపారేసినట్లే అవుతుంది. ఇది మనం గుర్తించాలి ! గుర్తించి, తగిన విధంగా వర్తించాలి !

ఈ సత్యాన్ని మనం గ్రహించిననాడు సృష్టిలోని ఏ వ్యక్తిగాని, ఏ జంతువునుగాని మనం తక్కువజేసి చూడము. అంతటా దైవాన్నే దర్శిస్తాము. ఆయానామరూపాలను దైవం ఎందుకు స్వీకరిస్తున్నాడో బోధపరచుకొంటాంఇదంతా। ఆయన వైభవమని తెలుసుకొంటాం! ఎప్పుడయితే మీరు ఎవరినీ తక్కువగా చూడరో, అప్పుడు సృష్టితో మీకు ఘర్షణ ఉండదు. సృష్టిలోని సమస్యలన్నీ ఇక్కడే వస్తున్నాయి. ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనుకోవడంలోనే వస్తున్నాయి. ఆలోచించండి! సమస్యలకు మూలం ఇదికాదా! ఎప్పుడయితే ఎక్కువ తక్కువలు వచ్చాయో, నానావిధ ఘర్షణలు పెచ్చరిల్లుతాయి. సమాజం క్షోభిల్లుతుంది. అట్టుడికినట్లవుతుంది. అల్లకల్లోలమవుతుంది, అస్తవ్యస్థమవుతుంది. అశాంతి నను భవిస్తుంది. గొంతెత్తి ఆక్రోశిస్తుంది. ఇంతకథా జరుగుతుంది. ఇంత కథ జరుగుతున్నది.కనుక ఎక్కువ తక్కువలు మనమనస్సునుండిజారిపోవాలి!అంతటా దైవం మనకు గోచరించాలి! ఏనుగుగా ఉన్నవాడే కుక్కగా ఉన్నాడు. యజమానిగాఉన్న దైవమే కూలీగాకూడ పనిచేస్తున్నాడు. ఈ దర్శనం మనకలవడాలి! ఎవరిపని వారు చేస్తూనే అందరూ ఒక్కటిగా బ్రతకాలి! ఎవరి పనివారు చేయకపోతే సమాజం నడవదు. అందరిలో దైవం కనబడకపోతే సమాజం నిలవదు, ఇది మనం గ్రహించాలి !

• • •

# 17. సంతోషంగా స్వీకరించు!

తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేన చిత్!
అనికేతః స్థిరమతి ర్భక్తి సన్మే ప్రియోనరః॥
(12అ॥-19శ్లో॥)

సాధకుడయినవాడు నిందాస్తుతుల యెడల మౌనాన్ని వహిస్తాడు. దేనినయినా సంతోషంగానే స్వీకరిస్తాడు. ఇది తన ఇల్లు. ఇదికాదు అన్న భావనలకు అతీతంగా మెలుగుతాడు. స్థిరచిత్తుడై మహాభక్తుడయి వర్ధిల్లుతాడు.

జీవనయాత్ర సాగుతుండగా కొందరు ఎదురై నిందలను గుప్పించవచ్చు. కొందరు కలసివచ్చి స్తుతులను గుమ్మరించవచ్చు. నిందింపబడినచోట కృంగిపో కూడదు. అభినందింపబడినచోట పొంగిపోకూడదు. నిందాస్తుతులు అన్నవిరెండూ వ్యక్తమవుతున్నది ఒకేదైవం నుండి అని గమనించుకోవాలి ! అతడు అక్కడ అలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడు, ఇక్కడ ఇలా ఎందుకు చేయి కలుపుతున్నాడు అన్నది మన గ్రహింపుకురావాలి. ఆ వెనుకనున్న పరమార్థమేదో మనకు బోధ పడాలి, ఆ పరమార్థానికి అనుగుణంగా మన జీవనయాత్రను మలచుకోవాలి. రెం డింటి యెడల మౌనాన్ని వహిస్తూ మూలకారణం వైపునకు ధ్యానాన్ని కొన సాగించాలి.

ధ్యానం అలా కొనసాగుతున్నప్పుడు అది ఏదయినప్పటికీ దానిని సంతో షంగా స్వీకరించడం చేతనవుతుంది. అన్నీ అతడి ప్రసాదమే. అతడి అను గ్రహమే: అతడి సంకల్పమే అని తెలియవస్తుంది! దానితో ఆ సంతోషస్థితిలో నిల బడిన మనస్సునకు ఇక చెదిరిపోవడముండదు, బదులు చెప్పడముంటుంది. సన్ని వేశాలను అవలీలగా నిర్వహించడం చేతనవుతుంది. పరిష్కారాలు ఇట్లే పొడగడ తాయి. సన్నివేశాలనన్నింటినుండి లోకహితమే సాధింపబడుతుంది. అది మంచిగా వచ్చినా చెడుగావచ్చినా లోకహితంవైపుకు మళ్ళించబడుతుంది. జన్మ కర్మలు పునీతమవుతాయి. పరిసరాలు పరవశిస్తాయి.

ఇక అతనికి ఇది తన నివాసము, ఇది కాదు అన్న భేదభావం కరిగి పోతుంది. ఎక్కడఉంటే అక్కడే తన నివాసము. ఈ సృష్టి అంతా తననివాసమే! ఇందులో తనదికానిది ఏది: తానుకానిది ఏది: తనవారు, పరులు అన్నదికూడ కరిగి పోతుంది. ఎవరినీ పరాయిగా చూడటముండదు, కిరాయిగా భావించడముండదు. అంతటా దైవమే గోచరిస్తాడు. అతడే తన నివాసమని తెలియవస్తుంది. మనస్సు అతనియందు లగ్నమవుతుంది. దానితో దానికి స్థిరత్వమొస్తుంది.

దైవమందు కుదురుకొన్న మనస్సు మహిమాన్వితమవుతుంది. మహా కార్యసాధనకు నియోగింపబడుతుంది. భూమిపైన దేవునిరాజ్యాన్ని అనుభవానికి తెస్తుంది. అనంతమైన శక్తియుక్తులను అనుక్షణం పొందుతూ ఉంటుంది. నిరంతరం లోకహితకార్యాలలో నిమగ్నమవుతూ ఉంటుంది.

గాలికి రెపరెపలాడుతున్నప్పుడు దీపం మనకు వెలుగును సరిగా అందించలేదు. పరిసరాలను చక్కగా చూపలేదు. ఆ దీపపుమొగ్గ ఎంత పెద్దదయినప్పటికీ కదలిపోతున్నవేళ, అది చేయగలిగిందిలేదు. అదే గాలిపెద్దగా లేనిచోట దీపం నిలబెట్టబడినప్పుడు దీపపుమొగ్గ నిలబడుతుంది. ఆ మొగ్గ ఎంతచిన్నగా ఉన్నాసరే. చక్కగా నిలిచి వెలుగుతుంది. పరిసరాలను మనకు స్పష్టంగా చూపుతుంది. మనస్సు ఆ దీపంలాంటిది. సన్నివేశాల తాకిడికి చెదిరిపోతున్నవేళ అది చేయగలిగిందిలేదు. ఆ తాకిడికి అతీతమైనస్థితిలో అది నిలబడగలిగినప్పుడు ఇక అది చేయలేనిదిలేదు. దైవంలో కుదురుకొన్న మనస్సుకు ఇక అసాధ్యమన్నది ఉండదు. ఈ సత్యాన్ని తెలియజెబుతూనే విభూతియోగంలో కృష్ణుడంటాడుకదా- ఇంద్రియాలలో మనస్సును నేను- అని. మనస్సుకంత పెద్దపీట వేశాడు అతడు. తన స్వరూపంగా దాని విని యోగాన్ని నేర్వమన్నాడు. మనస్సు ఉన్నందుకు ఫలితమిది !- అనిగ్రహించమన్నాడు.

అలాంటి దివ్యస్థితిలో అనుభవానికి వచ్చేదే భక్తి. దానిని అనుభవిస్తున్నవాడు భక్తుడు. భక్తి అంటే ఏమిటి ? కలయిక ! వర్ణభక్తి అంటున్నాం. అంటే రెండు రంగులు కలుస్తున్నాయిక్కడ, అలాగే మనస్సు దైవాన్ని సమీపించినవేళ, దైవం మనస్సును స్పృశిస్తుంది ఆ స్పర్శలో అనుభవమయ్యేదే భక్తి. ఆ స్పర్శను నిరంతరం పొందుతున్నవాడు భక్తుడు. ఇటు మనస్సు, అటుదైవం నరనారాయణులై ఒకరినొకరు కౌగలించుకొంటున్నప్పటిస్థితి అది. జీవితం అలాంటి కౌగలింత కాగలిగిననాడు అంతకంటే కావలంసిందేముంటుంది ! అలాంటి భక్తునిగా మానవుణ్ణి తీర్చిదిద్దేటందుకే ఈ సాధనంతా! అలాంటి కౌగలింతను నిరంతరం అనుభవించడానికే ఈ వివరణ అంతా !

# 18. నిన్ను ఉద్ధరించుకోనవలసినది నీవే!

ఉద్ధరేదాత్మనా వత్మానం నాత్మానమవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః॥
(16అ॥-5శ్లో॥)

తనను ఉద్ధరించుకోవలసినది తానే ! ఈ సత్యాన్ని మానవుడు గమనించాలి ! ఉద్ధరించుకొనే ప్రయత్నంలో అతడు తనకు తాను మిత్రు డవుతున్నాడు. ఉద్ధరించుకోలేకపోతున్న వేళ అతడు తనకుతానే శత్రువవు తున్నాడు.

అయితే మనకు ఇందరు దేవతామూర్తులున్నారు. ఎందరో గురుమూర్తులు రూపుకట్టుకొని వస్తున్నారు. మరి వీరందరి మాటాఏమిటి? వారు మనకు చేయగలి గింది ఏమిటి ? చేస్తున్నదేమిటి?_ అన్నది ప్రశ్న.

దేవతామూర్తులుగాని, గురుమూర్తులుగాని నిన్ను నీవు ఉద్ధరించుకొనే ప్రయత్నంలో ఉన్నప్పుడు నీకు సహకరించగలరు. కావలసిన దోహదాన్ని అం దించగలరు. అవసరమైన వాతావరణాన్ని రూపొందించగలరు. జరుగుతున్న ప్రయ త్నానికి కావలసిన జ్ఞానాన్ని అందించగలరు. నీ మంచిచెడులను పట్టించుకొంటూ, సాధన సరిగా సాగేటట్లుగా సలహాలనివ్వగలరు. కాని ఒక్కనిజాన్ని మాత్రం నీవు గుర్తుంచుకోవాలి। నిన్ను ఉద్ధరించుకోవలసింది మాత్రం నీవే । నీకథ ఏమిటి అన్నది నీ చేతిలోనే ఉన్నది. అలా ఉంచబడింది. దీనిని మనం గుర్తించాలి!

ఇది ఒకరకంగా ఒక మధురమయిన అవకాశం. ఎదుగుదలలోని ఆనం దాన్ని అనుభవిస్తూ ఎదగవచ్చు మనం. ఉద్ధరింపబడటంలోని హాయిని అందు కొంటూ ఎదగవచ్చు మనం. కనుక ఇది నిజంగా భగవంతుడిచ్చిన అవకాశమని చెప్పాలి. రా, ఎదిగిరా । నా చెంతకురా। నా లోనికిరా। నేనుగా నిలబడటానికిరా।_ అని అతడు మనలోనుండి మనలను ఆహ్వానిస్తున్నాడు. ఎంత చక్కని సన్నివేశ మిది! ఆలోచించి చూడండి ।

కృషిచేసి సాధించడంలో ఒక అనుభూతి ఉంటుంది. అది పొందిన వారికే తెలుస్తుంది. చెరుకు గడను చెక్కి, ముక్కలు ముక్కలుగాకోసి, పళ్ళెంలో ఎదురుగాపెట్టి తినమన్నారనుకోండి. ఆ ప్రక్కవాడు ఇంకా కొంచెం ప్రక్కకు వెళ్ళి చెరుకురసాన్నే గ్లాసుల్లోనింపి త్రాగమన్నాడనుకోండి. ఇంతలో కూర్చున్నవాడి కన్ను ఆ ప్రక్కనున్న చెరుకుగడమీద పడిందనుకోండి. అతడు ఏమాత్రం సాధనా శీలుడయినా ఏం చేస్తాడూ! ఆ చెరుకుగడను తీసికొని, పంటికి పనిచెబుతూ ఆ రుచిని నేరుగా అనుభవిస్తాడు. చెరుకుగడను మనంగా కొరుక్కొని తినేటప్పుడు లభించే రుచి, ఆనందం పళ్ళెంలోని చెరుకుముక్కలుగాని, గ్లాసులోని చెరుకురసంగాని ఇవ్వ గలవా? ఆనందస్థితిని తనకు తానుగా సాధించుకోవడంలో మానవునికి అంతటి తృప్తి ఉన్నది. అంతటి తృప్తి లభిస్తున్నది.

కనుకనే భగవంతుడు మానవుని ఆనందింపజేయగోరి, 'నిన్ను నీవు ఉద్ధరించుకొంటూ, నాలోనికి ప్రవేశించు'. అని ఒక మహత్తరమయిన అవకాశ మిచ్చాడు.

తీరుగా వచ్చినప్పుడు పొందిన తృప్తి, తేరగా వచ్చినప్పుడు పొంద గలమా? ఒకనికి మూడుతరాల ముదరష్టం కలిసివచ్చింది. ఇంటినిండా కోట్లు నిండాయి. నెలకు అద్దెలు లక్షలమీద వస్తున్నాయి. లోటులేదుగాని, ఇచ్చట తృప్తి ఉన్నదా? ఆలోచించండి.

ఒకడు కష్టపడి, ధనం విలువను తెలుసుకొని, చెమటోడ్చి, క్రమంగా తనకున్న పరిచయాలను సద్వినియోగం చేసికొంటూ, కష్టార్జితంగా కొద్దిలక్షల వరకు సంపాదించగలిగాడు. అతడి ముఖంలో ఏదో విజయ కేతనం రెపరెపలాడుతోంది. 'నేను నా జీవితానికి పదునుపెట్టగలిగాను. ఎవరికీ ఏమాత్రం ఇబ్బంది కలగకుం డానే ఈ మాత్రం సంపాదించగలిగాను. నా కిదిచాలు! ఇప్పుడు నాకే లోటూ లేదు. మనస్సునిండా తృప్తిమాత్రం నిండిఉంది.' అనుకొన్నాడతను. మనస్సులోనే కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. అయినా ఏ వృత్తివలన తాను పైకివచ్చాడో, ఆ వృత్తిని పదిమందికీ మేలు కలిగేటట్లు చేస్తూనేఉంటానని దేవునితో చెప్పుకొన్నాడు. లోటులేదు. తృప్తి ఉన్నది. పని ఆగదు. బాగున్నది.

కోట్లు నిండినవాడు, ఈ కష్టపడి పైకి వచ్చినవాడు ఒకేవేళన ఎవ రింట్లో వారు భోజనం చేస్తున్నారనుకోండి. వారి స్థితి ఎలా ఉంటుంది? మొదటివాడు ఎవరో ఇచ్చిన దానిని తింటూ కూర్చుంటున్నాడు. రెండవవాడు తాను స్వయంగా సంపాదించుకొని ఆ మూడుముద్దలూ ముచ్చటగా తినగలుగుతున్నాడు. అప్పుడు ఒకే

సారిగా ఆ రెండు ముఖాలను మనం చూడగలిగితే ఎలా ఉంటుంది అన్నది మీరే చెప్పండి.

ఆ సివ ప్తే తీసికోకూడదు అని కాదుగాని, మనవంతు కష్టం మనం చేయ కుండా ఈ భూమిమీద అన్నంతినే అధికారం మనకులేదు. అలా కష్టించి సాధించు కొని తిన్న అన్నంలోనే నిజమయిన రుచి మనకు లభిస్తుంది. చూశారా! సాధన చేసి పొందడంలో, సాధనచేసి అందుకోవడంలో ఎంతటి అనుభూతి దాగిఉన్నదో! కనుక సాధకులారా! 'మానవుడు తనను తానే ఉద్ధరించుకోవాలి'. అన్న గీతా చార్యుని వాక్యం ఎంతటి నిగూఢమైనదో, ఎంతటి రుచికరమైనదో చూడండి!

ఇలా చూస్తూ సాగుతున్నప్పుడు మనకేమి తెలుస్తున్నది? కావలసిన దోహదాన్ని అందుకొంటూ, మనకు మనంగా లక్ష్యాన్ని సాధించుకోవడంలోనే తృప్తి అన్నది దాగి ఉన్నది. అని స్పష్టమవుతున్నది. సరిగా ఇలాంటిస్థితే యోగ సాధనలోకూడ మనకు దర్శనమిస్తుంది.

తోటమాలి తోటలోని మొక్కలకు ఏం చేస్తున్నాడు? చక్కటి దోహ దాన్ని అందిస్తున్నాడు. ప్రతి మొక్కనూ, చెట్టునూ కనిపెట్టుకొని ఉంటున్నాడు. వాటికి కావలసిన పోషణ నందిస్తున్నాడు. రక్షణ నందిస్తున్నాడు. అన్నీ చేస్తు న్నాడు. కాని ఎదిగి పూలుపూసి, కాయలుకాసి, పండ్లనివ్వవలసిన బాధ్యత మాత్రం ఆ మొక్కలూ, చెట్లదే। ఈ ఈయబడిన దోహదంతో అవి విజృంభించి, సమా జాన్ని నవరసాలతో అలరిస్తున్నాయి. అందుకు ఆ తోటమాలి, 'ఆహా! నా దోహ దం ఫలించింది కదా!' అని ఆనందిస్తున్నాడు.

కొన్ని మొక్కలూ, చెట్లూ తొందరగా దోహదాన్ని అందుకొంటాయి. త్వరత్వరగా అందుకొని ఎదిగివస్తాయి. కొన్నిచెట్లు బద్ధకించి ఇస్తున్న దోహద మంతా ఏమవుతుందా అన్నట్లుగా ముఖంపెడతాయి. అయినా తోటమాలి ఇస్తూనే ఉంటాడు. వాటి మందకొడితనాన్ని వదలకొట్టడానికి ప్రయత్నాన్ని చేస్తూనే ఉంటాడు. అతడి ప్రయత్నమొక్కటే. లభిస్తున్న దోహదాన్ని అందుకొని అవి పైకి రావాలి! లోకం అతని దోహదాన్నిచూసి మురిసిపోవాలి! అదీ అతని దృష్టి.

మహనీయులు, గురుమూర్తులు అయినవారు ఆ తోటమాలి వంటివారు. సాధకులు, భక్తులు ఆ తోటలోని మొక్కలు, చెట్లవంటివారు. ఇది మనం గమనిం చాలి! వారు మనకు దోహదాన్ని అందిస్తారు. అవసరాన్నిబట్టి పోషణనిస్తారు. రక్షణనిస్తారు! దారి చూపిస్తారు। ఆ దారివెంట భయంలేకుండా తోడు ఉంటారు. తప్పుచేస్తే మందలిస్తారు. మంచిచేస్తే ప్రోత్సహిస్తారు. వెంటబడుతుంటే అడ్డు

చెబుతారు. ఆత్రపడుతుంటే అడ్డుపడతారు. బాధ్యతలను మరచినవేళ గుర్తుచేస్తారు. పూర్ణజీవితంలో దేనిస్థానం దానికి ఉంది సుమా!_ అని నొక్కి చెబుతారు. ఇలా ఎన్నో విధాలుగా దోహదం చేస్తారు. మన ఎదుగుదలకు కావలసిన విధంగా నిరంతరం సహకరిస్తూ ఉంటారు. అయితే ఉద్ధరించుకోవలసింది మాత్రం మనని మనమే। అది వారు చేయలేకనికాదు, చేయకూడదు. చేస్తే ఏ మధురానుభూతి కొరకు ఈ నరజన్మ లభించిందో, ఆ మధురానుభూతిని మనంగా అందుకోలేని వారమవుతాం దానిని మనమే సాధించుకోవాలి. అప్పుడే అనుభూతి! ఆ అనుభూతి కోసమే ఇంత సృష్టి !

నవమాసాలు మోసి, నొప్పులుపడి, బిడ్డనుకని అతడిని చంకన వేసుకొన్న తల్లికిఉన్న తృప్తి, తెలిసినవారి బిడ్డను దత్తత తీసికొన్నవారికి లభించగలదా ? ఆ తృప్తి ఏమిటో వారికి ఎప్పటికయినా తెలుస్తుందా ? కనుక నొప్పులు తప్పవని తెలిసినా స్త్రీకి స్వయంగా బిడ్డను కనాలని ఉంటుంది. సాధనకూడ అలాంటిదే! ఆత్మస్థితిని తానుగా సాధించుకొన్నవేళ లభించే అనుభూతి అలాంటిది. ఆ మధురానుభూతిని అనుభవించడానికే అటు స్త్రీకి, ఇటు సాధకునకు భగవంతుడు ఇలాంటి అవకాశమిచ్చాడు. ఇది మాత్రం గ్రహించాలి !

కురుక్షేత్రాన శ్రీకృష్ణుని సారథ్యరూపంలో ఉపదేశింపబడిన సూక్ష్మం కూడ ఇదే ! అతదేమన్నాడు. నేను రథం నడిపిపెడతాను. సారథ్యాన్ని వహిస్తాను. సలహాలనిస్తుంటాను. కాని ఆయుధాన్నిమాత్రం పట్టను. యుద్ధంచేయను. ఆయుధాన్ని పట్టవలసినవాడివి నీవు. యుద్ధం చేయవలసినవాడివి నీవు. విజయం సాధించవలసిన వాడివి నీవు. అలా జరిగిననాడు అది నీకూ ముచ్చట నాకూ ముచ్చట. నేను తలుచుకొంటే వీరందరినీ క్షణకాలంలో సంహరించగలను కాని అలా తలచుకోను. 'ఆ పని నీ చేతులమీదుగా జరగాలి' నీవే చేయాలి ! ఇది నా నిర్ణయం!' అంటాడు శ్రీకృష్ణుడు ఈ సన్నివేశం సరిగా మానవుడు తననుతానే ఉద్ధరించుకోవాలి !_ అన్న ఉపదేశానికి చక్కగా సరిపోతుంది. అతదేమంటున్నాడు. 'దోహదమంతా నాది సాధనమాత్రంనీది!' అని నొక్కి చెబుతున్నాడు. ఈ సన్నివేశాన్ని మరల మరల స్మరించుకోవడం ఆత్మస్థితిని మన మందుకోవడానికి ఎంతయినా అవసరం! ఆయుధం పట్టను. సారథ్యం వహిస్తాను ! ఎంత చిత్రమయిన వాక్యమిది! ఎంత సూక్ష్మమయిన ఉపదేశమిది ! ఈ ఒక్క వాక్యంతో నరజాతికి నారాయణుడు 'నా నిర్దేశమిది సుమా!' అని తెలియబరుస్తున్నాడు కదా !

కనుక అర్జునుడికి చెబితే ఇక అందరికీ చెప్పినట్లే ! 'సారథ్యం నాది, కర్తవ్య నిర్వహణం మీది !' దానితో మిమ్మల్ని మీరు ఉద్ధరించుకొన్న వాళ్ళవు తారు.' అని పార్థసారథి తెలియజెబుతున్నాడు.

అలాంటి సారథ్యంలో కర్తవ్యమన్నది సాధనగా సాగుతున్నప్పుడు ఇంద్రియాలు, మనస్సువశంలోనికి వస్తాయి. మనస్సు బుద్ధిపైపుకు మళ్ళుతుంది. బుద్ధి అన్నిటినీ కలుపుకొని ఆత్మను చేరుకొంటుంది. ఆత్మ ఇన్నిటినీ తనలో నిలుపుకొంటుంది. ఆత్మవంతుడు అనే స్థితిని అతనికి అనుగ్రహిస్తుంది. ఇలాంటి ప్రయత్నం చేస్తున్నవాడు తనకుతాను మిత్రుడవుతున్నాడు. తన ఇంద్రియాలతో, మనస్సుతో మైత్రిని నెరపగలిగిన సామర్థ్యాన్ని పొందగలుగుతున్నాడు. అవిఅతడి స్నేహితులయి అతని శ్రేయస్సునుకోరుతూ, అతని ఆత్మస్థితిలో అతడు నిల ద్రొక్కుకునేలా చేస్తున్నాయి. అంటే ఏమిటి? అతనితో ఉన్నవారందరూ అతనికి కలిసివస్తున్నారన్నమాట !

అలాకాక ఏదో గాలికి కొట్టుకుపోతున్నామన్నట్లు బ్రతుకును గడిపేస్తు న్నామనుకోండి. ఇంద్రియాలు చెదురుబాటు చెందిఉంటాయి. మనస్సు వికలమై ఉంటుంది. బుద్ధికీ, వీటికీ లంగరందదు. ఎవరిదారి వారిదిగా ఉంటుంది. ఎవరికి వారు మరొకరికి అడ్డుపడుతూ ఉంటారు. అసలు వ్యక్తికి కలసిరారు. తుఫానులోని దిక్కుతోచని నావలా అతని జీవితం దుర్భరమవుతుంది. అతని ఇంద్రియాలు, మనస్సు అతనికి శత్రువులయి ప్రవర్తిస్తాయి. అతను వాటికి సమాధానం చెప్ప లేని స్థితిలో పడిపోతాడు. తనకుతానే శత్రువునన్న సత్యాన్ని వీక్షిస్తూకూడా ఏమీ చేయలేని స్థితిలో పడిపోతాడు. అలాంటిస్థితిలో కూడా తననుతాను ఉద్ధరించుకో దలచుకొంటే, మళ్ళీ అతనికి దారి దొరుకుతుంది. కావలసిన దోహదమందుతుంది. అంతవరకూ శత్రువులుగా పనిచేసిన ఇంద్రియాలు, మనస్సు దారికి వస్తాయి. అయితే అన్నిటికీ కావలసినది ఒక్కటి. తనను తాను ఉద్ధరించుకోవడానికి నిర్ణ యించుకోవాలి ! అతనిలో ఆ ప్రయత్నం జరగాలి ! అతనిలో ఆ ప్రయత్నం లేనప్పుడు ఎదుటివారు ఎంతటివారయినా ఏమీ లాభంలేదు. చూస్తూ ఉండవల సిందే ! దీనికి అతడు ఇతరులను నిందించి లాభంలేదు. తనకు శత్రువు తానేనని గుర్తించాలి; ఉద్ధరించుకోవడానికి తనలో ప్రయత్నం ప్రారంభంకాకపోతే ఎవరెవరు ఎన్నెన్నిచేసినా, అవన్నీ బూడిదలోపోసిన పన్నీరేనని అతడు గ్రహించాలి।

అసలు ఇంతకూ ఉద్ధరించుకోవడమంటే ఏమిటి ? మామూలు మాటలో చెప్పుకొందాం. నేను బాగుండాలి! మంచిగాబ్రతకాలి! మనిషిగా బ్రతకాలి పెద్దలమాట

వినాలి! పిన్నలయెడల బాధ్యత పడాలి! ఎవరినీ నొప్పించకుండా జీవించాలి! బాధ్యతలన్నింటినీ సక్రమంగా నిర్వర్తించాలి! తాను ఒకరికి బరువు కాకూడదు. పదిమందికి తాను సాయపడాలి !' — ఇలాంటిభావాలతో, పెద్దల అడుగుజాడలలో పవిత్రగ్రంథ పఠనాలమధ్య నుండి తాను సాగుతున్నప్పుడు అతనిలో తననుతాను ఉద్ధరించుకొనే ప్రయత్నం అతనికి తెలియకుండానే ప్రారంభమయిందన్నమాట! ఇతడు ప్రవర్తనను తీర్చిదిద్దుకొంటున్నకొద్దీ అతనిలోని ఇంద్రియాలు మనస్సుపైపుకు ఉద్ధరింపబడతాయి. మనస్సు బుద్ధిపైపుకు ఉద్ధరింపబడుతుంది. బుద్ధి ఆత్మస్థితికి చేరుకొంటుంది. అతడు తననుతాను ఉద్ధరించుకొన్నవాడు అవుతున్నాడు. అతడి జీవితం ధన్యమవుతుంది. అలాంటి ప్రయత్నం వందల వేల మందిలో ప్రారంభమయ్యేటట్లుగా, అనగా వారు ప్రారంభించేటట్లుగా ప్రేరణను కలిగించడానికే మహనీయులు, ప్రవక్తలు దిగివస్తూ ఉంటారు. వారిచ్చేది ప్రేరణ. మనలో జరుగవలసినది ప్రయత్నం ! వారిచ్చేది ఉపదేశం, మనలో కలుగవలసినది మనను మనం ఉద్ధరించుకోవాలనే ప్రయత్నానికి కావలసిన ఉన్ముఖత్వం ! వారిచ్చేది సందేశం. అది మనం చేస్తున్న ప్రయత్నం సరిగా జరుగుతున్నదో లేదో చూచుకోవడానికి పనికివచ్చే అరచేతి దీపం !

ఇంతకూ తననుతానే ఉద్ధరించుకోవాలి ! ఇది మానవుడు తెలిసికొనవలసిన సత్యం. ఆ ప్రయత్నం అతనిలో జరుగుతున్నప్పుడు అతనిలోని మనస్సు ఇంద్రియాలు అతనికి మిత్రులు. అంటే అవికూడా నిజానికి తనకుతానేమిత్రుడవుతున్నాడు అప్పుడు. అలాంటి ప్రయత్నం ఎడల ఏమరుపాటు చెందినప్పుడు అలాంటిదేమీ అతనిలో జరుగనప్పుడు అతనిలోని మనస్సు, ఇంద్రియాలు నిజానికి అతనే అయినా, అతనిపట్ల శత్రువులా పనిచేస్తాయి. అతణ్ణి దిగజారుస్తాయి. వ్యసనపరుణ్ణి చేస్తాయి భ్రష్టుణ్ణి చేస్తాయి· నికృష్టస్థితిలో నిలబెడతాయి. అప్పుడేమవుతున్నది ! మనస్సూ, ఇంద్రియాలు నిజానికి తానే అయినా తనకు తాను శత్రువవుతున్నాడు ఇక్కడ. తనను తానే ధ్వంసం చేసికొంటున్నాడిక్కడ. తానే తనకు శత్రువవడం ఎంతచిత్రం ?

కనుక మనిషీ ! పాండవ మధ్యమునిలా నిలబడు ! పార్థసారథి సారథ్యాన్ని అందుకో ! ఇక రథాన్ని ముందుకు కదలనీ ! సారథి మనోరథాన్ని మాత్రం గమనించుకొంటూ ఉండు ! నీకు జయం !



# అభయానికి అక్షరరూపం

తానుపొందిన అనుభూతికి అక్షరరూపమిచ్చి ప్రపంచాన్ని ఆ అనుభూతి లోనికి నడిపించిన శ్రీ కృష్ణస్వామిగారు కారణజన్ములు.

భగవంతుని నుండి ఆయన పొందిన అభయాన్ని ప్రపంచ మానవాళికి విప్పి చెప్పడంకోసం ఆపరేషన్ అనే మృత్యుముఖంనుండి బయటపడి ఈ కొద్ది కాలంలో మిగిలిన తన జీవితకార్యక్రమాన్ని సంపూర్తిగా నిర్వహించి కర్తవ్య నిర్వహణలోనే తన శరీరాన్ని వదలివెళ్ళారాయన. ఈ మహాయజ్ఞానికి నేను ప్రత్యక్షసాక్షిని.

సాధారణంగా తానుచేసే పనిలో ఎవరూ వేలుపెట్టడం ఆయనకు నచ్చదు. అందుకే ఆ కాస్త కార్యక్రమం పూర్తి అయ్యేటందుకే మేము 'వేలు' పెట్టవలసివచ్చింది. అమృతాన్ని రుచిచూడాలన్నా వేలుతోనేగా సాధ్యమయ్యేది.

28-10-94.

విజయవాడ.

మోపిదేవి కళ్యాణి

* * *

# వెనుక నున్న కథ

అనుకొన్న ప్రకారం జీవనసూత్రాల రచన పూర్తయింది. దానికి సంబంధించిన వ్రాతప్రతులు సిద్ధమవుతున్నాయి. మరునటిరోజు ఆపరేషను జరుగవలసి ఉంది. ఈరోజు కూడా ఏదో ఒకటి చేయాలి అనిపించింది. భారతీయమయిన సంప్రదాయంలో ఒక అంశం ఉంది. పని అయిపోయింది అనరాదు. పని ఇంకా ఉంది. అని అనాలి. పనికి అయిపోవడమంటూ ఉండకూడదు. అది ఉంటూనే ఉండాలి! ఉంటూనేఉంటుంది. పురాణప్రవచనం చేసేవారుకూడా ఒక అధ్యాయంగాని, ఒక కాండగాని అయిపోయినప్పుడు అయిపోయింది కదా అని అక్కడ ఆపరు. ఆ తరువాతి అధ్యాయంలోగాని, కాండలోగాని కనీసం కొద్దిభాగమయినా చదివి కథ ఇంకా ఉంది సుమా ! అని తెలియజెబుతూ ఆ పూటకు విశ్రాంతి నిస్తారు.

నాకూ అలాగే చేయాలనిపించింది. ఆ ఉన్నసమయంలో భగవద్గీతనుండి అభయవచనాలను ఇవతలకు తీసి క్రోడీకరించాను. తరువాత జరుగవలసిన రచన కోసం వాటిని ఒక చోట ఒకవరుసలో వ్రాసిపెట్టాను. సమయం అందుకు సరిపోయింది, 'ఆపరేషను నుండి క్షేమంగా తిరిగిరావడం జరిగితే అభయవచనాల రచన ప్రారంభమవుతుంది' అని అనుకొంటూ వాటి నొకచోట పెట్టాను.

రాత్రి అయింది. తెల్లవారితే ఆపరేషను. ఆ రాత్రి చివరి డయాలసిస్ చేశారు. డయాలసిస్‌కు షుమారు అయిదు గంటలు పడుతుంది. డయాలసిస్ జరుగుతుండగా ఆ అయిదుగంటలలోనూ జీవనసూత్రాల శుద్ధప్రతిని ఆ మూలాగ్రమూ చదివించుకొని విన్నాను. 'బాగున్నది' అనుకొన్నాను. అప్పటికి అర్ధరాత్రి అయింది. పార్థసారథి స్పర్శలో ఆ రాత్రి గడిచింది.

మర్నాటి ఉదయంనుండి ఆపరేషను సంరంభం ప్రారంభమయింది. డాక్టర్ నాగేశ్వరరావుగారి దంపతులు ఒకదేవుని ఉత్సవంగా క్రతువును నడిపించారు. చూడటానికి వచ్చిన వారందరినీ విష్ణుసహస్రనామ పారాయణకు ప్రోత్సహించారు. ఆరోజు ఉదయంనుండి మధ్యాహ్నం 2-30గంటల వరకు సోదర

బృందం విష్ణు సహస్రనామ పారాయణ చేస్తూనే ఉన్నది. పాలీక్లినిక్ పరమాత్ముని కోవెలగా రూపొందింది.

ఇక ఆపరేషనుకు తరలివెళ్ళే సమయం ఆసన్నమవుతోంది అనగా, సామూహిక ప్రార్థన జరిగింది. ఆ ప్రార్థనతో గురుపూజలవంటి వాతావరణం వెల్లి విరిసింది. అవును ! ఇదికూడా గురుపూజేకదా, అని సోదరబృందంలోని వారు ఒకానొక దివ్యానుభూతికి లోనయ్యారు. ఆ దివ్యానుభూతిలో వారు తేలియాడుతూ ఉండగా నేను ఆపరేషన్ థియేటరుకు తరలింపబడటం జరిగింది.

సామాన్యంగా ఈ ఆపరేషను ఆరునుండి ఏడుగంటల సమయాన్ని కోరుతుంది. అలాంటిది మూడుగంటలలో ఆపరేషను పూర్తయింది. అది ఎలా సాధ్యమైంది- అన్నది వైద్యులకుకూడా ఆశ్చర్యమే ! కథ చివరకు వచ్చింది. సాయంత్రం ఆరుగంటలయింది అనిపించింది. ప్రేయరు జరుగు తోందికదూ- అని అడిగాను. నాగేశ్వరరావుగారు 'అవును' అన్నారు. సుబ్రహ్మ ణ్యంగారు ఆపరేషన్ క్రతువును దివ్యంగా పూర్తిచేశామన్న తృప్తితో చివరి సర్దుబాట్లు చేస్తున్నారు, ప్రేయరు వినబడుతోంది, ప్రేయరుతో ప్రారంభ మయిన ఆపరేషను మళ్ళీ సాయంత్రం ప్రేయరువేళకు పూర్తయింది. మైత్రేయ స్తోత్రం గానం చేయబడుతూ ఉండగా నన్ను బయటకు తీసికొని వచ్చారు. సోదర బృందం అటూఇటూ బారులుతీర్చి ఉన్నారు. ఇంకా స్తోత్రగానం సాగుతూనే ఉంది. మధ్యలో స్ట్రెచర్‌పై నేను పూర్తిస్పృహతో అందరినీ చూశాను. అందరూ నన్ను ఆనందాతిరేకంతో చూశారు. అందరికీ అది ఒక మధురానుభూతి! అలాచూస్తూ ఉండగానే నన్ను ఇంటెన్సివ్‌కేర్‌కు తరలించారు.

పునర్జన్మ ఎత్తినట్లైంది, పునరుజ్జీవం పొందినట్లైంది. శిలువపై నుండి లేచినట్లయింది. దేవదేవుని ఆజ్ఞ మేరకు మృత్యువు తప్పుకొన్నట్లయింది. శరీరం, మనస్సు తేలిపోతున్నట్లుంది. అంతా క్రొత్తక్రొత్తగా ఉంది.

మనస్సులో అభయవచనాలు మెదులుతున్నాయి. అభయవచనాల రచనకు తగిన సమయం ఇదే సుమా ! అనిపించింది. ఆ అభయముద్ర యొక్క ప్రభావం ఎంతటిదో అనుభవానికి వచ్చిందికదా! ఆ అభయవచనాల వైభవమెంతటిదో అను భూతమయ్యిందికదా ! ఇంకా అనుభూతమవుతూనే ఉన్నది కదా! ఆ అభయహస్త స్పర్శను నాలోని అణువణువు ఇంకా ఇంకా అనుభవిస్తూనే ఉన్నదికదా! అలాంటి

ఈ దివ్యానుభవం ఇలా ఇలా కొనసాగుతూఉండగానే 'అభయవచనాల' రచన జరుగ వలసి ఉన్నది అనిపించింది. అంతే! ఇక రచనకు మనస్సు ఉన్ముఖమయింది.

వారంరోజులకల్లా ఇంటెన్సివ్ కేర్ నుండి ఇవతలకు వచ్చాను. ఒక ప్రత్యేకమయిన గదిలో ఉంచబడ్డాను. 'కళ్యాణిగారూ! మీకు మాత్రమే పర్మిషన్' అంటూ శ్రీమతిని మాత్రమే గదిలోపలికి వచ్చి సేవ చేయడానికి అనుమతినిచ్చారు నాగేశ్వరరావుగారు. అభయవచనాలు మనసులో మెదులుతున్నాయి. వాటినిగూర్చిన వివరణలు మనస్సనే తెరపైన కదలాడుతున్నాయి అన్నిపనులతోపాటు, ఈ వ్రాతపనిని కూడా కళ్యాణి చేపడతానంది. భారతం - ధర్మాద్వైతం వ్రాసిపెట్టిన వారిలో కళ్యాణి ప్రముఖపాత్ర వహించింది. ఆ తరువాత ఆమె వ్రాతపనిలో పాల్గొనడానికి సందర్భపడలేదు. సంస్థయొక్క పాలనాయంత్రాంగాన్ని నడిపించ డంలో ఆమె బాధ్యత పడింది. మళ్ళీ ఇన్నాళ్ళకు ఈ అభయవచనాలు ఆమెను ఈ పనిలోనికి దించుతున్నాయి. ఈ సందర్భం ఇలా కలిసిరావడంలో ఒక ఔచిత్యం నాకు కనిపించింది. అనారోగ్యంతో హాస్పటల్‌లో చేరినప్పటినుండి ఆపరేషన్ పూర్తయ్యేవరకు దేవదేవుని అభయహస్త స్పర్శ నేనెంతగా అనుభవించానో ఆమె కూడ అంతగా అనుభవించింది. దానితో అభయవచనాలను వ్రాసిపెట్టే పాత్రత ఆమెకు అందివచ్చింది. నేను చెబుతుండగా అభయవచనాలకు వ్యాఖ్యనువ్రాసి పెట్టే ఈ పుణ్యకార్యంతో ఆమె జీవితం కూడా ఒక మలుపు తిరుగుతున్నట్లు నాకనిపించింది. మొత్తం కథ ఒక మలుపు తిరుగుతున్నది. జీవనసూత్రాల రచనతో అది ప్రారంభమైంది. అభయవచనాల రచనతో అది మరింతగా స్పష్ట మవుతూ ఉన్నది.

అభయవచనాల రచన ఇలా జరుగుతుందనిగానీ, ఇంత తొందరలో ఇలా జరుగుతుందనిగానీ, ఇలా నా మీదుగానే జరుగుతుందనిగానీ నేను అనుకోలేదు. జీవనసూత్రాల రచనను ముగించి అంతటితో తృప్తిపడ్డాను. ఇంతవరకూ మన ద్వారా జరిగింది. ఈ తృప్తిచాలు మనకు. చివరిక్షణం వరకు దేవదేవుని ప్రణాళి కలో పనిచేశామన్న ఈ తృప్తిచాలు. తిరిగి ఆయన అవకాశమిస్తే, జీవింపజేసి, నీద్వారా జరుగవలసిన పని ఇంకా ఉన్నది అని, ఆయన నిర్దేశిస్తే, అంటి అవ కాశం ఆయన అనుగ్రహిస్తే అప్పుడు చూద్దాం! అనుకొంటూ తృప్తిగా ఆపరే షన్ థియేటరులోనికి ప్రవేశించాను. దేహాన్ని నారాయణ స్వరూపులయిన

వైద్యులముందు ఉంచాను. నిజం చెప్పాలీ అంటే ఆ రూపంలో ఉన్న నారాయణుడికి సమర్పించాను. తృప్తిగా సమర్పించాను! జీవించినంతకాలం నీవప్పగించిన పనిలో ఈ జీవితం పునీతమైంది. ఈ దేహం పవిత్రమైంది. ఈ ఆయుర్దాయం సార్థకమైంది. ఈ అవకాశం సద్వినియోగమైంది అన్న తృప్తితో సమర్పించాను. దేహాన్ని స్వీకరిస్తావా సంతోషం. దేహాన్ని తిరిగి నిలుపుతావా ఇంకా సంతోషం. ఎందువల్లనంటే నేను పునరుజ్జీవుడనయితే నాద్వారా దేవదేవుని ప్రణాళిక మరింతగా వ్యక్తమవుతుందని నా మనస్సునకు గోచరిస్తోంది కనుక! ఈ నీ ప్రణాళిక మరింతగా భూమిమీద వ్యక్తమయ్యేందుకు అవకాశం ఉంటేనే ఈ నా దేహం నీ చేత నిలపడుతుంది కనుక! ఏది జరిగినా అది నీ ఇచ్ఛ. నీ ఇచ్ఛయే జరుగనీ! అని అనుకొంటూ అంతర్ముఖుడనయ్యాను. ఆలా అంతర్ముఖుడనవుతుండగానే ఆపరేషన్ అనే క్రతువు ప్రారంభమయింది.

ఆపరేషన్ అయిన తరువాత ఆ మరునటిరోజున చూడటానికి వచ్చినప్పుడు నాగేశ్వరరావుగారు అన్నారు. 'ఆపరేషనుచేశామని మాకనిపించలేదు. మేము నిమిత్తమాత్రులమై నిలబడ్డాము. నిజానికి ఆ క్రతువును నిర్వహించింది శ్రీకృష్ణుడే! ఇది మా అనుభవం, అనుభూతి! ఇలా ఈ క్రతువులో పాల్గొనే అవకాశం కలగడం ఆ దేవదేవుని అనుగ్రహం అనుకొంటున్నాము. ఇప్పుడు ఏ ఇబ్బందీ లేకుండా మీరు చకచకా కోలుకోవడంకూడా ఆ వైభవాన్నే సూచిస్తున్నది'- అంటూ దివ్యానందాన్ని పొందారు.

మరికొన్నిరోజుల తరువాత అలాగే చూడటానికి వచ్చినప్పుడు ఆరు నెలలపాటు మీదగ్గరకు ఎవరూ రాకూడదు. మీరు బయటకు కదలకూడదు. ఇలాగే ఒక రూములో ఉండిపోవాలి! ఆరోగ్యరక్షణకోసం ఈ నియమం తప్పదు.అయితే మీ రచనా వ్యాసంగానికి మేమడ్డు చెప్పం. దానిని మీరు కొనసాగించవచ్చు. మీ నుండి రచనలు వెలువడుతూనే ఉండాలి! ఇప్పుడిక మీనుండి రాబోయేదేమిటి? మేము వినవచ్చునా?- అంటూ ఆర్ద్రంగా అడిగారు. 'అభయవచనాల' రచన ప్రారంభమవుతున్నది. ఆ అభయాన్ని నిండుగా పొందిఉన్న సమయం కదా ఇది! కనుక సమయానికి తగిన రచన వెలువడుతూ ఉన్నది. వ్రాసిపెట్టేది కళ్యాణి. ఆమెకూడ ఆ అభయపురుచిని అంతగానూ అనుభవించిందికదా! అదీ ఇందులో విశేషం!'- అని అంటుండగా, 'మీతోపాటు మాకుకూడా ఆ అభయస్పర్శను నిండుగా అనుభ

వింటే అవకాశాన్ని కలిగించారు' అన్నారు నాగేశ్వరరావుగారు, వారి శ్రీమతి సుధ ఆ ప్రక్కనే ఉంది. ఆమెవైపుకు తిరిగి, 'అభయవచనాలను కొన్నిటిని చెప్పగలవా నీవు ? అని అడిగారాయన. వెంటనే ఆమె వరుసగా కొన్నిటిని చెప్పసాగారు. ఆశ్చర్యం ! అవన్నీకూడా నేను వ్రాసిపెట్టుకొన్న వాటిలోనివే ! ఆ వ్రాసిపెట్టిన వాటిని ఆమెచూచి చదువుతున్నదా- అన్నట్లున్నది. ఈవిధంగా 'అభయవచనాల' రచనకు కావలసిన నేపథ్యం రూపొందించబడింది. 16-4-1994 ఉదయం 10-30 గంటలకు అభయవచనాల రచన వెలువడటం ప్రారంభించింది. 26-5-1994 సాయంత్రం ప్రేయరు సమయానికి రచన పూర్తయ్యింది.

జీవనసూత్రాలలో సాధకుడు తన దినచర్యనూ, ఆ దినచర్య రూపంలో వ్యక్తమవుతున్న మానవప్రయత్నాన్నీ ఎలా తీర్చిదిద్దుకోవాలీ అన్నది తెలియజెప్పబడింది. ఇప్పుడీ అభయవచనాలలో జీవనసూత్రాల ప్రకారం మానవుడు తన మానవ ప్రయత్నాన్ని తీర్చిదిద్దుకొంటున్నప్పుడు దైవంనుండి ఎలాంటి దోహదం లభిస్తుందో, ఎలాంటి అభయస్పర్శ అందివస్తుందో అనుభూతిప్రదంగా వివరించబడింది. మానవుని ప్రయత్నానికి దేవుని చేయూత ఎన్నివిధాలుగా లభిస్తూ ఉంటుందన్నది ఈ అభయవచనాలు మనకు తెలియజెబుతాయి. మనం అతడివైపుకు ఒక్క అడుగువేస్తే, అతడు మనవైపుకు పది అడుగులు వేస్తున్నాడు- అన్న సత్యదర్శనం ఈ అభయవచనాలు మనకు అందిస్తాయి.

అభయవచనాల వివరణలో మనకు మరొకవిశేషం కూడా గోచరిస్తుంది. ఎక్కడికక్కడ దేవదేవుని అభయస్పర్శ ఎంతటి ప్రేమమయమో మనకు అనుభవానికి రావడంతోపాటుగా సాధనకు సంబంధించిన సుళువులు లలిత మధురంగా మన మనస్సులకు అందుతాయి. దానితో మనస్సు తేలిక పడుతుంది. మార్గం స్పష్టమవుతుంది. ప్రయాణం సుగమమవుతుంది. గమ్యం చేరువవుతుంది. ఆచరణ అవగాహనా భరితమవుతుంది. ఆనందస్థితి అలవోకగా అందివస్తుంది. దేవదేవునితోడి సాహచర్యం స్థిరపడుతుంది. దృఢపడుతుంది.

మనిషి తననుతాను ఎలా ఉద్ధరించుకోవాలి అన్నది జీవనసూత్రాలు మనకు తెలియజెబుతూ ఉండగా, ఆ ఉద్ధరణ జరుగుతున్నవేళలో ఆ దేవదేవుని అనుగ్రహం ఎన్నెన్ని విధాలుగా మనిషిపైన వర్షింపబడుతున్నది అన్నది అభయవచనాలు మనకు దర్శింపజేస్తాయి. అలాంటి ఈ రెండుభాగాలూ కలసి ఒక సంపుటంగా వెలు

వడటం, అందునా ఇది భగవద్గీతకు సంబంధించిన మొదటి సంపుటంకావడం, పై లోకాలకు సంబంధించిన ప్రణాళికలోని భాగంగా భాసిస్తూ ఉన్నది. ఆ దేవదేవుని దివ్యసంకల్పమే ఇలా మనమీదుగా రూపుధరిస్తున్నట్లుగా అనుభూతికి అందుతూ ఉన్నది.

ఇది మొదటి సంపుటము. ఇక రెండవ సంపుటము వెలువడవలసి ఉన్నది. దేవదేవుడు అనుగ్రహించినవేళ అదికూడ ఇలాగే రూపుధరిస్తుంది.

మానవజీవితంలో ఒక్కొక్క సన్నివేశం ఒక్కొక్కందుకు వస్తూ ఉంటుంది. తీవ్రమయిన ఈ అనారోగ్యమనే సన్నివేశం ఇలా ఈ "పార్థసారథి ప్రవచనాలు" దిగిరావడానికి పనికివచ్చింది. కర్నూలులో రామచంద్రన్ అని ఒకాయన ఉన్నారు. 1993 గురుపూజలలో ఆయన నాతో ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతూ, 'ఇప్పటికే పెద్దలెందరో గ్రంథాలు వ్రాశారుకదా అని, మన ప్రాచీన గ్రంథాలను మీరు వివరించకుండా వదిలివేయవద్దు. మీరు తప్పక వివరించాలి ! మీ వివరణలోని మాధుర్యం, ప్రత్యేకమయిన ఆ వైభవం ప్రజలందరూ కూడా అందుకోవాలి ! మీ మీదుగా దిగివచ్చినప్పుడు మన దివ్యగ్రంథాలు మరింతగా ప్రజలకు చేరువవుతాయి. ఇది మా అనుభవంలోని మాట ! గీత, ఉపనిషత్తులు మొదలయిన వాటన్నిటినీ గూర్చి మీనుండి గ్రంథాలు దిగిరావాలి!'- అంటూ ఆయన ఆర్ద్రంగా కోరారు. ఈ ప్రవచనాలు ఇలా దిగివస్తున్నవేళ ఆయన మాటలు నాకు గుర్తుకువస్తున్నాయి. గుండె లోతులనుండి వారన్నట్లుగా, ఈ రచన మానవాళికి మరింతగా ఉపకరించినవేళ నామీదుగా సాగివచ్చిన ఈ ప్రయత్నం ధన్యతను సంతరించుకొంటుంది.

ఇదీ ఈ ప్రవచనాలకు వెనుకనున్న కథ ! రండి. ఇలారండి! దేవదేవుని అభయస్పర్శను నిండుగా అందుకొందాం ! అతడు మనను అందుకొంటాడు. అక్కున జేర్చుకొంటాడు. అతడి తోడి తాదాత్మ్యస్థితిని అనుగ్రహిస్తాడు. ఈ మన జీవితాలను ఆనందమయంగానూ, అనుభూతిప్రదంగానూ నడిపిస్తాడు. అతడితో శ్రుతికలిపి ఈ భూమిపైన అలా అలా తిరుగాడుదాం ! కదిలి రండి ! ఈ కథలు వినండి !

28-5-94, మోపిదేవి కృష్ణస్వామి

విజయవాడ.

# పెద్దలను వెన్ను తడతాను

యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరోజనః
సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే
(3అ॥-21శ్లో॥)

పెద్దలు ప్రముఖులు అయినవారు దేనిని ఆచరిస్తారో మిగిలిన ప్రజలందరూ దానినే అనుసరిస్తారు. వారు దేనిని ప్రమాణంగా స్వీకరిస్తారో దానినే జనసామాన్యులందరూ ప్రమాణంగా స్వీకరించి జీవించే ప్రయత్నం చేస్తారు.

ఉన్నట్లుండి సమాజంవైపుకు చూచినప్పుడు, ఇంతకూ ఇది ఎటు వెళుతోంది, ఏమయిపోతోంది, ఇకముందు జరిగేదేమిటి- అని అనిపిస్తూ ఉంటుంది. సమాజం, ముఖ్యంగా నేటి సమాజం విలువలను కోల్పోతోంది. ఆచారాదులను జారవిడుచుకొంటోంది. క్రమంగా భ్రష్టతవైపుకు వెళ్ళిపోతున్నదా అనిపిస్తూ ఉన్నది. నైతికమయిన విలువలు పోతున్నాయి. అనుస్యూతంగా వస్తున్న సంప్రదాయమూ పోతున్నది. క్రమంగా మనిషి మానవత్వానికి దూరమవుతున్న స్థితి ఏర్పడుతున్నది. ప్రయోజనాపేక్ష పెరిగి పరమార్థాభిలాష కనుమరుగై పోతున్నది. దీనితో మనిషికీ మనిషికీ మధ్య శ్రుతి చెమరుతున్నది. ఎడం పెరుగుతున్నది. మనిషిని మనిషి నమ్మలేని స్థితి ఏర్పడుతున్నది.మనిషి మనిషికి ఏమీకానిస్థితి వచ్చేస్తున్నది. మనిషి జీవితం దుర్భరమవుతున్నది.

ఒకప్పుడు ఈ గడ్డమీద మనిషి నిబ్బరంగా బ్రతికాడు. అలాంటివాడు ఇవాళ దుర్భరమయిన స్థితిలోనికి వచ్చేస్తున్నాడు. దుర్భరమయిన స్థితినుండి అతనిని నిబ్బరమయిన స్థితికీ మళ్ళీ నడిపించడం ఎలా? లక్షలు కోట్లుగా దిగజారిపోయి కనబడుతున్నారుకదా జాతిజనులు! ఇంతమందిని మళ్ళీపట్టాలపైకి ఎక్కించడంఎలా?

ఇది ఒకపట్టాన సాధ్యమయ్యే పనేనా?— అనిపించడం సహజం! అయితే మరేం చేయాలి! ఎంతమందినని మరలించగలం మనం? అని వదిలిపెట్టి ఊరుకోవాలా? అది భావ్యమా? మరిఎలాగ దీనికి పరిష్కారం? జనసామాన్యం త్వరత్వరగా మొత్తంగా ధర్మం ఎడల మేల్కొనేట్లు చేయడం ఎలాగ?

ఈ పరిస్థితికి పార్థసారథి ఇలా బదులు చెబుతున్నాడు. పరిస్థితులు మీరన్నట్లుగా ఉన్నమాట నిజమే. కాని కంగారుపడవలసిన పనిలేదు ఇంతటి పరిస్థితిని కూడా సులువుగా మనము సరిజేసుకొనవచ్చు. తలుపు తీయవలెనన్నచో ఊతక ఎత్తవలసిన పనిలేదు. గడియ తీసిన చాలు. అలాంటి నిపుణమయిన మార్గమొకటి సృష్టిలో పాదుకొల్పబడి ఉన్నది. దానిని గమనించండి చాలు. మీరిక జనసామాన్యాన్ని వందలు, వేలు, లక్షలుగా ధర్మమార్గమువెంట నడిపించగలరు.

సమాజంలో పెద్దలయిన వారుంటారు. వివిధరంగాలలో ప్రముఖులయిన వారుంటారు. వారు కొంచెం బాధ్యతగా ప్రవర్తిస్తేచాలు మిగిలిన సమాజమంతటిలో రావలసిన మార్పు అదే వచ్చేస్తుంది. ఇంటి యజమానికిపద్ధతి ఉన్నప్పుడు ఇంటిలోని వారికి కూడ పద్ధతి అదే వస్తుంది కదా!

పెద్దలయిన వారివైపు జనసామాన్యం చూస్తూ ఉంటుంది. వారి నడవడిని గమనిస్తూ ఉంటుంది. తానుకూడా అలా నడిచే ప్రయత్నంచేస్తూ ఉంటుంది. అలాంటప్పుడు ఆ పెద్దలయిన వారు తమ ప్రవర్తనలో కావలసిన జాగ్రత్తలు తీసికొన్నారనుకోండి. ఇది చాలా లీలగా జరుగుతుంది. చిత్రంగా అనిపిస్తుంది. కాని ఇది నిజం. చరిత్రను గమనించండి! మీకే తెలుస్తుంది మీకు కావలసినంత ధైర్యం వస్తుంది. తాళం తీయడానికి తాళం పగులగొట్టనక్కరలేదు. తాళపుచెవి ఉంటుంది. దానిని వినియోగిస్తేచాలు. అలాగే సమాజం సంస్కరింపబడటానికి సమాజం మొత్తానికి మనం చాకిరేవు పెట్టనక్కరలేదు. పెద్దలయినవాడు పద్ధతిలోనికి వస్తే చాలు.

పూర్వకాలంలో పల్లెటూళ్ళలో, పెళ్ళిళ్ళు జరిగేవి, పెళ్ళికి ఎడ్లబళ్ళమీద బయలుదేరేవాళ్ళు. ఒక్కొక్క పెళ్ళికి అరవై, డెబ్బయి బళ్ళు బయలుదేరేవి. రాత్రి పూట పెందలకడ భోజనాలు ముగించి మెల్లగా బళ్ళను బయలుదేరదీసేవాళ్ళు. ఈ బయలుదేరదీసిన వాళ్ళందరికీ పెళ్ళివారి ఊరికి దారి తెలుసును అనుకోకండి మీరు. వారందరికీ తెలియడం ఎలా సాధ్యం? ఎక్కడెక్కడినుండో వచ్చి చేరినవాళ్ళు

వాళ్ళు. చిత్రమేమిటంటే దారి తెలియకపోయినా ఇబ్బంది ఉండదు. ప్రయాణం సాగిపోతుంది. ఇంతకూ అక్కడ జరుగుతున్నదేమిటి? ముందు బండి వాడు మాత్రం దారి తెలిసినవాడై ఉంటాడు. ఇక అంతే! మిగిలిన అన్నిబండ్లూ, ఆ బండివెంట వెళ్ళిపోతూ ఉంటాయి, పెళ్ళివారింటికి నిశ్చింతగా జేరుకొంటారు. చూశారా ఈ సూక్ష్మాన్ని! దారి అడుగవలసిన పనీ, దారి తెలియవలసిన పనీలేదు. అయ్యో! మనకు దారి తెలియరాలేదే, ఇప్పుడెలాగ? అని బెంగపడవలసిన పని అసలు లేదు. ప్రయాణం సాగిపోతున్నది. గమ్యం చేరువవుతున్నది. ఇంక కావలసినదేమున్నది? మనం ఈ సన్నివేశాన్ని మననం చేయవలసిఉంది. సరిగా సమాజం ఇలాగే కాలకాలాలలో సంస్కరింపబడుతూ వస్తున్నదని మనం గమనించు కోవలసి ఉంది. ఇదే సుళువును మరల మరల మనం అనుష్ఠించవలసిఉంది. ప్రకృతి మనకందిస్తున్న సుళువు ఇది. సమస్యలను మానవుడు సృష్టిస్తూ ఉండగా భగవానుడు ఇలా సుళువులను చూపిస్తూ అభయవదనాన్ని పలుకుతున్నాడు. అభయ మార్గాన మనను నడుపుతున్నాడు. మళ్ళీ యథాస్థితిలో అవలీలగా మనను నిలుపు తున్నాడు. అతని కరుణ ఎంతటిది! ఆ ప్రేమ ఎంతటిది! మన ఊహకు అంద నంతటిది! మనవాక్కులలో ఇమడనంతటిది, అనుభవైకవేద్యమది! అనుభూతి రూపమది!

ఒక తండ్రి, మిత్రుల సహవాసానపడి మద్యపానాన్ని రుచిమరిగాడు. సాయంత్రమయ్యేటప్పటికి మిత్రులగోష్ఠిలో మద్యపానానికి ముచ్చటపడుతూ కూర్చుండిపోసాగాడు. మధ్యమధ్యలో త్రాగుతూ, మిత్రులతో కబుర్లాడుతూ ఇంత కంటే జీవితానికి హాయి ఏమున్నది అని పులకించి పోసాగాడు. ఇది ఇలా జరుగు తుండగా ఒకరోజున ఏడేళ్లకొడుకు 'నాన్నా! నేనూ నీతో వస్తున్నా'నని వెంటబడి వచ్చేశాడు. పిల్లవాడేకదా వచ్చిందని! అనుకొని తండ్రి యథాప్రకారం కార్యక్రమాన్ని ప్రారంభించాడు.

మధ్యమధ్యలో పిల్లవాడివైపు చూస్తున్నాడు తండ్రి. పిల్లవాడు స్పందిస్తు న్నాడు. తండ్రి ఆశ్చర్యపోయాడు, 'నేనుకూడా త్రాగుతాను'- అన్నట్లుచూశాడు పిల్లవాడు. తండ్రి ఉలిక్కిపడ్డాడు. ఉలికిపాటును సర్దుకొంటూ ఇలా అన్నాడు తండ్రి. 'నీవు చిన్నపిల్లాడివి. త్రాగితే తట్టుకోలేవు. పడిపోతావు. కనుక వద్దు'

అన్నాడు. ఆ మాటలకు పిల్లవాడు చిన్నగా నవ్వాడు. పిల్లవాని నవ్వుకు తండ్రి మళ్ళీ ఉలిక్కిపడ్డాడు.

వస్తున్న నవ్వును ఆపుకొంటూ, పిల్లవాడు ఇలా అన్నాడు : 'నాన్నా నేను త్రాగిపడిపోతే ఇబ్బందిలేదు. నేను చిన్నపిల్లవాడినికదా. నీవు నన్ను తీసికొని వెళ్ళగలవు. నీవు త్రాగిపడిపోతేనే కష్టం. నీవు పెద్దవాడివి కదా ! నిన్ను నేను తీసికొని వెళ్ళలేను. కనుక నేను త్రాగినా ఫరవాలేదు. నీవు త్రాగితేనే కష్టం!'- అంటూ పిల్లవాడు గ్లాసువైపు వంగబోతున్నాడు.

తండ్రి బెంబేలు పడిపోయాడు. అతడికి మత్తు దిగిపోయింది. కొడుకు వైపు ఒక్కసారి పరిశీలనగా చూశాడు. తనవైపు ఒకసారి పరిశీలనగా చూచుకొన్నాడు. లేచి కొడుకు చేతిని పట్టుకొన్నాడు. ఇద్దరం పడిపోకముందే ఇంటికి వెళదామా అన్నట్లు చూస్తూ, పిల్లవాడిని పట్టుకొని ముందుకు సాగాడు. మద్యపానం మధ్యలోనుండి లేవగలగడమా- అన్నట్లు చూస్తున్నారు మిత్రులు. మరి మద్యపానం మధ్యలో జరిగింది ఏమిటో వారికి తెలియదు కదా!

భగవదనుగ్రహవశాన ఈ సన్నివేశం జరిగిన కొద్దికాలంలోనే ఆ తండ్రి మనకు దగ్గరయ్యాడు. మనబృందంలో ఒకడు అయ్యాడు. వ్యసనాలకు స్వస్తి చెప్పాడు. బాధ్యతగల యజమానిగా రూపొందాడు. రోజూ ప్రేయరు చేస్తున్నాడు. ఇప్పుడు పిల్లవాడు తండ్రితో ప్రేయరులో శ్రుతి కలుపుతున్నాడు. చక్కగా నుదుట బొట్టు పెట్టుకొని స్కూలుకువెళ్ళి అన్నిటా మొదట నిలుస్తున్నాడు. చూశారా ! తండ్రిలో మార్పు వచ్చేసరికి బిడ్డలో ఎంత మార్పు వచ్చిందో! యజమాని సర్దుకునేసరికి మొత్తం కుటుంబమే సర్దుకొంది. చూశారా! సమాజంకూడా ఒక పెద్ద కుటుంబమే కదా ! సమాజంలోని పెద్దలు ఈ యజమానివంటివారేకదా ! ఆలోచించండి!

స్వాతంత్ర్య సమరకాలంలో గాంధీమహాత్ముడు తన ప్రవర్తనతో జాతిని ఎలా సంస్కరించాడో, ఎలా నిలబెట్టాడో, ఒక ఉద్యమంగా వారిని ఎలా నడిపించాడో ఒక్కసారి చూడండి ! ఆయన ఆచరణతోనే అలా చేయగలిగాడు. ఆయన ఖద్దరు కట్టాడు. జాతిజనులు ఖద్దరు కట్టారు. ఆయన రాట్నం పట్టాడు. జాతిజనులు రాట్నం పట్టారు. ఆయన సత్యాగ్రహమన్నాడు. జాతిజనులు ముందుకు

మూకారు. శాంతి అహింసలన్నాడు. ఆయన వించేస్తే ప్రజలు అది చేశారు. 'పెద్దలయినవారు దేనిని ఆచరిస్తే, మిగిలిన ప్రజలందరూ దానినే ఆచరిస్తారు. దానితో జాతిదారిన పడుతుంది'. అన్న కృష్ణదేవుని వాక్కు గాంధీగారి విషయంలో నిజమయింది. ఆ అభయం మనకు అనుభవానికి వచ్చింది. జాతి బ్రతికి బట్టకట్టింది. ఇదంతా ఎప్పుడో జరిగిందికాదు. ఈ మధ్య జరిగిందే. మనమధ్య జరిగిందే !

గాంధీ మహాత్ముడు భూమిమీద నుండి తప్పుకొన్నాడు. మళ్ళీ ప్రజలు జారిపడటం ప్రారంభించారు. ఇద్దరు కనుమరుగయింది. రాట్నాలు అటకల కెక్కాయి. సత్యాహింసలు తప్పుకొన్నాయి. జన జీవనం దిగజారింది. మళ్ళీ ఇదేమిటి పరిస్థితి? అన్నట్లుగా తయారయింది. నీతినిజాయితీ లేని జాతి జీవనం భయాన్ని కలిగిస్తున్నది. నేడు మనిషినిచూపి మనిషి భయపడుతున్నాడు. మరి ఇప్పుడు జరుగవలసినదేమిటి ? మళ్ళీ జరుగవలసినది అదే! పెద్దలయినవారు పూను కొని తమ ప్రవర్తనను తీర్చిదిద్దుకొని నిలబడాలి ! అప్పుడు కొద్దికాలంలోనే జాతి లేచి నిలబడగలుగుతుంది.

దీనికొక ఉదాహరణ చెబుతాను. లాల్‌బహదూర్‌శాస్త్రి కాలంలో, ఆ కొద్దిసమయంలో మళ్ళీ మనం ఒక జాగృతిని చూశాం. జాతిజనులను, వారానికి ఒక్కపూట ఆహారస్వీకరణ తగ్గించమని ఆయన కోరారు. జాతి స్పందించింది. ఆయన మాట ప్రకారం వారానికొకపూట కోరుకొని ఉపవాసం ఉంది. కారణం, ఆయన ఆచరణశీలి కను. ఆయన ఆచరణకు జాతి అంతగా స్పందించింది. పెద్దలయినవారు ఆచరించి చూపించాలేగాని మేము అనుసరించడానికి ఎప్పుడూ సిద్ధమే. అని జాతి మరొకసారి పలికినట్లయింది

ఈ దృశ్యాలు మనకేం చెబుతున్నాయి ? ప్రజలు దారినపడటం పెద్దల చేతిలో ఉన్నదని ! పెద్దల ప్రవర్తన తగినట్లుగా ఉన్నప్పుడు దానికి తగ్గనట్లుగా ప్రజలు ప్రవర్తించగలరని ! కనుక పెద్దలు దానిని అనుక్షణం గమనించుకొంటూ ఉండాలని ! అప్పుడు మాత్రమే వారు జాతిజనులను నిలిపి నడుపగలరని !

1987వ సంవత్సరంలో కృష్ణాజిల్లా బంటుమిల్లిలో ఒక విలక్షణమయిన సభ జరిగింది. ఒక గోష్ఠిలా సాగినసభ అది. ఆ ప్రాంతంలోని పత్రికా విలేఖరులు ఏర్పాటుచేసిన సభ అది. సమాజంలోని వివిధవర్గాలకు చెందిన పెద్దలెందరో

ఆ పఠాన్నలికి చేరుకొన్నారు. సమాజంలో రావలసిన మార్పును గురించి గోష్ఠి ప్రారంభమయింది.

వారు, మననుగూర్చి, మన ఉద్యమాన్నిగూర్చి విన్నారు. విని సంతోషించారు. సంతోషిస్తూనే ఒకప్రశ్న వేశారు. 'మీరు వ్యక్తిగతంగా చైతన్యవంతు లయ్యారు. యథాశక్తి ప్రజలను చైతన్యవంతులనుచేసే ప్రయత్నం చేస్తున్నారు. కాని ఈమాత్రం సరిపోతుందా! సమాజం మొత్తం చైతన్యవంతమవ్వాలికదా! అప్పుడుకదా సమస్యలకు పరిష్కారం లభించేది. సమాజం చైతన్యవంతంకాకుండా కొందరు వ్యక్తులు చైతన్యవంతం కావడంచేత ఏమంత పరిష్కారం లభిస్తుంది! అది అంతంత మాత్రమేకదా..!' ఇదీ వారిప్రశ్న!

అప్పుడు నేను వారికిలా తెలియజెప్పాను. మీ ఆశయం బాగున్నది. మీ సంశయమూ బాగున్నది. మీరు చెప్పింది నిజమే! సమాజం మొత్తం చైతన్య వంతమైనప్పుడే సమస్యలు పూర్తిగా పరిష్కరింపబడేవి. అయితే సమాజం మొత్తం చైతన్యవంతం అవడం అనేది ఎలా జరుగుతుంది? ఇంతవరకూ ఎలా జరుగు తున్నది అన్నది మనకు తెలియాలి! దానిని మనం గమనించుకోవాలి! ఎప్పుడూ కూడా సమాజం మొత్తం ఒక్కేసారి మేల్కొనటం అనేది జరుగదు. ముందుగా కొందరు వ్యక్తులు మేల్కొంటారు. వారు చైతన్యవంతులయి ప్రవర్తిస్తారు.

సమాజాన్ని పెద్దఎత్తున మేల్కొల్పడానికి కావలసిన పెద్దలుగా వారు రూపొందుతారు. ఆ పెద్దల అడుగుజాడలలో సమాజం నడుస్తుంది. క్రమంగా సమాజం మొత్తం చైతన్యవంతమవుతుంది. జాతికి కావలసిన మలుపు త్రిప్ప గలుగుతుంది.

చూడండి! 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అని తిలక్ మహాశయు డన్నాడు. అది జాతిజనుల చెవుల్లో పడింది. అది క్రమంగా నినాదమై మారు మ్రోగింది. ప్రతి భారతీయుడూ 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అని గద్దించ సాగాడు. గర్జించసాగాడు. ఆ నినాదం జాతికి ఊపిరులూదింది. జాతిని ముందుకు నడిపింది. గమనించారా! మొదట అది వెలువడేది వ్యక్తిగతంగానే! అది ఉద్భ వించింది వ్యక్తిగత చైతన్యంనుండే! క్రమంగా అది జాతి చైతన్యమై వెల్లివిరి సింది. ఏమంటారు! జాతిలో మార్పు ఎప్పుడూ కూడా ఇలాగేవస్తూ ఉంటుంది. గమనించండి!

నిద్రపోతున్న మనిషిని లేపాలి అనుకొన్నప్పుడు మనమేం చేస్తున్నాం ! అతణ్ణి తట్టి లేపుతున్నాం. తగుమాత్రంగా పిలుస్తున్నాం. అప్పుడతనేం చేస్తున్నాడు కళ్ళు తెరిచి చూస్తున్నాడు. నోరు తెరిచి లేస్తున్నాను. అని చెబుతున్నాడు. మనం సంతృప్తిపడి ఇవతలికి వచ్చేస్తున్నాం. కాసేపటికి తననుతాను కూడదీసికొని మొత్తంగా లేచి ఇవతలకు వస్తున్నాడు.

చూడండి ! మనం మొదట లేపినప్పుడు అతడు మొత్తంగా లేవలేదు. కళ్లు తెరచి చూచాడు. నోటితో పలికాడు. మనం అందుకు సంతృప్తిపడ్డాం. నిజంగానే అతడు కాసేపటిలో లేచివచ్చాడు. ఇక్కడ జరుగుతున్న దానిని గమనించండి! సరిగా సమాజంలోనూ అదే జరుగుతుందని గ్రహించండి! నిద్రపోతున్న సమాజాన్ని కాలం వత్తిడిచేస్తూ పిలుస్తుంది. అప్పుడు, ముందుగా ఆ సమాజానికి కన్నులవంటివారు, నోరువంటివారు ఎవరోవారు మేల్కొంటారు. వారినే మనం పెద్దలు, ప్రముఖులు, మార్గదర్శకులు, నాయకులు అంటున్నాం. వారి ప్రేరణతో సమాజం మొత్తం ప్రేరణచెంది మేల్కొంటున్నది. తనను తాను కూడదీసికొని, క్రమంగా కర్తవ్యపథం వెంట సాగిపోతున్నది. కాలకాలాలలో మానవజాతి కథ ఇలాగే జరుగుతూ ఉంటుంది. ఇలాగే జరుగుతూ ఉంటుందని ఇప్పటికి 5000 సంవత్సరాల నాడు శ్రీకృష్ణుడు భగవద్గీతలో మనకు గుర్తుచేశాడు. గుర్తుచేశాడు అనడంకన్నా తెలియచెప్పాడు అనడం బాగుంటుంది. తెలియచెప్పడమే కాదు, ఒక అభయవచనంగా ఈ సూత్రాన్ని అందించాడు. జనసామాన్యంలో చైతన్యాన్ని గురించి మీరు కలవరపడవద్దు. పెద్దలయినవారు దేనిని ఆచరిస్తే, మిగిలిన జనులందరూ దానినే ఆచరిస్తారు వారు దేనిని ప్రమాణంగా స్వీకరిస్తే మిగిలిన జనులందరూ దానినే ప్రమాణంగా స్వీకరించి వర్తిస్తారు. కాబట్టి పెద్దలు నిలబడితే చాలు. సమాజం నిలబడుతుంది. పెద్దలు మంచిమార్గాన నడిస్తేచాలు, సమాజం మంచిమార్గాన నడుస్తుంది. జరుగవలసినది ఇది. జరిగేది ఇది! ఇది అతడి అభయవచనం. అన్ని సిద్ధాంతాలుకూడా అతడి అభయవచనంలో ఒదిగిపోతాయి. ఆ అభయవచనాన్ని మరల మరల స్మరించండి ! దానిని అనుష్ఠించే ప్రయత్నం చేయండి. ప్రజలు మనవెంట వస్తారు. సమాజం చక్కబడుతుంది.

జనకాది రాజర్షులు తాము ప్రత్యేకంగా చేయవలసింది లేకపోయినా, ఆదర్శప్రాయులయిన పెద్దలుగా నిలబడి, సమాజాన్ని ముందుకు నడిపించారు. తాము

ఆచరించారు. సమాజాన్ని ఆచరింపజేశారు. పెద్దలయినవారు చేయవలసింది ఇది!— అని తెలియజెప్పారు. మనం వారిని మార్గదర్శకులుగా స్వీకరించిననాడు, అంత నిర్మమంగా మనం లోకహితాన్ని సాధించదలచిననాడు, మనని మనం తీర్చిదిద్దుకోగలం ! సమాజానికికూడా తగిన ప్రేరణ నందించగలం !

ఈ అంశాన్ని తెలియజెబుతూనే ఇ. కె. మాస్టరుగారు, 'జనసామాన్యాన్ని ఎన్నడూ నిందించకండి ! వారిలో ఎక్కువమంది ఎప్పుడూ మంచిగా ఉందామనే అనుకొంటారు. వారికి మార్గదర్శకులు కావాలి ! చేయి పట్టుకొని నడిపేవారు కావాలి ! అప్పుడు జనసామాన్యం, మీవెంట ఉంటుంది. మహాకార్యాలనుసాధించి పెడుతుంది. అలా ఆయన నడిపించి చూపించారు. ఇప్పుడుకూడ చూపిస్తున్నారు.

ఇలా సమాజస్థాయిని పెంచగోరినప్పుడల్లా దేవదేవుడు మహనీయుల రూపంలో వ్యక్తమై ప్రముఖులను, పెద్దలను ముందుకు సాగవలసినదిగా వెన్ను తడుతూ ఉంటాడు.



# 2. అక్కడికక్కడే కలుగజేసికొంటాను

యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥
(4అ॥-7శ్లో॥)

"ఎప్పుడెప్పుడు ధర్మం ఇరుకున పెట్టబడి ఇబ్బందులపాలు చేయబడుతుందో, అప్పుడప్పుడల్లా నాకు నేనుగానే కలుగజేసికొంటాను. కావలసిన రూపాన్ని స్వీకరించి, అధర్మాన్ని తొలగించి, ధర్మాన్ని నిలబెడుతూ ఉంటాను."

సమాజంలో విభిన్న దృక్పథాలు కలవారుంటారు. విభిన్న ప్రవృత్తులు గలవారుంటారు. విభిన్నమయిన అభిరుచులు గలవారుంటారు. వీరందరూ ఎవరికి తోచినట్లు వారు ప్రవర్తిస్తూ ఉంటారు. ఎవరికి తోచినట్లు వారు ప్రవర్తించవచ్చును. అనుకొంటూ ఉంటారు. ఎవరి ప్రాణానికి వారి ప్రవర్తన వారికి సహజంగానే కని పిస్తుంది. సరిఅయినదిగానే అనిపిస్తూ ఉంటుంది. దానితో సామాజిక జీవనంలో తరచు ఘర్షణాత్మకమయిన సన్నివేశాలు ఉద్భవిస్తూ ఉంటాయి. ఒకరి ప్రవర్తన. మరొకరి ప్రవర్తనతో ఒరుసుకొని, ఘర్షణకు తరచు అవకాశం ఏర్పడుతూ ఉం టుంది, అలా ఏర్పడినప్పుడల్లా నేను కలుగజేసుకొని, సరిచేస్తూనే ఉంటాను, మళ్ళీ యథాస్థితికి మిమ్మల్ని పట్టుకొని వస్తూనే ఉంటాను. అని అభయమిస్తున్నాడు. అభయవచనాన్ని పలుకుతున్నాడు శ్రీకృష్ణుడు.

ఈ అభయవచనం చాలా విశేషమైనది. పరిస్థితులనుగూర్చి బెంబేలు పడ వలసిన పనిలేదనీ, ఎవరయినా శ్రుతిమించి, మనను ఇబ్బంది పెడుతున్నవేళ, తాను ఏమాత్రం ఊరుకోననీ, తగినరీతిలో కలుగజేసికొని అప్పటికప్పుడే, అక్కడికక్కడే పరిస్థితిని సరిజేస్తాననీ, ధర్మాన్ని నిలబెట్టే విషయంలో విలంబనం జరుగదనీ. కనుక సత్ప్రవర్తనగలవారు నిశ్చింతగా ఉండవచ్చుననీ, ధర్మమార్గాన ప్రశాంతంగా నడిచి పోవచ్చుననీ, ఎట్టి పరిస్థితులలోనూ రాజీపడవలసిన అవసరంలేదనీ, ఉన్నస్థితినుండి దిగజారవలసిన అవసరం కలుగదనీ అంతర్యామి అయిన తనపైన విశ్వాసముంచి, విలువలకు కట్టుబడినవేళ వెలకట్టలేని రక్షణ అనుక్షణం లభిస్తూనే ఉంటుందనీ శ్రీకృష్ణుడు అభయవచనాన్ని పలుకుతున్నాడు.

పరిస్థితులు చూస్తే ఇలా ఉన్నాయి. ఇలాంటి పరిస్థితులలో మనబోటి వాళ్ళు జీవించగలరా ? మన ప్రకారం మనను జీవించనిస్తారా ?. అని నిస్పృహ చెందవలసిన పనిలేదు. ఎవరూ ఎవరినీ ఏమీ చేయకుండా నిరంతరం రక్షించు కొనేటందుకు నేను అనుక్షణం అప్రమత్తంగా మిమ్ములను కాచుకొంటున్నాను. చూచుకొంటున్నాను. కనుక మీరు కలవరపడవలసిన పనిలేదు. ధర్మనిష్ఠులై మీరు ప్రవర్తిస్తున్నంతకాలం నా అభయహస్తం మిమ్ములను వెన్నంటే ఉంటుంది. ఆ స్పర్శ మీకు అనుభవానికి వస్తూనే ఉంటుంది. సన్నివేశాల రూపంలో నా సాన్ని ధ్యం, నా సాన్నిహిత్యం మీకు లభిస్తూనే ఉంటుంది. మీరు ఒంటరివారుకారు. నేను మీతో ఉన్నాను.' అంటున్నాడు కృష్ణదేవుడు.

బస్సులో మనం ప్రయాణం చేస్తున్నాం. బస్సు చాలా వత్తిడిగా ఉంది. ఎవరో మనజేబులోని పర్సును లాగుతున్నారు. వెంటనే ఆ ప్రక్కనతను ఇటు పర్సునూ, అటులాగే అతనినికూడ ఒక్కసారిగా పట్టుకొన్నాడు. దొంగ దొరికి పోతాడు. పర్సు చేతికి వస్తుంది. ఈ సన్నివేశంలో, ప్రక్కనున్నవానికి, పట్టుకొమ్మని చెప్పినదెవరు? దైవమే! పట్టుకొంటున్నవానికిగూడ ఆ క్షణంవరకు తెలియదు. ఆ తరువాత తెలుస్తుంది, దైవశక్తి తనను ముందుకు నడిపించిందనీ, తన ద్వారా వ్యక్తమయిందనీ! అప్పటికప్పుడే, అక్కడికక్కడే దైవం వ్యక్తమవడమంటే ఇలా ఉంటుంది.

రైల్లో మనం ప్రయాణంచేస్తూ ఉంటాం. కొందరు పద్ధతిలేనివాళ్ళు సీట్లను అక్రమంగా ఆక్రమించుకొని వెకిలిగా ప్రవర్తిస్తూ, కూర్చోడానికికూడా అవకాశమివ్వరు. అప్పుడేం జరుగుతుంది? ఆ ప్రక్కనున్న ఇద్దరో, ముగ్గురో కలుగజేసికొంటారు. పద్ధతిలేని వారిని కేకలేస్తారు. మనని వారి ప్రక్కన కూర్చోపెడతారు. ఈ సన్నివేశాన్ని గమనించినప్పుడు, ప్రక్కనున్నవారికి కేకలేసే శక్తి ఎక్కడనుండి వచ్చింది? దీన్ని గమనిస్తే దైవం అప్పటికప్పుడే, అక్కడికక్కడే కలుగజేసికోవడమంటే ఏమిటో మనకు అర్థమవుతుంది.

రోడ్డుమీద మనం వెళుతూ ఉంటాం. ఎవడో పద్ధతిలేనివాడు వాహనంతో గుద్దుతాడు. మనకు దెబ్బలు తగులుతాయి. మనం నిశ్చేష్టులమై చూస్తూ ఉంటాం. ఇంతలో చుట్టుప్రక్కలవాళ్ళు కలుగజేసికొని వాహనం నడుపుతున్నవాణ్ణి మందలిస్తారు. మనను సేద తీరుస్తారు. మనకు కావలసిన రక్షణనందిస్తారు. మనకు మామూలు స్థితివచ్చేలా ప్రయత్నిస్తారు. ఇంతకూ ఎవరు వారు? ఎందుకంతబాధ్యత పడి ప్రవర్తిస్తున్నారు. దైవమే వారినుండి వ్యక్తమవుతున్నదని మనం గమనించాలి। 'అప్పటికప్పుడే అక్కడికక్కడే నేను కలుగజేసికొంటాను' అని దైవమిచ్చిన మాట ఎంత విశేషమయినదో మనం గ్రహించుకోవాలి।

ఇలా చిన్నాపెద్దా సన్నివేశాలలో తరచుగా దేవదేవుని సాన్నిధ్యం మనకు లభిస్తూనే ఉంటుంది. దేవదేవుని సాంగత్యం మనను వర్తిస్తూనే ఉంటుంది. నీవు ఒంటరివాడివికావు. నీవు నావెంట ఉండు। నా వెంటనుండు వారికెన్నడూ భద్రమే।

అని ఆ దివ్యశక్తి మనను సేదతీరుస్తూ ఉంటుంది. అక్కున జేర్చుకొంటూ ఉంటుంది. గుండెలకు హత్తుకొంటూ ఉంటుంది.

ఇప్పుడు మనమొకసారి మహాభారతగాథను సమీపిద్దాం. ద్రౌపదీ వస్త్రాపహరణ సన్నివేశమది. దుర్యోధనాదులు రెచ్చిపోతున్నారు. దుశ్శాసనాదులు విజృంభిస్తున్నారు. ద్రౌపది విలవిలలాడుతున్నది. ధర్మజాదులు నిస్సహాయులై చూస్తున్నారు. భీష్మాదులు నిశ్చేష్టులయి ఊరుకొన్నారు. స భ నం తా ఒక్కసారి కలియజూచింది ద్రౌపది. ఇంతమందిలో తనను పట్టించుకొనేవారు ఒక్కరూ కానరాలేదు. అందుకు ఆమె నిస్పృహ చెందలేదు. కనులు మూసుకొన్నది. కృష్ణుని తలుచుకొన్నది. కాసేపటికి కనులు తెరిచింది. చీరలగుట్టల కావలపడియున్న దుశ్శాసనుణ్ణి చూచింది. తన ఒంటిపై వస్త్రమలాగే ఉన్నది. అది చెక్కుచెదరలేదు. అప్పటికప్పుడు, అక్కడికక్కడ ఎంతటి రక్షణ నామె పొందినది !

అప్పుడు ఆమెనలా రక్షించిన కృష్ణుడు అంతటితో ఊరుకోలేదు. రాయబారానికి వచ్చినప్పుడు ఈ సన్నివేశాన్ని గుర్తుచేస్తూ మెత్తమెత్తగా మందలించాడు. 'మీరు దక్షతగలవారు. సమర్థులయినవారు. క్షణమాత్రంలో అధర్మాన్ని దమించగలిగినవారు. అయినప్పటికీ ఆడకూతురు అల్లాడిపోతుంటే ఊరుకోవడానికి మీమనస్సెలా ఒప్పింది! ఆ సన్నివేశంలో అలా ఉపేక్ష చేయవచ్చునా ! అలా ఉపేక్ష చేయడం ఎంత తప్పిదమో మీరు ఎరుగరా? మీరు ఉపేక్ష చేసినంతమాత్రాన, ధర్మమార్గాన్ని మీరు అవలంభించని వారవుతున్నారుగాని సన్నివేశం సాగిపోకుండా ఉంటుందా! మీరు ఊరుకొన్నారని దైవం ఊరుకోదుకదా! దైవం ఎలా కలుగజేసికొంటాడన్నది మీకు అనుభవమైందికదా!' అని అతడు బోధపరుస్తూఉంటే, భీష్మాదులు తమలోతాము సిగ్గిలిపోయారు. సిగ్గిలిపోతూనే దేవదేవునకు మనస్సున నమస్కరించుకొన్నారు. "మేము చేయవలసినది నీవుచేసి కథను ముందుకు నడిపావు. అందుకు ఎనలేని కృతజ్ఞతలు నీకు." అనుకొంటూ వారు అతనికి మనస్సుతోనే మోకరిల్లారు.

ఇ. కె. మాస్టరుగారికి సర్వసమర్పణ చెందిన సోదరబృందంలో ఒక యువతి ఉండేది. ఆమెకు ఇంకా వివాహం కాలేదు. తల్లి సంరక్షణలోనే ఉండేది. ఒకానొక సందర్భంలో ఆయువతి వాళ్ళ మేనమామగారి ఇంటికి వెళ్ళింది. మన మేనమామగారిల్లేకదా అనుకొని వెళ్ళింది.

ఈ అమ్మాయి ఇంట్లో అడుగుపెట్టేసరికి మేనమామ భార్య కనబడలేదు. మేనమామ ఒక్కడే ఉన్నాడు. అప్పటికే చీకటి పడుతోంది. ఇంట్లో ఇంకెవరూ ఉన్నట్లులేరు. మేనమామ సాదరంగా ఆహ్వానించాడు. ఈ అమ్మాయి, 'మన మేనమామే కదా' అని క్రొత్తలేకుండా మంచీచెడూ చెబుతూ వంటచేసి, అతనికింత పెట్టి, తానింత తిన్నది.

ప్రయాణంలో అలసి ఉన్నదేమో ఆమెకు నిద్ర వచ్చేస్తోంది. మేనమామతో చెప్పి పడుకుండిపోయింది. అతడూ ఆమెకు కావలసినవి చూసివెళ్ళి అవతల గదిలో పడుకొన్నాడు. ఇంతవరకూ కథ బాగానే సాగింది.

అర్ధరాత్రి అవుతున్నది. కాని మేనమామకు నిద్రపట్టడంలేదు. అతడిలో దుర్బుద్ధి బయలుదేరింది. క్రమంగా అతడు పశువుకన్న హీనుడయ్యాడు. ఒక్క ఉదుటున ఇవతలిగదిలోనికి వచ్చిపడి, ఇవతలిగదిలోని ఆ అమ్మాయిని బలాత్కరించసాగాడు.

ఆమె కలవరపాటుతో మేల్కొన్నది. బెంబేలు పడుతూ చూసింది. పరిస్థితి విషమించినట్లు ఆమెకు తెలిసింది. తననుతాను రక్షించుకోవడానికి పెనుగులాడసాగింది. 'మామయ్యా! తప్పు, తప్పు' అంటున్నది. వినగలిగిన స్థితిలో ఉన్నాడా అతను ? తప్పుకో, తప్పుకో- అంటున్నది. ఆ మాట వినిపించుకొంటాడా అతను ! అతడాస్థితిలో లేడనీ, ఆ స్థితిలోకి రాడనీ ఆమె గ్రహించింది.

మాస్టరుగారూ !- అంటూ ఒక్కసారి తననుతాను కూడదీసికొని అతనిని విదిలించికొట్టింది. అదేమి విశేషమో ఆ విదిలింపుకు అతనువెళ్ళి అవతలపడ్డాడు. అలాపడ్డ క్షణాలలోనే విలవిలలాడుతూ గిలగిలా తన్నుకొంటున్నాడు. ఆశ్చర్యం ! అక్కడొక తేలు ఉన్నది. పడ్డక్షణాలలో అది అతడిని కాటువేసింది. అందుకనే అతడలా విలవిలలాడుతూ, గిలగిలా తన్నుకొంటున్నాడు. ఇక లేవగలిగినస్థితిలో లేడతను. అతడు కాటువేయబడ్డాడు. కట్టివేయబడ్డాడు. దిక్కుతోచని స్థితిలో విభ్రాంతపోతున్నాడతను. ఎవరూ లేరనుకొని విజృంభించాడుకదా! ఈ తేలు ఎక్కడ నుండి వచ్చింది ?

ఇలా సన్నివేశాన్ని దారిలోనికి తెచ్చి చరచర నడిచిపోతున్న ఆ తేలు రూపానికి 'మాస్టరుగారూ!' అంటూ మరొక్కసారి నమస్కరించింది ఆ అమ్మాయి. ఒక్క ఉదుటున అక్కడనుండి బయటపడింది.

అక్కడికక్కడే అప్పటికప్పుడే నేను కలుగజేసుకొంటాను. నేనుగా కలుగజేసికొంటాను- అన్న అభయవచనం ఋజువవుతూనే ఉంటుంది. చిత్తశుద్ధి కలిగి ఏపేరుతో పిలిచినా, ఆ దైవం పలుకుతూనే ఉన్నాడు. పరిరక్షిస్తూనేఉన్నాడు. గమనించారుకదా ! ఇది ఇటీవలి సన్నివేశాలలో ఒకటి! సరిగా ద్రౌపది కథలాంటి కథ ఇది. మనం మరల మరల స్మరించుకోదగినది. అభయవచన వైభవాన్ని విందుగా తెలియజెప్పే సన్నివేశమిది !

అంతర్యామి ఒకసారి సృష్టికి ఉన్ముఖమయిన తరువాత సృష్టి పరిణామ మన్నది ఏర్పడుతున్నది. ఖనిజాలు, ఖనిజాలనుండి వృక్షాలు, వృక్షాల నుండి జంతువులు, జంతువుల నుండి మానవులు- ఇలా కొనసాగుతుంది. పరిణామం ప్రకారం మానవుడుకూడా జంతువే !

అయితే మిగిలిన జంతువులకు, మానవులకు ఒకతేడా ఉంది. మిగిలిన జంతువులు ప్రకృతికి ఒదిగి ఉంటాయి. ప్రకృతి నియమాలకు కట్టుబడి ప్రవర్తిస్తాయి. ఆహారస్వీకరణం, నిద్ర, దాంపత్యం, ప్రాణరక్షణకు ప్రయత్నం ఇవన్నీకూడా ఆ జంతువులలో ప్రకృతినియమాలకు ఒదిగి జరిగిపోతూ ఉంటాయి. వాటికి స్వతంత్రించడం ఉండదు.

కాని, మానవుడు స్వతంత్రించగలడు. అతనికి ఆ స్వేచ్ఛ ప్రకృతిలో ఈయబడింది. దానిని సద్వినియోగం చేసికొనవలసిన బాధ్యత కూడ అతనికే అప్పజెప్పబడింది. సద్వినియోగం చేసుకొన్నప్పుడు అతడు మానవత్వం నుండి దైవత్వానికి ప్రయాణం చేయగలుగుతున్నాడు. దుర్వినియోగం జరుగుతున్నప్పుడు అతడు మానవస్థితి కాదుకదా, పశుస్థితికన్నా క్రిందకు దిగిపోతున్నాడు ! పశువు, ప్రకృతి నియమాలను మీరదుకదా ! మానవుడు మీరగలడు। ఈ కారణాన అతడు పశువుకన్న హీనుడై అతడు పడిపోవడం సమాజంలో చూస్తూ ఉన్నాము.

ఇలా ఈయబడిన స్వేచ్ఛను మానవుడు రకరకాలుగా వినియోగించుకోవడంతో వ్యక్తుల ప్రవర్తనలమధ్య హెచ్చుతగ్గులు ఏర్పడుతున్నాయి. తారతమ్యాలు తలయెత్తుతున్నాయి. రాగద్వేషాలు చోటుచేసికొంటున్నాయి. పగప్రతీకారాలు చెలరేగుతున్నాయి. వంచన, మోసాలు విజృంభిస్తున్నాయి. దీనితో సామాజికమయిన ఘర్షణలు చెలరేగుతున్నాయి. వీటిని ఎప్పటికప్పుడు అదుపుజేస్తూ, కథను ముందుకు

నడిపే బాధ్యతను తామగా స్వీకరిస్తున్నాడు. మనుషులు ధర్మాన్ని తప్పినప్పుడల్లా ఏదో ఒకరూపంలో అతడు కలుగజేసికొని, అక్కడికక్కడే, అప్పటికప్పుడే సరి జేస్తున్నాడు. లేకపోతే సృష్టికథ దుర్భరమయిపోతుందికదా! అతడు దుర్భరం కానీయడు. నిబ్బరంగానే నడిపిస్తూ ఉంటాడు. అతడి అభయమంతటిది! పరిణామం ముందుకు సాగుతూ ఉంటుంది. జీవులు సాధనలో ముందుకు సాగుతూ ఉంటారు. వెనుకనుండి వచ్చి చేరేవారు చేరుతూనే ఉంటారు. విద్యాలయాలలో పరీక్షలు పాసై పై తరగతులలోనికి వెళ్ళేవారు వెళుతూ ఉండగా, క్రింది తరగతులలో చేరే వారు చేరుతూనే ఉన్నారుకదా! పరిణామంలో కూడా జరిగేది అంతే విద్యాలయాలలో మొదటి తరగతి ఎప్పుడూ ఉన్నట్లుగా, జంతుస్థితినుండి మానవస్థితిలోనికి మేలుకొనే జీవులు సృష్టి పరిణామంలో ఉంటూనే ఉంటాయి.

అప్పుడప్పుడే మానవస్థితిలోనికి మేలుకొంటున్న జీవులకు అంతంత మాత్రంగానే కన్నులు విప్పుకొంటాయికదా! దానితో వారి ప్రవర్తనలో ఎగుడు దిగుడులు ఏర్పడుతూ ఉండటం సహజమేకదా! వారి ప్రవర్తనలోని ఎగుడు దిగుడులే ధర్మానికి ఇబ్బందిని కలిగిస్తూ ఉంటాయి. సామాజికజీవనంలో కలవర పెట్టే సన్నివేశాలను సృజిస్తూ ఉంటాయి. అలా ప్రవర్తిస్తున్నవారికి ధర్మాన్ని గూర్చి తెలియదు. కాని స్వేచ్ఛమాత్రం లభించింది. ఆ లభించిన స్వేచ్ఛతో వారు తోచినట్లు ప్రవర్తిస్తూ ఉంటారు. పరిణామంలో వారి స్థాయినిబట్టి వారి ప్రవర్తన రూపుకట్టుకొంటూ ఉంటుంది. దీనితో అనేకస్థాయిలనుండి ప్రవర్తించేవారు సమాజంలో కలిసి మసవలసివస్తుంది. ఇలా మసవలసిరావటం కొంచెం ఇబ్బందిగానే ఉంటుంది. ఒకరున్నట్లు ఒకరుండరుకదా! ఒకరు ప్రవర్తించినట్లు ఒకరు ప్రవర్తించరుకదా! ఎవరిదృష్టి ప్రకారం, ఆలోచన ప్రకారం వారు పోతూ ఉంటారుగదా! దానితో మనుషులమధ్య కలవరం చెలరేగుతుంది. ఆ కలవరం అతిక్రమించుతున్నప్పుడల్లా దైవం తానుగా కలుగజేసికొంటూ ఉంటాడు. ఇంతమంది మధ్యలోనూ ధర్మానికి దెబ్బతగలకుండా కాచుకొంటూ ఉంటాడు. ఇటు ధర్మానికి దెబ్బ తగలకుండానూ, అటు జీవుల పరిణామం, కొనసాగేట్లుగానూ అతడు ఎప్పటికప్పుడు చూచుకొంటూ ఉంటాడు.

అతని కనుసన్నలలో ఇంతకథ జరుగుతూ ఉంటుంది, అతని అభయ ముద్రలో ఇంత కథా ఒదిగిపోతుంది.

***

# 3. అవసరాన్ని బట్టి అవతరిస్తాను

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥
(4అ॥-8శ్లో)

సాధుజనులను రక్షించేటందుకు దుష్టజనులను శిక్షించేటందుకు యుగ యుగాలలో నేను అవతరిస్తూ ఉంటాను. ధర్మసంస్థాపనం నిర్వహిస్తానే ఉంటాను.

సృష్టి పరిణామక్రమం సాగుతూఉన్నప్పుడు కలుగుతూ ఉండే అలజడిని గూర్చి చెప్పుకొన్నాం ఆ అలజడినిగూర్చి దైవం ఎక్కడికక్కడ ఎలా సర్దుబాటు చేస్తూవస్తూ ఉంటాడోకూడా తెలుసుకొన్నాం, అతని అభయముద్ర మనను వెన్నంటి ఉంటుంది— అన్న అనుభూతిని అందుకొన్నాం.

అలాగే పరిణామక్రమం సాగుతూ ఉండగా ఒకొక్కప్పుడు దుష్టత్వం పెచ్చుమీరి అసురప్రవృత్తి కలవారిద్వారా విజృంభిస్తూఉంటుంది. వ్యక్తులకువ్యక్తులే దుష్టులయి సామాజికజీవనాన్ని సంక్షుభితం చేసేస్తూ ఉంటారు. ధర్మమార్గాలను కాలరాచెయ్యాలని శతవిధాల ప్రయత్నిస్తూఉంటారు. సాధుజనులను దుఃఖపెట్ట డం ద్వారా దైవాన్నే బెదిరించాలని ప్రయత్నాలు కొనసాగిస్తూ ఉంటారు. ఒకానొక

అల్లకల్లోలస్థితిని సమాజమంతా సృష్టిస్తూ, విర్రవీగుతూ ఉంటారు. వీరుసమాజాన్ని దుఃఖపెట్టడానికి కారణం ఉండదు. సాధుజనులను దుఃఖపెట్టడంలో తాము ఆనందించే ప్రయత్నాన్నిచేస్తూ ఉంటారు. తోటివారిని దుఃఖపెడుతూ, వారు దుఃఖపడుతూ ఉంటే చూసి ఆనందించే మన స్తత్వం వీరికి ఉంటుంది. సాధుజనులను దుఃఖపెట్టడం, మంచిపనులను చెడగొట్టడం వీరి సరదాలుగా ఉంటాయి. లోకమంతా వీరివల్ల హాహాకారాలతో ఆక్రోశిస్తూ ఉండగా, వీరుమాత్రం పండుగ చేసుకొంటూ ఉంటారు. ఇలాంటి పరిస్థితులు పరిణామక్రమంలో ఏర్పడినప్పుడు దైవం తాను కూడా ప్రత్యేక ఆకృతిని ధరించి, పూనుకొని, దుష్టసంహారంచేసి ధర్మసంస్థాపనం నిర్వహిస్తాడు. దానితో సాధుజనులు రక్షింపబడతారు. సృష్టి మళ్ళీ సజావుగా సాగుతుంది. ఇలాంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు నేను నామరూపాలతో దిగివచ్చి మీలో ఒకడినై, ధర్మసంస్థాపనచేసి మిమ్మల్ని రక్షించుకొంటాను. మీరు భయపడవలసిన పనిలేదు. మీకొరకు నేను వ్యక్తిగా దిగిరావడానికయినా సిద్ధమే ! అంటూ దేవదేవుడు అభయవచనాన్ని పలుకుతున్నాడు.

నామరూపాలుగల మూర్తులుగా దిగి వచ్చేటప్పుడు నాలుగురకాల పద్ధతులను అతడు అవలంబిస్తూ ఉంటాడు. వివిధ జంతు రూపాలుగా దిగిరావడమన్నది మొదటి పద్ధతి. మత్స్య, కూర్మ, వరాహావతారాలు ఇందుకు ఉదాహరణ. రెండవది మానవమూర్తులుగా దిగివస్తాడు. దుష్టశిక్షణచేసి అంతటితో వెళ్ళిపోతాడు. వామన, పరశురామాది అవతారాలు ఇలాంటివి. ఇకపోతే నరసింహావతారం ఒకటి ఉన్నది. ఇది విలక్షణమైనది. కేవలం హిరణ్యకశిపుడు అడిగిన వరాలను కాదనకుండానే అతడిని సంహరించడంకోసం తీసికొన్న ప్రత్యేక అవతారమిది ! ఇలా సందర్భాన్నిబట్టి తీసికొన్నవి ప్రత్యేక అవతారాలవుతాయి. ఇవి మూడవ తరగతికి చెందినవి. ఇక రామ, కృష్ణాది అవతారాలు నాల్గవతరగతికి చెందినవి. ఈ అవతారాలలో దుష్ట శిక్షణ, శిష్టరక్షణతో పాటుగా నరజాతికి ధర్మమార్గం కూడ ఉపదేశింపబడింది. ఆ ఉపదేశాన్ని అందుకొన్న నరజాతి వారు చూపిన ధర్మమార్గం వెంట అడుగులువేస్తూ, ముక్తస్థితిని పొందుతుంది. దివ్యత్వంలోనికి అడుగిడుతుంది. దేవదేవునితో తాదాత్మ్యం చెందుతూ పరవశిస్తుంది. ఆ దివ్యస్థితిలో నుండి దేవదేవుని దివ్యవైభవం తననుండి వ్యక్తమవుతూ ఉండగానరజాతి నిండుగా

వర్ధిల్లుతుంది అప్పుడు భూమి స్వర్గాన్ని మించి ప్రకాశిస్తుంది. అప్పుడు భూమి దేవునిరాజ్యమై ఆనందానుభూతిని వెల్లివిరియజేస్తుంది.

రామకృష్ణాది అవతారాలలో జరిగినది ఏమిటి? సాధుజనులనూ, ధర్మ మార్గాలనూ వెంటాడి, వేటాడి దుఃఖపెడుతున్న దుష్టులను సంహరించడంజరిగింది. అయితే ఈ అవతారాలలో దుష్టులు తలయెత్తగానే సంహరించబడటం జరగలేదు. వారికి కావలసినంత సమయం ఈయడం జరిగింది. వారిలో మార్పును ఆకాంక్షించ డం జరిగింది. ఆ మార్పుకొరకు వేచిఉండటమూ, ప్రయత్నించి చూడటమూ జరి గింది. ఇదంతా దేవదేవుని అపారమయిన ప్రేమకూ, అనితరసాధ్యమయిన కరుణకూ నిదర్శనం. 'ఇక తప్పదు. ఈ శరీరాలలో వీరిని ఇలా ఉండనీయడంవల్ల వీరు సృష్టిని సంక్షుభితం చేస్తూనే ఉంటారు. దారికిరారు. భూభారం పెరిగిపోతూ ఉం టుంది. భూమాత ఆక్రోశిస్తుంది. ఇక వీరిని శరీరాలనుండి తొలగించడమే పరమా వధి' అని నిర్ణయమయిన తరువాత ఆ నిర్ణయాన్ని అమలుపరచడంకోసం దేవ దేవుడు తామగా సంహరించడంగాని, తగినవారితో సంహరింపజేయడంగాని చేస్తూ ఉంటాడు.

ఇక్కడ ఇంకొక చిత్రమున్నది. శరీరాలనుండి తొలగింపబడిన ఆ దుష్టులను అతడు వదిలిపెట్టలేదు, వెడలగొట్టలేదు. ఉపేక్ష చేయలేదు, నిరాదరణ చూపలేదు. తనలోనే కలుపుకొన్నాడు. తనలోనే నిలుపుకొన్నాడు. అలా కలుపు కొని, నిలుపుకొన్నప్పటికీ వాళ్ళు మళ్ళీ దుష్టులుగానే జన్మించిన ఘట్టాలుకూడా మన కున్నాయి. మళ్ళీ అప్పుడూ అంతే! భూభార నిర్వాపణార్థం ఆయన వారిని శరీరాల నుండి తొలగిస్తాడు. తనలోనే కలుపుకొంటాడు. తనలోనే నిలుపుకొంటాడు. ఇలా వారి శిక్షణ పూర్తయ్యేవరకు ఈ కథ సాగుతూనే ఉంటుంది. శిక్షణ పూర్తి కావాలి! వారుకూడ తరించాలి! వారుకూడ ఆయనలో తాదాత్మ్యం చెందాలి! అంతవరకు ఆ ప్రణాళిక నడుస్తూనే ఉంటుంది.

భూమికి వారు బరువు. కనుక వారిని శరీరాలనుండి తొలగించాడు. తనకు వారు బరువుకాదుకదా! కనుక వారిని తనలో నిలుపుకొన్నాడు. సాధు జనులు వారిని తట్టుకొనలేరు. కాబట్టి వారిని వారినుండి తొలగించాడు. కాని తాను తట్టుకోగలడుకదా! అందుకని తాను స్వీకరించాడు. అందరూ కాదన్న వారినికూడ అతడు కాదనడు. అందరూ లేదన్న వారినికూడ అతడు లేదనడు. అవసరమయితే

శిక్షణనిస్తాడు తప్ప ఎవరినీ వదిలిపెట్టడు. వారు అందరూ తనవారే! తననుండి వ్యక్త మవుతున్నవారే- అన్నది ఆయన అనుభూతి !

ఈ అవతారాల విషయమై మరొక విశేషం ఉంది. అప్పటికి భూమిని కల్లోలపరుస్తున్న దుష్టులను వీరు శిక్షిస్తారు. అవసరాన్నిబట్టి దేహాలనుండి కూడ తొలగిస్తారు. అంతవరకు బాగున్నది. అలా జరగడంతో భూమాత శరీరం తేలిక పడుతుంది. ధర్మసంస్థాపన జరిగినందుకు, అధర్మాన్ని భూమి పైనుండి తొల గించినందుకు ఆమె ఆనందిస్తుంది. అలా దేవదేవుని నుండి సాధించిన విజయం అన్నివిధాలా ఆనందాన్ని చేకూర్చిపెడుతుంది. అలా అయినప్పుడు ఆ ఆనందం ఆ కాలానికి మాత్రమే పరిమితం కావాలి కదా ! అప్పటి వారుకదా బాధలనుండి విముక్తి పొందింది! ఎప్పుడో జరిగిన కథలు గాథలు కదా ఇవి. మరి ఇప్పటికిగూడ మనకు అనుభూతిని అందిస్తున్నాయి. ఇంకా ఎప్పటికీగూడ అందించగలిగిన స్థితిలో ఉన్నాయి. ఏమిటీ విశేషం ? ఇంత నిత్యనూతనత్వం ఆ అవతారగాథలకు ఎలా అబ్బుతూ ఉన్నది ? అవి ఎప్పటికీ మానవజాతికి ఎలాఊపిరులూదగలుగుతున్నాయి. వెన్నుతట్టి నిలబెట్టగలుగుతున్నాయి ? విషాదాన్ని తొలగించగలుగుతున్నాయి. కర్తవ్యోన్ముఖులను చేసి, నరులను తరింపజేయగలుగుతున్నాయి. ఇదంతా ఎలా జరుగుతున్నది ?

అవతారమూర్తి అప్పటి దుష్టులను సంహరిస్తాడు- అన్నమాట నిజం. ఆ ఫలితాన్ని అప్పటివారు అనుభవిస్తారన్నది నిజం. అది వారికి అతడిచ్చే కానుక. అలా అప్పటివారికి ఒక కానుకను అందించడంతోపాటుగా ఎప్పటివారికీ పనికి వచ్చే లాగున ఒక ప్రత్యేకమయిన బహుమతినికూడ అందిస్తాడు. అదేమిటీ అంటే ఆ దుష్టశిక్షణ నిర్వహించేవేళ అతడనుసరించిన పద్ధతి. అంతవరకూ అతడు తననుండి వ్యక్తంచేస్తూ వచ్చిన ఒకానొక దివ్యమయిన జీవనవిధానం.

పుట్టి పెరిగినప్పటినుండి అవతారపరిసమాప్తివరకు అతడు ఆచరించే ధర్మము, సర్వధర్మముల సమాహారమవుతుంది. సర్వధర్మములకు అతడి జీవితంలో సమన్వయం లభిస్తుంది. నరుడు ఎలా నడుచుకొంటే నారాయణుడవుతాడు- అన్న విధానాన్ని ఆయన జీవితం తేటతెల్లం చేస్తుంది. అలా తరించడానికి కావలసిన అడుగుజాడలను ఆ అవతారమూర్తి జీవితం పొందికగా వ్యక్తం చేస్తుంది. ఆ

అడుగుజాడలు ఎన్నటికీ చెదరవు. మాసిపోవు. మైలపడవు. నిత్యనూతన మయిన స్థితిలోఉండి నిరంతరం నరజాతిని నడిపిస్తూనే ఉంటాయి. అందుకే నర జాతి యుగాలు గడిచినా ఆ గాథలను చెవులార వింటూనే ఉంటుంది. గొంతెత్తి పాడుతూనే ఉంటుంది. మైమరచి పరవశిస్తూనే ఉంటుంది. వాటిని ఊతంగాగొని, మునుముందుకుసాగిపోతూనే ఉంటుంది. ఆ గాథలు జాతికి ప్రాణం !

ఇలా, ఆ నాటికి కావలసింది చేసిపెడుతూనే ఏ నాటికీ కావలసిన ధర్మ మార్గాన్ని అందించడమనేది మహత్తరమయిన విశేషం. దానితో ఈ అవతార గాథలు విశ్వగానంగా గానం చేయబడ్డాయి. ఆ గానమే ప్రాణంగా నరజాతి సాగి పోయేటట్లుగా ఈ సృష్టికథ రూపొందింపబడింది.

రామాయణగాథ, ఇది సీతారాముల కథ ! మానవులను ఆదర్శదంపతు లుగా, నిండయిన గృహస్థులుగా, సమాజంయెడల బాధ్యత ఎరిగిన విశిష్టపౌరులుగా తీర్చిదిద్దే రచన ఇది. ముఖ్యంగా మానవుడు గృహస్థుగా ఉంటూ ఎలా ప్రవర్తిం చాలి అన్నది, ఎలా ప్రవర్తిస్తే అది ధర్మమార్గమవుతుంది అన్నది రామాయణ గాథ మనకు నిండుగా వివరించి చెబుతుంది. గృహస్థు అయినవానికి ఎన్నివిధాల యిన బాధ్యతలు ఉంటాయి. వాటిని నిర్వహించడానికి సృష్టిధర్మానికి అనుగుణంగా ఎలాంటి జాగరూకతలు పాటిస్తూ ఉండాలో మనకు తెలియరావాలన్నా, ఆ తెలియ వచ్చినది మనకు ఒంటబట్టాలన్నా రామాయణగాథను మనం నిరంతరం మననం చేసి కొంటూ ఉండాలి ! మరల మరల పారాయణగావిస్తూ ఉండాలి! తలచినకొద్దీ అది తలపులలో నిలుస్తుంది. గానం చేసినకొద్దీ అది మన జీవితగానంగా పర్యవసిస్తుంది. దానితో మన జీవితగాథ రామగాథగా రూపొంది విశ్వకళ్యాణాన్ని సాధిస్తుంది.

శ్రీరామచంద్రుడు తండ్రి ఇచ్చినమాట కోసం అడవులవెంట నడిచాడు. అటుపైన రాజ్యపాలన కోసం సీతాదేవిని అడవులవెంట నడపవలసివచ్చింది. ఈ రెండూ కూడా విలక్షణమయిన సన్నివేశాలు. తండ్రిమాట కొరకు రాజ్యాన్ని విడిచి నప్పుడు, రాజ్యాన్ని విడిచి నడిచినప్పుడు అతనికి రాజ్యంయెడల వ్యామోహంలేదని స్పష్టమైంది. రాజ్యపాలనకోసం సీతాదేవిని అడవులవెంట నడిపినప్పుడు ప్రజలలో ధర్మసంస్థాపన కోసమై తనకు ప్రాణాతిప్రాణమయిన జీవిత భాగస్వామినికూడా త్యాగం చేయగలడని ఋజువయింది. కర్తవ్యనిర్వహణ కోసం అతడు సర్వస్వాన్నీ వదులుకొన్నట్లయింది.

ఇక సీతాదేవి, రామాయణంలో రామునికి ఎంతపాత్ర ఉన్నదో, సీతకూ అంత పాత్ర ఉంది. ఒకరకంగా రామాయణం దంపతులు చేసిన ధర్మసంస్థాపన గాథ. ధర్మసంస్థాపన అన్నది వారిరువురిమీదుగా సమపాళంగా సాగింది. రాముడు అరణ్యవాసానికి వెళుతున్నప్పుడు, తన ప్రసక్తి లేకపోయినా, సీతాదేవి అడవుల వెంట సాగడం విశేషం. అటుపైన రావణవధలో సీత ప్రధానపాత్ర వహించింది. సీతాదేవి కారణంగానే రావణుడు దోషిగా నిలబడి, రామునిచేత సంహరింపబడటం జరిగింది. ఇలా రామాయణంలోని ప్రధానకార్యం సీతాదేవి మీదుగా సాగింది. చివరకు ప్రజలశ్రేయస్సు కోసం, రాముని ఆజ్ఞననుసరించి, సీతాదేవి అడవులపాలైంది అందులోకూడా భర్తకు సహకరిస్తున్నందుకు ఆమె ఆత్మ తృప్తిననుభవించింది. అడవులలో నుండికూడ వంశాంకురాలను కని శ్రీరామచంద్రునికి వారసులుగా అందించింది. అలా అడవులపాలయిన వేళకూడా వాల్మీకి మహర్షి ఆశ్రయాన్నిపొంది, రామాయణగాథ నిండుగా దిగిరావడానికి కారణభూతమయింది. ఆ గాథను లవకుశులు గానం చేయడం ఒక విశేషం. అలా అడవులలో నుండి కూడ ఆమె అవతారగాథకు మెరుగులు దిద్దడం ఒక విశేషం.

సృష్టి ధర్మానికి అనుగుణంగా, గృహస్థు, కుటుంబసభ్యులతో ఎలా ప్రవర్తించాలి ? చతురాశ్రమాలకు ఆయువుపట్టయిన ఆ గృహస్థాశ్రమంలో నుండి సమాజంయెడల ఎలాంటి బాధ్యతవహించాలి?— అన్న అంశాలను రామాయణగాథ, నరజాతిని అక్కునజేర్చుకొని నేర్పుకొంటూ వస్తున్నది.

ఇక శ్రీకృష్ణుని దగ్గరకువస్తే అతడు ఒక గృహస్థునిగా నిలబడతాడు. ఒక సామాజికవేత్తగా గోచరిస్తాడు. సాక్షాత్తుసృష్టికర్తగా దర్శనమిస్తాడు. సృష్టి ధర్మానికి తన జీవితాన్ని పరమప్రమాణంగా చూపిన పూర్ణపురుషుడు. పరిపూర్ణ అవతారుడితడు. జననమాదిగా ఇతని జీవిత సన్నివేశాలన్నీ సృష్టికథకు సంకేతాలుగా నిలిచాయి. తన జీవిత విధానంతో సృష్టికథకు భాష్యం చెప్పిన మహనీయుడితడు. సృష్టిధర్మాన్ని భగవద్గీతరూపంలో అనుగ్రహించిన యోగేశ్వరుడితడు. భగవద్గీత వేదోపనిషత్తుల సారాంశం. మహాభారత ఇతిహాసానికి ఆయువుపట్టు. తరువాత వచ్చిన సకల ఆధ్యాత్మిక సంప్రదాయాలకూ పరమప్రాణం. అది వెలువడిన నాటినుండి దానిమీదుగానే సకల ఆధ్యాత్మికబోధలు సాగిపోతున్నాయి. సకల సంప్రదాయాలు దానిని గుండెగా చేసికొని వర్ధిల్లుతున్నాయి. ఎవరెన్ని రకాలుగా చెప్పి

కొన్నా దానినే చెప్పుకొంటున్నారు. దానితో కనువిప్పు పొందుతున్నారు. భగవద్గీత అంటే అది। శ్రీకృష్ణుని జీవిత సందేశమది !

శ్రీకృష్ణుడు రాజులకు రాజుగా వర్తించినవాడు. మకుటంలేని మహా రాజుగా ప్రవర్తించినవాడు. చక్రవర్తులకు చక్రవర్తిగా ప్రకాశించినవాడు. రాజ వంశములను నడిపించినవాడు. ప్రచండవీరులయిన పాండవులను ధర్మసంస్థాపనార్థమై సద్వినియోగపరచినవాడు. రాజసూయ మహాధ్వరంలో అగ్రపూజను ధర్మజుని చేతులమీదుగా అందుకొన్నవాడు, భీష్మాదుల సమక్షంలో దేవదేవుడై సకల ధర్మస్వరూపుడై వెలుగొందినవాడు. వారికా వెలుగు పంచిపెట్టినవాడు. ఎట్టి అధికారము స్వీకరించకుండానే సృష్టికి సర్వాధికారిగా తిరుగాడినవాడు. తన పాద ముద్రలతో భూమాతను పరవశింపజేసినవాడు. ధర్మదేవత కడగండ్లను తనచేతలతో, చేతులతో తుడిచినవాడు.

ఇంతటివాడు అని చెప్పలేని ఇతడు, ఎక్కడ ఎంతగా ఉండాలో, అక్కడ అంతగా ఉండగలవాడు. ఎక్కడ ఎదిగిపోవాలో, ఎక్కడ ఒదిగిపోవాలో తెలిసి అక్కడ అలా వర్తించినవాడు. ధర్మాధర్మాలమధ్య దూతగా పనిచేయడానికి కూడా వెనుదీయనివాడు. ధర్మసంస్థాపనార్థమై నిర్వహింపబడిన ప్రపంచ మహాసంగ్రామంలో రథసారథిగా ఉండి గుఱ్ఱాలను తోలడానికీ, తోమడానికీ కూడ సిద్ధపడినవాడు. అతడికి చిన్నపనీ, పెద్దపనీ అన్నది లేదు. చేయవలసిన పని ఉన్నది. జరుగవలసిన పని ఉన్నది. అతడు మానావమానములకు అతీతుడు. సాధ్యాసాధ్యములకు అతీతుడు. సర్వము తానైనవాడు. సర్వము తనయందున్న వాడు. ఏ క్షణమునకు ఏది కర్తవ్యమో, దానిని అవలీలగా నిర్వహించగలిగిన వాడు.

అతడు పనిచేయని క్షణములేదు. అలడు అలసిన క్షణముకూడ లేదు. నిరంతర క్రియాశీలి కాని చేసినట్లు కనబడడు. బాధ్యతాయుతమూర్తి. కాని బరువును మోస్తున్నట్లు అనిపించడు. లీలాప్రాయమయిన నిర్వహణమతడిది. చిరునవ్వు చెరుగని జీవనవిధాన మతడిది. మానవజీవితాన్ని ఒక లీలావిశేషంగా నిర్వహించడమెలాగో నిరూపించడానికి, నిర్దేశించడానికీ, నడిపించడానికీ దిగివచ్చిన దేవదేవుడతడు. తెలియకపోతే మానవజీవితమొక గోల. తెలిసినపుడు మానవజీవిత మొక లీల. ఇది తెలియజెప్పడానికి వచ్చిన, తెలిసి నడుపడానికి వచ్చిన సారథి

ము. అతడి అడుగుజాడలు పరమమోక్షప్రదాలు, అతడి అడుగుజాడలు కలి
రణమార్గాలు. అతడి అడుగుజాడలు ఈ సృష్టికి శాశ్వత తరణోపాయాలు !
డి అడుగుజాడలు సకల ఆనందప్రదాలు !

కురుక్షేత్ర మహాసంగ్రామంలో భూభారనిర్వాపణం కావలసినంతగా జరి
ది. అటుపైన ఒక్కొక్క రాజవంశమూ భూమినుండి తొలగిపోవడం జరుగుతూ
ంది. ఈ సందర్భంలో మనకొక అనుమానం కలుగుతుంది. కృష్ణావతారంలో
ఎత్తున ధర్మసంస్థాపన జరిగినమాట నిజమే ! అది ఎన్నడూ ఎక్కడా జరుగ
గా జరిగింది. ముందు దుష్టులు వెళ్ళిపోయారు. తరువాత శిష్టులు కూడా
సగా వెళ్ళిపోయారు. మరి భూమికి మిగిలిందేమిటి ? మరి భూమి ఊపిరిపీల్చు
ాలికదా ! మరి శ్రీకృష్ణుడు ఈ విషయంలో చూపిన కౌశలమేమిటి ? జరిగిన
పరిశీలిస్తే అతడు కూడ కురుక్షేత్రానంతరం త్వరలో తప్పుకొన్నాడుకదా !
చివరకు భూమాతకు మిగిలిందేమిటి ? శ్రీకృష్ణుడు మిగిల్చిందేమిటి ?

శ్రీకృష్ణుడు భూమికి మిగిల్చినది చాలా ఉన్నది. నిజం గమనించగలి
వారికి ఇప్పటికీ ఆయన మిగిల్చినదే కొనసాగుతున్నది ఈ భూమిమీద. ఆయన
మాతను ఒంటరిగా వదలలేదు. భూమాత ఇప్పటికీ వర్ధిల్లుతున్నది ఆయన పరి
ణలోనే ! పరిత్రాణాయ సాధూనాం— అన్న ఆయన అభయవచనం వజ్రకవ
ం భూమాతను రక్షిస్తూనే వస్తున్నది. ఆయన అభయవచనం శాశ్వతమైనది.
తనమైనది. దాని ప్రభావం అమోఘం ! దాని వైభవం అనంతం !

అటు పాండవుల పరాక్రమానికి కూడలిగా, ఇటు తన ధర్మతేజానికి
వధిగా పరీక్షిత్తును తీర్చిదిద్దాడు శ్రీకృష్ణుడు. కలిసంతరణమార్గంగా అతని
నవిధానాన్ని రూపొందించి, భూమి జనులకు అతనినుండి రక్షణ, శిక్షణ అందే
ుగా సంకల్పించాడు. ధర్మసంస్థాపనార్థమై అంతవరకూ జరిగిన ప్రయత్నా
ంటినీ ఆకళించుకొన్న పరీక్షిత్తు, ఆ కళను అందుకొని, కథను ముందుకు నడి
డు. కలిప్రభావాన్ని దమించాడు. ధర్మదేవతను నాలుగుపాదాలతో నడిపించాడు.
మాతను అన్నివిధాల పరవశింపజేశాడు. పాండవాదులు ఎక్కడికీ పోలేదు.
దరూ ఈ పరీక్షిత్తునుండి తమ వెలుగును గుమ్మరిస్తూనే ఉన్నారు'— అని భూమి
లు ఎనలేని సంతోషాన్ని పొందారు.

కాలచక్రం గిర్రున తిరిగింది. పరీక్షిత్తుకు పిలుపువచ్చే సమయం ఆసన్నమయింది. అప్పుడు శ్రీకృష్ణుడు పరీక్షిత్తుమీదుగా కలిసంతరణమార్గమైన భాగవత పురాణాన్ని భూమిజనులకు అందేలాగునచూశాడు. దానితో నరజాతికి శాశ్వతతరుణోపాయమొకటి అందినట్లైంది. అలా భాగవతాన్ని ముక్తికాంతగా అందించి దేహాన్ని విడిచిపుచ్చాడు పరీక్షిత్తు. భారత, భాగవతాలు శిక్షణ రక్షణలను అందిస్తూ నరజాతిని రెండుచేతులూ పట్టుకొని నడుపసాగాయి. భారతమందించేది శిక్షణ. భాగవతమందించేది రక్షణ. ఇలా శ్రీకృష్ణుని శిక్షణ, రక్షణ కార్యక్రమాలు, రెండు దివ్యగ్రంథాలుగా రూపొందాయి. యావత్సృష్టికి మార్గదర్శకాలై వెలుగొందసాగాయి. భగవద్గీత అటు భారతంలో యోగసాధనగానూ, ఇటు భాగవతంలో యోగజీవనంగానూ వ్యాసమహర్షిచేత అందించబడింది. ఆ అందించడంలో అతడు చూపిన నేర్పు అనితరసాధ్యమైనది. శ్రీకృష్ణుని ప్రణాళిక మొత్తము వ్యాసమహర్షిచేత అనుభూతిప్రదంగా గ్రంథస్థం చేయబడింది. శ్రీకృష్ణుడు చేసినదీ, చేస్తున్నదీ, చేయనున్నదీ సమస్తమూ వ్యాసమహర్షి తన దివ్యదృష్టితో దర్శించి అపురూపమయిన తన రచనావిన్యాసంతో నరజాతికి అందించడం జరిగింది.

ముఖ్యంగా, శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణుని భవిష్యత్ ప్రణాళిక కూడ వ్యాసమహర్షి సూచించాడు. శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచిపెడతాడు. అనగా మైత్రేయమహర్షివచ్చి శ్రీకృష్ణుని కలుస్తాడు. ఆ కలయిక చాలా విశేషమైనది. కలియుగం మొత్తం దానిపైననే ఆధారపడిఉంది. మైత్రేయమహర్షి హృదయాన్ని తన సింహాసనంగా చేసికొని కలియుగాంతం వరకు ఈ భూమిపైన తన కార్యక్రమాన్ని నిర్వహించాలని శ్రీకృష్ణుడు నిర్ణయించాడు. దానితో మైత్రేయ మహర్షి శరీరం శ్రీకృష్ణుని ఆలయంగా రూపొందింది. ఆ క్షణంనుండి ఆ హృదయసింహాసనంపైన ఆసీనుడై దేవదేవుడు తన ప్రభుత్వాన్ని నెరపడ వలన మైత్రేయమహర్షి అప్పటినుండి మైత్రేయప్రభువుగా పిలువబడసాగాడు. లార్డ్ మైత్రేయగా నేడు ప్రపంచ జనులందరిచేత పిలువబడుతున్నది ఈ మహనీయుడే! కలియుగమందలి సమస్త ఆధ్యాత్మిక సంప్రదాయాలకు, విభిన్న మత విశేషాలకు ఇతడే ఆటపట్టు. ఇతడి ఆధ్వర్యంనుండి వ్యక్తమవుతున్నవే అవన్నీకూడా! ఇలా శ్రీకృష్ణుడు కలియుగంకొరకు ఒక కట్టుదిట్టమయిన ఏర్పాటును చేసిపెట్టాడు. ఆయన అభయావచనాన్ని కలియుగానికి ఒక రక్షాకవచంగా రూపొందించాడు.

హిమాలయ పర్వతాలలో శంబళ, కలాప గ్రామాలు ఉన్నాయి. ఈ గ్రామాలు సిద్ధపురుషులకు, పరమగురువులకు ఆటపట్టు. ఈ భూమిమీద జన్మిస్తూ అపారమయిన సాధనతో సిద్ధపురుషులుగా రూపొందినవారందరూ ఈ గ్రామాలకు చేరుకొంటారు. మైత్రేయప్రభువు ఏలుబడిలో ఈ సృష్టియజ్ఞంలో తమ వంతు పాత్రను తాము నిర్వహిస్తూ ఉంటారు. ఆ ప్రభువు ఆజ్ఞానుసారం కాలకాలాలలో, దేశదేశాలలో మహర్షులుగా, మహనీయులుగా, ప్రవక్తలుగా, ప్రవర్తకులుగా దిగివస్తూ ఉంటారు. దిగివచ్చి సృష్టికథకు అప్పటికి కావలసిన ప్రేరణను అందిస్తూ ఉంటారు. మానవజాతి పరిణామానికి కావలసిన వేగాన్ని పెంచుతూ ఉంటారు. జాతి సముద్ధరణకు కావలసిన సమన్వయాన్ని దర్శించి అందిస్తూ ఉంటారు.

కథ తెలియని వారికి ఈ పెద్దలు వేరువేరుగా గోచరిస్తూ ఉంటారు. కథ తెలిసిన వారికి వీరందరూ ఒకచోటివారేనని ఒకే ప్రభువు ఏలుబడిలో పని చేస్తున్నారనీ, వివిధమైన ఈ ఆధ్యాత్మికరీతులన్నీ అతడినుండే వ్యక్తమవుతున్నాయని ఇవన్నీ చివరకు అతడిలోనే సంగమిస్తాయనీ ఉన్న సత్యం దర్శనమిస్తుంది.

దేవదేవుడయిన శ్రీకృష్ణుడు మైత్రేయమహర్షినే తన ఉపాధిగా స్వీకరించడంలో ఒక విశేషమయిన ఔచిత్యముంది. ఇది కలియుగం. కలి అంటే విభేదం. మనుషులమధ్య భేదభావాలు తేలికగా, పొడమాపే యుగం కలియుగం. మనిషినుండి మనిషి తొందరగా విభేదిస్తాడు. తొందరగా విడిపోతాడు. విడిపోవడమెలాగ అని చూస్తుంటాడు. ఎదుటివాడికన్న తాను ఎలా వేరో గుర్తించుకోవడానికి శ్రమపడుతూ ఉంటాడు. దానితో కులమత భేదాలు, వర్గపోరాటాలు, సాంఘిక తారతమ్యాలు, జాతిభేదాలు, దేశ భేదాలు, స్థాయీ భేదాలు, అంతస్థుల భేదాలు ఇలా అనేకంగా భేదభావాలు రూపుదిద్దుకొంటాయి. జాతి మనస్సు కలుషితమవుతుంది. ఎవడికివాడు ఎదుటివాడిని పరాయివాడిగా చూచేస్థితికి వచ్చేస్తుంది. చివరకు కార్యార్థులుకూడ ఎవరి జాగ్రత్త వాళ్ళు పడేస్థితి దాపురిస్తుంది. ఈ కలుషితమయిన వాతావరణ స్థితినుండి మానవజాతి మొత్తంగా లేవనెత్తబడవలసి ఉంది. అలా లేవనెత్తబడటానికి మైత్రీభావమొక్కటే పరిష్కారం. మైత్రీభావం పెంపొందినపుడు మానవులమధ్య భేదాలు గోచరించవు. సకల తారతమ్యాలను కరిగించ

గలిగినది మైత్రి ఒక్కటే ! కనుక ఈ యుగంలో తరించగోరినవాడు మైత్రిని అభ్యసించవలసి ఉంటుంది. ఎవరూ ఎవరిపైనా పెత్తనం చేసేయుగం కాదిది. ఒకరు మరియొకరితో మైత్రి చేయవలసిన యుగమిది. తల్లిదండ్రులు బిడ్డలతోగాని, పరిపాలకుడు ప్రజలతోగాని ఈ యుగమున చేయవలసినది మైత్రి మాత్రమే ! చివరకు దాంపత్యముకూడ మైత్రీ భావమున్నప్పుడు మాత్రమే ఈ యుగాన వర్ధిల్ల గలదు. దివ్యమయిన ఈ మైత్రిమాత్రమే మానవులను కలిప్రభావానికి అతీతంగా ఉంచగలదు. విశేషమయిన ఈ కారణంచేతనే శ్రీకృష్ణుడు మైత్రేయమహర్షిని తన ఉపాధిగా స్వీకరించడం జరిగింది. ఈ మైత్రీభావాన్ని పెంపొందించే ప్రణాళిక వెనుక కృష్ణావతారమందలి బృందావన అనుభూతి జోడించబడి ఉన్నది. అనుభూతి నుండికదా మైత్రి జనించేది. బృందావనం అనుభూతిక్షేత్రం. ఆ బృందావనక్షేత్రం నుండి మంత్రజాల మార్గమొకటి శ్రీకృష్ణునిచేత రూపొందింపబడింది. ఆ మంత్ర జాలంతో అతడు వ్యక్తులను మిత్రులుగా రూపొందిస్తూ ఉంటాడు. అంతేకాదు వ్యక్తులను బృందాలుగా రూపొందిస్తూ ఉంటాడు. ఎక్కడికక్కడ బృందావనాలను రూపొందిస్తూ ఉంటాడు. కనుకనే కలియుగాన వ్యక్తులు బృందంగా రూపొంది నప్పుడే ఏదయినా సాధింపబడుతుంది. వ్యక్తి ఎంత గొప్పవాడయినా ఈ యుగాన ఒంటరిగా సాధించగలిగినది తక్కువ. అతడు బృందముగా రూపొందినప్పుడే దేని నైనా సాధించగలడు. వ్యక్తులను బృందముగా తీర్చిదిద్దగలిగినది మైత్రి మాత్రమే !

కలియుగం చివరకు వచ్చేసరికి పాలకులు దుష్టులవుతారు. వారిని శిక్షించ వలసిన అవసరం ఏర్పడుతుంది. దానితో కల్కి అవతారం దిగివస్తుంది. ఈ కల్కి అవతారం శంబళ, కలాప గ్రామాలనుండి వ్యక్తమవుతుంది. దేవదేవుడు కల్కి అవతారంగా దిగివచ్చి, దుష్టపాలకుల బారినుండి భూమిని రక్షించి, కృత యుగానికి మళ్ళీ శ్రీకారం చుడతాడు. కాలచక్రం మలుపు తిరుగుతుంది.

కల్కిగా తాను దిగివచ్చేలోపు ఈ భూమి ప్రజలనుండి, ఈ యుగపు ప్రజలనుండి రాబోయే కృతయుగానికి కావలసిన విశిష్టజీవులను ఆయన తీర్చిదిద్దు తాడు. ఇప్పటి పంటనుండేకదా రాబోయే పంటకు విత్తనాలు లభించేది. అలాగే కలియుగంలో తీర్చిదిద్దబడిన జీవులతోనే మరల కృతయుగం ప్రారంభమవుతుంది. కనుక తరింపగోరిన మానవులకు కలియుగం ఒక చక్కని అవకాశం. దైవానికి

అనుగుణంగా, ధర్మానికి అనుగుణంగా జీవించగోరినవారికి, ఈ కలియుగంలో దైవంనుండి మహిమాన్వితమయిన చేయూత అందించబడుతుంది. సాధన త్వర త్వరగా సాగుతుంది. జీవపరిణామం ఎనలేని వేగాన్ని అందుకొంటుంది. తీర్చి దిద్దబడటానికి కావలసిన సన్నివేశాలు చకచక నడిచివస్తాయి. ఈ యుగంలో ధర్మ మార్గాన చేసిన ఏ చిన్న ప్రయత్నమయినా విశేషమయిన ప్రభావాన్ని కలిగి ఉంటుంది. ధర్మమార్గాన లోక శ్రేయస్సు సాధిద్దామని ఏమాత్రం అనిపించినా చాలు, అటువైపుగా ఏమాత్రం మన అడుగులు పడినా చాలు. దేవదేవుని అభయహస్తం మన వెన్నును స్పృశిస్తుంది. మనను వెన్నంటి నడిపిస్తుంది. మనను సకల విధాలుగా రక్షిస్తుంది. కృతయుగంవైపుగా మన ప్రయాణం సాగేటట్లు చేస్తుంది. ఇలాంటి దివ్యమయిన అవకాశంగా కలియుగాన్ని రూపొందించేటందుకే దేవదేవుడయిన శ్రీకృష్ణుడు శంబళ కలాప గ్రామాలలో మైత్రేయమహర్షి హృదయ సింహాసనంపై ఆసీనుడై వేలాది సిద్ధపురుషులతో కొలువుతీర్చి ఉన్నాడు మనయెడల అభయ ముద్రను పట్టి ఉన్నాడు.

నవీనయుగానికి తగినట్లుగా తాము రూపొందించిన యోగసంప్రదాయంలో పరమగురువు మాస్టర్ సి. వి. వి. మైత్రేయ ప్రభువును మాస్టర్ ఎం. టి. ఏ గా సంబోధించి ఉన్నారు.

* * *

# 4. పడిపోకుండా పట్టుకొంటాను!

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః ॥

(4అ॥-34శ్లో)

"దేవదేవుడు సృష్టిగా దిగి వస్తున్నాడు. ఈ సృష్టిగా వర్తిల్లుతున్నది అతడే ! పరిపూర్ణమయిన శరణాగతి చెంది, పరిప్రశ్నము చేసికొంటూ, పరిచర్యాత్మకమయిన సేవను ఈ సృష్టిరూపంలో ఉన్న అతనికి మనం నిర్వహించినవేళ అతడి నిజస్వరూపాన్ని ఇక్కడే, ఈ భూమిపైననే, ఇప్పటికిప్పుడే మనం అనుభవించవచ్చు. అలా అతడిని అనుభవించాలన్న ప్రయత్నం మనలో సాగుతున్నవేళ, ఆ అనుభూతి మనకు అందుతున్నవేళ ఏ కారణం చేతనయినా మనం ఏమరుపాటుకు గురైనప్పుడు అతడు మనను విడిచిపెట్టడు. తత్త్వదర్శనం కలిగిన జ్ఞానుల రూపంలో మనకు దగ్గరై మనను మేలుకొలిపి మరలమరల మనకు తనతో అనుసంధానాన్ని అనుగ్రహిస్తూ ఉంటాడు. అంతవరకు పొందిన అనుభూతిని కొనసాగేటట్లుగా చేస్తూ కరుణ చూపుతాడు."

నాతో ఒక్కసారి శ్రుతి కలిపినవానిని, అటుపైన అతడు ఆ స్మృతి నుండి జారుతున్నప్పటికీ నేను వదిలిపెట్టను. ఉపేక్ష చేయను. తగిన నామరూపాలతో దగ్గరయి, మరల అక్కున జేర్చుకొంటాను- అని అతడు అభయవచనాన్ని పలుకుతున్నాడు.

సృష్టిగతమయిన దేవదేవుడు నామరూపాలకు మాటున ఉన్నాడు. నామరూపాలకు చాటున ఉన్నాడు. విభిన్నమయిన నామరూపాలను ధరిస్తూ, ఎనలేని వైవిధ్యాన్ని చూపుతున్నాడు. ఒకలాచూస్తే ఈ నామరూపాలు అతడిని మనం చూడటానికి అడ్డంకి ! ఒకలాచూస్తే ఈ నామరూపాలు అతడు మనకు చూపుతున్న విశిష్టమైన అనుభవాలు ! ఒక్కసారిగా ఇన్నినామరూపాలలో ఇంతసృష్టిగా వ్యక్తమవటం మరి విశిష్టతకాదా !

ఏదిఏమయినా ఈ నామరూపాలమీరుగా అతడిని మనం చూడగలగాలి ! ఈ నామరూపాలకు అతీతంగా వ్యక్తమవుతున్న అతడిని మనం అనుభవించగలగాలి ! అందుకుగాను మనం ప్రణిపాతం చెందాలి! పరిపూర్ణమయిన శరణాగతిని చెందాలి! ఈ నామరూపాలు అతడివి అని మనకు తెలుసు కనుక ఈ నామరూపాలు ధరిస్తున్న అతడిని మనం శరణాగతి చెందాలి! ఈ శరణాగతి మొదట విధేయతగా

ప్రారంభమయి, పరిపూర్ణమయిన సమర్పణగా పర్యవసిస్తుంది. విధేయతకు పరా కాష్ఠస్థితియే శరణాగతి ! అట్టి శరణాగతికి అతడు మెచ్చుకుని మనకు ప్రసన్నుడవుతాడు.

అలా అతడు ప్రసన్నుడవుతున్న వేళలో మనం పరిప్రశ్నం చేయాలి ! ఎంతవరకు వెళితే ప్రశ్నించడానికి ఇక అవకాశముండదో అంతవరకూ ప్రశ్నిస్తూ సాగడం పరిప్రశ్నమవుతుంది. సర్వసాధారణంగా మనం ఉపరిప్రశ్నలువేస్తూ ఉంటాం. ఉపరిప్రశ్నలు అంటే పైపైన ప్రశ్నలు. మీరెవరు ? ఏం చేస్తుం టారు ? ఎక్కడ ఉంటారు ? ఏ పనిమీద వచ్చారు ? మీది ఏ కులం ? ఏమతం ? మీ ఆస్తిపాస్తులెంత ? ఎంతమంది పిల్లలు ? ఏం చేస్తున్నారు ? పెళ్ళిళ్ళు అయి నాయా ? పిల్లలా ! పేర్లేం పెట్టారు ? చదువుకొంటున్నారా ? ఎక్కడెక్కడు న్నారు ? ఇలాంటివన్నీ ఉపరిప్రశ్నలే ! ఎదుటివారిని గూర్చి పైపైన తెలుసుకో వడానికి మాత్రమే పనికివస్తాయి. ఇక రెండవది ఉభయకుశలోపరి ప్రశ్నలు. మీరు క్షేమమేకదా ! పిల్లలు క్షేమమేకదా ! పంటలు చేతికి వచ్చాయికదా ! ఇటువైపు ఎప్పుడు వస్తున్నారు ? ఈ యోగక్షేమాలు కనుక్కోవడముందే. ఇవి ఉభయకుశ లోపరి ప్రశ్నలు. ఇక్కడ ఉభయుల కుశలము అడిగిచెప్పుకొని వదిలేస్తున్నాము. ఇక్కడకూడ అంతకుమించి లోతుకు పోవడంలేదు.

ఇక పరిప్రశ్నం దగ్గరకు వద్దాం. ఎదుటనున్న వ్యక్తియొక్క పేరు ఊరు మొదలయినవి పుట్టిన తరువాత మరి. పుట్టకముందు? గర్భస్థుడై ఉన్నప్పుడు ? గర్భస్థుడు కాకముందు ? ఇంకా అంతకుముందు ! అప్పుడు, అక్కడిదాకా వెళ్ళి నప్పుడు అది పరిప్రశ్నమవుతుంది. ఆ స్థితిలో అతడు దేవదేవుడేనని మనకు స్పష్ట మవుతుంది.

ప్రణిపాతము చెందిన తరువాత అనగా శరణాగతి చెందిన తరువాత అతని నిజస్వరూపం మనకు స్పష్టమయ్యేంతవరకు పరిప్రశ్నసాగాలి ! అప్పుడు నామరూపాత్మకమయిన దేవాలయాలలో ప్రజ్ఞారూపుడయిన దైవంఎలా వెలుగొందు తున్నదీ మనకు దర్శనమిస్తుంది. ఇక మనకా దర్శనం అనుభవం కావాలి !

దివ్యమయిన ఆ దర్శనంమనకు అనుభవం కావాలీ అంటే అతడిని మనం సేవించాలి ! అది పరిచర్యరూపంలో సాగాలి. సేవ అంటే ఏమిటి ? నామ రూపాలతో అతడు ఉన్నస్థితిలో అతడికి కావలసినదేమిటో అందించగలగడం.

అక్కడున్న ఆవశ్యకతను విచక్షణతో గమనించి ప్రవర్తించగలగడం ! ఎప్పటికి ఏది అవసరమో అప్పటికి అలా సహకరించగలగడం ! ఇదీ సేవ అంటే! ఇలాంటి సేవలో ప్రజ్ఞారూపుడై వెలుగుతున్న అతడు మన హృదయందాకా సాగివస్తాడు. మనను స్పృశిస్తాడు. మనతో శ్రుతి కలుపుతాడు. మనకు తనతో తాదాత్మ్యస్థితిని అనుగ్రహిస్తాడు. సేవ సాగుతున్నవేళ మనదేహాలు ఉపకరణాలుగా నిలుస్తాయి. అంతా తన్మయమై అతనిమయమై భాసిస్తుంది అప్పుడు దేహాలుకూడా వేరుగా అనిపించవు. అవీ అతడి రూపాలే ! అతడు తానుగా అల్లుకొన్నవే ! ఇలా దగ్గరయి, సేవారూపంలో పరవశించడానికిగాను, ఒక్కటిగా పర్యవసించడానికిగాను అతడు కోరి రూపొందుకొన్నవే ఈ ఉపాధులు. కనుక ఆ దివ్యస్థితిలో దేహాలు కూడా దివ్యోపకరణాలు అవుతాయి. అసలవిఎందుకున్నాయో, ఎలాంటి దివ్యస్థితిలో ఉన్నాయో, ఎంతటి అనుభూతిని అందుకోవడం కోసం అవి రూపొందింపబడ్డాయో అప్పుడు మనకు తెలియవస్తుంది. సేవించడానికి అందివస్తాయి. అనుభూతి చెందడానికి అడ్డుపడవు. హృదయస్థితినుండి, చర్మస్థితివరకు ఒకే అనుభూతి. దేహాలు లీలగా, అవలీలగా వర్తించడమంటే ఏమిటో అప్పుడు తెలుస్తుంది.

సృష్టి సాగుతుండగా ఇంతటి అనుభూతి అందిరావాలి! అది దేవదేవుని ప్రణాళిక. అందుకు దేహధారులు దగ్గర కావాలి ! ఆ దగ్గర కావడం కొరకే బంధుమిత్రులుగా రూపకల్పన ! ఆ దగ్గర కావడంకొరకే గృహస్థాశ్రమాన్ని అతడు రూపుదిద్దడం. ఆ దగ్గర కావడం కొరకే ఊళ్లుగా, పట్టణాలుగా రూపొందించి మానవుణ్ణి ఒక పౌరునిగా రూపొందించడం. సహజీవనాన్ని సాధించడం. సాంఘిక సహజీవనంలో జీవితానికి పరమావధి చూపించడం. ఇవన్నీకూడా ఒకరికొకరు దగ్గర కావడంకొరకే ! ఇలా అతడు దేహధారులను ముచ్చటగా దగ్గర చేస్తున్నాడు. తాదాత్మ్యస్థితిని అందుకోవడానికి దివ్యమయిన అవకాశాలను అందిస్తున్నాడు. ఎక్కడోలేను. ఎక్కడికక్కడ నీ ఎదుటనే ఉన్నాను. అనేకవిధాలుగా నీతో శ్రుతి కలుపుతున్నాను. నీవు నన్ను నన్నుగా అనుభవించాలీ అంటే మూడు సోపానాలు ఎప్పటికప్పుడు ఎక్కి రావాలి ! అవి– ప్రణిపాతము, పరిప్రశ్నము, సేవ. చూశారా ! ఒకరికొకరు దగ్గరై, ఒకరినొకరు సేవించుకోవడంలో ఇంత పరమార్థాన్ని నిక్షిప్తంచేసి ఉంచాను నేను. ఇక మీరు అందుకోవడమే తరువాయి.

అసలు ఇంత సృష్టిగా దిగివస్తున్నది, ఇలా నిక్షిప్తం చేయబడిన ఈ పరమానంద స్థితిని ఇలా అందుకోవడానికే, అనుభవించడానికే !

చిన్నపిల్లలు దాగుడుమూతలాట ఆడతారు. ఆ ఆటలో కావాలని ఒకరు దొంగగా మారి దాక్కొంటారు. మిగిలినవాళ్ళు ఆ దొంగను పట్టుకొనే ప్రయత్నం చేస్తారు. ఆ ప్రయత్నంలో ఒడుపు చూపగలిగినవారు దొంగను పట్టుకొంటారు. దొరికాడు, దొరికాడు అంటారు. అందరూ చప్పట్లు కొడతారు. కేరింతలు కొడతారు. ఉవ్వెత్తున ఎగురుతూ ఉల్లాసపడతారు. మళ్ళీ ఈసారి అని మళ్ళీ ఆట మొదలుపెడతారు. అలా రోజూ ఆడుకొంటూనే ఉంటారు. ఎంత ఆడినా తనివి తీరని ఆట. రోజూ ఆ ఆటకోసం, ఆ వేళకోసం ఎదురుచూస్తూ ఉంటారు. ఈ సృష్టి అలాంటి దాగుడుమూతలాట ! నామరూపాలమాటున దాగియున్న ఆ దేవదేవుణ్ణి వెతికి పట్టుకొనే దాగుడుమూతలాట ఈ సృష్టి ! ఆ దొంగను పట్టుకోవడానికి కావలసిన ఒడుపు ఈ అభయవచనంలో చెప్పబడుతున్నది. 'శరణాగతి చెందు. పరిప్రశ్నము చేయి. తృప్తిగా సేవించు. నేనిక దొరికిపోతాను. అప్పుడు నీవే నేను. నేనే నీవు. ఆ దివ్యస్థితిని అందుకోవడానికే ఈ సృష్టిలీల'— అంటున్నాడు దేవదేవుడు. తనను పట్టుకొనే మార్గం చెబుతున్నాడు. ఈ సుళువును గ్రహించమంటున్నాడు.

ఒక చిత్రమయిన విశేషమేమంటే ఒడుపు ఏమాత్రం తగ్గినా మానవుడు ఎదుటనున్నవారిని నామరూపాలవరకే చూడగలుగుతాడు. అంతకుమించి లోపలకు చూడలేడు. చిత్రమయిన ఏమరుపాటు ఇది. ఈ ఏమరుపాటువల్ల నామరూపాలే నిజమనిపిస్తాయి. అసలువాడు అంతపట్టడు. అతడిపైపుకు దృష్టికూడ పోదు. ఒకొక్కప్పుడు అసలతడున్నాడని కూడ అనిపించదు. మనలోని మనస్సు ఎదుటివానిలోని మనస్సువరకే చూడగలుగుతుంది. కామక్రోధాలు, రాగద్వేషాలు తలయెత్తుతాయి. అభిప్రాయాలేర్పడతాయి, అవి మెల్లగా కరుడు కడతాయి. దృక్పథాలేర్పడతాయి, అవి క్రమంగా స్థిరపడతాయి. ఇలా మనిషి తననుతాను బిగించుకొంటాడు. బంధనాల్లో పడతాడు. దానితో తాను అనుకొన్నదేతప్ప అక్కడ ఉన్నది కనబడదు. అప్పుడేం జరుగుతోంది! మానవుడు ఈ ప్రపంచంలోనే తన ప్రపంచాన్నొకదానిని సృష్టించుకొంటున్నాడు. తానందులో బందీ అవుతున్నాడు. బందీయై విలవిలలాడుతున్నాడు. ఇది దారుణస్థితి ! ఈ దారుణస్థితి నుండి మానవుణ్ణి ఉద్ధరించి నిల

బెట్టడానికై తత్త్వజ్ఞానులయిన మహనీయులుంటారు. వారు మనం దీపారాధనలో వత్తిని ఎగదోసినట్లు మన మనస్సును పైకి ఎగదోస్తారు. అప్పుడు ఆ వత్తికి కట్టిన కొడిరాలిపోతుంది. వెలుగు విజృంభిస్తుంది. పరిసరాలు గోచరిస్తాయి. అక్కడ ఉన్నదేమిటో అనుభవానికి వస్తుంది. దానితో మనజన్మకు తెల్లవారుతుంది. ఇక్కడ దేవదేవుడయిన శ్రీకృష్ణుడు చెబుతున్నదేమంటే 'నీకు నీవుగా, ఇరుక్కుపోతున్నవేళ నేను తత్త్వజ్ఞానులయిన మహనీయులరూపంలో దిగివచ్చి నిన్ను మేలుకొల్పుకొంటున్నానుసుమా!- అని. రాగద్వేషాది దారుణస్థితులకు ఆలవాలమయిన పరిస్థితిలో నీవు ఎక్కువకాలం విలవిలలాడిపోకుండా కనిపెట్టుకొని కాచుకొంటున్నాను సుమా!- అని. ఆ విలవిలలాడే స్థితినుండి బయటపడాలనిపిస్తే నా చేయూత నీకు ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది- అని. కావాలంటే చాలు. కనబడి కలుగజేసికొనే నా అభయహస్తం నీతో ఉన్నది- అని !

కావలసిన విధంగా నేను కలుగజేసుకొన్నప్పుడు అప్పటికి తగిన నామరూపాలతో నీకు కనబడతాను. ఆ నామరూపాలూ, ఆ మహనీయస్థితి నీకు నచ్చుతాయి. 'నా' అనుగ్రహ విశేషంచేత నీవు నాకు దగ్గరవుతావు. నేను గురుమూర్తినై నిన్ను శిష్యునిగా స్వీకరిస్తాను. నీవు నన్ను శరణాగతి చెందుతావు. విధేయతతో ఒదిగి ప్రవర్తిస్తూ, నాలో లోనికి చూడగలుగుతావు. అలా చూడటంలో పరిప్రశ్నం నీకు సహకరిస్తుంది. ఆ చూసిన వెలుగును అనుభవించడానికి పరిచర్య నీకు ఉపకరిస్తుంది. ప్రణిపాతము, పరిప్రశ్నము, పరిచర్య- అన్న మూడు సోపానాలలో నీవు నాకు దగ్గరవుతావు. నీవే నేనుగా రూపొందుతావు అటుపైన 'నన్ను' జగత్తంతటా చూడగలుగుతావు. విశ్వరూపసందర్శనాన్ని అనుభవించగలుగుతావు. ఇలా దైవమునయిన నేను మహనీయుడుగా వ్యక్తమయి, గురువుగా నీకు దగ్గరయి, నా అక్కున నిన్ను జేర్చుకొని, అంతటా నేనే గోచరిస్తూ, విశ్వరూపసందర్శనం వరకు నీ సాధనను సాగేట్లు చూస్తాను, ఇలా పడిపోతున్న నిన్ను పట్టుకొని, పరిణితి నీకు లభించేవరకు వెన్నంటి నిన్ను నడిపిస్తాను. సమస్తబంధనాల నుండి నిన్ను విడిపిస్తాను. నేనే నీవుగా, నీవే నేనుగా అనుభవానికి వచ్చే ఒకానొక దివ్యస్థితిలో నీ జన్మకర్మలను నాలీలావిశేషంగా ప్రకాశింపజేస్తాను.

ఇక్కడ మరొక చిత్రం ఉన్నది. మామూలు మానవుడే రాగద్వేషాది దారుణస్థితులలో చిక్కుకొన్నప్పుడు తట్టుకొనలేడు. అలాంటప్పుడు, కొంతకాలం సాధనమార్గాన నడిచి, ఎదుటఉన్నవారి రూపానఉన్న దేవదేవుని పొడగట్టించుకొని, ఆ అనుభూతి చెందినవాడు, సందర్భవశాన నిమసపాటు చెంది, నామరూపాలకు పరిమితమై రాగద్వేషాలకు లోనయ్యాడనుకోండి. అప్పుడతనికి మరీ ఇబ్బందిగా ఉంటుంది. అది తన నిజస్థితికాదని తెలుసు. తాను క్రిందకు జారడం జరిగిందని కూడ తెలుసు. కాని పైకెక్కడమెలాగో తోచదు. అలా ఉండలేడు. దానికతీతుడు కాలేడు. కర్తవ్యమేదో తెలియనిస్థితి ఏర్పడుతుంది. అంతా అయోమయంగా ఉంటుంది. ఒకవిధమైన ఆందోళన కలుగుతుంది. అశాంతి అనుభవానికి వస్తుంది. అలాంటివేళలో దేవదేవుడు తత్త్వజ్ఞానులయిన శుభానీయుల రూపంలో మనను వెతుక్కుంటూ వస్తాడు. అప్పటికి కావలసిన నామరూపాలతో, వేషభాషలతో మనకు దగ్గరవుతాడు. ఓదారుస్తాడు. సేదతీరుస్తాడు. చేయూతనిస్తాడు. లేపి నిల బెడతాడు. కర్తవ్యోన్ముఖులను చేస్తాడు. పరమ ప్రశాంతిని అనుభవింపజేస్తాడు. దానితో మళ్ళీ మనకు దర్శనం అందుతుంది. నామరూపాలకు అతీతమయినస్థితిని అందుకోగలుగుతాం. తాదాత్మ్యస్థితిలో జీవితాన్ని ఒక ఉత్సవంగా నడుప గలుగుతాం.

పాండవమధ్యముడయిన అర్జునుడు శ్రీకృష్ణుని పారమెరిగినవాడు. అత డితో శ్రుతి కలిపి అతడే తానుగా, తానే అతడుగా జీవిస్తున్నవాడు. ఇంతటివాడు కూడా కురుక్షేత్ర మహాసంగ్రామానికి ముందు ఉన్నస్థితినుండి జారిపోయాడు. జార డమే తరువాయి. నామరూపాలకు పరిమితమయ్యాడు. బంధుత్వాలు, మమకా రాలు పనిచేశాయి. ధర్మాధర్మాలు కనబడటం మానేసి, బంధుమిత్రులు కనిపించ సాగారు. దానితో అతడు విషాదయోగంలోనికి వెళ్ళిపోయాడు. విషాదాన్ని వైరాగ్యభాషలో చెప్పసాగాడు. వినేవారికి 'ఏమి ఈ వైరాగ్యం' అనిపిస్తుంది. పరి స్థితి తెలిసినవారికి అది ఎంత విషాదమో బోధపడుతుంది. చివరికి అతడికే తెల్వ లేదు. ఇది వైరాగ్యమా, విషాదమా అని ! 'నేనేమిటో, నేనేమయిపోతు న్నానో నాకే తెలియదు. నాస్థితి నాకు అంతుబట్టడంలేదు. ఇప్పుడు నన్నేమి చేయమంటావో చెప్పు. నా కర్తవ్యాన్ని నిర్దేశించు' అని కృష్ణుడినే అడిగాడు. కృష్ణుడొక చిరునవ్వు నవ్వి, అతడి స్థితిని అతడికి తెలియజెప్పాడు. కావలసిన

తత్త్వజ్ఞానాన్ని భగవద్గీతరూపంలో అందించి, కర్తవ్యోన్ముఖుణ్ణిచేసి నిలబెట్టాడు. ఇక అంతే, కథ సాఫీగా నడిచిపోయింది. ఇదివరకే అనుభూతి చెందినవాడుకదా, మరల ఆ అనుభూతిలోచేరి నిలద్రొక్కుకున్నాడు.

కాలం గడిచింది. కృష్ణావతారం చాలింపబడింది. ద్వారకనుండి తిరిగి వస్తున్నాడు అర్జునుడు. ఆ విషాదానికి తట్టుకొనలేకపోయాడు. అంతఃపురకాంతలను రక్షించలేని స్థితిలో పడ్డాడు. దారి దొంగలకు జవాబు చెప్పలేని స్థితికివచ్చాడు. ఆ దీనస్థితిలో పిచ్చివాడివలె ముందుకు సాగుతున్నాడు. జగదేకవీరుడైన అర్జునుడేనా ఇతడు ! తన స్థితినుండి క్రిందకు ఒక్కసారి జారేసరికి ఎంతటి దీనస్థితికి దిగజారిపోయాడు. అలా దేశాలు పట్టిపోతున్న అతడిముందు వ్యాసభగవానుడు గోచరించాడు. అనగా దేవదేవుడే వ్యాసభగవానుడి రూపంలో కలగజేసికొన్నాడన్నమాట. నేను నిన్ను పడిపోనివ్వను. కావలసినరూపంలో కలుగజేసికొని నిన్ను నిలబెడతాను- అన్న తన అభయవచనాన్ని ఇలా నిజం చేస్తున్నాడన్నమాట.

వ్యాసభగవానుడు అర్జునుని ఓదార్చాడు. ఆ ఓదార్పుతో అర్జునుడు తనను తాను కూడదీసికొన్నాడు. అలా అర్జునుణ్ణి నిజస్థితిలో నిలిపి 'ఇంతకాలం మీరేం చేశారు ? శ్రీకృష్ణునివెంట నడిచారు. ఇంక ఇప్పుడూ జరుగవలసిందదే!'- అన్న కర్తవ్యాన్ని ఉపదేశించాడు, అర్జునుడు కర్తవ్యోన్ముఖుడయ్యాడు. మహాప్రస్థానానికి రంగం సిద్ధం కాసాగింది. ఇలా దేవదేవుని అభయహస్తం అర్జునుడివెంట సాగుతూనే ఉంది. అతడిని ముందుకు నడిపిస్తూనే ఉంది. అతడి ప్రయాణం ఆగుతున్నది అన్నప్పుడల్లా తగినరూపాన్ని ధరించి, కలుగజేసుకొంటూనే ఉంది. ధర్మజుని విషయంలోనూ అలాగే కలుగజేసుకొంది, ఎవరి విషయంలోనయినా అలాగే కలుగజేసుకొంటుంది. ఇది అతడు సృష్టికి ఇచ్చిన అభయం. ఆ అభయముద్ర సృష్టిని వెన్నంటి సాగుతూనే ఉంటుంది. సృష్టిలోని ప్రతి ఒక్కరికి వర్తిస్తూనే ఉంటుంది.

ఈ అభయవచనం విషయమై ఆధునికకాలంలో షిరిడి సాయి ఒక చిత్రమయిన మెలకువను చూపారు. మామూలుగా ఉపదేక్ష్యంతితే జ్ఞానం.'' అన్నప్పుడు వారు జ్ఞానాన్ని ఉపదేశిస్తారు అని అర్థం వస్తుంది. పండితుడొకడు షిరిడి సాయి, సన్నిధిలో కూర్చొని ఈ శ్లోకాన్ని వల్లెవేస్తుండగా ఆయన అన్నారుకదా !

ఉపదేక్ష్యంతి తే అజ్ఞానం' అని ఎందుకనుకోకూడదు ? అని! పండితుడు తెల్లబోయాడు. తెల్లబోవడానికి మొదటి కారణం షిరిడీసాయికి సంస్కృతం వచ్చునని ఆ పండితుడు అనుకోలేదు. రెండవ కారణం- ఈ చెబుతున్న మార్పును ఆయన ఎలా అన్వయిస్తాడు అని !

కాసేపు మౌనంనడిచిన తరువాత, 'ఉపదేక్ష్యంతి తే అజ్ఞానం అన్నప్పుడు ఒక అక్షరం ఎక్కువవుతోందికదా, వ్యాకరణం తప్పిపోతుందనా నీ భయం ! వ్యాకరణానికి ఇబ్బంది కలిగించనక్కరలేదు. ఆకారానికి బదులుగా అవగ్రహాన్ని పెట్టుకొంటే సరిపోతుంది. 'ఉపదేక్ష్యంతి తేఽజ్ఞానం' అని వ్రాస్తే సరిపోతుంది. అవగ్రహమంటే కరువు. ఇక్కడ అకారమున్నదిగాని దానికి కరువొచ్చింది అన్న మాట. అంటే లోపించిందన్నమాట. ఈ వివరణకు పండితుడాశ్చర్యపోయాడు. 'పండిపోయిన వానిముందు తన పాండిత్యమెంత'?- అనుకొన్నాడు. సర్వజ్ఞానిముందు తన జ్ఞానమెంత అనుకొన్నాడు. అనుకొంటూనే మళ్ళీఇలా అనుకొన్నాడు. వ్యాకరణ పరంగా బాగానే చెప్పారుగాని, అన్వయపరంగా ఎలా చెబుతారా అని!

మళ్ళీ కాసేపు మౌనం నడిచిన తరువాత షిరిడీ సాయి ఇలా అన్నాడు : ఈ చెప్పబడినదానికి అన్వయమెలాగ ? అనిపిస్తోందికదూ నీకు ! ఇదిగో, ఇలాగ ! ''మనలో ప్రతి ఒక్కరమూ జ్ఞానస్వరూపులమే ! సృష్టిలీలలో భాగంగా మనను అజ్ఞానం ఆవరిస్తోంది. తత్త్వజ్ఞానులయిన మహనీయుల రూపంలో ఆ అజ్ఞానాన్ని ఎలా తొలగించుకోవలసిందీ దైవం మనకు ఉపదేశిస్తున్నది, తొలగవలసినది అజ్ఞానం. అజ్ఞానమంతా తొలగినక్షణంలో జ్ఞానం అక్కడ వెలుగుతూనే ఉంటుంది. మనమే జ్ఞానస్వరూపులంకదా ! కనుక ఏ మహనీయుడయినా ఏం చెబుతున్నాడు. ఏది అజ్ఞానమో చెబుతున్నాడు. ఆ అజ్ఞానాన్ని ఎలా తొలగించుకోవాలో చెబుతున్నాడు. అందుకే నేను, 'ఉపదేక్ష్యంతి తే అజ్ఞానం అని చెబుతున్నాను, ఏమంటావు. బాగుందికదూ !- అంటూ ముసిముసినవ్వులు నవ్వారాయన.

భగవద్గీత చదివిన పుణ్యానికి శ్రీకృష్ణుడే షిరిడిసాయి రూపంలో ఇలా నన్ను ఆటపట్టిస్తున్నాడు. తన వాక్యానికి తానే భాష్యం చెబుతున్నాడు అని మురిసి

'యాడు పండితుడు. 'తత్త్వజ్ఞానులయినవారి రూపంలో కలుగజేసికొని, కావలసిన 'ర్చ నీలో తీసికొని వస్తాను'. అన్న అభయవచనం పండితుడి విషయంలో ఇలా ం చేశాడు. అతడిలా నిజంచేస్తూనే ఉంటాడు. మనం గమనించుకోవడమే ంవాయి.

* * *

# 5. నీకొరకు నేను నావనౌతాను

అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥
(4అ॥-36శ్లో॥)

నీవొక పాపివైనప్పటికీ, పాపాచరణకే నీ జీవితం అంకితమైనప్ప కూడ దారి కోరినవేళ నాదయ నీకు లభించగలదు. నేను గోచరించిన మునుండి, ఆ నేనను ఎరుకతో, ఆ ఎరుకయే ఒక నావకాగా, సముద్ర త పాపము నుండైనను నీవు అవలీలగా బయటపడగలవు. కోరి నన్ను గట్టించుకొన్నందువల్ల నీకంతటి మేలు జరుగగలదు. కనుకపాపమును చ్చిన చింతకన్నా నన్నుగూర్చిన ముఖ్యఎరుక ్యమని గ్రహించు. ఆ కయే నిన్ను తరింపజేయగలదు.

ఈ సృష్టిలోని పాపుల కథ ఏమిటి ? వారి పరిణామమేమిటి ? వారి సానమేమిటి ? పరమావధి ఏమిటి ? వారిని ఏం చేయాలి ? వారు ఏమవు ? వారియెడల ఎలా ప్రవర్తించాలి ! దైవం వారియెడల ఎలా ప్రవర్తిస్తాడు?.

ఈ సూక్ష్మాంశాలు మనకు తెలియాలి ! అప్పుడుగాని ఈ పుణ్యపాపాల స్వరూపస్వభా వాలు మనకు బోధపడవు. వాటి అనుపానులు మనకు తెలియవు.

ఈ జగత్తు ఒక నాటకం. ఇది జగన్నాటకం. అనాదిగా పెద్దలందరూ ఈ జగత్తును నాటకంగా అభివర్ణిస్తూనే ఉన్నారు. అయితే ఈ జగన్నాటకంలో ఒక చిత్రమయిన విశేషముంది. ఈ సృష్టిలో ఎవరికివాడు ప్రేక్షకుడు. మిగిలిన జగత్తు అతడికి నాటకం. నాటకాన్నిచూస్తూ ప్రేక్షకస్థానంలో ఉన్న మనం సరసమయిన శిక్షణ పొందాలి ! పూర్ణమయిన శిక్షణ పొందాలి ! ముక్తజీవిగా వెలుగొందాలి ! మానవత్వాన్నుండి దివ్యత్వాన్ని సంతరించుకోవాలి ! పశుత్వంనుండి మానవత్వా నికి, మానవత్వంనుండి దివ్యత్వానికి దివ్యత్వంనుండి సాక్షాత్తు దైవస్వరూపమై నడ యాడటానికి కావలసిన పరిణామమంతా ఈ జగన్నాటక దర్శనం నుండి పొందాలి !

నాటకంలో మంచిపాత్రలూ ఉంటాయి. చెడ్డపాత్రలూ ఉంటాయి. పుణ్యవర్తనులూ ఉంటారు. పాపాచరణపరాయణులూ ఉంటారు. జగన్నాటకంలో ఈ వైవిధ్యం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. ఇటు పుణ్యమూర్తులూ, అటు పాపా త్ములూ లెక్కకుమిక్కిలిగా కొట్టవచ్చినట్లు కనబడతారు. అప్పుడా జగన్నాటకానికి ప్రేక్షకుడుగానున్న మనం ఏం చేయాలి ? పుణ్యాత్ముల పాత్రలతోపాటు, పాపా త్ముల పాత్రలనుకూడా అధ్యయనం చేయాలి ! ఆ అధ్యయనం రసభరితంగా సాగాలి ! నీరసభరితంగా ఉండకూడదు, రసభరితంగా సాగాలి. సాగాల్సి ఉంది, సాగుతుంది. కాబట్టే ఇది జగన్నాటకం అని మరల మరల చెప్పబడుతోంది. నాటకం రసభరితంకదామరి! ఆ రసానందస్థితిని అనుభవిస్తూనే, ఆ తాదాత్మ్య స్థితిలోనుండే కావలసిన సందేశాన్ని మనం అందుకోవలసి ఉంటుంది. అప్పుడే మన జీవితానికి, ఈ మానవ జీవితానికి సార్థకత !

నాటకం జరుగుతూ ఉంటుంది. ఆ నడుస్తున్న జగన్నాటకంలో పుణ్యాత్ములూ, పాపాత్ములూ వర్తిస్తూ ఉంటారు. నర్తిస్తూ ఉంటారు. పుణ్యాత్ముల పాత్రలు చూస్తున్నప్పుడు ఎలా ప్రవర్తించాలో తెలుస్తుంది. పాపాత్ముల పాత్రలను చూస్తు న్నప్పుడు ఎలా వర్తించకూడదో తెలుస్తుంది. పుణ్యాత్ముల పాత్రలను తలుచు కొంటూ ఉండాలి ! మెచ్చుకొంటూ ఉండాలి ! ఒకరకంగా ఆ పుణ్యాత్ముల పాత్ర ను ఆరాధించాలి ! అనుసరించాలి ! అలా చేయడంద్వారా, మనకు తెలియకుం

డానే మనంకూడా పుణ్యాత్ములుగా రూపొందుతాం. అయస్కాంతస్పర్శతో ఇనుప ముక్కకూడా అయస్కాంతమై వర్తించినట్లుగా !

ఇక జగన్నాటకంలో పాపాత్ముల సంగతి: వారిని 'చూస్తున్నప్పుడు ఎలా వర్తించకూడదో మనకు తెలుస్తూ ఉంటుందని చెప్పుకొన్నాం. ఎన్నివిధాలుగా పాపాచరణ ఉంటుందీ, దాని ప్రవర్తన ఎలా ఉంటుంది. దాని ఫలితాలు ఎలా ఉంటాయి. ఆ ఫలితాలు అనుభవానికి వస్తున్నవేళ ఎలా ఉంటుందీ ? ఈ అంశాలు కూడా, జగన్నాటకంలోని పాపాత్ముల పాత్రలు మనకు తెలియజెబుతాయి. అనుభవానికి తెస్తాయి. 'మీరు ఇలా ఉండకండిసుమా!' అని హెచ్చరిస్తాయి. 'మాలా ఇలా అయిపోకండి సుమా !' అని జాగ్రత్తలు చెబుతాయి. పాపాచరణలోని లోటుపాటులను మన కళ్ళకు కట్టిస్తాయి. పాపాచరణలోని లోటుపాట్లను మనం గ్రహించి, వాటినుంచి మనకు కావలసిన ఆ మేలుకొలుపును అందించడానికీ ఆ పాత్రలున్నాయి. జగన్నాటకానికి ప్రేక్షకుడిగా, ఆ పాత్రలనుండి ఆ మేలుకొలుపును మనం అందుకోవాలి ! మేలు చేయడమెలాగో పుణ్యాత్ముల పాత్రలు మనకు నేర్పుతూఉండగా మనం మేలుకొనేటందుకు కావలసిన దోహదాన్ని పాపాత్ముల పాత్రలు మనకు అందిస్తున్నాయి. సృష్టిలో ఎలాఉండాలో పుణ్యాత్ములపాత్రలు చెబుతూ ఉండగా, ఎలా ఉండకూడదో పాపాత్ముల పాత్రలు చెబుతున్నాయి. ఇక్కడ ఒకసూక్ష్మన్నిమనం గమనించాలి ! ఆ గమనించిన సూక్ష్మన్ని జీవితం పొడుగునా మనం అనుసరచుకోవాలి ! అదేమిటీ అంటే జగన్నాటకంలోని పాపాత్ముల పాత్రలయెడల మనకు అవగాహన కలగాలితప్ప, అభిప్రాయమన్నది ఏర్పడకూడదు. వాటినుండి మనకు కావలసిన దానిని అందుకోవాలితప్ప ఆ పాపాత్ముల పాత్రలను ఎట్టి పరిస్థితుల లోనూ చిన్నచూపు చూడకూడదు. ఆ పాపాత్ముల పాత్రలనుగూర్చి తక్కువచేసి మాట్లాడకూడదు. తక్కువపాటి అభిప్రాయాలు ఆ పాత్రలయెడల ఏర్పడకూడదు. వారిని అవమానించడానికో, ద్వేషించడానికో, నిందించడానికో మనం ప్రయత్నించకూడదు. అలా ప్రయత్నించినట్లయితే, పాపాత్ములయిన ఆ పాత్రల పాపసంస్కారంమన మనస్సులకు అంటుకొంటుంది. మనకు తెలియకుండానే మనంకూడా పాపస్మరణకు, పాపాచరణకు ఒడిగట్టే ప్రమాదంకూడా దీనివల్ల వస్తుంది. దీనితో ఉన్నస్థాయినుండి మనం దిగజారడం జరుగుతుంది. పడిపోవడం జరుగుతుంది. పతనం కావడమంటే ఇదే ! కనుక పాపాత్ములయిన పాత్రలయెడల మనకు ఉండ

వలసినది అవగాహన. అవగాహన మాత్రమే ఉన్నప్పుడు అది మన ఎదుగుదలకు పనికి వస్తుంది. అలాంటి పాపాచరణ మననుండి వ్యక్తంకాకుండా ఒకానొక అతీత మయినస్థితిలో ఆ అవగాహన మనను నిలబెడుతుంది.

ఒకకోడలు అత్తగారినుండి పోరుసు అనుభవిస్తోంది. అనేకవిధాల కష్టనష్టాలకు గురిచేయబడుతోంది. నరకయాతన అనుభవిస్తోంది. ఇక్కడ కోడలు ప్రేక్షకురాలు. అత్తగారు జగన్నాటకంలోని పాత్ర. మనలో ఎవడికివాడు ప్రేక్షకుడు. మిగిలినది జగన్నాటకం అని చెప్పుకొన్నాంకదా! అత్తగారిది పాపాచరణకు అంకితమయిన పాత్ర. అప్పుడు కోడలిలో ఏమి జరగాలి! ఆ అత్తగారిపాత్ర యెడల అవగాహన ఏర్పడాలి! అంతేగాని మా అత్తగారు దుష్టురాలు- అన్న అభిప్రాయం మాత్రం ఏర్పడకూడదు. అత్తగారి పాత్రయెడల అవగాహనఏర్పడితే, తానొక అత్తగారిగా అయినప్పుడు కోడలిని బాధించదు. అడుగడుగునా ఆమెకు ఆ పొందిన అవగాహన అక్కరకు వస్తుంది. అత్తగారుగా ఎలా ఉండకూడదో తన అత్తగారి విషయంలో తాను చూసిందికదా। ఒక అత్తగారుగా ఎలా ఉండాలో తాను చూపగలుగుతుంది. అవగాహన అంతగా అక్కరకు వస్తుంది, అంతటి ఎదుగుదల నిస్తుంది. అలాకాక, ఆ అత్తగారి పాత్రయెడల అభిప్రాయమేర్పడిందనుకోండి 'ఆమె ఒక దుష్టురాలు. రాక్షసి'- అనిపించిందనుకోండి, ఇక ఆఅభిప్రాయం కరుడు కడుతుంది. ఆ పాత్ర సంస్కారం కోడలి మనసుకు అంటుకొంటుంది. దానితో ఆ అత్తగారి పాత్రను నిరంతరం నిందించడం, ద్వేషించడం, పదిమందితో చెప్పుకొని పరితృప్తి పొందడం, మాటమాటకూ ఆవిడ ప్రసక్తి తేవడంలాంటి కూడని పనులన్నీ జరుగుతాయి. ఈ కూడని ప్రవర్తనలు కోడలి స్థాయిని దిగజార్చి, ఆమెనుకూడ ఒక కుసంస్కారిగా రూపొందించగలవు. అప్పుడేం జరుగుతుంది. ఈ కోడలు అత్తగారయ్యేటప్పటికి ఆ కోడలిగా వచ్చినామెను రాచిరంపాన పెడుతుంది. తనను తన అత్త ఏడిపించినట్లు, తాను కోడలును ఏడిపించాలనుకొంటుంది. తన అత్తగారి దగ్గర తానుపడని సుఖం తన దగ్గర కోడలు ఏల ఎందుకు పడాలి అనిపిస్తుంది. తన అవకాశాలన్నింటినీ తన అత్తగారు హరించినట్లుగా, తాను కూడా తనకోడలి అవకాశాలన్నింటినీ హరించడంతో ఒడుపుచూపి ఆనందించాలనిపిస్తుంది. చూశారా ! అవగాహన అనే దివ్యస్థితినుండి, అభిప్రాయమనబడే దిగువస్థితికి పడిపోయేటప్పటికి మానవప్రవర్తన ఎంతగా దెబ్బతింటుందో! కనుక మనలో ఎవరికి

వారు ప్రేక్షకులుగా, మిగిలిన జగన్నాటకాన్ని చూస్తున్నప్పుడు, ఆ జగన్నాటకాన్ని తగినవిధంగా చూడటం మనకు చేతకావాలి! రసభరితమయిన స్థితిలో అతాదాత్మ్య స్థితిలోనుండి మనకు కావలసిన ఆ సందేశాన్ని ఆ జగన్నాటకంలో నుండి మనం అందుకొంటూ ఉండాలి! ఆ జగన్నాటకంలోని పుణ్యాత్ముల పాత్రలను మనం అనుసరించాలి! పాపాత్ముల పాత్రలయెడల కావలసిన అవగాహన మనం పొందాలి! అవన్నీకూడా జగన్నాటక సూత్రధారినుండి వ్యక్తం చేయబడుతున్నవేనని మనకు తెలియాలి!

మరి ఆ పాపాత్ముల సంగతి ఏమిటి అన్న ప్రశ్న ఒకటి వస్తుంది. కంగారుపడవలసిన పనిలేదు. వారి పరిణామం వారికీ ఉంటుంది. వారూ మనలాంటి వారే! కాలమూ, పరిస్థితులూ వారిలోనూ మార్పులు తీసుకువస్తాయి. ఏదీ ఉన్నట్లుగా ఉండిపోదు. రావలసిన మార్పులకు కావలసిన దోహదం అందరికీ అందుతూనే ఉంటుంది. పాపవర్తనులు ఎప్పుడూ అలాగే ఉండిపోతారు అనుకోకూడదు. వారిలోనూ ఎవరికివారు ఈ జగన్నాటకానికి ప్రేక్షకులేకదా! వారు నేర్చుకొనే పాఠాలు వారూ నేర్చుకొంటూనే ఉంటారు. వారికి అందవలసిన శిక్షణ వారికి అందుతూనే ఉంటుంది. ఈ సృష్టిలో ఎవరూ వదిలిపెట్టబడరు. ముందు వెనుకలుగా అందరూ తరించేవారే!

సృష్టిలోని మిగిలిన జీవరాసులకన్నా మానవులకు ప్రత్యేకమయిన స్వేచ్ఛ ఈయబడింది. ఉన్నస్థితి నుండి దిగనూవచ్చు. ఎదగనూవచ్చు. పశుస్థితి కన్నా దిగిపోనూవచ్చును. దేవదేవుని స్థితికి ఎదిగిరానూ వచ్చును. అంతటి అవకాశం అతడికి ఈయబడింది.

ఈ స్వేచ్ఛ ఎప్పుడయితే ఈయబడిందో కర్మఫలితంయొక్క అనుభవం కూడ అతడికి ఏర్పాటు చేయబడింది. అతడాచరిస్తున్న ప్రతికర్మకూ ఫలితం అనుభవానికి వచ్చేటట్లుగా ఏర్పాటు చేయబడింది. కర్మఫలితం అనుభవించాలీ అంటే, అదేదో ఇబ్బంది అన్నట్లుగా ముఖం పెట్టేవారే ఎక్కువమంది. అది కేవలం తెలియనితనం. దుష్కర్మకు దుష్ఫలితమున్నట్లే, సత్కర్మకు సత్ఫలితం ఉంటుంది కదా! మనం సత్కర్మలే ఆచరించవచ్చుకదా! దుష్కర్మలకు దుష్ఫలితాలు ఎందుకున్నాయీ అంటే, మరల మరల అవి మనం ఆచరించకుండా ఉండటానికే! అలా అని మనను హెచ్చరించడానికే! నిప్పులో వేలుపెట్టాం. కాలింది, గిలగిలలాడాం.

వెధవనిప్పు అనుకొన్నాం. వెధవ ఎవరు అన్నది మరచిపోయాం. కాలించి, కాలింది అని పదిసార్లు అనుకొన్నాం. ఇలా అనుకొంటున్నారుకదా, మనకు చెడ్డపేరెందుకని ఆ నిప్పు బాధపెట్టడం మానేసిందనుకోండి. నిప్పులో వేలుపెట్టాం. బాధ తెలియదు. కాలిపోతూ ఉంటుంది. బాధ తెలిస్తే వేలు ఇవతలికి తీసేవాళ్ళం. ఇప్పుడిక వేలుండదు. చేయుండదు. నిప్పులోనికి వెళ్ళిపోతుంది. మనం అలా వెళ్ళిపోకూడదనీ, మనవేలు, మనచేయి, మనం చిరకాలం ఉండాలని తనను ముట్టుకోగానే బాధనుపెట్టి ఆ ప్రయత్నాన్నుండి విరమింపజేస్తోంది. ఇప్పుడు చెప్పండి. నిప్పు మనకు బాధ కలిగించడం అవసరమా ! కాదా ! దుష్కర్మలకు దుష్ఫలితాలు ఇలాంటివి. అవి మనను రక్షించడానికే ఉన్నాయని గుర్తుంచుకోవాలి !

స్వేచ్ఛాయుతమయిన ఈ కర్మాచరణల్ల మానవులలో విభిన్న సంస్కారాలు రూపుదిద్దుకొంటాయి. విభిన్నదృక్పథాలు ఏర్పడతాయి. వారువారు సంపాదించుకొన్న సంస్కారాలనుబట్టి, దృక్పథాలనుబట్టి. జగన్నాటకంలో పాత్రలు కేటాయించబడతాయి. మామూలుగా ఒక నాటకాన్ని ఆడేటప్పుడు మాత్రం ఏం చేస్తున్నాం ? సమాజంలోని ఆయా ప్రవృత్తులు గలవారిని, ఆయా వేషభాషలు, రూపురేఖలు గలవారిని ఎంచుకొంటున్నాంకదా ! వారితో ఆయాపాత్రలను నటింపజేసి నాటకాన్ని రక్తి కట్టిస్తున్నాంకదా ! సరిగ్గా జగన్నాటకంలోనూ జరుగుతున్నదిదే ! మానవునిలోని ఆయా జీవపరిణామాలనుబట్టి ఎవరికివారు తగిన పాత్రలను పొందుతున్నారు, పోషిస్తున్నారు.

పాత్రపోషణ జరుగుతూ ఉంటగా, మానవ జీవితం సాగుతూఉండగా సత్కర్మలు సత్ఫలితాలు, దుష్కర్మలు దుష్ఫలితాలు అందిస్తూ ఉంటాయి, సత్కర్మలు ఆచరిస్తున్నవారు ఆనందస్థితిని పొందుతారు. దుష్కర్మలు ఆచరిస్తున్నవారు దుఃఖస్థితిని పొందుతారు. ఈ దుఃఖస్థితి వారికి ఇబ్బందికరంగా పరిణమిస్తోంది. ఈ దుఃఖంనుండి, ఇబ్బందినుండీ బయటపడితే బాగుండుననిపిస్తుంది. కాని అభ్యాసవశం చేత దుష్కర్మాచరణ అన్నది సాగుతూనే ఉంటుంది. కనుక ఈ దుఃఖమూ, ఇబ్బందీ తప్పనిస్థితి ఏర్పడుతుంది, ఇలా పాపాచరణ పెరిగిపోతూ ఉంటుంది. పాపాత్ముడుగా అతడు రూఢి అవుతూ ఉంటాడు. కాని మనసు ఈ స్థితికి తట్టుకొనలేక గిలగిలలాడుతుంది. విలవిలలాడుతుంది. అలాంటిస్థితిలో కూడా పాపాచరణ జరుగుతూనే ఉంటుంది. అభ్యాసానికి అంత బలముంటుంది. రాగద్వేషాలకు అంతటిశక్తి

ఉంటుంది. ఇష్టానిష్టాలకు అంతటివాడి ఉంటుంది. మదమాత్సర్యాలకు అంతటి విజృంభణ ఉంటుంది. మరొకలా ఉండలేనిస్థితి ఉంటుంది. ఏదో పూనినట్లు ఉంటుంది. ఒకానొక వివశస్థితి నడుస్తుంది. ఒక ప్రక్కనుండి ఆ కర్మాచరణకు తగిన ఫలితాలు చుట్టుముడుతూ ఉంటాయి. అతడిని పుటంపెడతాయి. గడగడలాడి స్తాయి. అనేకవిధాలుగా వత్తిడితెస్తాయి. చివరకు ఊపిరి అందనిస్థితి, ఊపిరి ఆడనిస్థితి. దానితో మనసు ఆక్రోశిస్తుంది. హాహాకారాలు చేస్తుంది. ఈ దుస్థితి నుండి బయటపడే మార్గమేలేదా ! – అని వెతకడం మొదలుపెడుతుంది. అన్వేషణ సాగుతుంది. ఆత్మసాక్షాత్కారం లభిస్తుంది. దానితో అతడి జీవితానికి తెల్ల వారుతుంది.

మనలో ప్రతిఒక్కరిలో రెండు భాగాలున్నాయి. ఆ భాగాలు ఇవి. ఒకటి– 'నాది', రెండు– 'నేను'. నా శరీరం, నా ప్రాణం, నా ఇంద్రియాలు, నా మనస్సు, నా బుద్ధి ఇవన్నీకూడా నాది అన్న విభాగంలోనికి వస్తాయి. ఆపైన ఉన్నది 'నేను'. మొత్తంమీద ప్రతిఒక్కరిలో ప్రతిఒక్కరిగా ఉన్నది ఈ రెండే, నాది, నేను ! 'నేను' నుండి 'నాది' వ్యక్తమవుతున్నది. కనుక నాది అనబడే రాజ్యానికి 'ప్రజ్ఞ' ప్రభువు. ఎవరికివారుగా చూసినప్పుడు ఆ 'నేను'ను 'జీవి' అంటున్నాం. అందరిలోనున్న ఆ 'నేను'ను ఒక్కసారిగా చూడగలిగినప్పుడు 'దేవుడు' అంటున్నాం.

లోకవ్యవహారం కోసం మనలో ఎందరెందరో ఎన్నెన్నో పేర్లు పెట్టు కొన్నా, ఎవరితోనయినా మాట్లాడవలసి వచ్చినప్పుడు, ఎవరు నువ్వు? అంటే 'నేను' అంటున్నాం ! తలుపుకొడుతున్నదెవరు అంటే 'నేను' అంటున్నాం. వెళుతున్న దెవరు ? అంటే 'నేను' అంటున్నాం. మనలో ప్రతిఒక్కరం నేను, నేను అంటూనే కాలాన్ని గడుపుతున్నాం, ఇలా గమనించగలిగినప్పుడేం తెలుస్తుంది ! అందరూకూడ ఎవరికివారు 'నేను', 'నేను' అనే అంటున్నారుకదా! ఈ నేను లేక తాను అని చెప్పడానికి సంస్కృతంలో 'ఆత్మ' అంటారు. ఆత్మ సాక్షాత్కారం అంటే అందరిలోనూ, మనలోనూ ఉన్న నేను మనకు దర్శనమిచ్చి, అనుభవానికి రావడమే ! ముక్తజీవనము అంటే ఆ 'నేను' అనబడే దివ్యస్థితిలో నుండి 'నాది' అనబడే దేహరాజ్యాన్ని నడపడమే ! 'నేను'గా నిలబడాలి । నాది అన్నదానిని

నడిపించాలి। నేను ప్రకారం, 'నాది' నడుచుకోవాలి ! అదే జీవితానికి సార్థకత। మానవుడుగా మనం జీవితంలో సాధించవలసిందికూడా అదే !

ఈ నేను సర్వత్రా వ్యాపించి ఉన్నది. ఈ 'నేను'నుండే సర్వమూ వ్యక్తమవుతున్నది. ఖనిజాలలో ఈ 'నేను' నిద్రను అభినయిస్తూ ఉంటుంది. వృక్షాలలో ఈ 'నేను' స్వప్నస్థితిలో ఉంటుంది. జంతువులలో ఈ 'నేను' మేలు కొంటుంది. మానవులలో ఈ 'నేను' వికసించనారంభిస్తుంది. వికసిస్తున్నకొద్దీ దైవ స్థితికి దగ్గరవుతుంది. ఇలా అంతటా 'నేను' కథ నడుస్తూ ఉంటుంది. ఆ 'నేను'ను పొడగట్టించుకొంటున్నవారికి ఆనందస్థితి అనుభవానికి వస్తుంది. ఈ 'నేను'ను పొడ గట్టించుకొంటున్నవానికి 'నాది' అనబడేవానితో ఎలా ప్రవర్తించాలో అలవోకగా బోధపడుతుంది. దానితో జీవితనిర్వహణకు కావలసిన దారి ఎప్పటికప్పుడు పొడగ డుతూ ఉంటుంది. కర్తవ్యమేమిటన్నది అప్పటికప్పుడే స్పష్టమవుతుంది. అను క్షణం విశ్వకళ్యాణం సాధింపబడుతుంది.

ఏసుప్రభువు 'నేనే మార్గమును' *'I am the Path'* 'నా'ద్వారాతప్ప మానవులు తండ్రిని చేరలేరు' అని ఉపదేశించాడు. మనం ఇంతవరకూ చెప్పుకొన్న 'నేను' కథనే అతను ఇలా ఉపదేశించడం జరిగింది. 'నేనే' మార్గము అన్నప్పుడు మనలోనూ, అందరిలోను ఉన్న 'నేను'ను పొడ ట్టించుకోవడమే మార్గము అని అర్థం !' 'నా'ద్వారా తప్ప ఎవరునూ తండ్రిని చేరలేరు'— అన్నప్పుడు ఆ నేను'ను పొడగట్టించుకోవడం ద్వారా మాత్రమే ఎవరయినప్పటికీ దైవస్థితిని అందుకొనగలి గేది- అన్నది ఉపదేశం ! అతనిద్వారా పలుకబడింది ఏమిటో, దాని పరమార్థ మేమిటో, ఆ పూర్తిస్వరూపం తెలియాలంటే, భగవద్గీతను శ్రద్ధగా, భక్తితో అధ్యయనం చేయడం ఒక్కటే మార్గం. భగవద్గీత తరువాత వచ్చిన ఆధ్యాత్మిక సంప్రదాయాలన్నీ భగవద్గీతను గుండెగా చేసికొని సాగినవే అని ఇదివరలో చెప్పు కొన్నాం. ఆ వాక్యాలన్నీ ఇక్కడ మరల మరల స్మరించుకోవాలి!

తెలియనివారు ఇక్కడ ఏసుప్రభువు తనే మార్గమనీ, తనద్వారానే తరిం చాలనీ నొక్కిచెప్పాడు అనుకొంటారు. అలా అని ప్రచారం చేస్తారుకూడా! కాని అతడు చెప్పినది 'నేను'ను గూర్చి! అందరిలోని 'నేను'ను గూర్చి. అందుకోవల సిన 'నేను'ను గూర్చి. దేహగతమయిన 'నేను'ను బిడ్డగా, ఇన్ని దేహాలనుండి

వ్యక్తమవుతున్న నేనును తంత్రిగా అతడు పేర్కొన్నాడు. దేహగతమయిన నేను విశ్వవ్యాప్తమైన 'నేను'గా వెలుగొందాలి అని అతడు కోరుకొన్నాడు. భగవద్గీత లోని సూక్ష్మమయిన ఉపదేశాలను కొన్నింటిని తీసికొని, వాటిని మధురంగా, మానవజాతికి అందించడానికి ఏసుప్రభువు నుండి జరిగినదే 'బైబిలుబోధ'! తాను వెలువడిన క్షణంనుండి, భగవద్గీత, అటుపైన వెలువడిన సకల ఆధ్యాత్మిక సంప్రదాయాలకూ ప్రాణము, ప్రమాణము, ప్రేరణ అయికూడా నిలిచిందని ఇంతకు ముందే మనం చెప్పుకొన్నాంకదా!

ఈ 'నేను'ను పొడగట్టించుకోవడమే జ్ఞానం. జ్ఞానమంటే ఏమిటి ? తెలియడం! తెలియవలసినది తెలియడం. సృష్టిలో తెలియవలసినది ఈ 'నేను' అనబడే ప్రజ్ఞ. అది తెలిసేంతవరకు ఒకరకంగా మనం ప్రయాణిస్తున్నది చీకటి లోనే. భాగవతంలోని, 'ఇల్లను చీకటి నూతిలోపడి'— అన్న ప్రహ్లాదుని వివరణలోని భావమిదే! 'నాది' మాత్రమే మనస్సునకు అందినప్పుడు చీకటిలోనే జీవితం! 'నేను'కూడ అందినప్పుడే జీవితానికి వెలుగు. కనుకనే, ఏసుప్రభువు కూడ *'I am the light'* 'నేనే' వెలుగును ?— అని ఉపదేశించాడు. 'నేను' అనేది పొడగట్టేవరకు నిజమయిన వెలుగు పొడగట్టదని స్పష్టం చేశాడు. ఇవి విలువైన వాక్యాలు! వెలుగైన వాక్యాలు! పెద్దల వెలుగులో, వారి అడుగుజాడల ననుసరిస్తూ మాత్రమే మనం అధ్యయనం చేయవలసిన వాక్యాలు!

సర్వసాధారణంగా మనస్సు 'నాది' అనబడే దానిలోనే ఉండిపోతుంది. అదికూడ 'నేను', అనబడే దానిలో భాగమేకదా! దానికే పరిమితమైపోతూ ఉంటుంది. తోటిజగత్తును చూసినప్పుడు కూడ 'నాది' అనబడే స్థితివరకే చూడగలుగుతోంది. తనలోగాని, తనతోటి వారిలోగాని 'నేను' అనబడేస్థితిని అది ఒకపట్టాన పొడగట్టించుకోలేదు. ఆ 'నేను'ను పొడగట్టించుకొనే వరకు సృష్టికథ మనకు బోధపడదు. కర్తవ్యమేమిటన్నది మనసుకు తెలియరాదు. దానితో అది తోచినట్లు ప్రవర్తిస్తుంది. ఆ ప్రవర్తించడంలో తరచు పొరపాట్లు జరిగిపోతాయి. చేయకూడనివి చేయబడతాయి. దానితో పాపస్థితి అనుభవానికి వస్తుంది. పాపాచరణ అలవాటుఅవుతుంది. జీవించాలి అంటే ఇదంతా చేయకతప్పదేమో అనిపిస్తుంది. మిగిలినవారు కూడా ఇలాగే చేస్తున్నారుకదా అనిపిస్తుంది. చేస్తున్నదానిని సమర్థించుకోవాలని పిస్తుంది. అలా అలా మానవుడు పాపాచరణలో కూరుకుపోవడం జరుగుతుంది.

ఎదుటివారిలో కూడ 'నాది' అనబడే స్థితివరకే చూడటంవల్ల వారుపరాయి వారు అనిపిస్తుంది. దానితో వారు వేరుగా కనిపిస్తారు. వేరుగా కనిపించేటప్పటికి ఇక అభిప్రాయాలేర్పడతాయి. రాగద్వేషాలు నెలకొంటాయి. ఇష్టానిష్టాలు రూపు దిద్దుకొంటాయి. దానితో తోటివారియెడల కూడని ప్రవర్తన వ్యక్తమవుతుంది. పాపాచరణకు చోటు ఏర్పడుతుంది.

పాపాచరణకు లోనైనప్పుడు దానికి తగిన ఫలితాలు వస్తుంటాయికదా! ఆ ఫలితాలు ఇబ్బందికరంగా ఉంటాయి, క్రమంగా అవి మనిషిని చుట్టుముడతాయి, మనస్సుపై ఒత్తిడిని తెస్తాయి, మనస్సుకు క్లేశాన్ని కలిగిస్తాయి. సుఖసంతోషాలకు దానిని దూరం చేస్తాయి. అశాంతికీ, ఆందోళనకూ ఆలవాలమైపోతుంది మనస్సు. దానితో, నేను నడుస్తున్నది పద్ధతికాదేమోనన్న ప్రశ్న ప్రారంభమవుతుంది. అనుభవిస్తున్న దారుణస్థితినుండి బయటపడాలని మనస్సు కోరుకొంటుంది, బయటపడటమెలాగ? అని ఆలోచిస్తుంది. ఒక్కొక్కసారి ఆక్రోశిస్తుంది.

ఆ ఆలోచన, ఆ ఆక్రోశం మనలోని 'నేను' దగ్గరకు చేరుతుంది. ఆ దివ్యస్థితినుండి మనపై అనుగ్రహం వర్షిస్తుంది. అందరిలోనూ 'నేను'గా వ్యక్తమవుతున్న దైవం తగినరూపంలో కలుగజేసికొంటాడు. 'నాది' అనబడు స్థితిలో ఇరుక్కొన్న మనస్సును 'నేను' దగ్గరకు నడిపిస్తాడు. ఆ సాక్షాత్కారంతో మనస్సుకు ప్రశాంతి చిక్కుతుంది. దారి దొరకుతుంది.

'నేను'ను గమనించు! నాది అనబడుతున్నది కూడ నిజానికి 'నేనే' అని గమనించు! నేనను వెలుగు నీకు ఆ గమనికను నిండుగా అందించగలదు! అప్పుడు నీవు ఇక 'నాది'లో ఇరుక్కోవు, సరికదా 'నాది' అనబడు దేహరాజ్యాన్ని సరిజేసికొని, సరిగా నడుపగలవు. 'నేన'ను వెలుగున్నదే— అది నీకు ఈవిషయమై అన్నివిధాలా సహకరించగలదు.

'నాది' అనబడు దేహరాజ్యమున్నదే, అది నా నుండి వ్యక్తమవుతున్నదే! అది నా రూపమే! నేనను వెలుగుయొక్క ఒకానొక వ్యక్తీకరణమే! చూడగలిగినవారికి అది 'నేనే'! 'నా' నుండి వ్యకమయినది. 'నేను'కాక మరొకటి ఎలా అవుతుంది? చెప్పు! సృష్టికథ కొరకు నన్ను నేనే ఇలా రెండుగా గోచరించేట్లు సంకల్పిస్తూ ఉంటాను. కనుక నీవుదానినెన్నడూ చిన్నచూపు చూడకు!

దేహరాజ్యాన్ని చిన్నచూపు చూడటమంటే దేవదేవుని చిన్నచూపు చూడటమే అవుతుంది. ఇది గమనించు ! ఈ ఎరుక కలిగి ప్రవర్తించు! ఈ విషయమై ఎన్నడూ ఏమరుపాటు చెందకు !

నా వెలుగును దివ్యమయిన కార్యాచరణంగా వ్యక్తం చేయడానికిగాను ఒకానొక మహోపకరణంగా దేహరాజ్యమన్నది నాచేత రూపుదిద్దబడుతున్నది. దేహరాజ్యమన్నది లేనిదే, భూమిపైన కర్మాచరణమునకు అవకాశమున్నదా ! నేనను వెలుగును గమనించనిదే ధర్మాధర్మమునకు కావలసినకనువిప్పు కలుగగలదా! కనుక ఈ రెండూ కావలసినవే ! ఈ రెండిటికీ శ్రుతి కలియటమే మానవజన్మకు పరమావధి. అట్టి శ్రుతికుదరడమే యోగము. ఆ స్థితిలో అనుభవానికి వచ్చేదే యోగస్థితి! అప్పుడు నీనుండి వ్యక్తమయ్యేదే నిజమయిన జీవితం. అంతవరకు నీనుండి జరుగుతూ వస్తున్నది జీవించడానికిగాను, తప్పటడుగులతో. తప్పటడుగులతోకూడిన ఒక ప్రయత్నం మాత్రమే ! ఒక ప్రయోగం మాత్రమే!- అన్న ఉపదేశం దేవదేవునినుండి ఆ సమయాన మనకు వినబడుతుంది. మన మనస్సును నిలబెడుతుంది! దానితో మన కన్నులు చెమ్మగిల్లుతాయి. మన కనురెప్పలు విచ్చుకొంటాయి. మన లోని జ్ఞాననేత్రం తెరుచుకొంటుంది. సృష్టితత్త్వం ఆసాంతమూదర్శనమిస్తుంది. దేవదేవుని నిజరూపంగా ఈ సృష్టి మనకు బోధగడుతుంది. మన చేతులు ఆయన పాదాలను స్పృశిస్తాయి. అంతవరకు మననుండి జరిగిన పాపాలూ, లోపాలూ ఇక మన నుండి తమకుతాముగా తొలగిపోతూ ఉండటం మనకు భాసిస్తుంది. అలా వాటి నన్నింటినీ సాంతంగా సాగనంపుతున్న ఆయన అభయహస్తం నిండుగా మనకు దర్శనమిస్తుంది. ఇక నీ జీవితం ఒక పండుగేననిపిస్తుంది.

దేవదేవుని నుండి దివ్యసందేశం అలా అందుకొన్న సమయంనుండి మన లోనూ, విఖిలజగత్తులోనూ ఆ 'నేను'ను బోధగట్టించుకోవడమన్నది ఇక ఒక దీక్షగా సాగుతుంది. ఆ 'నేను' ఒకనావగా రూపొందుతుంది. సముద్రమంత పాపాన్నయినప్పటికీ, ఆ నావ మనలను దాటించకలుగుతుంది. కావలసినదల్లా మన మనస్సు ఆ 'నేను'ను నావగా ఆశ్రయించగలగడం !

అప్పటికి మనం ఎంతగా పాపంచేసి ఉన్నప్పటికీ, ఈ 'నేను' అన్న నావ మనను దాటించగలుగుతుంది. అలాగే జగత్తులోని తోటివారు ఎంత పాప

భూయిష్ఠంగా ప్రవర్తించినప్పటికీ మనం ఈ 'నేను'ను నావగా ఆశ్రయించినప్పుడు ఆ పాపానికి ఏమాత్రం అంటుకోకుండానే, వారివారి పాపచర్యలతో నిమిత్తంలేకుండానే, వారితో సహజీవనం చేయడమన్నది మనకు చేతనవుతుంది. క్రమంగా మనస్సు, తానుకూడా 'నేను'గా రూపొందుతుంది. 'నేను'తో తాదాత్మ్యం చెందుతుంది. దానితో మనలోని 'నాది' అనబడే మొత్తం, 'నేను' అనబడే ప్రజ్ఞకు అనుగుణంగా ఒదిగి నడుచుకొంటుంది. మోక్షస్థితి అన్నది అప్పుడు మనకు నిండుగా అనుభవానికి వస్తుంది.

మనలో 'నాది' అనబడుతున్నది మనలోని 'నేను'కు శరణాగతి చెందాలి। ప్రణిపాతము అంటే అదే। అందుకు కావలసిన పరిప్రశ్నము మనస్సుచేత నిరంతరం నిర్వహింపబడుతూ ఉండాలి। అలా నిర్వహింపబడుతున్నప్పుడే ఆ 'నేను' అన్నస్థితిలో మనం చిరకాలం నిలబడటానికి వీలవుతుంది. మనస్సు 'నేను' స్థితిలో నిలబడి, 'నాది' అనబడు దేహరాజ్యాన్ని కర్తవ్యోన్ముఖంగా నడిపించడం జరగాలి! మనస్సుకు 'నేను' అందేవరకు జీవితం మన ప్రకారం సాగుతుంది. మనస్సుకు 'నేను' అందినప్పటినుండి మన జీవితం సృష్టిప్రకారం నడుస్తుంది.

జీవితం మన దృష్టిప్రకారం సాగినంతకాలం కష్టసుఖాలు, పాపపుణ్యాలు, మంచిచెడులు, కర్మఫలితాలు, అన్నీ ఉంటాయి. అనుభవానికి వస్తాయి. అలా కాక, జీవితం సృష్టిప్రకారం సాగినప్పుడు వీటన్నింటికీ అతీతమైన స్థితిఅనుభవానికి వస్తుంది. వీటన్నింటినుండీ విడుదల లభిస్తుంది. మోక్షము అన్న పదానికి విడుదల అని అర్థం. వీటన్నిటినుండి విడుదల లభించడమే 'మోక్షం'! మనస్సు నేనును సమీపిస్తున్నకొద్దీ, మోక్షస్థితి అనుభవానికి వస్తుంది. మానవుడు తనయందూ, నిఖిలభూతములయందూ ఆ 'నేను'ను పొడగట్టించుకొంటూ, ఆ 'నేను' అనుగ్రహిస్తున్న మోక్షస్థితిలో విశ్వకళ్యాణకరమయిన జీవితాన్ని నిండుగా నిర్వహించగలగాలి; నిర్వహించగలడు! "పాపచింతన వలదు. నీవొక మహాపాపివైననూ, మునిగిపోయినది లేదు. నన్ను దర్శించు! 'నేను'ను నావను ఆశ్రయించు! సముద్రమంతపాపమునైననూ అవలీలగా ఇక దాటగలవు" అన్నదికదా, భగవానుని అభయవచనము! అదే మనకు రక్ష!

## 6. నీ ప్రయత్నాన్ని అందుకొంటాను !

పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ।
నహి కల్యాణ కృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి ॥
ప్రాప్యపుణ్య కృతాంలోకా నుషిత్వా శాశ్వతీస్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే ॥
అథవా యోగినామేవ కులేభవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥
తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదేహికమ్ ।
యతతే చ తతో భూయ సంసిద్ధౌ కురునందన ॥
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపినః ।
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతి వర్తతే ॥
ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।
అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్ ॥

(6అ॥ - 40-45శ్లో)

నన్ను పొందగోరి ప్రయత్నాన్ని ప్రారంభించి, ఆ ప్రయత్నం ఇంకా ఒక దశకు రాకముందే అనగా నన్ను పొందకుండానే శరీరాన్ని విడిచే యోగసాధకులు, వారు యోగసాధకులే అవుతారుగాని, యోగ భ్రష్టులుకారు. ఇహపరాల రెండిటిలోనూ వారు అభివృద్ధినే పొందుతారు తప్ప ఏమాత్రం నాశం చెందరు. వారు చేస్తున్నది మంచి ప్రయత్నం కదా! మంచి ప్రయత్నానికి మంచి ఫలితమే వస్తుందితప్ప, చెడుఫలితం కలుగనేరదు. కనుక వారికి సద్గతియేగాని దుర్గతి ఉండదు. నన్ను పొందే

టందుకు చేసే ప్రయత్నం కన్న పుణ్యకర్మ ఏమున్నది? ఆ ప్రయత్నాన ఉండగా శరీరాలు విడిచినవారు పుణ్యవర్తనులు అనుభవించు దివ్యలోకాలను చిరకాలం అనుభవించగలరు. తిరిగి జన్మించవలసి వచ్చినప్పుడు శ్రీమంతుల ఇండ్లలో, సదాచారవంతుల ఇండ్లలో శుభకరమయిన జన్మలను పొందగలరు.

లేదా యోగాభ్యాసాన సిద్ధులయిన వారి ఇంట జన్మించగలరు. ఇలాంటి జన్మ ఎంతటి దుర్లభమో వేరుగా చెప్పవలెనా? అంతటి అవకాశము అతడికి లభిస్తుంది. నన్ను చేరుటకుగాను అతడు పూర్వజన్మయందు చేసిన ప్రయత్నం ఇంతటి అనుగ్రహమును అందించగలదు.

అలా జన్మించిన వారు పూర్వ సంస్కారవశాన 'నన్ను' పొందే ప్రయత్నాన్ని చక్కగా కొనసాగిస్తారు. పూర్వజన్మలో వారినుండి జరిగినది ఒక దొడ్డ ప్రయత్నమని మనం మరువరాదు. ఆ ప్రయత్నం జన్మలను దాటి కొనసాగుతుందే తప్ప ఆగదు.

వయస్సు, వయస్సు యొక్క ప్రభావం మరియు సాంగత్యాలవల్ల ఒక్కొక్కప్పుడు అలా జన్మించిన వారు కొంతకాలం చెడిపోయినట్లు కనిపించవచ్చు. కాని ఏదో ఒక సన్నివేశంలో వారు మళ్ళీ నాకు దగ్గరవుతారు. దానికి కారణం పూర్వజన్మలో వారు నన్నుగూర్చి చేసిన ప్రయత్నమే! ఆ అభ్యాసబలం వారిని నాకు దగ్గర చేస్తుంది. వారు నాకు దగ్గరై నన్నుపొందే ప్రయత్నాన్ని దీక్షగా కొనసాగిస్తారు. పూర్వసంస్కారానికి అంతటిబలం ఉంటుంది. అభ్యాసానికి అంతటి పట్టు ఉంటుంది. వేదశాస్త్రాలు ఇలాంటి సాధకులకు మార్గాన్ని సూచిస్తూ ఉంటాయి. ఆచరణశీలమయిన అంశాలనే వేదశాస్త్రాలలో అడుగడుగునా వీరు దర్శిస్తూ ఉంటారు. కారణం వారినుండి ప్రయత్నం సాగుతున్నది కనుక! వారికున్నది అభ్యాసబలం కనుక! ఇలాంటి ప్రయత్నం లేకుండా, అనగా నన్నుపొందే తగిన ప్రయత్నం చేయకుండా వేదశాస్త్రాలు చదివినవారు పండితులు కాగలరుకాని, నన్ను పొంద

లేదు. పాండిత్యముతిన్న ప్రయత్నమేమిన్న ; అందునా పూర్వజన్మనుండి సాగి వస్తున్న ప్రయత్నమున్నదే అది మరీ బలవత్తరమైనది.

ఈ ప్రయత్నమిలా సాగుతుండగా జన్మలు ఇలా సాగిపోవచ్చు నష్టము లేదు. ప్రయత్నము సాగుతున్నంతవరకు నా స్పర్శ అతనికి అనుభవానికి వస్తూనే ఉంటుందికదా! అలాంటి జన్మలు నడిచి, నడిచి చివరకతడు తప్పక సిద్ధిని పొంద గలడు. ప్రయత్నమునకు సాగుటయేగాని ఆగుట ఉండదు. ఆవశ్యకతనుబట్టి అది జన్మల తరబడి సాగవచ్చుగాని సిద్ధిని పొందకమానదు.

సృష్టిలోని ప్రతివస్తువునందు, వ్యక్తినందు మనకు గోచరించేవీ, గోచ రించవలసినవీ రెండేరెండు అంశాలని చెప్పుకొన్నాం. అవి ఒకటి- నాది, రెండు నేను. 'నాది' అనబడేది 'నేను' నుండి వ్యక్తమవుతున్నదని దర్శించాం! 'నేను' అనబడే దివ్యప్రజ్ఞకు 'నాది' అనబడే దేహరాజ్యం ఒదిగిఉండాలని కూడ గమనిం చాం. 'నేను'ను మరచి, 'నాది' లో తిరుగాడుతున్న మనస్సు ఏవిధమయిన ఇబ్బందికి లోనవుతుంది అనేదికూడా తెలుసుకొన్నాం. ఆఇబ్బందినుండి బైటపడాలని మనస్సు ఎలాంటి తపనను చెందుతుందో కూడ గమనించాం! తపన చెందినపేళ తత్త్వజ్ఞాను లయిన మహనీయులరూపంలో దైవం దగ్గరై మనస్సునకు ఎలాంటి మేలుకొలు పునను గ్రహిస్తాడో కూడా తెలుసుకొన్నాం. అలాంటి మేలుకొలుపును చెందిన మనస్సు, 'నేను' అను దివ్యప్రజ్ఞకు నాది అనబడు దేహరాజ్యం ఒదిగి ఉండే టట్లుగా చూడటానికిగాను ఎలాంటి సాధనకు ఉపక్రమిస్తుందో కూడా వివరించు కొన్నాం.

ఆ సాధనలో ప్రధానమయిన అంశాలు మూడు, మొదటిది- ప్రణిపా తము, రెండవది- పరిప్రశ్నము మూడవది సేవ!

మొదటిది- ప్రణిపాతము- అంటే శరణాగతి! ఇది భక్తిభావానికి సం బంధించినది. 'నేను' అన్న దివ్యప్రజ్ఞకు సర్వసమర్పణ చెందాలి అన్నది దీని తాత్పర్యం- సర్వసమర్పణ చెందినప్పుడే యోగస్థితి అనగా ఏకత్వానుభవం అంది వస్తుంది. దీనినే మనం తన్మయస్థితి అంటున్నాం.

రెండవది పరిప్రశ్నము. ఇది జ్ఞానస్థితికి సంబంధించినది. జ్ఞానంఅంటే తెలియడం. తెలివికలగడం, నిజస్వరూపం తెలియడం. ఆ నిజస్వరూపం అందే

వరకు ప్రశ్నిస్తూ పోగటమే పరిప్రశ్నము. పరిప్రశ్నముయొక్క పరమావధి తెలుసు కొనగలగడమే! అనగా 'నేన'ను దివ్యప్రజ్ఞయెడల పరిపూర్ణమయిన ఎరుక అంది రావడమే !

మూడవది- సేవ. ఇది కర్మాచరణస్థితికి సంబంధించినది. మనము చేయ వలసినది మన స్వధర్మమవుతుంది. ఆ స్వధర్మాచరణము సేవగా నిర్వహించగల గాలి ! సృష్టిరూపంలో వ్యక్తమవుతున్న దైవాన్ని మనం అర్చించగలగాలి! ఆ అర్చనకు పరమావధిగా 'నేను' అను దివ్యస్థితి మనకు అనుభవానికి వస్తుంది.

పరిప్రశ్నమువల్ల ఎరుక కలుగుతుంది. 'నేను' అను దివ్యప్రజ్ఞ పొడ గడుతుంది. ఆ జ్ఞానస్థితిని సేవరూపంలో కర్మాచరణ అనుసరిస్తుంది. ఇలా కర్మ జ్ఞానాలు రెండూ ఒకదానికొకటి అనగలుపుకొని భక్తిభావంలోనికి పర్యవసిస్తాయి. ఎప్పుడైతే భక్తిభావం పరిఢవిల్లుతుందో 'నాది' అనబడు దేహస్థితికీ, నేను అనబడు దివ్యస్థితికీ శ్రుతి కుదురుతుంది. ఒకానొక తాదాత్మ్యస్థితి అనుభవానికి వస్తుంది. ఇక అక్కడనుండీ ఆ తాదాత్మ్యస్థితిలోనే కర్తవ్య నిర్వహణ జరుగుతుంది.

బాగున్నది. ఇదంతా సజావుగా జరిగిపోతే బాగానే ఉంటుంది. కాని అలా జరిగేలోపున, ఆ ఒడుపు కుదిరేలోపున కేవలం ప్రయత్నం సాగుతూ ఉండగానే సాధకుడు శరీరాన్ని విడిచిపెట్టవలసి వచ్చిందనుకోండి. అప్పుడతని పరిస్థితి ఏమిటి ?

ఆ సాధకుడికి 'నాది' అనబడే దేహరాజ్యం సర్వస్వంకాదని తెలిసిపో తుంది. 'నేను' అనబడు దివ్యస్థితిని పొందవలసి ఉన్నదనిస్పష్టమవుతుంది. పొంద డానికి మార్గమేమిటి అన్నదికూడ అతనికి తెలిసి ఉంది. ఆ మార్గానికి తగినట్లుగా అతడు జీవితాన్ని మలచుకొంటూ వస్తున్నాడు. మలచుకోవడం పూర్తయ్యేలోపుననే మలచుకోవడం ఇంకా పూర్తి కాకుండానే మృత్యువు వచ్చేసింది. అప్పుడు అతని పరి స్థితి ఏమిటి ?

లోకంలోని అందరిలా అతడు జీవించలేడుకదా ! తినవలచినట్లుగా తిని తిరుగదలచినట్లు తిరుగలేడుకదా! తనకు తోచినట్లుగా ఇక బ్రతుకలేడుకదా! అంత

వరకూ సుఖసంతోషాలుగా చూసినవాటిని ఇప్పుడు చూడలేడుకదా! లభించిన కొలుపుతో, ఇంతవరకూ అతడనుభవించిన పరిమితస్థితి ఏమిటో అతడికి పడిందికదా! దానితో అతడి మనస్సు ఊర్ధ్వయానం మొదలుపెడుతుందికదా! యానం ఒకకొలిక్కి రాకముందే శరీరం విడిచిపెట్టాల్సి వచ్చిందనుకోండి. అ అతను వదిలినది ఉన్నదిగాని, పొందినది లేదుకదా! అప్పుడు ఇటు చె అటు పొందడు. మధ్యలో ఉండిపోయినట్లవుతోందికదా! అలాంటివానికి నుండి బదులు ఎలా ఉంటుంది? అతడలా మధ్యలో ఉండిపోవలసిందేనా? సాధకునకు శంక కలగడం సహజం! ఆ శంకకు దేవదేవుడిలా అభయమిస్తు 'శంకించవలసిన అవసరంలేదు. నన్ను పొందేటందుకు ప్రారంభమయిన ప్రం ఇక ఆగదు, జన్మలు ఆ ప్రయాణంలో మజలీలు అవుతాయితప్ప, పురో మాత్రం అడ్డురావు. పైగా అవి సహకరిస్తాయి కూడా'! అంటున్నాడతను.

నన్ను చేరేటందుకు చేసే ప్రయత్నంకన్న పుణ్యకర్మ మరొ ఉంటుందా ! అటువంటివానికి దేహత్యాగానంతరం దుర్గతి ఎలాకలుగుతుంది కనుక దుర్గతి అన్న ప్రశ్నేలేదు. పుణ్యాత్ములందరూ దేహాన్ని విడిచిపెట్టిన వాత ఎలాంటి దివ్యలోకాలను అనుభవిస్తారో, ఇతడూ అలాంటి దివ్యలో అనుభవిస్తాడు. చిరకాలం అనుభవిస్తాడు. అఖండంగా అనుభవిస్తాడు. దివా స్థితిని పొందుతాడు. ఆనందమన్న రుచి తెలియడం ప్రయత్నం ప్రారంభమై నుండి ఉంటుంది, నన్ను పొందేటందుకు జరిగే ప్రయత్నమే ఆనందంగా ఉం నేను ఆనందస్వరూపుడనుకదా! పంచదార తినడం ప్రారంభించినప్పటినుండీ గానే ఉంటుందితప్ప తినగాతినగా తీపి అనుభవానికి రావడమంటూ ఉండదు. చింతింపవలసిన పనిలేదు. నన్ను పొందేటందుకుగాను మనస్సు ప్రయత్న ప్రారంభించిన క్షణంనుండి నా ఆనందస్థితి, కావలసినమేరకు అందుతూనే ఉం దేహం విడిచిన తరువాతకూడ ఆ ఆనందస్థితి అలా కొనసాగుతూనే ఉం మృత్యువు అందుకు దోహదం చేస్తుంది తప్ప అడ్డుకోదు. కనుక, సాధన కాలేదుకదా- అని చింతింపవలసిన పనిలేదు. సాధన ప్రారంభమైతే చాలు అభయహస్తం సాధకుని వెన్నంటి ఉంటుంది. మృత్యువుకూడా నా అభం ఒదిగి ప్రవర్తిస్తుంది. ఎరిగి ప్రవర్తిస్తుంది. నా ప్రతినిధిగా వర్తిస్తూ, సా కావలసిన దోహదాన్ని సావధానంగా అందిస్తుంది.

సముద్రజలాలు ఉప్పదనాన్ని కలిగి ఉంటాయి. సూర్యకిరణం గురూపదేశమై ఆ జలాలమీద పడుతోంది. ఆ ఉపదేశానికి పులకించిన సముద్రజలాలు తమ ఉప్పదనాన్ని సన్న్యసించి సూర్యకిరణం వెంట పైకి సాగుతున్నాయి. పరిశుద్ధమయిన స్థితిని అందుకొంటూ పైకి సాగుతున్నాయి. అలా పైకి ప్రయాణం చేసి చేసి మేఘాల రూపాన్ని ధరిస్తున్నాయి. ఈ మేఘాలు క్రమంగా కొంతసేపటిలో వర్షింపగలవు అని అనిపిస్తుండగా ఇంతలో ఎటువైపునుండో గాలులు వీస్తాయి. ఆ గాలులు పెనుగాలులయినప్పుడు, ఆ మబ్బులు ఛిన్నాభిన్నమై చెదిరిపోతాయి. అరెరె! కథ ఒకదారికి రాకముందే చెదిరిపోయాయే- అనిపిస్తుంది. కథ పూర్తి కాలేదుకదా- అని బాధ కలుగుతుంది. ఇప్పుడా జలాలు ఏమైనాపుకొన్నట్లు? సూర్యకిరణం ప్రేరణతో సముద్రజలాలుగాఉన్న అవి, తమ ఉప్పదనాన్ని వదులుకొని, ఊర్ధ్వయానం పట్టాయి. మేఘాలస్థితి వరకు వచ్చాయి. కాని ఇంతలో గాలులు వచ్చిపడ్డాయి- మృత్యువులాగ! మేఘాలు ఛిన్నాభిన్నమైనాయి. మరి ఇప్పుడీ జలాల భవిష్యత్తు ఏమయినట్లు! అవి ఏమి బావుకొన్నట్లు. ఉన్న ఉప్పదనాన్ని వదులుకొన్నాయి. పొందవలసిన పరిణతిని పొందలేదు. మరి ఇబ్బందికాదా? అనిపిస్తుంది. అనిపించడమేమిటి, కనిపిస్తున్నదికూడా అదేకదా!

అయినప్పటికీ కంగారుపడవలసిన పనిలేదు. పెనుగాలులచేత ఛిన్నాభిన్నం చేయబడిన మేఘాలు తాత్కాలికంగా చెదిరిపోతున్నాయి తప్ప అవేమీ చెదిరిపోవడంలేదు. ఆ గాలుల తాకిడికి తమకు ప్రాప్తమున్నచోటికి కొట్టుకుపోతున్నాయి. ఆ చోటున ఆగి మరల దగ్గరవుతాయి. మేఘాలరూపాన్ని పూర్ణంగా ధరిస్తాయి. చిక్కగా, చక్కగా, దట్టంగా అల్లుకొంటాయి. ఆ ప్రాప్తమున్న ప్రాంతంలో తనివితీరా వర్షిస్తాయి. కనుక పెనుగాలులు మేఘాలకు తగినచోటును నిర్దేశించడానికి పనికివచ్చాయితప్ప వేరుకాదు.

అలా తనివితీరా వర్షిస్తున్నవేళ ఆ జలాలు స్వచ్ఛమై, శక్తిమంతమై, ఆ ప్రాంతభూములను పులకింపజేయగల, ప్రసవింపజేయగల దివ్యశక్తులకు ఆటపట్టయి వర్ధిల్లడం జరుగుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ వర్షజలాలు భూమికి ప్రాణప్రదాలు. సృష్టికి వృద్ధికారకాలు. వీర్యశక్తి సమన్వితాలు. దైవానుగ్రహానికి సంకేతాలు.

అలాగే సాధన పూర్తికాకుండా శరీరాన్ని విడిచిపెట్టినవారు కూడా అభివృద్ధిపథంలోనే పయనిస్తారు. వారి కథకూడా ఈ మేఘాలవంటి కథయే అవుతుంది. ఉప్పదనాన్ని సన్న్యసించడంవల్ల సముద్రజలాలు క్రమంగా ఎంతటి దివ్యస్థితినిపొందాయో, సాధన ప్రారంభించి, అంతవరకు తానున్న కూడని స్థితులనుండి తనను తాను కూడదీసుకోవడం ప్రారంభించిన సాధకుడుకూడా క్రమంగా అంతటి దివ్యస్థితిని పొందగలడు. పెనుగాలులు మేఘాలను ఛిన్నాభిన్నం చేసినట్లు, మృత్యువు వల్ల సాధకునిస్థితి, తాత్కాలికంగా అంతుపట్టనట్లు అనిపించవచ్చు. కాని ఆమేఘాలు ప్రాప్తమున్నచోటుకు చేరుకొన్నట్లు, సాధకుడుకూడ తనకు తగినచోటుకు చేరుకొనగలడు. ఆ జలాలు స్వచ్ఛతనుపొంది, శక్తిమంతమై దివ్యశక్తులను సంతరించుకొని భూమికి మరల దిగివచ్చినట్లుగా ఇతడు అన్నివిధాలా తగిన పునర్జన్మను పొందగలడు. తన సాధనను సజావుగా కొనసాగించగలడు.

సాధన జరుగుతూ ఉండగా, మృత్యువువచ్చి శరీరాలు తొలగిపోయినప్పుడు ఆ సాధకుడు సూక్ష్మమైన దివ్యలోకాలలో పుణ్యప్రదమయిన స్థితిలో కావలసినంతకాలం సేద తీరుతాడు. ఆటుపైన అతనికి మళ్ళీ జన్మ వస్తుంది. ఇదివరకటి జన్మలో సాధన జరుగుతున్నవేళ, అతడేమయినా అసౌకర్యాలను అనుభవించి ఉంటే, అటువంటి ఇబ్బందికరమయినవన్నీ ఈ జన్మలో సరిజేయబడతాయి. సాధనకు కావలసిన అవకాశాలు పుష్కలంగా లభించేవిధంగా ఈ జన్మ తీర్చిదిద్దబడుతుంది. క్రిందటి జన్మలో పరిశుభ్రమయిన పరిసరాలు, కుటుంబంలో సదాచారం, ఆహారవిహారాల విషయంలో సరిఅయిన పద్ధతులు లేక సాధకుడు అసౌకర్యానికి గురయ్యాడనుకోండి. ఈసారి జన్మలో ఆ అసౌకర్యాలు సర్దుకొంటాయి. శుచి, శుభ్రము, సదాచారము, అన్నివిధాలా మంచి నడవడి కలిగినకుటుంబంలో ఈసారి జన్మలభిస్తుంది. దానితో అతడి సాధన వేగాన్ని అందుకొంటుంది.

క్రిందటిజన్మలో సంపదలు అంతగా లేక, వనరులు అంతగా అందిరాక అనుకొన్నంతగా సత్కార్మచరణగాని, సేవా కార్యక్రమాలనుగాని నిర్వహించలేకపోవడం జరిగిందనుకోండి. ఈసారి జన్మలో శ్రీమంతుల ఇంటిలో అతడు జన్మిస్తాడు. సత్కర్మను సేవగా ఆచరించడంలో సకలసంపదలూ అతడిని చుట్టుముట్టి నిలబడతాయి. వనరులన్నీ అలవోకగా ఒనగూడుతాయి. సేవారూపమయిన సత్కార్మాచరణ తృప్తిగా చిరకాలం నిర్వహించే వీలు కలుగుతుంది. క్రిందటిజన్మలో

ఏర్పడిన లోటు ఇలా అలవోకగా తీర్చబడుతుంది. దానితో సాధకుడు పరితృప్తి చెందడానికి వీలు కలుగుతుంది. సాధన విజృంభించడానికి దారి సిద్ధ మవుతుంది.

క్రిందటి జన్మలో, జరుగుతున్న సాధనకు తగిన దోహదం అందలేదను కోండి. అతని జన్మగాని, కులమతాలుగాని, సాంఘికస్థాయిగాని, సమాజస్థితి గతులుగాని, విద్యాగంధం కరువవడంవల్లగాని, అర్హత ఉందనిగాని, లేదనిగాని, ఏదో ఒక కారణంచేత సాధనకు దోహదం అందిరాక సాధకుడు తపనపడి, తపన పడి శరీరాన్ని విడిచిపుచ్చాడనుకోండి. బ్లాకు బోర్డుమీద వ్రాయబడినదానిని డస్టరుతో తుడిచివేసినట్లుగా మృత్యువు ఆ కథనంతా తృటిలో తుడిచివేస్తుంది. ఈసారిజన్మ అతనికి వేదవాదుల ఇళ్ళలో లభిస్తుంది. యోగసాధనలో ఆరితేరిన వారి ఇంటిలో లభిస్తుంది. అన్నివిధాలా సాధనలో పరిపూర్ణతచెంది, తగిన మార్గంలో ఆ సాధనను అతనికి కోరి మరీ అందింపగలిగిన వారి ఇంటిలో అతడు జన్మిస్తాడు. పొదుగుతున్నవేళ బిడ్డ ఎదిగిరావడానికి కోడిపెట్ట కోడిగ్రుడ్డుకు ఎలాంటి వాతావర ణాన్ని అందిస్తోందో, అలాంటి వాతావరణం ఈసారి జన్మలో అతనికి అనుగ్ర హించబడుతుంది. ఇలాంటి జన్మ, ఇలాంటి అవకాశం లభించడం ఎంత దుర్ల భం ! 'మనుజన్మ' ఇలాంటి మహత్తరమయిన అవకాశం కావటం ఎంతటి విశే షం ! మరి అంతటిరంగం సిద్ధం కావడానికి మృత్యువు ఒకతెరలా పనిచేస్తున్నది. అంతత్వరగా కావలసిన పనిని జరిపిస్తున్నది.

సదాచారం కలిగి సంపన్నస్థితిలో వెలుగొందుతూ ఉదారమయిన ప్రవ ర్తన గలిగిన ఒకగృహస్థుకు ఆరుగురు కొడుకులు. ఆ గృహస్థుయొక్క ఆధ్యా త్మిక భావన ఆ కొడుకులందరిలోనూ కనబడుతూనే ఉంటుంది. అలాంటివారి ఇంటిలో ఒకరోజున నాడీగ్రంథగోష్ఠి జరిగింది. అందరి పూర్వజన్మలూ తడమ బడ్డాయి. ఆ కొడుకులలో ఒక కొడుకుకథ చిత్రంగా చెప్పబడింది. దాని సారాం శం ఇది : ఈ గృహస్థు క్రిందటి జన్మలోకూడ దివ్యజీవనం గడిపినవాడే. కుటుంబసభ్యులు అతనికి కలిసివచ్చేవారు. అయితే తమతమ అవకాశాలనుబట్టి కలిసి వచ్చేవారు. వారితో ఒక పనిమనిషి కుటుంబం ఉండేది. వారు మాత్రం ఈ గృహస్థును బాగా కనిపెట్టి ఉండేవారు. ఆ పనిమనిషికి చిన్నకొడుకుండేవాడు. ఆ కుర్రవాడు స్నానపానాదుల విషయంలో నిష్ఠగా వర్తిస్తూ, ఈ యజమానికి కావల

సిన పూజాద్రవ్యాలను శ్రద్ధగా అమర్చిపెడుతూ ఉండేవాడు. అలా అల్లంత దూరాన కూర్చొని యజమానినికూడా కలుపుకొని, ఆ దైవానికి నమస్కరిస్తూ ఏదో భక్తిపారవశ్యంలో మునిగేవాడు. అలా సంవత్సరాల తరబడి సేవించాడు. ఆ సేవ ఫలించిందా అన్నట్లుగా ఈ జన్మలో అదే గృహస్థుకు కొడుకుగా పుట్టాడు. ఇప్పుడుకూడ మిగిలిన కొడుకులకన్న అతడికే భక్తిభావం ఎక్కువ. ఇందరిలోనూ తండ్రిని వెన్నంటిఉండేవాడు ఇప్పటికీ అతనే! ఈ కథ విని అందరూ ఆశ్చర్యానందాలను పొందారు. ఆ యజమాని పరవశించాడు కాలపురుషుడు మృత్యువు సాయంతో చేయగలిగిన పనులు ఇలా ఉంటాయి. సాగుతున్న సాధనకు అన్నివిధాలా సహకరించేలా ఉంటాయి. సాధనకు మనస్సు సిద్ధపడాలేగాని, ఇక అంతా సహకారమే! దేవదేవుని అభయహస్తం అలా మనను వెన్నంటి సాగుతుంది. కంటికి రెప్పలా మనను కాపాడుతుంది. కాలానుగుణంగా వచ్చే మార్పులను, సాధనకు అనుగుణంగా తీర్చిదిద్దుతుంది. సాధన వేగం పెరగడానికి కావలసిన చర్యల నన్నింటినీ తీసికొంటుంది.

తరువాతి జన్మలో అవకాశాలు మరింతగా కలిసి రావడంతో క్రిందటి జన్మనుండి కలిసివస్తున్న యోగసాధన మరింత వేగాన్ని అందుకొంటుంది. కావలసిన పనినిచేస్తూ, రాత్రి అయిన కారణాన ఆ కాసేపూ నిద్రించినవాడు, మెలకువ వచ్చిన క్షణంనుంచీ మళ్ళీ ఆ పనినిగూర్చే ప్రయత్నిస్తాడుకదా! ఒకరకంగా ఆ రాత్రి నిద్ర అతడికి అప్పటికి కావలసిన విశ్రాంతినిస్తూ, మరునాటి పనికి కావలసిన శక్తియుక్తులను కూడ అంతలోనే సంతరించిపెడుతుంది. దానితో అతడు సేదతీరి, శక్తిమంతుడై మిగిలిన పనిని మరింత హుషారుగా చేస్తాడు. అలాగే సాధన సాగుతూ ఉండగా నడిచివచ్చిన మృత్యువుకూడ ఈ నిద్ర వంటిదే! అది విశ్రాంతినిస్తుంది. సేద తీరుస్తుంది. పరిపుష్టం చేస్తుంది. మళ్ళీ జన్మ వచ్చేటప్పటికి సరిక్రొత్త దేహంకూడ అమర్చిపెట్టబడి ఉంటుంది. దానితో, నిద్రనుండి లేచినవాడు పనిని కొనసాగించినట్లుగా, సాధకుడు తన సాధనను దివ్యంగా కొనసాగిస్తాడు. పనిచేస్తూ పడుకొన్నవాడు ఆ స్పృహతోనే నిద్ర లేచినట్లుగా, 'నన్ను' పొందే ప్రయత్నంలో దేహాన్ని విడిచిపెట్టినవాడు, ఆ ప్రయత్నాన్నే కొనసాగిస్తాడు. యోగసాధనకు ఉన్నశక్తి అలాంటిది. ఆ అభ్యాసబలం, బుద్ధిని,

మనస్సును, ఇంద్రియాలను అవలీలగా యోగసాధనవైపు మళ్ళిస్తుంది. దానితో జీవితం రాణిస్తుంది. జన్మల పరంపర శుభదాయకమవుతుంది.

ఒకొక్కప్పుడు తరువాతి జన్మలో మొదటిదశ, పరిస్థితుల ప్రభావానికి లోనయి, తాత్కాలికంగా చెదరవచ్చు. పరిస్థితులు, పరిసరాలు, సాంగత్యాలు వ్యక్తిని దారి తప్పించవచ్చు. అప్పుడప్పుడు చెడిపోయినట్లు కనిపిస్తాడు. 'ఇంకేమున్నది, ఇకది పని అయిపోయింది'— అనిపిస్తుంది, కాని అది తాత్కాలికము, మబ్బుతెర తొలగి, సూర్యుడు బయటపడినట్లుగా, జీవితంలోని ఏదో ఒక సన్నివేశంతో అరడా కూడని స్థితినుండి బయటపడతాడు. నన్ను పొందే ప్రయత్నం అక్కడనుంగి దీక్షగా కొనసాగిస్తాడు. పూర్వజన్మ నుండి సాగుతున్న ప్రయత్నం ఉన్నదే, ఇక అది ఒక ఊపు అందుకొంటుంది. ఆ ఊపుతో ఆ ప్రయత్నానికి వేగం మనం ఊహించలేనంతగా పెరుగుతుంది. ఇక అది సిద్ధిని పొందేవరకు ఆగదు. వాల్మీకి మహర్షి, వేమన యోగి మొదలయిన వారి జీవితగాథలు ఇందుకు ఉదాహరణలుగా మనం గమనించవచ్చు.

పూర్వజన్మనుండి సాగుతూ వస్తున్న ప్రయత్నం ఈసారి జన్మలో తాత్కాలికంగా మరుగున పడవచ్చుగాని, అది అందిరాక పోవడమంటూ ఉండదు. సాధనరూపంలో జరిగిన ప్రయత్నానికి బలమెక్కువ. అది ఎక్కడికీ పోదు. అవకాశం రాగానే మళ్ళీ విజృంభిస్తుంది. అవకాశం కోసం ఎదురుచూస్తూ ఉంటుంది. కనుక నన్ను పొందేటందుకుగాను పూర్వజన్మలో ఏమాత్రం ప్రయత్నం జరిగినా, అది ఇప్పటి జన్మలో కావలసినంతగా అక్కరకు వస్తుంది. జీవితాన్ని చెదిరిపోకుండా పట్టి నిలబెడుతుంది. కనుక దైవానికి అనుగుణంగా జీవితాన్ని మలచుకోడానికి సాధకుడు చేస్తున్న ప్రతి ప్రయత్నమూ కూడా జన్మల తరబడి అక్కరకు వస్తుంది.

ఈ ప్రయత్నం జరుగుతూ ఉండగా, వేదశాస్త్రాలు అధ్యయనం చేసినా పురాణేతిహాసాలు పారాయణ చేసినా, ఒనగూడే మేలు ఉన్నదే, అది చాలా విశేషమయినది. దైవానికి తగినవిధంగా జీవితాన్ని మలచుకోవడమనే ప్రయత్నంతో ఉన్నవారికి ఈ దివ్యగ్రంథాలలోని ప్రతి అంశమూ, కావలసిన దారిని చూపిస్తాయి, ఆచరించడమన్నది ఎలాగో నేర్పుతాయి. జీవితాన్ని మలచుకోవడమెలాగో, అవి ఎప్పటికప్పుడు తెలియజెబుతూ ఉంటాయి. కర్తవ్యం తోచని

తిలో ఈ గ్రంథాలను సాధకుడు తెరిచాడనుకోండి. అతనికి కర్తవ్యం బోధ
డుతుంది. మనకొరకే, ఈ సన్నివేశం కొరకే ఇక్కడ ఇలా వ్రాయబడింది!
న్నట్లుగా ఉంటుంది. సాధనలో ఉన్నవారికి ఈ దివ్యగ్రంథాలు అంతగా అక్క
కు వస్తాయి. సాధన సాగుతున్నవేళ అవి చేయి పట్టుకొని నడిపిస్తాయి. మనను
నిపెట్టుకొని కాచుకొంటాయి. ఒక మంచి మిత్రునిలా మనను వెన్నంటి సాగు
ాయి, ప్రజ్ఞామయమూర్తులై మనను నడిపిస్తాయి. దైవానికి ప్రతినిధులై
ైవంయొక్క వ్యక్తరూపాలై మనతో సహచరిస్తాయి. సనాతనము, నిత్యనూత
ము అయిన సాంగత్యాన్ని మనకు అనుగ్రహించి, మనలను పునీతులను
ేస్తాయి. కనుక పూర్వజన్మలో జరిగిన ప్రయత్నమున్నదే, అది ఈ జన్మలో
ివ్యగ్రంథాలు ఇలా ప్రసన్నం కావడానికి పనికివస్తుంది పాండిత్యం చర్చలకూ
న్మానాలకు పనికిరాగా, ప్రయత్నం సాంగత్యాన్ని అందించి తరింప
ేస్తుంది.

సాధన ఇలా సాగుతూ ఉండగా మరికొన్ని జన్మలు అవసరం కావచ్చు.
అందుకు చింతింపవలసిన పనిలేదు. జన్మనుండి జన్మకు సాధనకు కావలసిన
అవకాశాలు పెరుగుతాయేతప్ప తగ్గవు. కనుక జన్మల పరంపర సాధనకు దోహద
కారిగా మనం గమనించవలసి ఉంది. జన్మలిలా సాగుతూ ఉండగా ఒక శుభ
ముహూర్తాన సిద్ధిదానికదిగా సాధకుని వరిస్తుంది. అక్కడనుండి అతడు జీవ
న్ముక్తుడవుతాడు. అప్పటినుండి అతని జన్మకర్మలు దివ్యమైనవి అవుతాయి,
సాధారణజన్మలకు బదులుగా దైవానుగ్రహ విశేషాన "కారణజన్మలు" అతడికి
లభిస్తాయి.

నన్ను అందుకొనే ప్రయత్నం నీ నుండి ప్రారంభం కావాలేగాని, ఇక
అది ఆగదు, సరికదా పోను పోను ఆ ప్రయత్నానికి వేగం పెరుగుతుంది!
మధ్యలో మృత్యువు ముంచుకువచ్చినా భయపడవలసిన పనిలేదు. ఆ మృత్యువు
కూడ సాగుతున్న ప్రయత్నానికి దోహదకారి అయ్యేలాగున నేను చూడగలను.
దానితో జన్మనుండి జన్మకు ఈ ప్రయత్నం కొనసాగుతుంది. ఆ జన్మలపొడుగు
నుండి 'నేనే' సాగుతున్న ప్రయత్నాన్ని ఎప్పటికప్పుడు అందుకొంటూ ఉంటాను
ఆదుకొంటూ ఉంటాను. సిద్ధి లభించేవరకు నేనా ప్రయత్నాన్ని వెన్నంటి ఉండి
అన్నివిధాలా కాచుకొంటూ ఉంటాను. సాధకుడు తన ప్రయత్నంలో తానుండే
వాలు, మిగిలినదంతా నేను చూచుకొంటాను !' ఇదీ భగవానుని అభయవచనం.

# 7. భయాన్ని తొలగిస్తాను !

నేహాభి క్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥
(2అ॥-40శ్లో॥)

"నన్ను పొందేటందుకు సాధకుడుచేసే ప్రయత్నమున్నదే, దానికెన్నడూ నాశముండదు. ఆ ప్రయత్నానికి ఎన్నడూ విఘ్నాలురావు. ఈ నా మార్గాన ఏ మేరకు ముందుకు సాగినా, ఆ మేరకు భయము తొలగిపోగలదు. ఈ నా మార్గాన ఏ మాత్రం ధర్మాచరణ సాగినప్పటికీ, ఆ సాగిన ధర్మాచరణ దొడ్డవయిన భయభ్రాంతులను పెద్దఎత్తున తొలగించగలదు !"

నన్ను పొందేటందుకుగాను సాధకుడుచేసే ప్రయత్నం ఎన్నడూ దెబ్బతినదు. దానికి ఆగిపోవడమన్నది ఉండదు. పరిస్థితులవశాన సాధకుడు తాత్కాలికంగా ఏమరుపాటు చెందినప్పటికీ, మరల అదును దొరకినప్పుడు ఆ ప్రయత్నం విజృంభిస్తుందే తప్ప విడిచిపెట్టదు. ఆ ప్రయత్నంలోని రుచిని అనుభవించిన మనస్సు ఇక దానిని మరువలేదు, విడువలేదు. తాత్కాలికంగా మరుపు కలిగినప్పటికీ ఆ మరుపు ఎక్కువకాలం ఉండదు. ఒకసారి రుచి చూచిన మనస్సు దానినుండి ఎడబాటును ఎక్కువకాలం సహించలేదు. దానికి ఏదో ఒక సన్నివేశం నిమిత్తమై మళ్ళీ ఆ ప్రయత్నంలోనికి వచ్చేస్తుంది. ప్రయత్నాన్ని మళ్ళీ ప్రారంభించిన మనస్సు అలవోకగా వేగాన్ని పెంచుతుంది. ఆ ప్రయత్నం ఎంత విలువైనదో, ఎంత అవసరమైనదో — అనుభవపూర్వకంగా అది తెలుసుకొంది కదామరి!

ఇక ఆగమన్నా ఆగదు. కనుక నువ్వు నన్ను పొందేటందుకు సాగే ప్రయత్నము న్నదే దానికి నాశములేదు.

అలాగే 'నా' మార్గానసాగే ఆ ప్రయత్నానికి ఎన్నడూ విఘ్నాలుకూడా రావు. మనస్సు ఇంకా పరిణితి చెందనప్పుడు, సాధనలో విఘ్నాలు వచ్చినట్లు కనిపిస్తాయి. ఆ కనిపించిన విఘ్నాలను దాటుకొంటూ వెళ్ళిన తరువాత కొంత కాలానికి తెలుస్తుంది. అవి విఘ్నాలుకాదనీ, నీ సాధనను విజృంభింపజేసే అవకాశాలనీ ! అప్పటినుండి అతడికి బోధపడుతుంది. మనం విఘ్నాలు అనుకొంటున్నవి విఘ్నాలుకావు, అవి మనం ఎదిగిరావడానికి ఎదురుగావస్తున్న అవకాశాలు మాత్రమే. అని ! సాధనలోని రుచి ఇంకా తెలియని మనస్సు వాటిని విఘ్నాలుగా పొరబడుతుంది. రుచి తెలిసినకొద్దీ అవి మనకొరకు నడిచివస్తున్న అవకాశాలని తెలుస్తుంది. సాధనకు ఆ సన్నివేశాలు అడ్డంకులుకాదు, సరికదా చక్కనిసోపానాలు. అని బోధపడుతుంది.

'నేను' అనబడు దివ్యప్రజ్ఞకు అనుగుణంగా 'నాది' అనబడు దేహరాజ్యాన్ని మలచుకొంటూ రావడమెలాగ అన్నది జీవనసూత్రాలలో వివరించబడింది. నిత్యజీవితంలో ఆ సూత్రాలను అనుఉపరచడం ప్రారంభిస్తేచాలు, దేహరాజ్యం దివ్యప్రజ్ఞలో విహరించడమన్నది అలవోకగా జరుగుతుంది. ఆనందప్రదంగా జరుగుతుంది. అనుభూతిమయంగా జరుగుతుంది. అప్పుడు జరిగే కర్మాచరణమున్నదే. అది 'ధర్మాచరణ' మనబడుతుంది, కారణం, కర్మాచరణ మొత్తము సృష్టిధర్మానికి అనుగుణంగా జరుగుతున్నది కనుక !

అలాంటి ధర్మాచరణం ఏమాత్రం జరిగినా ఆ మేరకు సాధకుడు భయ్యనుండి విమోచనం పొందుతాడు. ఆ మేరకు సాధకుడు ప్రశాంతతను అనభవిస్తాడు.

ఇక్కడ భయమంటే ఏమిటి ? మనకు కొంత వివరణ కావాలి! దీనినే భవభయం అంటారు. భవము అంటే పుట్టుక. పుట్టటంచేత కలిగే భయమిది. జనన మరణాలను గూర్చిన భయం. కష్టసుఖాలను గూర్చిన భయం. వ్యాధి బాధ

ను గూర్చిన భయం. భవిష్యత్తును గూర్చిన భయం. జీవికను గూర్చిన భయం.
ీవితం ఎలా నడుస్తుందోనని భయం. పనులు చేసినప్పుడల్లా ఫలితాలను గూర్చిన
యం. బంధుమిత్రుల యోగక్షేమాలను గూర్చిన భయం. పరిస్థితులు సజావుగా
రుగుతాయా, లేదా అని భయం. ఎవరేమి చేస్తారో అని భయం, రేపు ఏమవు
తుందోనని భయం. కుటుంబాన్ని నిర్వహించగలనా అని భయం. పిల్లలను తీర్చి
దిద్ది నిలబెట్టగలనా అని భయం. బాధ్యతలనన్నింటినీ నెరవేర్చగలనా అని భయం
ఇలా అడుగడుగునా భయం! ఒకటే భయం! ఇదే భవభయం! పుట్టుకతో మాన
వుడు తెచ్చుకొన్న భయం!

నేడు మనం సమాజాన్ని అవినీతిమయంగా చూస్తున్నాం. కర్తవ్యనిర్వ
హణలో అవినీతికి పాల్పడనివారు మనకు అరుదుగా కనిపిస్తున్నారు. కాని అవి
నీతికి పాల్పడుతున్న వారందరికీ తెలుసు ఇది మంచి లక్షణం కాదని, అయినా
పాల్పడుతున్నారు. ఎందుచేత? భయం వారిని నడిపిస్తున్నది. జీవితాన్నిగూర్చి,
భవిష్యత్తునుగూర్చి, భవిష్యత్తులో నెరవేర్చవలసిన బాధ్యతలనుగూర్చి, వెంటాడు
తున్న భయమే మానవుని అవినీతిపరునిగా చేస్తున్నది. అవినీతికి పాల్పడకపోతే
బ్రతుకలేనేమోనన్న భయమే అతడి బ్రతుకును అవినీతిమయం చేస్తున్నది. అప్పు
డతని దగ్గర మనమెన్ని నీతి సూత్రాలను వల్లించినా ప్రయోజనం ఉండదు. ఆ
నీతిసూత్రాలు అతని భయాన్ని పోగొట్టలేవు. నా పరిస్థితి మీకు తెలియదులెండి.
నా స్థితిలో మీరుంటే అప్పుడు మీకూ తెలుస్తుంది. 'ఒడ్డున ఉండి చెప్పడం కాదు'-
అన్నట్లు చూస్తాడతను. మనం చెప్పినవి అతడికి బోధపడలేదనికాదు. అతనిని
భయం నడిపిస్తున్నది. ఆ భయం ఒకపట్టాన పోయేదికాదు. జీవితం పట్టాలు
ఎక్కినప్పుడు మాత్రమే ఆ భయం తొలగిపోయేది.

అలాగే లోకంలో ఒకరినొకరు చంపుకొనేవరకు వెళుతున్నారు. వారిని
మనం రౌడీలంటున్నాం. గూండాలంటున్నాం. వారు దేనికయినా తెగిస్తారని
చెప్పుకొంటున్నాం. వారు తెగబడటం, తెగిపడటంకూడ చూస్తున్నాం. చిత్రమేమి
టంటే, వారిని నడిపిస్తున్నది కూడ భయమే! మనం ఎదుటివాడిని చంపకపోతే
ఎదుటివాడు మననెక్కడ చంపేస్తాడోననే భయం. ఆ భయమే వాడిని నడిపిస్తు

స్నది. వారిని చంపిస్తున్నది. ఆ భయమే వారికి లేకపోతే, లేదా ఆ భయం వారి నుండి తొలగిపోతే, వారింతటి పాపకార్యాలకు ఒడిగట్టరు.

మనం పరిశీలనగా చూస్తే సమాజంలో ఎక్కువచోట్ల మానవుడిలోని దుష్టత్వాన్ని ప్రేరేపిస్తున్నది కూడ, ప్రేరేపించి అతడిని దుష్టునిగా మారుస్తున్నదికూడ, ఈ భయమేనని మనకు తెలుస్తుంది, భయంనుండే అనుమానం, కలుగుతుంది. ఆ అనుమానం పెనుభూతమై మనిషిని వివశుడిగా మారుస్తుంది. ఆ వివశస్థితిలో ఏం చేస్తున్నదీ తెలియని పరిస్థితిలో పడిపోతాడు మానవుడు. కొన్ని చోట్ల పగ, ప్రతీకారాలకు వశుడవుతాడు. మొత్తంమీద మానవత్వం నుండి జారిపోతాడు.

అసలీ భయం ఎందుకు కలుగుతున్నది ? ఎప్పుడయితే మనం దేహాన్ని ధరించామో, మిగిలిన సృష్టికన్నా మనం వేరుగా కనిపించడం జరుగుతోంది. కనిపించడమేకాకుండా మనసుకు అనిపించడం కూడా జరుగుతోంది. మిగిలిన సృష్టిని మనకన్నా భిన్నంగా, పరాయిదిగా, మనకన్న వేరయినదిగా చూడటానికి అలవాటు పడడం జరుగుతోంది. ఆ అలవాటు ఘనీభవిస్తోంది. దీనితో అందరిలోనూ ఉన్న 'నేను' మనకు అందడం మానేస్తోంది. ఎక్కడ చూసినా దేహరాజ్యం వరకే మనకు కనిపిస్తోంది. ఇలా ఎప్పుడయితే మిగిలిన సృష్టిని మనకన్న వేరుగా చూశామో, అప్పుడే మన మనస్సులో భయం మొలకెత్తుతుంది. ఎవరు ఎలాంటివారో మనకెలా తెలుస్తుంది ? అనిపిస్తుంది. చూస్తూ, చూస్తూ వీరందరినీ ఎలా నమ్ముతాం ? అనిపిస్తుంది అయినా ఎందుకు నమ్మాలి? అన్న ప్రశ్న వస్తుంది. ఎవరు మన గురించి ఏమనుకొంటున్నారో— అన్న ప్రశ్న వస్తుంది. ఎవరు మనయెడల ఎలా ప్రవర్తించబోతున్నారో ? అన్న అనుమానం కలుగుతుంది. ఆ అనుమానంతో భయాందోళనలు కలుగుతాయి. మనస్సు అశాంతికి గురి అవుతుంది. ఎవరినీ నమ్మలేని స్థితి ఏర్పడుతుంది ఇదంతా కూడా అందరిలో ఉన్నది ఒకే 'నేను' అని మనం గమనించకపోవడంవల్ల ఏర్పడుతున్న విపరీతస్థితి ! ఎదుటివారిని పరాయివారుగా చూడటానికి అలవాటు పడటం వలన రూపుదిద్దుకొంటున్న దారుణస్థితి. ఇంతకంటే నరకం ఇంకేముంటుంది చెప్పండి, ఇంతకంటే బంధం ఇంకేముంటుంది చెప్పండి,

ఇలా 'నేను' అనబడే దివ్యస్థితి నుండి మనస్సు 'నాది' అనబడే దేహస్థితికి జారిపోవడాన్నే మన పెద్దలు 'సంసారము' అన్నారు. సంసారమంటే సంసరణము. సంసరణము అంటే జరిగిపోవడం, జారిపోవడం! 'నేను' అనబడే స్థితినుండి 'నాది' అనబడే స్థితికి మనస్సు జారిపోవడం. అటుపైన తన యందు, మిగిలిన సృష్టియందు ఉన్న 'నేను'ను పొడగట్టించుకోలేకపోవడం. దేహానికి పరిమితం కావడం. దేహమే నేను! అటుపైన ఏమీలేదు. అనేస్థితికి వెళ్ళిపోవడం. ఇవన్నీకూడ ఆ జారిపోవడంవల్ల వచ్చేఫలితాలే! ఇలా జారిపోయి ఇబ్బంది పడుతున్నవారినే మన పెద్దలు 'సంసార జీవులు' అన్నారు. ఇదితెలియక కొందరు ఆలుబిడ్డలున్నవారిని సంసారజీవులంటున్నారు. వారు సాధనకు అడ్డంకి అంటున్నారు. వారలా అనుకోవడం అపరాధం! ఆలుబిడ్డలుకూడ మనవంటి మనుషులే! వారూ మనలాంటి వ్యక్తులే! మనలాగ సాధనలో ఉన్నవారే! మనతో కలసి సాధన చేయడానికి వారు మన కుటుంబ సభ్యులుగ వ్యక్తమవుతున్నారు. కుటుంబ సభ్యులు బృందంగా రూపొంది ఒకరి సాధనకు మరొకరు దోహదపడాలన్నది సృష్టి ప్రణాళిక! దీనిని గుర్తెరిగినప్పుడు కుటుంబం ఒక శిక్షణ శిబిరం. భగవంతుడే కోరి చేసిన ఒక ఏర్పాటు అవుతుంది. కనుక తొందరపడి కుటుంబాన్ని సంసారం అని పిలువరాదు. ఆ కుటుంబసభ్యులను బంధాలుగా భావించరాదు. అలా భావిస్తే అది అపరాధం అవుతుంది. వారిలో ఉన్నది కూడా 'నేనే' కనుక, ఆ 'నేను'ను చిన్నచూపు చూసినట్లు అవుతుంది. అవమానించినట్లు అవుతుంది. ఔచిత్యం తెలియాలి! 'నేను' అనబడే దివ్యప్రజ్ఞ నుండి క్రిందికి జారి 'నాది' అనబడే దేహరాజ్యానికి పరిమితమై పోవడమే 'సంసారం' అని మనకు తెలియాలి! నాది అనబడే దేహస్థితి నుండి 'నేను' అనబడే దివ్యస్థితికి ప్రయాణం చేయడమే సాధన. 'నేను' అనబడే దివ్యస్థితిలో నుండి 'నాది' అనబడే దేహరాజ్యాన్ని నిలుపగలగడం, నడుపగలగడం సాధన. సిద్ధి! అప్పుడు మనం సంసారాన్ని దాటినవాళ్ళమవుతాము. సంసారస్థితికి అతీతమయిన స్థితిలో నిలబడినవాళ్ళమవుతాం. నిజస్థితిలో నుండి జారిపోకుండా నిలబడగలిగిన వాళ్ళమవుతాం. ఈ నిలబడ్డానికి జరిగే ప్రయత్నమే సాధన. నిలబడటమే సిద్ధి. అలా నిలబడి దేహం

నుండి వ్యక్తం చేయగలిగినదే నిజమయిన జీవితం. అప్పుడు జరిగే కర్మాచరణ, అది కర్మాచరణ కాదు, ధర్మాచరణ. మన సకలచర్యలూ సృష్టికి అనుగుణంగానే జరుగుతాయి. ఇక స్వంతకర్మ ఉండదు. సృష్టికర్మే ఉంటుందప్పుడు. అంతటి దివ్యమయిన స్థితి అనుభవానికి వస్తుంది. ఎప్పుడు? మనను 'నేను'తో శ్రుతి కలిపినప్పుడు! ఆ 'నేను'ను గురువుగా గుర్తించి, మనస్సు, తానుశిష్యుడై నడచుకొన్నప్పుడు!

భగవాన్ రమణమహర్షి తమ దగ్గరకు ఎవరయినావచ్చి ఉపదేశమీయమని కోరినప్పుడు చిరునవ్వు నవ్వుతూ, "అడుగుతున్నది ఎవరు?" అని అడిగేవారు. ఆ అడిగిన వ్యక్తి 'నేను' అనేవాడు. 'నేనంటే?' అని ప్రశ్నించేవారు రమణమహర్షి. 'నేనేనండి!' అనేవాడు ఆపకలవ్యక్తి. 'అదే నేనూ అడుగుతున్నాను నేను, నేను అంటున్నారు మీరు. ఆ నేనంటే ఏమిటో గమనించండి చాలు! సమస్తం అందులోనే ఉంది. ఇదే మనం పొందవలసిన ఉపదేశం' అనేవారు రమణమహర్షి. అలా ఆయన అంటుండగానే ఆ అడిగిన వ్యక్తి మనస్సుకూ 'నేను' అనే ఆ దివ్యప్రజ్ఞకూ శ్రుతి కుదరడం ప్రారంభించేది. ఇక అంతే! అదిగేందుకు ఇక మనస్సులేదు. నేను, నేను అంటూ ఆ 'నేను' వెంటవెళుతున్నది. నేనును రుచి చూస్తున్నది. తానుకూడా నేనుగా రూపొందుతూఉన్నది. సాధకుడు ఆ స్థితిని అనుభవిస్తూ ఉండగా, కాంతిగోళాలవంటి తమ దివ్యనేత్రాలతో రమణమహర్షి ఆ సాధకునివైపు తీక్షణగా చూసేవారు. ఇక అంతే! సాధకునకు సాధనలో పట్టు చిక్కేది. అతడు జీవన్ముక్తుడై సార్థకమైన జీవితాన్ని నడుపుతూ లోకశ్రేయస్సును సాధించేవాడు. ఇలా తమచెంతకు చేరిన వారందరినీ 'నేను' వెంట నడపడంలో రమణమహర్షి చిత్రమయిన ఒడుపును చూపేవారు. ఆ 'నేను'గా నిలబడండి చాలు!' అని చెప్పేవారు. వెలుగులలోకాలలో ఆ సాధకులను అలా విహరింపజేసేవారు. ఎప్పుడయినా, ఎక్కడయినా, ఎవరితోనైనా, వారు ఏ సంప్రదాయానికి చెందినవారయినా, వారి గురువు ఎవరయినా, వారి మతం ఏదయినా వారిలో జరుగవలసిన సాధన మాత్రం ఇదే, ఇదే!

మనస్సు 'నేను' వైపుకు మొగ్గి, 'నాది' అనబడే దేహరాజ్యాన్ని 'నేను'కు అనుగుణంగా మలచుకోవడం ప్రారంభించినకొద్దీ అంతవరకూ జీవి

తాన్ని వెన్నాడుతూ వచ్చిన భయభ్రాంతుల తీవ్రతతగ్గిపోవడం మొదలుపెడుతుంది. శరీరమనేది ఒక ఉపకరణమని తెలుస్తుంది. జీవితమనేది ఒక అవకాశమని బోధ పడుతుంది. జీవితంలోని ప్రతి సన్నివేశమూ, ఇటు మన ఎదుగుదలకూ, అటు లోకశ్రేయస్సుకూ అందివచ్చేలా నిర్వహింపబడుతుంది. దానితో స్వధర్మనిర్వహణ ఒక అర్చనావిశేషంగా రూపొందుతుంది. మన ప్రకారం జీవించడమన్నది కరగిపోయి, దేవదేవుని ప్రణాళిక ప్రకారం జీవించడమన్నది మనస చేతనవుతుంది. మన కర్మాచరణ ధర్మాచరణంగా రూపొందుతుంది. ఇష్టానిష్టాల స్థానంలో ధర్మాధర్మాలు నిలుస్తాయి. దృక్పథమన్నది కరిగిపోయి, సృష్టివధమే కనులముందు కదులుతుంది. మనసు ఫలితాలపై పట్టును విడిచిపెడుతుంది. పనిచేయడంపైననే తన దృష్టిని లగ్నం చేస్తుంది. సృష్టి ధర్మానికి అనుగుణంగా పని చేసుకొంటూ వెళ్ళిపోదాం— ఇక ఫలితమంటారా, పైవాడికి వదిలిపెడదాం !— అన్న నిర్ణయానికి వస్తుంది.

ఫలితాలయెడల ఎప్పుడయితే తాపత్రయపడటం మానివేసిందో, మనస్సు అప్పుడే చాలావరకు భయంనుండి బైట పడిపోతుంది. నేను ధర్మాన్ని ఆచరిస్తున్నాను. ''నేను ఆచరిస్తున్న ధర్మమే నన్ను రక్షిస్తుంది.'' అని దానికి తెలుస్తుంది. ఆ రక్షణ అనుభవానికి వస్తూ ఉంటుందికూడా! దానితో భవిష్యత్తునుగూర్చిన బెంగ తొలగిపోతుంది. రేపెలా ఉంటుందో అన్న శంక ఇక కలగదు. ఇవాళ తననుండి జరుగుతున్న ధర్మాచరణమే రేపటికి తనకు రక్షణను ఈయగలదని తెలుస్తుంది, ఇప్పుడు దివ్యంగా నిర్వర్తింపబడుతున్న ఈ వర్తమానమే రానున్న భవిష్యత్తుకు బాటలు వేయగలదని బోధపడుతుంది. మనసు ధర్మాచరణను ప్రారంభించి, 'నేను' అనబడు దివ్యప్రజ్ఞకు దగ్గరవుతున్నకొద్దీ పుట్టుకతో వచ్చిన భయమున్నదే, అది ఇలా ఇలా తొలగిపోతుంది. ఒక విధమయిన నిర్వృతి, ఒక విధమయిన నిశ్చింత అనుభవానికి వస్తుంది. ఈ ప్రయాణం సాగుతున్నకొద్దీ మనస్సుకు క్రమంగా పటుత్వం పెరుగుతుంది. సుఖశాంతులు అన్నవి దానికి లభిస్తూ ఉంటాయి. క్రమక్రమంగా జననమరణాదుల వలన ఉన్నభయం కూడ మనస్సుకు తొలగిపోతుంది. వాటిని దేవుని లీలలో భాగంగా దర్శించడం జరుగుతుంది. వ్యాధిబాధలకు, కష్టనష్టాలకు బెదిరిపోవడమన్నది తగ్గుతుంది. వాటికి అతీతంగా జీవించడం చేతనవు

తుంది. సమస్యలుగా ఉన్నవికూడా సన్నివేశాలనీ, వాటికి సమాధానం చెప్పేస్థితికి మనిషి ఎదగాలనీ అనిపిస్తుంది. దానితో ఆయా సన్నివేశాలకు భయపడటమన్నది పోయి, వాటికి తగినవిధంగా ఎదిగి ప్రవర్తించడం చేతనవుతుంది. 'నేను'పైపుకు సాగుతున్న ఈ ప్రయాణం అంతటి సామర్థ్యాన్ని ఇస్తుంది.

సృష్టితత్త్వం యెడల అవగాహన పెరుగుతున్నకొద్దీ ఈ సామర్థ్యం మరింతగా అందివస్తుంది. మనస్సు 'నేను'ను సమీపిస్తున్నకొద్దీ సృష్టితత్త్వం ఇంతింతగా, మరింతగా బోధపడుతుంది. దానితో భయపడవలసిన పనిలేదు. దేవదేవుని అభయహస్తం మనతో ఉన్నది అని మన మనస్సుకు అనిపిస్తుంది. అనుభవానికి వస్తుంది. ఇక భయం వదిలిపోతుంది మననుండి కదలిపోతుంది.

భయమేకదా మానవుణ్ణి అనేక వక్రమార్గాలు పట్టిస్తున్నదని చెప్పుకొన్నాం. ఆ భయం తొలగిపోతున్నదిప్పుడు ఆ భయం తొలగిపోయినప్పుడు ఇక కక్కుర్తులుండవు. అవినీతికి లోబడటముండదు. రాగద్వేషాలకు చోటుండదు. మద మాత్సర్యాదులకు అవకాశముండదు. ఇష్టానిష్టాల ప్రసక్తి ఉండదు. ఫలితాలకై ఆత్రులు చాచటముండదు! భవిష్యత్తుకు భీతిల్లడముండదు. తోటివారిని అనుమానించడముండదు. వారిని పరాయివారుగా చూడటముండదు. తనయందు, నిఖిలభూతము లందు ఉన్నది 'నేనే' అని స్పష్టమవుతుంది. ఆ 'నేనే' ఇన్ని జీవరాశులుగా విలాసాన్ని చూపుతున్నట్లు అనుభవమవుతుంది. ఆ అనుభవమలా కొనసాగుతూనే ఉంటుంది. భయమనే నరకస్థితినుండి అభయమనే స్వర్గస్థితి ఇలా లభిస్తుంది. ఇక జీవితం పునీతమవుతుంది దేవదేవుని ఒకానొక ఉచ్చారణ అవుతుంది. ఆ ఉచ్చారణ లోని వైభవం జగత్తునకు ఒక క్రొత్తకళను సంతరించి పెడుతుంది. ఆ క్రొత్త కళ ఈ మన జీవితం అందించిన లిపిగురుతుగా సృష్టికథలో నిలచి పోతుంది.

* * *

# 8. అందరినీ అక్కున జేర్చుకొంటాను !

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతి నోऽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే !
ప్రియోహి జ్ఞానినోऽత్యర్థ మహం స చ మమప్రియః॥
(7అ॥ - 16, 17శ్లో)

"నాలుగు విధాలుగా సాధకుడైన నరుడు నన్ను చేరుతున్నాడు. ఆర్తులుగా నన్ను సమీపించువారు కొంతమంది. జిజ్ఞాసువులుగా నన్ను సమీపించువారు కొంతమంది. అర్థార్థులై నన్ను స్మరించువారు ఇంకొందరు. జ్ఞానులై నన్ను చేరుకొనువారు మరికొందరు.

వీరిలో జ్ఞాని ఉత్తమస్థితిని పొందినవాడవుతున్నాడు. అతడు నాతో యోగస్థితిని అనుభవిస్తున్నాడు. నా యెడల అనన్యస్థితిని కలిగియుండి, ఏ కారణము లేకుండగనే నన్ను ప్రేమించగలుగుతున్నాడు. దానితోఅతడు నాకు పరమ ప్రియుడవుతున్నాడు.

ఆర్తి అంటే బాధ. ఒకవిధమయిన ఇబ్బంది, మనస్సును పెట్టే ఇబ్బంది, ఇది జీవించడం చేతకాక పోవడంవల్ల కలుగవచ్చు. అంటే అజ్ఞానంవల్ల పొరపాటులు జరిగి, దానిఫలితంగా ఈ బాధ అనుభవానికి వస్తుందన్నమాట.

బలహీనతలవల్లబాధలు కలుగవచ్చు. తెలియక పొరపాటుచేస్తే అదిఅజ్ఞానమవుతుంది. తెలిసి పొరపాటుచేస్తే అది బలహీనత అవుతుంది. ఇది కూడనివని-

అని తెలిసికూడా దానిని చేయకుండా ఉండలేకపోతున్నాము అనుకోండి అది బల హీనత. ధూమపానము, త్రాగుడు, జూదము మొదలయినవన్నీ బలహీనతలే! వాటికి లోనయినవారిలో, వాటినికూడని పనులని తెలియనివారెవరుంటారు. కనుక అవి బలహీనతలవుతాయి. దురభ్యాసాలవుతాయి. వారికున్న తెలివితేటలు ఈ దురభ్యాసస్థితిని నిలువరించలేకపోతున్నాయి. దానితో వారు ఆర్తి చెందుతున్నారు. నానావిధబాధలకు గురి అవుతున్నారు. ఒకొక్కప్పుడు కాలం కొన్నిమార్పులను తీసి కొని వస్తుంది మానవజీవితంలో! ఆ మార్పులకు తట్టుకొనేశక్తి మానవుని మనస్సుకు లేనప్పుడు ఆ మనస్సు ఆర్తి చెందుతుంది, విలవిలలాడుతుంది. నిస్సహాయస్థితిని అనుభవిస్తుంది. ఏది ఎందుకు జరుగుతున్నదో అంతుబట్టని స్థితిలో తాత్కాలికంగా అది పడిపోతుంది. జీవితంలో త్రోసుకువస్తున్న మార్పులను తట్టుకొనలేనిస్థితిలో మానవుని మనస్సు చెందుతున్న ఆర్తి ఇది, జీవనస్థితిగతులు, ఆ నడుమనవచ్చే వ్యాధి బాధలు, వీటన్నిటివలన అనుభవానికి వచ్చే అనిశ్చితస్థితి మానవుణ్ణి ఆర్తి చెందేట్లు చేస్తుంది. ఇది నాల్గవవిధమయిన ఆర్తి. ఇలా మానవుడు ప్రధానంగా నాలుగు విధాలుగా ఆర్తి చెందేటందుకు అవకాశముంది.

ఆర్తిని అనుభవిస్తున్నవేళ, దానిని తట్టుకొని, నిలబడటానికికాని, దాని నుండి బయటపడటానికిగాని తన శక్తియుక్తులు తనకు చాలనిస్థితి ఏర్పడుతుంది. దానితో తోటివారిలో తగినవారిని చూసి, వారి సహకారాన్ని కోరి పొందవలసి వస్తుంది. అంటే ఏం జరుగుతున్నది? సృష్టిరూపంలో దైవాన్ని అతడు ఆశ్ర యిస్తున్నాడన్నమాట. ఇది ఒక సోపానం. తోటివారినుండి సహకారాన్ని అందు కొంటున్నప్పుడు, సహకారంతోపాటుగా వారిలో కొందరినుండి కొన్ని సలహాలు కూడా అతనికి అందివస్తూ ఉంటాయి. 'మీరింత ఆర్తిలో ఉన్నారు. ఫలానా చోట ఫలానా మహనీయుడున్నాడు. ఆయనను ఒకసారి దర్శిస్తే బాగుంటుంది.' 'మీరింత ఇబ్బందిలో ఉన్నారు, జరుగుతున్న మానవప్రయత్నానికి తోడుగా మీరు సుందరకాండ పారాయణచేస్తే బాగుంటుంది. మీరింతగా వ్యథ చెందుతున్నారు. ఒకసారి ఫలానా పుణ్యక్షేత్రాన్ని దర్శించిరండి. మనసు కుదుటపడుతుంది. 'మీ, కలత బోధపడింది. దైవానికి ఇలా మొక్కుకోండి, మీకు దారి దొరుకుతుంది' ఇలాంటి సలహాలు అందుతూ వస్తాయి. ఈ సలహాలే ఆర్తి చెందినవాని మనస్సును క్రమంగా దైవంపైపకు మళ్ళిస్తాయి. దానితో అతడు కనబడుతున్న సృష్టి

రూపంతోపాటుగా, దానికి నేపథ్యంగా ఉన్న దైవంయొక్క సూక్ష్మరూపానికి కూడా దగ్గరవుతాడు. ఆ లభించిన సలహాలలో తన పరిమాణానికి ఏది దగ్గరగా ఉందో దానిని అనుసరించి, సూక్ష్మరూపుడయిన ఆ దైవానికి కూడా నమస్కరిస్తాడు. ఇది రెండవ సోపానం.

ఇలా సోపానాలమీదుగా సాగుతూ ఉండగా దైవంతో శ్రుతి కుదురుతుంది. దైవం అతడిని అనుగ్రహిస్తాడు. అతని ఆర్తి ఉపశమించడం మొదలు పెడుతుంది. బాధలనుండి కొంతలోకొంత బయటపడటం జరుగుతుంది. అమ్మయ్య! దైవం మన మొర వినిపించుకొన్నాడు అనిపిస్తుంది. దానితో దైవం యెడల గురి కుదురుతుంది. అతడున్నాడుకదా అన్న ధైర్యం కలుగుతుంది. అతడి అభయ ముద్ర అనుభవానికి అందుతుంది. ఇది మూడవ సోపానం. దైవాన్ని రుచి చూడ గలిగిన స్థితి ఇది. దేవుని ప్రేమను తగుమాత్రంగా అనుభవించగలిగిన స్థితి ఇది.

పరిస్థితులు కొంతలో కొంత కుదుటపడుతున్నాయి. ఆర్తియొక్క తీవ్రత కొంతలోకొంత ఉపశమిస్తున్నది. దైవానుగ్రహం అందివస్తున్నది. అని తెలుస్తున్నది. కాని ఆ అనుగ్రహాన్ని ఇంకా పొందాలి అనిపిస్తుంది. ఆ అవసరం కనిపిస్తుంది. దానితో జిజ్ఞాస ప్రారంభమవుతుంది ఆర్తి క్రమంగా జిజ్ఞాస రూపాన్ని ధరిస్తుంది. ఇది నాల్గవ సోపానం. నాల్గవ సోపానం దగ్గరకు వచ్చేసరికి ఆర్తుడు జిజ్ఞాసువుగా రూపొందుతున్నాడు.

జిజ్ఞాస అంటే తెలుసుకోవాలన్న కోరిక. దేవదేవుని దివ్యానుగ్రహం కొంతలోకొంత అనుభవానికి వస్తున్నది కనుక, తగుమాత్రంగా ఆ అనుభూతి అందుతూ ఉన్నది కనుక దానిని గూర్చి మరికొంతగా తెలుసుకోవాలని మనస్సు ఉత్సాహాన్ని చూపిస్తుంది. అందుచేతనూ ఆర్తి కొంతవరకు తీరింది ఇంకా కొంత మేరకు తీరవలసింది ఉంది. ఆ తీరవలసిన ఆర్తికోసం దైవశక్తిని మరింతగా ప్రసన్నం చేసికోవలసిన అవసరం కనబడుతుంది. దానితో దేవదేవునిగూర్చిమనస్సునకు జిజ్ఞాస కలుగుతుంది.

ఆర్తి కొంతవరకు తీరింది కనుక, ఆ మేరకు దైవశక్తిపైన విశ్వాసం ఏర్పడుతుంది. ఇంకా కొంతవరకు తీరవలసి ఉన్నది. కనుక ఆ మేరకు దేవ దేవుని యెడల జిజ్ఞాస ఏర్పడుతుంది. ఇలా విశ్వాసానికి జిజ్ఞాసతోడై, కథ

మంత ముందుకు సాగుతుంది. దేవదేవుని తత్త్వాన్నిగురించి, అతడి చరిత్రలను గురించి, అతడు ధరించిన మూర్తులను గురించి, ఆయా మూర్తుల రూపంలో అతడు చూపుతున్న, వైభవాలను గురించి, అనేక విధాలుగా అతడు చూపుతున్న లీలావిశేషాలను గురించి తెలుసుకొంటూ ఉండటం. చెప్పుకొంటూ ఉండటం, అధ్యయనం చేస్తూ ఉంటడం, అనుభూతిని అందుకొనే ప్రయత్నాన్ని చేస్తూ ఉండటం జరుగుతూ ఉంటుంది. ఇలా ప్రవర్తిస్తున్న వేళలో మానవుడు ఒక విద్యార్థిగా గోచరిస్తాడు. దేవదేవుని గూర్చిన అనేకానేక అంశాలను గూర్చిన అధ్యయనం చేయాలన్న ఉత్సుకతను చూపిస్తూ ఉంటాడు. అవన్నీ తనకు కూడ అన్వయింపబడాలనీ, ఆ అనుభూతి అంతా తానుకూడా అందుకోవాలనీ మనసారా కోరుకొంటూ ఉంటాడు.

జిజ్ఞాస ఇలా కొనసాగుతూ ఉండగా, మానవుడు క్రమంగా అర్థార్థిగా రూపొందుతాడు. ఇలా అతడు అయిదవ సోపానంలోనికి అడుగుపెడుతున్నాడు జిజ్ఞాసవల్ల అనేకానేక అంశాలు తెలుస్తూ వస్తున్నాయి. ఆ అంశాలలో కొన్ని విశేషాలు, కొన్ని వైభవాలు, కొన్ని లీలలు, కొన్ని మహిమలు గోచరిస్తూఉన్నాయి. ఇవన్నీ తెలియవస్తున్నమీదట ఆర్తి అప్పటికే తగ్గుముఖం పట్టింది కనుక జిజ్ఞాస అందిస్తున్న ఈ విశేషాలసాయంతో జీవితంలో తాను పొందదలచిన ప్రయోజనాలను పొందాలనీ, వాటినన్నింటినీ సాధించుకోవాలనీ మానవుడికి అనిపిస్తుంది. అర్థమంటే ప్రయోజనం. అర్థార్థి అంటే ప్రయోజనాన్ని అపేక్షిస్తున్నవాడు. ఇప్పుడతడు వివిధ ప్రయోజనాలను అపేక్షించేస్థితికి వచ్చాడన్నమాట! ఈ ప్రయోజనాలను అపేక్షించడంతో అతడినుండి ప్రయత్నం ఇక ముమ్మరంగా సాగుతుంది, జిజ్ఞాసకూడా ప్రయోజనాపేక్షతో మిళితమవుతుంది.

ఎక్కడ ఏ దేవతామూర్తులకు ఏయే మహిమలున్నాయో, ఏయే క్షేత్రాలు ఎలాంటి శక్తియుక్తులను సంతరించుకొన్నాయో, ఏయే మంత్రోపాసనలకు ఎలాంటి ఫలితాలు వస్తున్నాయో వీటన్నింటి వివరాలు సాకల్యంగా వీరు సేకరిస్తూ ఉంటారు. తాము పొందదలచిన ప్రయోజనాలకు ఆయావివరాలకు ముడిపెడుతూ ఉంటారు. ఒక్కొక్కప్రయోజనం సాధించడం కోసం ఒక్కొక్క మూర్తి, ఒక్కొక్కమంత్రం ఎంచుకొంటూ ఉంటారు. అలా ఎంచి, వరించి, ఆ ప్రయోజనాన్నిపొందే ప్రయత్నం చేస్తారు. ప్రయోజనాలు అనుభవానికి రావడాన్నిబట్టి ఫలానా దేవతా

మూర్తి తొందరగా పలుకుతాడనీ, ఫలానామూర్తి ఆలస్యం చేస్తాడనీ, తమ అను
వాలు చెబుతూ ఉంటారు. ఫలానామంత్రం తొందరగా ఫలిస్తుంది. ఫలానా
ంత్రమయితే ఆలస్యంగా ఫలిస్తుంది. ఈ మంత్రానికయితే నిష్ఠ కావాలి. ఆ
ంత్రానికైతే ఎక్కువనిష్ఠ అక్కరలేదు అంటూ, తమ అనుభవాన్ని పురస్క
ించుకొని, ఆయా మంత్రాలమధ్య ఉన్న భేదాలను ఏకరువు పెడుతూ ఉంటారు.
లాగే క్షేత్రాలమధ్య కూడా ! ఒక ప్రక్క దేవుడు ఒక్కడే అని అనిపిస్తున్నా
ఱొక ప్రక్క దేవుడు వీరికి ఇన్నివిధాలుగానూ గోచరిస్తూ ఉంటాడు. ఇన్ని
ెక్కువ తక్కువ అనుభవానికి వస్తాయి. మనస్సు అలా తూకం వేస్తూనే ఉం
ంది. తూకంలో మొగ్గిన దేవతామూర్తులకు అప్పటికి మెప్పుకోలు లభిస్తుంది.
ొగ్గనివారు ఉపేక్షింపబడుతూ ఉంటారు. ఈ తూనికలను చూస్తూ దేవదేవుడు
వ్వుకొంటూ ఉంటాడు. అర్థార్థులు మాత్రం లభించిన ప్రయోజనాన్నిబట్టి
ార్కులు వేస్తూ ఉంటారు. తమనుండి మార్కులు పొందడం ఆ దేవతా
ూర్తికే ఒక ఘనతసుమా! అన్నట్లు ప్రవర్తిస్తూ ఉంటారు. అతని పూజలు,
నస్కారాలు, యజ్ఞయాగాలు ఇలా ప్రయోజనాపేక్షతో పెనవేసికొని సాగుతూ
ంటాయి.

అర్థార్థియై ప్రయోజనాపేక్షతో ముందుకు సాగుతూ ఉండగా ఎప్పటికో
ఒక శుభవేళ దైవానుగ్రహ విశేషాన అతడికి జ్ఞాననేత్రం తెరుచుకొంటుంది. జ్ఞాన
ి అనుభవానికి రావడం మొదలుపెడుతుంది. ఇది ఆరవ సోపానం. ఆఖరి
ోపానం. ఈ స్థితిలో ప్రయోజనాపేక్ష అన్నది కరిగిపోతుంది. మనకు
ప్పుడు ఏమి కావాలి అన్నది మనకన్న బాగుగా తెలిసినవాడు దైవం అన్నఎరుక
భిస్తుంది. దానితో అతడిని ఇదికావాలి, అది కావాలి అని అడగడమున్నదే,
ది మన తెలియనితనం. ఒకరకంగా అది మనకు మనంగా వెలితిపడటమే !
ేనం అడిగినా, అడగకపోయినా కావలసినమేరకు అతడు ఆదుకొంటూనే ఉం
ాడు'— అని బోధపడుతుంది. ఇక కర్తవ్యనిర్వహణమే ఉంటుందిగాని ఫలితా
ై అర్రులు చాచడమన్నది ఉండదు దానితో నిష్కామకర్మ అలవడుతుంది.
భించినదానితో తృప్తిపడుటమన్నది చేతనవుతుంది. మనకు లభించవలసింది
ప్పుడూ లభిస్తుంది. అది ఎక్కడికీ పోదు' అన్న సత్యం గమనికకు వస్తుంది.
ానితో ఇక ఫలితాలపై వ్యామోహం కలుగమన్నా కలుగదు. కర్తవ్యనిర్వహణ

ఫలితాలనుబట్టిగాక, పరమాత్మనుబట్టి జరుగుతుంది. దీనితో జన్మకర్మలుదివ్యము లైనవి అవుతాయి. మన జీవితం సృష్టి ప్రణాళికలో భాగం అవుతుంది, మన నుండి సాగేది సృష్టికర్మ అవుతుంది. ఇక సొంతకర్మ ఉండదు, కాబట్టి కర్మ బంధం ఉండదు. మోక్షస్థితిలో కర్తవ్యనిర్వహణ సాగుతూ ఉంటుంది.

ఫలితాలపై అపేక్ష జారిపోయినట్లుగానే మరొక విశేషం జరుగుతుంది. అనన్యచింత అలవడుతుంది, ఇందరు దేవుళ్ళులేరు. ఒక్కడే దేవుడు! కనుక వేరుగా కొలవవలసిన పనిలేదు. వేరుగా కొలవవచ్చు అని తెలుస్తుంది. విభిన్నంగా కనబడుతున్న ఈ దేవతామూర్తులందరూ కూడా ఆ దేవదేవుని వివిధ భంగిమలే నని తెలుస్తుంది. కనుక ఇందరు లేరు. ఇన్ని ఉపాసనలు లేవు. ఉన్న దైవము ఒక్కడే. ఏ మూర్తిని మనం పూజించినా, ఆ నమస్కారం అందుతున్నది అతడికే. అన్న సత్యం బోధపడుతుంది. దానితో వివిధత్వం కరిగిపోయి, ఏక త్వం అనుభవానికి వస్తుంది. ఏకభక్తి, ఏకాంత సేవ, అనన్యచింత అంటే ఏమిటో బోధపడుతుంది. అందరిలో, అంతటా వ్యాపించి ఉన్న ఒకే 'నేను' స్పష్టంగా పొడగడుతుంది. 'నాది' అనబడే దేహరాజ్యం 'నేను' అనబడు దైవానికి శరణాగతి చెందుతుంది. దానితో 'నేను' అనబడు దైవంయొక్క చరణార విందాలు 'నాది' అనబడు దేహరాజ్యంపైన ముద్రింపబడతాయి. దేహ రాజ్యంకూడ దేవునిరాజ్య మవుతుంది. దేవుని పాలనలో అది ముందుకు సాగు తుంది. దేవుని ప్రణాళికలో భాగంగా ఇక మన జీవితం వ్యక్తమవుతుంది. ఈ మన జీవితం ఆ దేవదేవుని దివ్యమయిన ఉచ్చారణ అవుతుంది.

ఇలా జ్ఞాని అనబడు స్థితిలో నిష్కామకర్మ, ఏకభక్తి అనగాఅనన్య చింత వ్యక్తమవుతాయి. కర్తవ్యనిర్వహణకు వేరే కారణం ఉండదు. దేవదేవుని పైన ప్రేమకొద్దీ అది సాగుతూ ఉంటుంది. దేవదేవుని పైన ప్రేమకు కారణం ఉండదు. అతడిని ప్రేమించకుండా ఉండలేనిస్థితి ఉంటుంది. జీవితాన్ని అతడి వైపుకు నడుపకుండా ఉండలేనిస్థితి ఉంటుంది. అతడిని ప్రేమించడం, అతడిని అనుసరించడం మన మనస్సుకు స్వభావమవుతుంది. అలాంటిస్థితిలో దేవదేవుని అనుగ్రహంకూడ మనపై అపారంగా వర్షిస్తుంది. అతని పరమప్రేమ అనుక్షణం అనుభవానికి వస్తుంది. దైవం ప్రేమ స్వరూపుడు అన్న పెద్దల వాక్యానికి

అర్థమేమిటన్నది ఇక అనుభవానికి వస్తుంది. ఇలా నాలుగు దశలలో మానవుడు దైవానికి దగ్గరవుతున్నాడు. నాల్గవదశలో అతడికి పరిపూర్ణత లభిస్తోంది. ముందున్న మూడుదశలలో ప్రయాణం సాగుతున్నదికాని పరిపూర్ణత అంతగాలేదు. ఆర్తి ఉపశమించినట్లు గోచరించగానే దైవస్మరణ వెనుకబడవచ్చు. ఆపదలలో ఉన్నప్పుడు ఏడుకొండలవాడికి మొక్కుకొని ఆపద గడిచి, తరువాత దశాబ్దాలు గడిచి వృద్ధాప్యం వస్తున్నా ఏడుకొండలు ఎక్కడాన్ని వాయిదా వేస్తున్న వాళ్ళెందరు లేరు. ఆర్తి తగ్గి, అవసరం గడిచేటప్పటికి దైవంయెడల కూడ ఏమరుపాటు వచ్చేస్తున్నది. ఉపేక్ష కలుగుతున్నది. 'అతడు సహాకరించినమాట నిజమే! కాని వెళ్ళిరావాలంటే మనకెన్నిపనులూ, ఎంత కథా, ఎక్కడ ఖాళీ !' అనిపిస్తుంది. మనస్సు కూడా ఈ ఆలోచననే గెలిపిస్తుంది.

ఇక రెండవదశ జిజ్ఞాస. ఈ జిజ్ఞాసలోకూడ ఏమరుపాటు కలగడానికి అవకాశం ఉంది. కష్టాలు గడిచి, జీవితాన ఒకస్థిరత్వం వచ్చింది అనేసరికి జిజ్ఞాస కొంత తగ్గవచ్చు. లేదా ప్రయోజనాపేక్ష కొంత కలుగవచ్చు. ఏ మంత్రానికి ఎంత బలం, ఏ దేవునికి ఎంత మహిమ, ఏ ఉపాసన తొందరగా సిద్ధిస్తుంది, మొదలయిన అంశాలు జిజ్ఞాసగా చెలామణి కావచ్చు. అది కూడ తెలుసుకోవడమేకదా అనిపించవచ్చు.

అర్థార్థిస్థితిలో మనిషిని ప్రయోజనాపేక్ష నడిపిస్తుంది. ఆ ప్రయోజనాపేక్ష దేవునిమూర్తులను విడివిడిగా చూచేస్థితిని కూడ కల్పిస్తుంది. దానితో మనిషి మనసుకు వివిధత్వమే తప్ప ఏకత్వం అనుభవానికి రాదు. అసలాస్థితి అంతుబట్టదు.

జ్ఞాని స్థితి పూర్ణస్థితి. ప్రయోజనాపేక్ష కరిగిపోయి, నిష్కామకర్మ నడిచేస్థితి. వివిధత్వమన్నది కరిగిపోయి, ఏకత్వమన్నది అనుభవానికి వచ్చేస్థితి ! ఈ స్థితిలో తనకూ, మానవునకూ భేదమే లేదంటున్నాడు దేవదేవుడు. నేను అతడికి ప్రియుడను. నాకు అతడు ప్రియుడు నిజమునకు జ్ఞాని అనగా నేనే !' అన్నది అతడి వాక్కు.

అయితే అతడు పై మూడుస్థితులలో ఉన్నవారిని కూడా భక్తులుగానే గుర్తిస్తున్నాడు. 'పరిణామవశాన వారిలో అపరిపూర్ణతలు వ్యక్తంకావచ్చు. ఆ అపరిపూర్ణతలను నేనంతగా పట్టించుకోను. ఆ అపరిపూర్ణతలలో నుండి కూడా

వారు నన్ను స్మరిస్తున్నారుకదా ! అది చాలు. ఆ స్మరణే వారికి క్రమంగా పరిపూర్ణతను అందించగలదు. కనుకనే వారికి కూడ నేను జ్ఞాని సరసన నిలబడే అవకాశం ఇస్తున్నాను.' అన్నది భగవానుని అభయవచనం. జ్ఞాని స్థితిలో మిగిలిన మూడు స్థితులనుచేర్చి నాలుగువిధాలుగా మానవులు నన్ను భజిస్తున్నారు. నాలుగు దశలలో నన్ను చేరుతున్నారు. అందరూ నా భక్తులే! నన్ను చేరికొంటున్నవారే ! అనడం ఉన్నదే. అది అపారమైన ఆతడి అనుగ్రహానికి నిదర్శనం.

నిజానికి ఆర్తస్థితికీ, జ్ఞానస్థితికీ ఎంతతేడా ఉన్నది ? అలాగే మిగిలిన స్థితులకూ, జ్ఞానస్థితికీ ఎంత తేడా ఉన్నది ? అయినప్పటికీ దేవదేవుడు ఆ తేడాలను పట్టించుకోలేదు. పైగా ఆ తేడాలను సరిజేస్తున్నాడు. తన అభయముద్ర స్పర్శతో మన అపరిపూర్ణతలను పరిపూర్ణతవైపుగా నడిపిస్తున్నాడు. క్రమంగా, ఆ మూడు స్థితులవారిని నాలగవ స్థితిలోనికి నడిపిస్తున్నాడు. అలా నడిపించుకొంటూ వచ్చి, చూశారా ఈ స్థితి ఎంత బాగున్నదో! ఇప్పుడిక మీరే నేను. నేనే మీరు అంటున్నాడు. అలాంటిస్థితిని వారు పొందేవరకు దేవదేవుడు బాధ్యత పడుతున్నాడు.

ఈ సందర్భంగా మనమొక సూక్ష్మాన్ని గమనించాలి. మానవులు దేవదేవుని నాలుగు విధాలుగా చేరినట్లుగానే మనను కూడ నాలుగువిధాలుగా చేరుతూ ఉంటారు. తెల్లవారిలేస్తే మనను చేరవచ్చేవారిలో ఆర్తులుంటారు. జిజ్ఞాసువులుంటారు. అర్థార్థులుంటారు. జ్ఞానులుంటారు. ఆర్తులు తమ ఆర్తిని తీర్చమంటారు. ఆర్తి తీరడం ఆలస్యం. కనబడటం తగ్గిస్తూ ఉంటారు. జిజ్ఞాసువులు మనను అధ్యయనం చేస్తూ ఉంటారు. విశ్లేషిస్తూ ఉంటారు. తమకు నచ్చినప్పుడు దగ్గరగా మెలుగుతూ ఉంటారు. తమకు నచ్చనప్పుడు దూరంగా తిరుగుతూ ఉంటారు. అర్థార్థులు ప్రయోజనాపేక్షతో మనయెడల ప్రవర్తిస్తూ ఉంటారు. లభిస్తున్న ప్రయోజనాన్ని బట్టి దగ్గరగానో, దూరంగానో ఉంటూ ఉంటారు. ఇక జ్ఞానులు. సాధారణంగా వీరి సంఖ్య తక్కువ ఉంటుంది. వీరు మాత్రం మనను మనంగా ప్రేమిస్తారు. నిష్కామంగా ప్రేమిస్తారు, అకారణంగా ప్రేమిస్తారు. ఎల్లకాలమూ ఒకేలా ప్రేమిస్తారు. ఆ ప్రేమకు ఎక్కువ తక్కువలుండవు, ఎగుడుదిగుడులుండవు. మనకనిపిస్తుందికదా! మనచెంతకు చేరేవాళ్ళందరూ ఇలా ఉంటే ఎంత బాగుంటుందని !

బాగానే ఉంటుంది కాని అది సాధ్యపడదు నాలుగు విధాలవారూ చేరుతూనే ఉంటారు, అయితే మిగిలిన మూడు తరగతుల వారిని మనం చిన్నచూపు చూడకూడదు. మనం కూడా దేవదేవునిలాగానే నాలుగువిధాల వారియెడల ప్రవర్తించాలి ! ఎదిగి రావలసిన మూడు విధాలవారికీ తగినదోహదాన్ని ప్రేమతో అందించాలి క్రమంగా వారు కూడ జ్ఞాని స్థితిని పొందేలాగున చూడాలి అప్పుడు దేవదేవుడు మనను మెచ్చుతాడు. మనము కూడ తనవలె ప్రవర్తిస్తున్నందుకు ముచ్చటపడతాడు. మన యెడల అతడు ముచ్చటపడటంకన్నా మనకు కావలసినదేమున్నది !



# 9. అనన్యచింతన నీది-యోగక్షేమాలు నావి!

అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥
(9అ॥-22శ్లో)

ఎవరు నన్ను అనన్యచింతన కలిగి ఆరాధిస్తారో, వారు నిత్యాభియుక్తులవుతున్నారు. అట్టి వారి యోగక్షేమాలను నేను చూచుకొంటాను. ఆ బాధ్యతను నేను వహిస్తాను. తమను గూర్చి తాము ఆలోచించుకోవలసిన స్థితి అన్నది వారికి లేకుండా, రాకుండా నేను కాచుకొంటాను.

అనన్యచింత అంటే ఏమిటి ? 'నేను' తప్ప అన్యములేదని అనుభవానికి రావడం. ఆచరణలో ఆ అనుభూతి అఖండంగా నిలబడటం.

మామూలుగా లోకంలో అనన్యచింత అన్నప్పుడు దేవతామూర్తులలోనో మహనీయులలోనో ఏదో ఒక మూర్తిని విశ్వసించి, ఆ మూర్తిని మాత్రమే స్మరిస్తూ, ఆ అర్చనలో పాల్గొంటూ ఉండటమనే అర్థం ఉన్నది. అలా తమకు నచ్చిన మూర్తిముందు కూర్చుండిపోయేవారు కూడ ఉన్నారు. ఆ స్మరణలో వీలైనంత ఎక్కువసేపు ఉండిపోయే వారుకూడా ఉన్నారు. ఇది చింతనకు ప్రారంభమవుతుందిగాని అనన్యచింతన అంటే ఇది మాత్రమేకాదు. ఇంతమాత్రమేకాదు.

దేవతామూర్తులలోగాని, దేవుని అంశతో దిగివచ్చిన మహనీయులలోగాని మనకు నచ్చిన మూర్తిని మనం స్మరించవచ్చు. మన మనసు మెచ్చిన మూర్తిని మనం ఉపాసించవచ్చు అయితే ఆ అర్చన క్రమంగా అనన్యచింతనగా రూపొందాలి. ఆ మూర్తినే మనం అంతటా చూడగలగాలి. అన్నిటా చూడగలగాలి: సకల దేవతామూర్తులలోను మహనీయులలోను మనకు నచ్చిన ఆ మూర్తి మనకు పొడగడుతూ ఉండాలి. అతడు, మిగిలినవారు అన్నభావన మనకుండకూడదు. ఆ భావన రాకూడదు. నిజానికి మిగిలినవారు అన్నవారులేరు. అలామిగలరు. అది మన భావన మాత్రమే !

సృష్టి అంతా భగవానుని రూపమే! సృష్టికి అవతల, ఇవతల కూడ ఉన్నది అతడే ! అతడు అనంతుడు. ఆద్యంతాలు లేనివాడు. సృష్టియంతా అతని రూపమే కనుక సృష్టిలోని ఏ రూపాన్నయినా మనం అతని ప్రతీకగా, ప్రతినిధిగా స్వీకరించవచ్చు. ఆ మూర్తిని, ఆ నామరూపాలను దైవస్వరూపంగా మనం ఆరాధించవచ్చు. అలా మన ఆరాధనను ప్రారంభించవచ్చు. అయితే అది ప్రారంభం మాత్రమే అని మనం గుర్తెరిగి ఉండాలి ! ఒకసారి ప్రారంభమయిన తరువాత అది ముందుకు సాగాలి : అనగా ఏ మూర్తిని మనం ఉపాసిస్తున్నామో ఆ మూర్తిని మనం అంతటా చూడగలగాలి. ఆ మూర్తిలో మనం అంతనూ చూడగలగాలి. ఆ మూర్తికానిది ఇంకేమీలేదు- అన్న అనుభూతి మనకు కలిగి స్థిరపడాలి! అప్పుడు అనన్యచింతన అవుతుంది. ఉన్నది ఒక్కడే. అన్యములేదు. అనగా ఇతరమన్నది ఇకలేదు అని స్పష్టమవుతుంది.

ఇలాంటి ఈ ఉపాసన ఏ కొద్దిసేపో నిర్వహింపబడవలసినదికాదు. దేవుని ముందు కూర్చున్న ఆ కాసేపు ఇలాంటి అనుభూతి కలిగితే చాలదు. దేవునిముందు

కూర్చోవడం, దేవతార్చన అన్నది ఉపాసనకు దోహదం కావాలితప్ప ఉపాసన అంటే అది మాత్రమే కారాదు. ఇది నిరంతరం సాగాలి. అఖండంగా సాగాలి. కనుకనే జరుగవలసినది పర్యుపాసనము అని చెప్పబడినది. జీవితంలో ఉపాసనకాదు. జీవితంతో ఉపాసన జరగాలి! ఉపాసనలో మన జీవితం నడయాడాలి! మన జీవితమే మన ఉపాసన కావాలి! మన జీవితమే ఒక దేవతార్చనగా రూపొందాలి. జీవిత నిర్వహణమే దేవునకు ఒక నిండైన పూజ కావాలి. మనంచేసే నిత్యదేవతార్చన, అనుష్ఠానం అందుకు కావలసిన దోహదాన్ని మనకు అందించాలి. అందుకు కావలసిన నేపథ్యాన్ని మనకు రూపొందించాలి! అందుకు కావలసిన శిక్షణను మనకు అనుగ్రహించాలి!

అనన్యచింతన అనేది ఎలా జరగాలి అన్నది భాగవతంలోని ప్రహ్లాదుని చరిత్రలో మనకు చక్కగా ఉపదేశింపబడింది. దినచర్యను దైవారాధనగా రూపొందించుకోవడమన్నది ఎలాగో ప్రహ్లాదుడు మనకు చూపిస్తున్నాడు చూడండి.

పానీయంబులు త్రావుచున్ గుడుచుచున్ భాషింపుచున్ హాసలీ
లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షింపుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారి సుతుఁడేత ద్విశ్వమున్ భూవరా!

పానీయస్వీకరణలో దాహము తీరుతున్నవేళ దైవమే అతడికి గోచరిస్తున్నాడు. దైవమే పానీయమై, దాహాన్నితీర్చి, ఇలా దేహాన్ని నిలబెడుతున్నాడు. అన్న గమనికను అతడందుకొంటున్నాడు. ఆహారస్వీకరణలో ఆకలితీరుతున్నవేళ ఆ దైవమే అతడికి గోచరిస్తున్నాడు. ఆకలి అతడే, ఆకలికి అన్నము అతడే. తింటున్నది అతడే. రుచిగా అనుభవానికి వస్తున్నది కూడ అతడే! వీటన్నింటి ద్వారా దేహాన్ని పోషిస్తున్నదీ అతడే! దేహమూ అతడే! ఇలా అన్నిటా అతడే గోచరిస్తున్నాడు. అన్నపానాల స్వీకరణ అర్చన అవుతున్నది. ఒక యజ్ఞవిశేషమవుతున్నది.

కర్తవ్యనిర్వహణలో భాగంగా అతడు సంభాషణలు జరుపుతున్నాడు. అలా మాట్లాడేటప్పుడు కూడ మాటమాటలో, మాటమాటకు దైవమే అతడికి అనుభవానికి వస్తున్నాడు. మాట్లాడుతున్నది దైవము. మాటలు దైవము ఎవరితో

పోట్లాడుతున్నాడో వారు దైవము, అంతటా దైవమే అతడికి అనుభవానికి వస్తున్నాడు. ఇలా జీవనవ్యాపారమే ఒక ఆరాధనా విశేషంగా రూపుదిద్దుకొంటున్నది.

అర్చన అన్నది తీవ్రంగా సాగనక్కరలేదు. భయపడుతూ చేయనక్కర లేదు. మామూలుమాటల్లో చెప్పాలంటే మనం సీరియస్‌గా ఉండనక్కరలేదు. ఆడవచ్చు. పాడవచ్చు. హాయిగా ఉండవచ్చు. లీలగా వర్తించవచ్చు ముచ్చటగా ప్రవర్తించవచ్చు. అంతేగాని మూతిముడుచుకొని. నొసలు చిట్లించుకొని, తోటివారికి జంకు కలిగేటట్లుగా ప్రవర్తించడం అర్చనకాదు పవిత్రతపేరిట బిగుసుకుపోవడం అర్చనకాదు. అది తెలియజెప్పడానికే ప్రహ్లాదుని చరిత్రలో, ''హాసలీలానిద్రాదులు సేయుచున్'' అని చెప్పబడింది. సందర్భాన్నిబట్టి అతడు నవ్వుతున్నాడు. లీలగా వర్తిస్తున్నాడు. కాని అప్పుడు కూడా, అందులోకూడా అద్వైతాన్నే అతడు అనుభవిస్తున్నాడు. దైవమే చిఱునవ్వయి అతడి పెదవులనుండి పూస్తున్నాడు. నవ్వులపువ్వులను విరజిమ్ముతున్నాడు. దైవమే తన లీలను అతడి నుండి చూపుతున్నాడు. అవలీలగా 'అతని' లీలగా కర్తవ్యనిర్వహణ సాగిపోయేట్లు చూస్తున్నాడు. కనుక నవ్వులూ అతడే. లీలలూ అతడే! ఆ మధ్యలో విశ్రాంతి నందించే నిద్రకూడ అతడే! అలసిన శరీరాలకు, ఇంద్రియాలకు, మనస్సుకు నిద్ర రూపంలో అతడు విశ్రాంతినిస్తున్నాడు. సేద తీరుస్తున్నాడు. మరునాడు పనిచేయడానికి కావలసిన శక్తియుక్తులను సంతరించి పెడుతున్నాడు, నిద్రనుండి లేచేటప్పటికి దివ్యమయిన తాజాదనాన్ని అతడు అనుభవానికి తెస్తున్నాడు. ఒక ఉత్తేజం, ఒక ఉత్సాహం పొంగుకొచ్చేలా చేస్తూ, కర్తవ్యనిర్వహణమొదల కావలసిన ఉన్ముఖత్వాన్ని కలిగిస్తున్నాడు. నిత్యనూతనస్థితిలో మనను నిలబెడుతున్నాడు. చూశారా! నిద్రలో నిద్రగా అతడెంత చేస్తున్నాడో! కనుక నిద్రలోకూడ అతడే అనుభవానికి వస్తున్నాడు అంటున్నాడు ప్రహ్లాదుడు.

నిద్రలో మనం గమనించవలసిన సూక్ష్మంమరొకటి ఉంది. మనం నిద్ర పోతున్నప్పుడు మనలో కొంతభాగం విశ్రాంతి తీసికొంటుంది. కొంతభాగం పని చేస్తూనే ఉంటుంది. మనస్సు, ఇంద్రియాలు విశ్రాంతిని తీసికొంటున్నాయి. గుండె, ఊపిరితిత్తులు మొదలయిన దేహభాగాలు పనిచేస్తూనే ఉంటాయి. మనస్సు, ఇంద్రియాలు మానవరాజ్యం అనబడతాయి. ఆ వెనుకన విశ్రాంతి కోరని రాజ్యమున్నదే అది దేవునిరాజ్యం. నిద్రలో జరుగుతున్నది ఏమిటి అంటే మానవరాజ్యం

దేవునిరాజ్యంలో కరిగిపోతున్నది. మళ్ళీ మెలకువ వచ్చినప్పుడు మానవరాజ్యం దేవునిరాజ్యం నుండి ఈవలకు వ్యక్తమవుతున్నది. ఇది ఒక దివ్యమయినస్థితి. దివ్యమయిన అనుభూతి, ఇటువంటి స్థితి మనం మేల్కొంచి ఉండగా కూడ అనుభవానికి వచ్చిందనుకోండి. అదే మోక్షస్థితి తురీయస్థితి. దానినే మనం సమాధి అంటున్నాం. నిద్రలో అనుభవానికి వస్తున్నదేదో అది మేల్కొనిఉండగాకూడ అనుభవానికి రావాలి. అంత హాయి అనుభవానికి వస్తుండగా దినచర్య దేవతార్చనగా సాగాలి. మానవరాజ్యం దేవునిరాజ్యంతో శ్రుతికలిపి దానితో తాదాత్మ్యం చెందుతూ, ఆ తాదాత్మ్యస్థితినుండిదినచర్యను ఒక ధ్యానంగా, ఒకగానంగావ్యక్తంచేయగలగాలి! వీణనుండి వీణాగానం వ్యక్తమైనట్లు, దేహంమీదుగా కర్మసంగీతం వ్యక్తం కావాలి ! ఆ కర్మ సంగీతం సృష్టిగానంతో శ్రుతి కలసాలి ! అప్పుడది వేదమవుతుంది. నాదమవుతుంది. వేదనాదమవుతుంది. నిద్రలోకూడ అతడినే చూడగలిగినప్పుడు అటువైన అతడనుగ్రహించే దివ్యస్థితి ఇలా ఉంటుంది.

ఇంకా ప్రహ్లాదుడు ఎలా ఉపాసిస్తున్నాడు. 'తిరుగుచున్, లక్షింపుచున్'.. అనగా అతడు ఉపాసనపేరిట ఒకచోట కూర్చుండిపోవడంలేదు. నిరంతరం కర్తవ్యశీలియై ప్రవర్తిస్తున్నాడు. ఆ కర్తవ్యనిర్వహణలో వివిధములయిన రాకపోకలు చేస్తూనే ఉన్నాడు. ఆ రాకపోకలన్నింటిలో అతడు దైవాన్నే అనుభవిస్తున్నాడు. ప్రతి కదలికలోనూ అతడికి పరమాత్మే గోచరిస్తున్నాడు. మానవుని కదలికలే దేవుని కథానికలు.. అన్న అనుభూతి అతనికి నిరంతరం అందివస్తూ ఉన్నది.

అలాగే ఇది చేయవలసిన పని_ అని ఒక పనివైపు చూస్తున్నప్పుడు, ఇతడితో మాట్లాడవలసి ఉన్నది అని ఒకవ్యక్తితో మాట్లాడవలసి వచ్చినప్పుడు అతనికి దైవమే గోచరిస్తున్నాడు. లక్షింపుచున్_ అన్నమాటకు అర్థమిది. ఇది అంటూ అతడు దేనిని చూస్తున్నా, దేనిని గుర్తిస్తున్నా, దేనివైపు చూస్తున్నా, దేనిని చూపెడుతున్నా అక్కడ దైవమే పొడగడుతున్నాడు. పనిని చేస్తున్నవాడు, ఆ పనియొక్క ఫలితాన్ని అందుకొంటున్నవాడు, జరుగుతున్న పని_ అంతటా దైవమే ! కర్త, కర్మ, క్రియ_ మూడూ ఉన్నది దైవమే ! పని జరగడం కొరకు అతడలా ఉంటున్నాడు. చూస్తున్నవాడు, చూడబడుతున్నది, చూడడమూ_ మూడూ దైవమే! సృష్టి కథకొరకు అతడలా మూడుగా కనబడుతున్నాడు. కథ

నడుస్తూనే ఉండాలి ! అంతటా, అన్నిటా అతడు మనకు గోచరిస్తూనే ఉండాలి ! అప్పుడు ఈ విశ్వంయొక్క రూపం భగవానుని విశ్వరూపమవుతుంది. విశ్వం స్థానంలో మనకతడే కనబడతాడు.

ఒక రోడ్డువెంట సామాన్యస్థితిలో ఉన్న మానవుడూ, ఆ ప్రక్కనే రామకృష్ణపరమహంస కలసి నడుస్తున్నారనుకోండి. సామాన్యస్థితిలోనున్న మానవునికి ప్రపంచము, దాని పోకడలూ కనిపిస్తాయి. రామకృష్ణ పరమహంసకు దైవము, అతని లీలలూ గోచరిస్తాయి. ఇద్దరూ ఒకే రోడ్డుపైన నడుస్తున్నారు. ఒకేవిశ్వంలో నడయాడుతున్నారు. కాని ఎవరి దర్శనం వారిది. ఒకరిది విశ్వం. మరొకరిది దైవం. అనన్యచింతనయొక్క ఫలితం ఇలాఉంటుంది. ఇంతవరకూ చెప్పుకొన్నట్లుగా అనన్యచింతన సాగవలసి ఉంటుంది.

కాకినాడకు దగ్గర ప్రాంతంలో ఒకామె ఉంది. ఆమెకు దైవభక్తిమెండు ఆ ఊరిలో ఒక దేవాలయముంది. ఆ దేవాలయంలోనిదేవప్రతిమూర్తి అంటేఆమెకు ఎనలేని ఇష్టం. దానితో తరచుగా ఆమె ఆ దేవాలయానికి వెళుతూ ఉండేది. ఒక రోజులోనే చాలాసార్లు వెళ్ళివస్తూ ఉండేది. క్రమంగా రోజు మొత్తం మీద ఇంటిలో ఉండే సమయంకన్నా, గుడిలో ఉండే సమయం పెరిగిపోయింది.

పొయ్యిమీద బియ్యం కడిగిపెట్టి, కూరలు, పులుసులూకూడ పెట్టి గుడికి వెళ్ళిపోయేది. ఇప్పుడే వచ్చేద్దాంకదా అనుకొనేది. గుడిలో అలాకూర్చుండిపోయేది. పొయ్యిమీద పదార్థాలు మాడిపోయేవి. ఇంటిలో భర్తా, పిల్లలూ అల్లాడిపోతూ ఉండేవారు. వారికేం చేయాలో తోచేది కాదు. ఆమెను ఔననలేరు. కాదన లేరు. అయోమయస్థితిలో పడిపోయారు. నచ్చచెప్పడానికి ప్రయత్నించినా పెద్ద ప్రయోజనం ఉండేదికాదు. అదంతా ఆమె తెలిసి చేయడం లేదుకదా ! కూర్చుండిపోవాలని వెళ్ళడం లేదావిడ ! కాని కూర్చుండిపోతోంది. ఒకసారి వెళ్ళిన తరువాత కదలలేకపోతోంది. దానితో మిగిలిన దినచర్య కుంటుపడుతోంది. కర్తవ్య నిర్వహణలో అనిశ్చితస్థితి చోటు చేసికొంటోంది. బంధుమిత్రులు తట్టుకోలేక పోతున్నారు. కాని, చేయగలిగినది లేదు. ఒకప్రక్క, వారి దినచర్యలు దెబ్బ తింటున్నాయి. కుటుంబజీవనం దారి తెన్నును కోల్పోతోంది. రెండవప్రక్క ఆమె ఏమయిపోతుందోనన్న ఆందోళన వారిని బాధిస్తోంది.

ఆమె బంధువులు ఆమెను నా దగ్గరకు తీసికొనివచ్చారు. పరిస్థితి చెప్పారు. దిగులుగా ముఖంపెట్టాడు. నేను భాగవతం ప్రథమస్కంధంలోని ఒక సూక్ష్మాంశాన్ని గూర్చి వారికి వివరించాను. భక్తిభావనలోపడి తాత్కాలికంగా కర్తవ్యాన్ని నిర్వహించలేనివారుంటారు. వారినిగూర్చి కంగారుపడవలసిన పనిలేదు. భగవంతుని అభయహస్తం వారిని వెన్నంటి ఉంటుంది. తగిన సమయంలో వారికి కావలసిన ప్రచోదనం అందుతుంది. దానితో వారు అనన్యచింతనయొక్క నిజస్వరూపాన్ని గ్రహిస్తారు. కర్తవ్యనిర్వహణ విందుగా కొనసాగిస్తారు'. అని వారికి వివరించాను. ఆ అభయవచనం వారిని సేదతీర్చింది. వాళ్ళముఖాలలో వెలుగు రేఖలు గోచరించాయి.

కొంతసేపటి తరువాత ఆమెను పిలిచి కూర్చోపెట్టి అడిగితే జరుగుతున్నది ఆమె చెప్పింది. జరుగవలసినది నేను చెప్పాను. అనన్యచింతన అన్నది ఎలాగ సాగాలి అన్నది ఆమెకు వివరించాను. నా వివరణ ఆమెకు నచ్చింది. ఆమెకు కావలసిన ప్రచోదనం అందింది. ఆమె ముఖంలో ఎనలేని తృప్తి తొణికిసలాడింది. తాను నమ్మిన దైవమే ఇలా కలుగజేసికొని నడిపిస్తున్నాడు అన్న దర్శనాన్ని పొంది ఆమె పరవశించింది. దానితో కథ దారికి వచ్చింది. అప్పటినుండి ఆమెనుండి జరిగినది పర్యుపాసన. అప్పటినుండి ఆమెకు అనుభవానికి వచ్చినది. నిత్యాభియుక్తస్థితి, దేవదేవునితో నిత్యానుసంధానస్థితి. నిత్యానుసంధానముఅంటే ఎడతెగని అనుసంధానము. ఆ అనుసంధానము అలా సాగుతూనే ఉంటుంది. అనన్యస్థితి అంటే ఇది అని అప్పటికి అనుభవమవుతుంది.

ఈ అభయవచనాలలో రెండు భాగాలున్నాయి. మొదటిభాగం మనం ఆచరించవలసినది. రెండవభాగం దైవం మనకు అనుగ్రహించవలసినది. అనన్యచింతన మనం చేయవలసినది. మనయొక్క యోగక్షేమములు అతడనుగ్రహించవలసినవి. మనం చేయవలసినవి మనం చేస్తూఉంటే, అతడు చూడవలసింది అతడు చూస్తూ ఉంటాడు. మనం అనన్యచింతనలో ఉండగా, మనయొక్క యోగక్షేమాల బాధ్యతను అతడు వహిస్తాడు. మన పని, సాధనను కొనసాగించడమే! ఇక యోగక్షేమాల విషయమై మనం కంగారుపడవలసిన పనిలేదు. వాటి విషయం తనకు వదిలేయమంటున్నాడాయన. అది తన బాధ్యత- అంటున్నాడు. 'నీవు చేయవల

సింది నీవు చేయి, నేను చూడవలసింది నేను చూస్తాను. నేను చూడవలసి దానిని గూర్చి నీవాలోచించకు. అసలు అలా ఆలోచించవలసిన అవసరం నీకులేదు ఆ అవసరం నీకు రాదు. రానీయను.

ఈ సూక్ష్మం తెలియక కొందరు కొందరు 'ఇంతకూ మన సాధన ఎంత వరకూ వచ్చింది ? కుండలిని ఎంతవరకు ఎగబ్రాకింది. యోగస్థితి ఎంతవరకు కుదురుతోంది ! యోగస్థితిలో మనం ఎంతవరకు నిలబడగలుగుతున్నాం ? మొదలయిన అంశాలను ఎవరయినా మహనీయులు కనబడినప్పుడు విచికిత్సచేస్తూ, ఇంతకూ నా స్థాయి ఏమిటి ? నేనెక్కడున్నాను? సాధన బాగా జరుగుతున్నట్లేనా ! అని అడుగుతూ ఉంటారు. ఇదంతా ఉండపట్టలేని ప్రవర్తన. అవసరంలేని ఆలోచన. పడనక్కరలేని తాపత్రయం. కూడని చర్చావిధానం ! సాధనచేయి. యోగస్థితి లభించడమన్నది ఆది నాకు వదిలిపెట్టు. అది నా బాధ్యత. అని దైవం అంటూ ఉండగా ఆ దేవదేవుని బాధ్యతలో మనం వేలుపెట్టాలని చూడటం కుర్రతనమవుతుంది. ఇంకా చెప్పాలంటే అతడిని శంకించడమవుతుంది. ఈ లోపున మనం చేయవలసిన సాధనకు గండి పడుతుంది. అనగా అనన్యచింతనకు అంతరాయమేర్పడుతుంది. కనుక సాధనలో ఎంతవరకు వచ్చామన్న విచికిత్స ఎన్నడూ కూడదు. అనన్యచింతనలో వర్తిస్తూ ఉండటమే మనం చేయవలసినది. ఇకయోగస్థితి అన్నది ఎప్పటికి ఎలా లభించాలన్నది దైవానికి సంబంధించిన అంశం. అది మనం తాపత్రయపడితే అందేది కాదు. దైవం మన సాధనకు ముచ్చటపడి అనుగ్రహించేది. అనుగ్రహించవలసినది ఆయన. అనుగ్రహంపైన మన అజమాయిషీ కూడనిపని. అక్కడ లెక్కలు లెక్కచేయబడవు. అనుగ్రహమంటేనే మానవీయమయిన లెక్కలకు, కొలతలకు, విచికిత్సలకు అతీతమైనది అని అర్థం !

ఇలా అనన్యచింతనలో ఉండటం మన బాధ్యత. యోగస్థితి ఒనగూడేట్లు చూడటం అతని బాధ్యత. కనుక మన పని మన బాధ్యతను మనం నిండుగానిర్వర్తించడమే ! యోగస్థితితోపాటు క్షేమస్థితిని కూడ నేనే చూసుకొంటాను. అంటున్నాడాయన.———— నీవుమాత్రం ఏమాత్రం ఏమరుపాటు చెందకుండా అనన్యచింతనలో ముందుకుసాగు. ఇది నా నిర్దేశం !. అన్నది ఆయన అభయవచనం.

యోగాన్నిగూర్చి విచికిత్స చేసినట్లుగానే తెలిసీతెలియని మానవు
క్షేమాన్నిగూర్చి కూడా విచికిత్సకు లోనవుతూ ఉంటాడు. రోజులు ఎప్పటిలా లేవ
కదా! ఇప్పటి ఈ కాలంలో ఇది సాధ్యమా? ఇలాంటి సాధనలో ఉండి మన
బ్రతికి బట్టకట్టగలమా? రాజీపడక తప్పదేమో! నలుగురితో నారాయణ అనక కుద
దేమో అనిపించవచ్చు. 'అటు దేశ పరిస్థితులూ, ఇటు కుటుంబపరిస్థితులూ త్వర
త్వరగా మారిపోతున్నాయి. భవిష్యత్తు ఎలా ఉంటుందో అన్న ఆలోచన కలు
వచ్చు. ఆ ఆలోచన ఒక బెంగగా మారవచ్చు. చుట్టూ ఉన్న వారందరూ ఎవ
జాగ్రత్తవారు పడుతూ ఉండగా, మనమొక్కరమే సాధన అంటే సరిపోతుందా
చివరకు ఈ సాధనలో మనం ఒంటరివారుగా మిగిలిపోతామేమో! మిగిలినవా
కన్నా అన్నివిధాల వెనుకబడిపోతామేమో! వారు పడిన జాగ్రత్త మనం పడట
లేదుకదా! వారు త్రొక్కినదారులన్నీ మనం త్రొక్కడం లేదుకదా! మన
సూటిగా పోతున్నామయ్యే! దీని ఫలితమెలా ఉంటుందో అనిపించవచ్చు. మన
ఎక్కడ మునిగి ఎక్కడ తేలుతామో అనిపించవచ్చు. మన జీవితానికి ఒక రక్షణ
కావాలికదా! మన భవిష్యత్తుకూ ఒకరూపం కావాలి! తన్నుమాలినధర్మం మొదల
చెడ్డబేరం అవుతుందికదా! కనుక మనం మొత్తం దైవానికి వదిలికూడని సాహసం
చేస్తున్నామేమో!'- అన్న భావన కలుగవచ్చు. ఇలా మనస్సు పరిపరివిధాలుగా
ఆలోచించవచ్చు. అనన్యస్థితిలో కుదురుకొనేలోపున దానికి ఇన్నివిధాల ఆలోచనలు
కలుగవచ్చు. ఒకొక్కప్పుడు అందివచ్చిన అనన్యస్థితి నుండి కూడ జారిపోవడం
వల్ల ఇలాంటి ఆలోచనలు కలుగవచ్చు. జరుగవచ్చు.

ఇంకా ఒకొక్కప్పుడు, ఆ దిగువకు జారినవేళలో 'ఏమి జరిగింది? ఏమి
జరిగింది' అనిపించవచ్చు. 'చేసిన దానికి ఇదా ఫలితం? ఏమీ చేయనివారే
లోకంలో హాయిగా సుఖపడుతున్నారు'- అన్నభావన కలుగవచ్చు. నిజానికి ఇదంత
కూడా అవసరంలేని విచికిత్స. అనావశ్యకమయిన ప్రేలాపన. అర్థంలేని ఆలోచన
అక్కరలేని ఒక భయం.

అతడు నీ యోగక్షేమాల బాధ్యత నాది! అంటున్నాడు. 'యోగస్థితి
నేను అందిస్తాను, క్షేమస్థితిని నేను సరిచూస్తాను. నీవుమాత్రం అనన్యచింతనతో
ముందుకు సాగు'— అన్నది ఆయన ఉపదేశం.

ఎప్పటికి మనకు ఏది క్షేమమో మనకు తెలుసా ? అతనికి తెలుసా? ఈ అంశం మనకు ముందు బోధపడాలి ! మనకు ఏది క్షేమమన్నదీ, ఎప్పుడు మనము ఏస్థితిలో ఉంచబడాలన్నదీ- మనకన్న అతడికే ఎక్కువ తెలుసు. కనుక అతడి నిర్ణయానికి మనం శిరస్సు వంచాలి ! అతడి నిర్ణయంలోని ఔచిత్యాన్ని గమనించ డంలో మనబుద్ధి మనకు అంది రావాలి ! అలా అందివచ్చినప్పుడు తెలుస్తుంది ఏమని ? అనన్యచింతనతో మనం సాగుతూఉండగా, జరుగకూడనిది జరుగదనీ, జరుగవలసినదే జరుగుతుందనీ, జరుగుతున్నదంతా మన క్షేమానికేననీ, తాత్కా- లికంగా ఇబ్బంది అనిపించినా, ప్రతి సన్నివేశం ఆ క్షేమంవైపుకే నడిపించకలుగు తున్నదనీ, దేవదేవుడు మన క్షేమంయెడల అంతగా బాధ్యత పడుతున్నాడనీ, జంకు గొంకులకూ, శంకలు అనుమానాలకూ తావులేకుండా సన్నివేశాల రూపంలో అతడు నిర్దేశిస్తున్న కర్తవ్యాన్ని నిశ్చింతగా, నిండుగా, నిర్వహించడమే మనం చేయవలసిన పని అనీ !

మనమేం చేయాలో సన్నివేశాల రూపంలో అతడు చెబుతున్నాడు. మనకేం కావాలో దానిని ఆ సన్నివేశాలవెంట మన చెంతకు నడిచివచ్చేలా చేస్తు న్నాడు. వనరులు అతడు సమకూరుస్తున్నాడు. సలహాలను అతడు ఇస్తున్నాడు. సహకారాన్ని సిద్ధం చేస్తున్నాడు. నడువవలసిన పథాన్ని పొడగట్టిస్తున్నాడు. నడక సాగుతున్నవేళ కావలసినంతగా చేయూతనందిస్తున్నాడు. ఒక్కమాటలో చెప్పాలీ అంటే నీవెప్పుడు ఏం కావాలి, నీకెప్పుడు ఏంకావాలి- అన్న అంశాలను తానుగా పట్టించుకొంటున్నాడు. కంటికి రెప్పలా కాచుకొంటున్నాడు. ఇంతకంటే యోగ క్షేమాలను ఎవరు అందించగలరు ? ఆలోచించండి.

ఒక రామకృష్ణుడు, ఒక వివేకానందుడు, ఒక మాస్టర్ ఇ. కె. అతడు చెప్పినట్లుగా నడిచి చూపారు. తమకేకాక యావత్ మానవజాతికే యోగక్షేమాలను సాధించిపెట్టారు. దేవదేవుని ఉత్సవసమయాలుగా తమ తమ జీవితకాలాలను నిండుగా నిర్వహించారు. మీరూ ఇలా నడిచిచూడండి ! ఇంతటి నిండుదనాన్ని మీరూ మీ జీవితాలలో అనుభవించండి.' అని తమ తమ జీవితాలతో మనకు ఉప దేశిస్తున్నారు. మీరు ఏ నామాన్ని స్మరించండి, ఏ మూర్తిని కొలవండి. ఏ విధ మయిన ఉపాసనను చేపట్టండి అనన్యచింతనగా రూపొందినపుడు మాత్రమే మీ ప్రయత్నం సిద్ధిస్తుందని గమనించండి ! అనన్యచింతన అలవడి, స్థిరపడేవరకు

మీరున్నది ప్రయాణంలోనే, ప్రయత్నంలోనే అని గుర్తెరగండి ! సిద్ధి ఎప్పుడు అనన్యచింతనతో ముడిపడిఉన్నదని తెలిసి మెలగండి !- అని వారు తమ జీవిత లతో మృదువుగా హెచ్చరిస్తున్నారు, ప్రేమతో వెన్ను తడుతున్నారు.

రామకృష్ణ పరమహంస సాధన అమ్మవారి విగ్రహాన్ని ఆరాధించ డంతో ప్రారంభమైంది. అలా విగ్రహారాధనగా ప్రారంభమైన సాధన అనన్య చింతగా పర్యవసించింది. ఆ మాతను ఆయన అంతటా అన్నిటా చూడగలిగాడు జగత్తును మాతగా జగన్మాతగా దర్శించగలిగాడు. అలాగే వివేకానందుడు అనన్య చింతనవల్ల ఒనగూడే యోగక్షేమస్థితులను అనుభవపూర్వకంగా అందుకొని చూపాడు రైలు ప్రయాణంలో సొమ్మసిల్లి పోయినప్పుడు మిఠాయిలవాడు అతడిదగ్గరకు పంప బడ్డాడు. జనసంచారం లేనిచోట ఆకలిదప్పులతో అతడు నిలిచినవేళ అక్కడి కక్కడే అన్నపానీయాలు అతనికి అందించబడ్డాయి భక్తుని క్షేమాన్ని భగవంతు డెంతగా పట్టించుకొంటాడో ఇలాంటి సందర్భాలు మనకు చక్కగా తెలియజెబు తాయి. అలాగే సర్వమత సమావేశానికి చికాగో వెళ్ళినప్పుడు అలసిసొలసిన అతడు ఒక ఇంటిముందు పడిపోయాడు. ఆ ఇంటి దంపతులు వారూ ఆ సభలకే వెళుతూ ఉండటం విశేషం. స్వామిని సేదతీర్చి, వివరాలను కనుక్కొని సభలకు ఆయ నను తోడ్కొనిపోయారు వారు. అటుపైన స్వామి ప్రవచనం జరగడం, స్వామి పేరు ప్రపంచమంతా ఒకేసారి మారుమ్రోగడం జరిగింది. ఇలా పడిపోయిన చోటనే ఆయనకు రక్షణ ఈయబడింది. ఆయన యోగస్థితికి కావలసిన దోహదం ఆ సన్నివేశంలోనే నిక్షిప్తం చేయబడింది. ఇలా వివేకానందుని యోగక్షేమాలు నిరంతరం దైవంచేత చూచుకోబడ్డాయి.

సాధన ప్రారంభమయిన తొలినాళ్ళలో వివేకానందుడు కూడా తన బాధ్యతలను గురించీ, కుటుంబక్షేమాన్ని గురించీ కలవరపడ్డాడు. 'నాకు కుటుంబ పరమయిన బాధ్యతలున్నాయికదా! వాటికి అమ్మ ఏం చెబుతుంది? మీరుఅమ్మను అడిగి చెప్పండి. అవి తీరితేకదా నేను లోకానికేమయినా చేయగలిగేది ?- అని రామకృష్ణునితో అన్నాడు. అందుకు రామకృష్ణుడు! 'అమ్మ అందరికీ అమ్మ! నేనడిగి చెప్పడమెందుకు ? నీవే అడుగు !' అన్నాడు. వివేకానందుడు అమ్మను సమీపించాడు. కాని ఏమీ అడుగలేకపోయాడు. నాకేమి కావాలో అమ్మకు తెలి యదా ! ఇది కావాలి అని నేను ఆమెను అడగాలా !' అని అలవడి క్రనిపించింది

అంతే ! ఇక తన యోగక్షేమాలను అమ్మ పాదాలకు అధీనం చేశాడు. తన కార్య క్రమానికి తాను అంకితమయ్యాడు.

ఇక ఇ. కె. మాస్టరుగారు : అనన్యచింతన యొక్క వైభవమే ఇ. కె. మాస్టరుగారి జీవితం. ఆ అనన్యచింతనతోనే తెలుగు మాస్టరుగా జీవితాన్ని ప్రారంభించిన వీరు, వెలుగుమాస్టరుగా రూపొందారు. తమ యోగక్షేమాలను తమ గురుమూర్తులయిన మాస్టర్ సి. వి. వి. చరణకమలాలకు అధీనం చేసి, వారందించిన విశ్వప్రణాళికను అమలుపరిచేటందుకుగాను ముందుకు దూసుకుపోయారు. మాస్టర్ ఇ. కె సిరిసంపదలు, పదవులు, ప్రభుత్వాధికారాలూ కలిసివచ్చినా మానవుడు సాధించలేనట్టి ప్రజాహిత కార్యములను అలవోకగా, అనాయాసంగా ఆయన నిర్వహించారు ఒక మనిషికికాదు, ఒక వ్యవస్థకుకూడా ఇంతటి కార్యక్రమ నిర్వహణ సాధ్యమా ? అన్నట్లుగా సాగింది ఆయన యజ్ఞార్థజీవితం. అనన్యచింతనయొక్క వైభవం ఇలా ఉంటుంది. అన్నట్లుగా సాగింది ఆయన ఎన్నడూ అవకాశాలకోసం ఎదురుచూడలేదు.' ఎదుటగా ఉన్నదే అవకాశం' అన్నది ఆయన ఉపదేశం. చేతిలోఉన్న పనిని శ్రద్ధగా చేయి. ఇక చేయవలసిన పని, అది నీ దగ్గరికే వస్తుంది. అన్నది ఆయన సందేశం. ఆయన అలాగే చేశారు. ఉన్న చోటున ఉన్న పనిని శ్రద్ధగా ఆయన చేస్తూ ఉండగానే, దేశదేశాలవాసులాయనకు దగ్గరయ్యారు. ఆయనకు శిష్యులయ్యారు. ఆయన సందేశం ప్రపంచమంతటా మారుమ్రోగేటందుకు కావలసిన బాటలను వారుగా తీర్చిదిద్దారు. ఆయన సేవలను విశ్వమంతటా వ్యాపింపజేశారు. ఆయన మాత్రం తనచేసున్న పనిని శ్రద్ధగా, తపస్సుగా చేసికొంటూ వెళ్ళిపోయారు. అది చిన్న పనిగానీ, పెద్ద పనిగానీ నడిచివచ్చిన పనిని చేయడమే ఆయనకు తెలుసు. అలా చేస్తూనే వామనుడు త్రివిక్రముడయినట్లు, ఆయన అంతటా వ్యాపించారు. అనన్యచింతనతో అంతర్యామిగా నిలబడ్డారు.

సర్వసంప్రదాయాలను సమన్వయించి, అనన్యచింతన వైపుగా ప్రపంచ జనులను ఈ ఆధునికయుగాన నడిపినవారు మాస్టరు ఇ. కె. వారి అడుగుజాడల వెంట అనన్యచింతనలోనికి అడుగిడటమే మనం చేయవలసిన పని.

ఆయన ఒక చెణుకును విసిరేవారు. అదేమిటీ అంటే 'మామూలుగా చదివినప్పుడు భగవద్గీతలో మనకు శ్లోకార్థమే బోధపడుతుంది'. అంటే ఏమిటి ?

ఏ శ్లోకానికా శ్లోకం అర్థమవుతూ ఉంటుంది. ఇంతకూ, మొత్తంమీద చెప్పబడు తున్నదేమిటనేది అంతుబట్టదు. 'ఇదీ శ్లోకార్థం అంటే!' అనన్యచింతన అలవడి నపుడు మాత్రమే గీతార్థం బోధపడుతుంది. ఇంతకూ కృష్ణుడు చెబుతున్నది ఏమిటీ అనేది అప్పుడు బోధపడుతుంది, ఆయన ఉపదేశమేమిటి అన్నది అప్పుడు మనకు అందివస్తుంది.

ఈ చెణుకును మనం నిరంతరం గుర్తుపెట్టుకోవలసి ఉంది. దీనికి తగినట్లుగా మన సాధనను మనం తీర్చిదిద్దుకోవలసి ఉంది.

ఇ. కె. మాస్టరుగారి బంధువులలో ఒక పెద్దాయన ఉండేవారు. ఆయన తహసిల్దారుగా పనిచేసేవారు. ఇంగ్లీషువారు మనదేశాన్ని పాలిస్తున్న కాలమది. బాధ్యతను నిర్వహించడంలో ఆయన దిట్ట. స్వయంగా ఆయన కూడా పన్నుల వసూలుకు వెళ్ళివస్తూ ఉండేవారు. ఒకరోజు పన్నుల వసూళ్ళకై ఒక గ్రామానికి వెళ్లారు. పని పూర్తయ్యేసరికి ప్రొద్దు వాలిపోయింది. తిరిగి వెళ్ళాలంటేమధ్యలో ఉన్నది అడవిమార్గం. దారి దొంగలకు అది ప్రసిద్ధి. గ్రామస్థులు ఆ రాత్రికి ఉండి పొమ్మన్నారు. ఆయన అందుకు అంగీకరించలేదు ఏం ఫరవాలేదని పరివారంతో బయలుదేరారు. అడవివారి వెంట ప్రయాణం. దొంగలజాడలు గోచరిస్తున్నాయి. దోచుకోవడానికి వారు సిద్ధమవుతున్నట్లు తెలుస్తోంది. ఆయన పరివారంపైపు చూచారు. 'ఇటు అటు చూడకుండా సూటిగా సాగిపోండి. మిగిలినది నాకు వదలండి' అన్నాడు. ఆ మాటలకు శిరస్సు వంచి పరివారం సూటిగా సాగిపోతున్నది.

అటు ఇటు దొంగలబారులు సంసిద్ధులై మీదకు రా వ డ మే తరువాయి అన్నట్లుగా! అది గమనించిన ఆ పెద్దాయన అనన్యచింతనతో ముందుకు సాగుతు న్నారు. ఆశ్చర్యం! బారులు తీర్చిన దొంగలు అలా విగ్రహాల్లా నిలబడిపోయారు పెద్దాయన ప్రయాణం యథావిధిగా సాగిపోతోంది. పెద్దాయన, ఆయన పరివారం కనుచూపుమేర దాటిన తరువాత దొంగలబారులకు ఒడలు తెలిసింది. 'ఏమిటి, మనం ఇంతసేపూ ఇలా ఉండిపోయాం!' అనుకొన్నారు. జరిగింది ఏమిటి అనేది ఇటు దొంగలకూ, అటు పరివారానికీ కూడ తెలియదు. ఆ పెద్దాయనకు మాత్రమే తెలుసు. గీతార్థం అనుభవంలోనికి వచ్చినవారి జీవితాలు ఇలా ఉంటాయి.

అన్నట్లు, భగవద్గీతలోనికి ప్రవేశించేటంతవరకే మన నుదిటి'గీత' పనిచేసేది!

# 10. నా భక్తునకు నాశము లేదు!

అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః ॥
క్షిప్రం భవతి ధర్మాత్మాశశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతి జానీహి నమే భక్తః ప్రణశ్యతి ॥
(9అ॥ - 30,31 శ్లో॥)

ఎంతటి దురాచార పరుడైనప్పటికి తన తప్పును తెలుసుకొని, నన్ను గూర్చిన అనన్యచింతనలో ప్రవేశించినవేళ అతడిక సాధువే! ఇది నిశ్చయము ! క్రమముగా అతడి జీవితము తీర్చిదిద్దబడగలదు.

అనన్యచింతన ప్రారంభమయిన వెంటనే అతడు ధర్మాత్ముడు కాగలడు. శాశ్వతమయిన శాంతిని అందుకొనగలడు. అర్జునా! ఈ అంశాన్ని గుర్తించు ! నా భక్తుడు ఎన్నడూ నాశమును పొందడు. అనన్యచింతన అంతటి రక్షణను అందించగలదు.

తెలిసిగాని, తెలియకగాని మానవుడు దురాచారపరుడు కావచ్చు. ఒకసారి దురాచారాలకు అలవాటుపడిన తరువాత, ఆ దురాచారపారీణత నుండి అతడుబయట పడటము కూడ అతనికి కష్టమేననిపించవచ్చు. ఎందువల్లననగా అభ్యాసానికున్న బలమంతటిది.

అభ్యాసాన్నే మనం మామూలుభాషలో అలవాటు అంటున్నాం. అల వాటును మానడం ఎంత కష్టమో మనకు తెలుసు. అది మంచిగాని, చెడుగాని, మనస్సు ఒకసారి అలవాటుపడిన తరువాత దానినుండి బయటపడటం కష్ట మవుతుంది.

తెలివితేటలుకూడ అలవాటును మాన్పించలేవు. తెలుసుకోవడం కూడ అలవాటును పోగొట్టలేదు. మద్యపానానికి బలి అవుతున్నవారిలో అది కూడనిది అని ఎంతమందికి తెలియదు !

ప్రయత్నము కూడ ఇక్కడ పెద్దగా ఫలించదు స్వభావంగా రూపొందిన దానిని ప్రయత్నమెలా ఆపగలదు ? తీవ్రకోపము, పరుషవాక్కు మొదలయిన వాటికి అలవాటు పడినవారు అవి కూడనివి అని తెలిసి వాటిని ఆపేటందుకు ప్రయత్నిస్తున్నారనుకోండి. ఆ ప్రయత్నం ఎంతసేపు నిలుస్తున్నది? ఏదో ఒక క్షణంలో వారు విరుచుకుపడటం తప్పడంలేదు. అలా విరుచుకు పడినపుడు అంతకు అంతా కలిపి వారు ముట్టచెబుతూనే ఉంటారు. కనుక దురాచారపారీణత తెలివివలన ఆగడంలేదు. ప్రయత్నము కూడ ఇక్కడ పనికిరావడం లేదు. మరి ఈ దుస్థితినుండి బయటపడేమార్గం ఏమిటి ? ఈ దుస్థితివల్ల వచ్చే దుష్ఫలితాలు మాత్రం మిక్కుటంగా ఉన్నాయి. ఆ ఫలితాలకు మనస్సు వేదన చెందుతున్నది. ఇది కూడనిస్థితి అని తెలుసుకొని దానినుండి బయటపడాలని అదేపనిగా తపన చెందుతూ ఉన్నది. కాని బైటపడలేక పోతున్నది.

అలాంటిస్థితిలో, ఆ స్థితిలో, ఆ దుస్థితినుండి మానవుని ఒడ్డుకుచేర్చేదే అనన్యచింతన. 'నాది' అనబడే దేహరాజ్యంలో చిక్కుకొని ఇంతటి దుస్థితికి లోనైన మానవుడు ఇది కూడనిస్థితి అని తెలుసుకొని పశ్చాత్తాపం పొందేటప్పటికి ఆ పైనున్న 'నేను' అనబడే దివ్యప్రజ్ఞ అతడికి పొడగడుతుంది. లేదా ఏ మహనీయుడో పూనుకొని అతడికి పొడగట్టేట్టు చేస్తాడు. ఆ పొడగట్టిన 'నేను'ను అంతటా, అన్నిటా అనన్యంగా దర్శించగలగడం, అనుభవించగలగడం జరగాలి।

ఇలా చింతన అనన్యంగా జరిగేటప్పటికి దేహరాజ్యంలో చిక్కుపడిన మనస్సు క్రమంగా పైకిలేస్తుంది. అ లేస్తున్నప్పుడు అది ఇబ్బంది పడదు. దివ్యమయిన హాయిని అనుభవిస్తుంది. లేవడం కష్టమనిపించదు. చాలా సుఖవుగా ఉంటుంది. పతనం చెందిన మనస్సు అనన్యచింతనతో సుఖవుగా పైకి లేవగలుగుతుంది. ఇంత సుఖవుగా లేవడం సాధ్యమా ! ఇంత సులభంగా అతడు మనకు అందుతున్నాడా ? ఇది నిజమేనా అనిపిస్తుంది. నిజమే ! అనన్యచింతనకు ఉన్న

శక్తి అటువంటిది. ఇంకా చెప్పాలీ అంటే అనన్యచింతనలో ఉన్నవారి యెడల భగవంతుడు చూపే అనుగ్రహవిశేషం అటువంటిది.

అనన్యచింతనలోనున్న వారికి నేను సులభంగా అందుతాను— అన్నది కృష్ణభగవానుని అనుగ్రహవచనాలలో ఒకటి. మనస్సు అనన్యచింతనలో తేలి యాడుతున్నవేళ ఇక ఆ మానవుడు సాధింపలేనిదంటూ ఏదీలేదు. సర్వశక్తియుక్తులు నా నుండి అతనికి అనుగ్రహింపబడతాయి- అన్నది ఆ దేవదేవుని అనుగ్రహ వచనాలలో మరొకటి.

ఇక ఇక్కడ ఈ సందర్భంలో చెబుతున్నదేమిటంటే అలాంటి అనన్య చింతనలో కుదుర్చుకొన్న వానికి అతడెన్ని దురాచారాలు చేసినప్పటికీకూడ ఆ పాప సంస్కారాలనుండి ఈవలకు వచ్చేందుకు కావలసిన చేయూత నానుండి లభిస్తుంది. ఆ చేయూత లభించిన క్షణం నుండి అతని మనసు సాధుస్థితిని పొందుతుంది. నా వెలుగులో తనను తాను తీర్చిదిద్దుకొనడం ఆ మనసుకు చేతనవుతుంది. దానితో శాంతి అన్నది అనుభవానికి అందుతుంది. అది మామూలు శాంతికాదు. శాశ్వత మైన శాంతి. సమస్త పాపముల నుండి ప్రక్షాళనము పొందిన ప్రశాంతి అది.

అనన్యచింతన ప్రారంభమయిన క్షణంనుండి ఇక అతని కర్మాచరణ, ధర్మాచరణమవుతుంది. అతడు ధర్మాత్ముడవుతాడు. అనగా తనకు తోచినట్లు చేయడు. నేను చెప్పినట్లు చేస్తాడు. ఆ 'నేను' ప్రకారం నడుచుకొంటాడు. ఆ 'నేను'కు ఒదిగి ప్రవర్తించడంలో ఆనందానుభూతిని పొందుతాడు. ఇక సొంత కథ ఉండదు. సృష్టికథయే ఉంటుంది. స్వంతకథ ఉన్నంతవరకే కర్మబంధం, స్వంతకథ సృష్టికథగా రూపొందినవేళ ఇక కర్మబంధమే ముంటుంది ? దేవదేవుని తోడి అనుబంధమొక్కటే ఉంటుంది. అనన్యచింతన ప్రారంభమయ్యేవరకు మానవుని కథ స్వంతకథ. అనన్యచింతన ప్రారంభమైనప్పటినుండి మానవుని కథ సృష్టి కథ.

అంతటి దురాచారపరుని గూడ వెంటనే ధర్మాత్మునిగా నిలబెడతాను అంటున్నాడు దేవదేవుడు. అతని కరుణ అటువంటిది. నిజానికి అతడి స్వభావమే అది. అతడి ఆ స్వభావం అతడి సృష్టిలో కూడ అడుగడుగునా గమనించవచ్చు. అందుకు ఒక ఉదాహరణ చెబుతాను. చూడండి! చీకటి పడుతున్నది. ఊరిలోని

వారు ఒక్కొక్కరే లైట్లు వేస్తున్నారు. కొందరు ఇళ్ళలో లేరు. బయటకు పనుల మీద వెళ్ళారు, తమ పనినిబట్టి, ఆ రాత్రివేళ ఒక్కొక్కరూ ఒక్కొక్క సమయానికి ఇంటికి తిరిగివస్తున్నారు. ఆ వస్తున్నవారు వస్తున్నట్లుగా ఇళ్లలో ప్రవేశించి లైట్లు వేస్తున్నారు. ఒకరు ఏడింటికి వేశారు. ఒకరు ఎనిమిదింటికి, ఒకరు తొమ్మిదింటికి మరొకరు పదింటికి వేశారు. ఆ వేస్తున్నప్పుడల్లా జరుగుతున్నది ఒక్కటే ! లైటు వెలుగుతున్నది. చీకటి వెంటనే కరుగుతున్నది. ఎవరు ఎప్పుడు వేశాడన్నది ఆ లైటు పట్టించుకోవడంలేదు. వెనకాముందులది చూడటంలేదు. ముందు వేసినవారికి ముందు వెలగడం వెనుక వేసినవారికి వెనుకగా వెలగడం అది చేయడంలేదు. ఎవరు ఎప్పుడు వేసినా వెంటనే వెలుగుతున్నది. వెలుగుతున్న క్షణంలోనే అంత చీకటినీ కరిగిస్తున్నది. ఇది ఇలాఉండగా ఒకడు అర్థరాత్రి 12.00 గంటలకు వచ్చి లైటు వేశాడు వెంటనే లైటు వెలుగుతూ ఉన్నది. చీకటిని కరిగిస్తున్నది. అంత ముదురు చీకటినీ అంతలోనే కరిగిస్తున్నది. ఆ క్షణంలోనే కరిగిస్తున్నది అనన్యచింతన అలాంటిది. ఆ లైటులాంటిది. దేవదేవుని అనుగ్రహం అంతటిది. వెంటనే వెంటవెంటనే లేవనెత్తగలిగినటువంటిది.

అప్పటికప్పుడే అనుగ్రహించబడటం బాగున్నది. మరి అంతవరకు అతడు చేసిన దురాచారాల సంగతి ఏమిటి ? ఆ దుష్కర్మల ఫలితాల సంగతి ఏమిటి ? ఎన్నాళ్ళు అనుభవిస్తే అవి తీరుతాయి? మరి అన్నాళ్ళూ అనుభవించవలసిందేనా ! ఒకవేళ అనుభవించవలసివస్తే ఇంక శాశ్వతశాంతికి నోచుకోవడమన్నది ఎక్కడుంటుంది ?- అన్న అంశాలు మన మనసులో మెదలడానికి అవకాశముంటుంది.

ఇక్కడ కొన్ని సూక్ష్మలను మనం గమనించాలి! కర్మ ఫలితం ఉన్నది మనిషిని సక్రమమైన మార్గాన నడపడానికి తప్ప అతనిని పడద్రోయడానికికాదు. అది దుష్కర్మ అయినప్పుడు ఆ కర్మ ఫలితం మనిషిని బంధిస్తుంది, బాధిస్తుంది. ఈ మొత్తం అతడికి కర్మాచరణలో శిక్షణ నివ్వడమేతప్ప అతడిని అణగద్రొక్కడం కాదు. దీనిని మనం గమనించాలి ! కర్మలు, కర్మఫలితాలను గూర్చి మన అవగాహనలో సరిచేసికోబడవలసినవి చాలా ఉన్నవి. కర్మ ఫలితం అన్నది మాన

వుడిని ఉద్ధరించి నిలబెట్టడానికి ఉందితప్ప ధిక్కరించి, పడగొట్టడానికి కాదు. దుష్కర్మల ఫలితాలు కూడ మానవునకు శిక్షణనిస్తాయి తప్ప, అతడిని శిక్షించవు. అతనికి బోధనందించడానికవి ఉన్నాయి తప్ప, అతడిని బాధించడం వాటి ఉద్దేశం కాదు.

మంచిపనికి మంచి ఫలితం వస్తున్నది. బాగున్నది అని ప్రోత్సహిస్తున్నది. చెడ్డ పనికి చెడ్డ ఫలితం వస్తున్నది. బాగులేదు అని హెచ్చరిస్తున్నది. ఇంకొకసారి ఇలా చేయకు సుమా అని వెనుకకులాగే ప్రయత్నమే ఇందులో ఉన్నది. ముందున్న గోతిని గమనించుకోకుండ అందులో పడబోతున్నవాడిని, అది గమనించిన వెనుకనున్నవాడు ఒక్క ఉదుటున అతడిని వెనక్కులాగడూ! సరిగా అలాంటి ప్రయత్నమే ఇది। కనుక దుష్కర్మల ఫలితాలను గూర్చి మనకు దుష్టమైన ఆలోచన రాకూడదు. వాటికొక నిర్దుష్టమయిన ప్రయోజనమున్నది.

ఈ సందర్భంగా ఒక ఉదాహరణ చెబుతాను చూడండి. ఒక విద్యాలయం ఉన్నది. ఆ విద్యాలయంలో ఒక ఉపాధ్యాయుడున్నాడు. ఆయనకు అల్లరి చేసే పిల్లలను గుంజీలు తీయించే అలవాటుంది. పిల్లలు చేసిన అల్లరినిబట్టి ఎవరు ఎన్ని గుంజీలు తియ్యాలి అన్నది ఆయన నిర్దేశిస్తూ ఉంటాడు. ఆ లెక్క ప్రకారం పిల్లలు గుంజీలుతీస్తూ ఉంటారు. ఒకసారి ఒక పిల్లవాడు అల్లరిచేశాడు. ఆ అల్లరినిబట్టి ఉపాధ్యాయుడు ఆ పిల్లవాడిని యాభై గుంజీలు తియ్యమన్నాడు. పిల్లవాడు తీస్తున్నాడు. ఉపాధ్యాయుడు లెక్కపెడుతున్నాడు. లెక్కపెడుతూనే అతడిని గమనిస్తున్నాడు. అతడి ముఖకవళికలను గమనిస్తున్నాడు. అతడిలో వస్తున్న మార్పును గమనిస్తున్నాడు. జరిగినదానికి పశ్చాత్తాపపడుతున్నట్లుగా రూఢి కాగానే, 'చాల్లే కూర్చో! ఇంకెప్పుడూ అలా చేయకు' అన్నాడు ఉపాధ్యాయుడు. 'ఇంకా ముప్ఫయికూడా కాలేదండి' అన్నాడు విద్యార్థి బాధగా జరిగినదానికి కళ్ల నీళ్లు పెట్టుకొంటూ. 'నీ కళ్లనీళ్లే నీ తప్పులను కడిగి వేస్తున్నాయి' అన్నట్లుగా చూస్తూ ఉపాధ్యాయుడు, 'నాకు తెలుసులేరా యాభయికాలేదని. కూర్చో ంగి, కూర్చొని పుస్తకం తియ్యండి. ఇంకెప్పుడూ అలాంటి అల్లరి చేయకండి! అన్నాడు. ఆ ప్రేమకు ముగ్ధుడయిన కుర్రవాడు 'ఇంకెప్పుడూ ఇలా చేయనండి.' అన్నట్లు చూస్తూ తన పనిలోనికి ఒదిగిపోయాడు.

ఏమి ? ఉపాధ్యాయుడు యాభయి గుంజీలను ఎందుకు తీయించలేదు. తీయమన్నది అతడేకదా ! ఆ మాటమీద నిలబడలేదేమి? విద్యార్థిని నిలబెట్టలేదేమి? ఇక్కడ ఉపాధ్యాయునికి పిల్లవానిలో మార్పు రావడం ముఖ్యంగాని, లెక్కలు సరి పెట్టబడటం ముఖ్యంకాదు. ఒకవేళ అతడు యాభయి గుంజీలు తీసికూడా ఎలాంటి మార్పునూ పొందలేదనుకోండి. లెక్క సరిపోయింది కదా అని ఉపాధ్యాయుడు సంతోషించడు. అయ్యో ! ఇంత శిక్ష విధించినా వీడిలో మార్పురాలేదే అని జాలి పడతాడు. సరిగా దేవదేవుని కర్మఫలితాల కథకూడా ఈ ఉపాధ్యాయుని గుంజీల కథ వంటిదే !

గుంజీలను లెక్కపెడుతూనే విద్యార్థిలో వస్తున్న మార్పును గమనిస్తున్న ఉపాధ్యాయునిలా, దుష్కర్మఫలితాలను అనుభవానికి తెస్తూనే మానవునిలోవస్తున్న మార్పును గమనిస్తూ ఉంటాడు దేవదేవుడు. తగినంత మార్పు వచ్చింది అని రూఢికాగానే 'ఇక చాల్లే ; ఇలా రా !' అని చెంతకు తీసికొంటాడు. ఉపాధ్యా యునికి లాగానే దేవదేవునికి కూడా లెక్కలు సరిపెట్టడం కాదు. మార్పు రావడం ముఖ్యం.

ఇటు ఉపాధ్యాయునికిగాని, అటు దేవదేవునికిగాని శిక్ష విధించాలని ఉంటుందా ! ఇబ్బంది పెట్టాలని ఉంటుందా ! ఎట్టి పరిస్థితులలోనూ ఉండదు. కాని ఎదుటనున్నవారి అభివృద్ధికొరకు అది తప్పనిసరి అవుతుంది. తప్పనిసరి అయిన ఆ శిక్షను అపారమయిన ప్రేమతో వారు విధిస్తున్నారు. అని మనం గుర్తుంచు కోవాలి. వారు ఇష్టపడి విధించడంలేదు. మనవలన కష్టపడి విధించడంలేదు. కేవలం మనందరిని పదేటందుకు విధిస్తున్నారు. మన తప్పును సరిచేసేటందుకుతప్పని సరియై విధిస్తున్నారు. కనుకనే శిక్షాసమయంలో వారు మనలోని మార్పుకోసం వెదుకులాడుతున్నారు. మార్పువస్తే చాలు అనుగ్రహిద్దామని చూస్తున్నారు. అభయ ముద్ర పట్టడానికి సిద్ధంగా ఉంటూనే అంత భయమూ మనను పెడుతున్నారు వాళ్ళు, మార్పు వచ్చేవరకూ భయం పెడతారు. మార్పు వచ్చీరాగానే అభయం పడతారు దీనిని మనం గమనించాలి !

అనన్యచింతన ప్రారంభంకాగానే దేవదేవుని చేయూత లభిస్తూ ఉన్నది. దేవదేవుని చేయూత లభించడం ప్రారంభించిన క్షణంనుండి సాధుస్థితి అన్నది అంది వస్తున్నది. సాధుస్థితి అందివచ్చిన క్షణంనుండి కర్మాచరణం సత్కార్మ

చరణంగా రూపుదిద్దుకొంటూ ఉన్నది. అంతవరకూ జరిగిన దుష్కర్మాచరణకు బదులుగా అప్పటినుండి సత్కర్మాచరణ జరుగుచున్నది. దుష్కర్మకు సత్కర్మ బదులు చెబుతున్నది. ఆ బకాయిని కట్టివేస్తున్నది. కొంతకాలానికి ఆ బకాయి పూర్తి కాగా, ఇక సత్కర్మ నిష్కామకర్మగా సాగుతుంది. అనగా ఆ సత్కర్మాచరణంనుండి అతడు పొందవలసినదిగాని, పొందగోరినదిగాని ఏమీలేదు. కేవలం దేవదేవునికి సమర్పణగా సాగుతున్న సత్కర్మాచరణ అది. దేవదేవుడు బదులు చెప్పమని అడగలేదు మానవుడు కూడ బదులుచెప్పాలన్న ఉద్దేశంతో సత్కర్మను ఆచరించలేదు. అతడు దేవదేవుని యెడల సమర్పణభావంతోనే సత్కర్మాచరణను సాగిస్తున్నాడు. అలా సాగించడంలో, అప్రయత్నంగా అతడు బదులు చెప్పినట్లు అవుతున్నది. అటుపైన నిష్కామకర్మ నిర్వహించినట్లు కూడ అవుతున్నది దేవదేవుని సాదత్యంలో ఈ మొత్తం కథ హాయిగా సాగిపోతున్నది. ఈ స్థితిలోని ఆచరణలో ఆనందముంటుంది. తప్ప శ్రమ కనిపించదు. పని చేస్తున్నప్పుడు పరితృప్తి అనుభవానికి వస్తుంది తప్ప, అలసట అనిపించదు. అనుభూతి చెందటమే తప్ప మనసుకు బాధపడవలసిన అవసరంరాదు.

అడవిదారిన నడుస్తున్న ప్రయాణికుడొకడు కాలులో ముల్లు గ్రుచ్చుకొని విలవిలలాడుతున్నాడు. ఆ బాధలో అతనికి ఏమి చేయాలో తోచడంలేదు. ఆ స్థితిని గమనించిన ఓ పెద్దాయన దగ్గరకు చేరి, మిత్రుడై, సేద తీరుస్తూనే, ఆ ప్రక్క నుండి ఒక మంచి ముల్లును తీసి అతని చేతికి అందించాడు ప్రయాణికునకు ఏమి చేయాలో బోధపడింది. ఆ ముల్లును అందుకొని, తన కాలిలోని ముల్లును మెల్లమెల్లగా తొలగించి వేశాడు. అమ్మయ్య! అనుకొంటూ, ఆ పెద్దాయన వైపు కృతజ్ఞతతో చూశాడు. ఆశీఃపూర్వకంగా చిరునవ్వు నవ్వాడు పెద్దాయన. ఇక ప్రయాణం కొనసాగించవచ్చు అన్నట్లుగా చూశాడు. సరిగా మానవుని కథ కూడా ఈ ప్రయాణికుని కథ వంటిదే!

దుష్కర్మ ఆచరింపబడటం అన్నది కాలులో ముల్లు విరగడం వంటిది, దానికతడు విలవిలలాడుతాడు. పశ్చాత్తాపపడతాడు. ఇంతలో దైవం ఆ పెద్దాయన వలె దగ్గరయి సత్కర్మాచరణమనే మంచిముల్లును అందిస్తాడు. దానితో ఆ దుష్కర్మఫలితం, ప్రభావం అన్నీ రహితమైపోతాయి. మనిషి మనిషిగా మిగులుతాడు. అటుపైన ఆ సత్కర్మాచరణ దైవానికి సమర్పణగా కొనసాగిస్తూ, తాను

కూడా దైవమై వెలుగుతాడు. ఈ మొత్తం ప్రయాణానికి దేవదేవుడే సారథ్యం వహిస్తాడు. కనుక ప్రయాణం జరిగినట్లే ఉండదు. కాని జరిగిపోతుంది. ఆ సారథ్యం, ఆ సాన్నిధ్యం, ఆ సాంగత్యం అంతటి అనుభూతిప్రదంగాఉంటుంది. ఇలా దేవదేవుడు తనను శరణుజొచ్చిన దురాచారపరుడిని తరింపజేసి నిలబెడతాడు. నిలబడిన అతడిని తన ప్రతినిధిగా, తన వాహికగా స్వీకరించి, అతడి వలన చిరకాలం పనికివచ్చే లోకహిత కార్యాలను నిర్వహింబడేట్లు చూస్తాడు.

అనన్యచింతన అన్నది సాగడం ముఖ్యం. అది ఏ విధంగా సాగినా ఫరవాలేదు, ప్రహ్లాదుడు మొదలయినవారు అపారమయిన భక్తితో అనన్యచింతనలో నిలబడ్డారు, హిరణ్యకశిపుడు మొదలయినవారు అపారమయిన ద్వేషంతో అనన్యచింతన సాగించారు. అయితే దేవదేవుడు ఈ రెండుతరహాల వారినికూడ ఒకేవిధంగా తన అక్కున జేర్చుకొన్నాడు. భావమేదయినగాని స్మరణ జరిగింది. ఉద్దేశం ఏదయినప్పటికీ ప్రయాణం అటువైపుకే సాగింది. దగ్గరకావడం ముఖ్యం. ఎలా దగ్గరయ్యారు అన్నది దేవదేవుడు పట్టించుకోడు. దగ్గరయితేచాలు అతడు అక్కున జేర్చుకొంటాడు. అతనికి మనను దగ్గరచేసేది అనన్యచింతన. అది ఏ విధంగా జరిగినాసరే, అతని సాన్నిధ్యం మనకు లభించి తీరుతుంది. దేవదేవుని అనుగ్రహవిశేషాలలో ఇదొకటి. మన భేదభావాలను, ద్వేషభావాలను పట్టించుకొనకుండ, మనను మాత్రమే పట్టించుకొంటున్నాడతను. మన స్మరణనుమాత్రమే పట్టించుకొంటున్నాడతను. ప్రేమ అంటే అదే! ప్రేమ భేదాన్ని చూడదు. ప్రేమ భేదాన్ని చూపదు!

అనన్యచింతనలో నిలచిన నా భక్తునకు నాశము అనేది ఉండదు.— అంటూ భగవంతుడు తన పరమప్రేమను ప్రకటిస్తున్నాడు. మానవుడు అనన్యచింతనలో నిలబడగలగాలేగాని అతడెన్నడూ ఏవిధంగానూ నాశాన్ని పొందడు. లేదు అన్నస్థితి అతనికి ఉండదు. లోటు అన్నస్థితి అతనికి రాదు. బాధ అన్నస్థితి అతడికి తెలియదు. చింత అన్నస్థితి అతనికి కలుగదు. 'జీవితము సమస్తము భగవానుని ప్రసాదమే! వస్తున్న ప్రతి సన్నివేశమూ భగవానుని సందేశమే!'— అన్నట్లుగా జీవనయాత్ర సాగిపోతుంది. కష్టసుఖములు కనిపించవచ్చు. ఒడుదుడుకులు అనిపించవచ్చు. కాని వీటన్నింటిలోనుండి అతడి స్పర్శ, అతడి అనుగ్రహం అనుభవానికి వస్తూ ఉంటాయి. అసలు అతడిలా అనుభవా

నికి రావడానికే ఇవన్నీ వస్తున్నాయా ?— అనిపిస్తూ ఉంటుంది. అతని సన్నిధిలో, అతని సారథ్యంలో కథ అనుభూతిప్రదంగా సాగిపోతూ ఉంటుంది.

వయస్సులో పెద్దవారైన మిత్రులొకరు రాత్రి ఎనిమిది గంటలవేళ కూర్చొని కష్టసుఖాలు చెబుతున్నారు. ఒక స్వచ్ఛంద సేవాసంస్థలో ప్రముఖ పాత్ర వహిస్తున్నారాయన. ఒక మాదిరి ఉద్యోగంచేసి రిటైరయ్యారు. ఆ ఉద్యోగానికి పెన్షన్ మొదలయినవి లేవు. రేపోమాపో భార్యకూడా ఉద్యోగంనుండి రిటైర్ కాబోతున్నది. బాధ్యతలు ఇంకా మిగిలిఉన్నాయి. పిల్లలలో నిలబడవల సినవారూ. పెళ్ళికావలసినవారూ ఉన్నారు కొద్దిరోజుల్లో ఇప్పుడు వస్తున్న ఆదాయం కూడా తగ్గిపోతుంది. ఏదో ఇంతవరకు గుంభనగా లాక్కొని వచ్చారు, ఆశయాలకు కట్టుబడి, సౌఖ్యాలమీద అంతగా దృష్టిలేని స్థితిలో. మనం అనుకొన్నట్లు మనం బ్రతుకుతున్నాం. అన్న తృప్తితో జీవిస్తూ వచ్చారు. ఇప్పుడు కూడ అలా జీవించాలనే ఉన్నది. కాని అది సాధ్యమా ! అని అనిపిస్తున్నది. "మాస్టరుగారూ ! పరిస్థితులనుబట్టి మళ్ళీ ఏదయినా. ఉద్యోగంలాంటిది చేద్దామను కొంటున్నాను, ఏమంటారు ?' అన్నారాయన. కొద్దిక్షణాలు మౌనంగా గడిచిన తరువాత ఇలా అన్నాను: పరిస్థితి బోధపడింది. పరిష్కారం లభిస్తుంది. అయితే అది మీరన్నదికాదు. ఈ వయసులో మీరు ఉద్యోగం చేయడం సాధ్యమయ్యే పనికాదు. ఆ అవసరమూలాదు, మీ నుండి సాగుతున్న లోకహిత కార్యాన్ని కొనసాగించండి ! మీ చిన్నబ్బాయి చదువు పూర్తయింది కదా ! అతనికి మంచి ఉద్యోగం వస్తుంది. అతడు మంచివాడు. బాధ్యత తెలిసినవాడు. మీరుచూడగా మిగిలిన బాధ్యతలను అతడు చూడగలడు. మీరు నిశ్చింతగా ఉండండి !' అని.

ఆయన తృప్తిపడ్డారు. పరిపూర్ణమయిన విశ్వాసంతో నమస్కరించి, శెలవు తీసికొన్నారు.

ఒకటి రెండు రోజులు గడిచాయో లేదో మళ్ళీ అదే రాత్రివేళ అయన వచ్చి కూర్చున్నారు. ముఖం కళకళలాడుతోంది. ఎనలేని తృప్తి ఆయన చిరునవ్వులో కనబడుతోంది. కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరిస్తూ, 'మీరన్నమాట నిజమైంది. చిన్నబ్బాయికి ఉద్యోగం దొరికింది. అదికూడా మంచి ఉద్యోగం. ఇప్పుడతను బాధ్యతలన్నింటినీ అవలీలగా చూసుకోగలడు. మీరన్నది అన్నట్లు జరిగింది.'

తృప్తిగా నవ్వుతూ నేనిలా అన్నాను! నేను అన్నది అన్నట్లు జరగదంకాదు. ఉన్నది ఉన్నట్లు అన్నాను. మీ జీవితం దైవానికీ, ధర్మానికీ అంకితమైనది. నిజానికి మీకు స్వంత జీవితమంటూ ఒకటుందా చెప్పండి? భగవద్గీతలో కృష్ణుడు 'నమే భక్తః ప్రణశ్యతి' అంటున్నాడు. అంటే ఏమిటో తెలుసునా! నా భక్తునకు నాశములేదు. ఆ అభయవచనాన్ని అనుసరించే క్రిందటిసారి నేను, 'మీకు ఇలా జరుగుతుంది' అని ధైర్యంగా చెప్పాను. సరిగా అలాగే జరిగింది. దేవదేవుడు తన అభయవచనాన్ని ఇలా మరొకసారి ఋజువు పరిచినట్లైంది చూశారా! ఇది కలికాలమయినా, నిరుద్యోగసమస్య ఇంతగా విజృంభిస్తున్నా ఈనాడుకూడ మీ విషయంలో ఆ అభయవచనం ఎలా ఋజువయిందో! అనన్య చింతనలో నిలబడి, జీవితాన్ని లోకహితంపైపుగా నడపాలేగాని, దేశకాలాలకు అతీతంగా ఆ అభయహస్తం మనను రక్షిస్తూనే ఉంటుంది. ఆ అభయవచనం మనపట్ల నిజమవుతూనే ఉంటుంది. ఋజువవుతూనే ఉంటుంది.

ఆ పెద్దాయన కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి. దేవదేవుని అనుగ్రహావర్షంలో తడిసి ముద్దవుతున్న స్థితి ఆయనది!



# 11. భక్తితో సమర్పించు చాలు, ముక్తిని అనుగ్రహిస్తాను!

పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యాప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
య త్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ।

శుభాశుభ ఫలైరేవం మోక్షసే కర్మబన్ధనైః।
సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి॥
(9అ॥ - 26-28శ్లో)

అనన్యచింతనతో నాకు సమర్పించబడినది అది ఒక ఆకు కావచ్చును. పూవు కావచ్చును. పండు కావచ్చును. అది ఏమయినప్పటికినీ ఏ మాత్రమైనప్పటికినీ నేను దానిని తృప్తిగా స్వీకరిస్తాను.

నిజమునకు నా కొరకు నీవు ప్రత్యేకించి, చేయవలసిన పనిలేదు. చేయచున్నదెల్ల నా కొరకని చేయి. నీవు తినుచున్నప్పుడది నా కొరకని స్మరించు. నీవు హోమము చేసినప్పుడు అది నాకొరకని తలంచు. నీవు దానము చేసినప్పుడు అది నాకే చెందుతున్నదని దర్శించు! నీవు చేయుచున్న తపస్సు అది నా కొరకే సమర్పించు! నీవు ఏది చేసినప్పటికి అది నా కొరకేననీ, నాకే చెందుతున్నదనీ గ్రహించు !

ఈ విధంగా చేయడం వలన నీకు పుణ్యపాపములు అంటవు. కర్మ ఫలితములు సోకవు. ఫలాపేక్ష అన్నది కరిగిపోయి నాకు సమర్పించుట యొక్కటే నీ లక్ష్యమైనదిగాన, నీవు నన్నే పొందెదవు."

ఎంత చేశాము అని కాదు. ఏమి చేశామన్నది కాదు, ఎలా చేశాము ; ఎలాంటిదృష్టితో చేశాము— అన్నది దేవదేవునికి రావాలి. పూజలో పత్రిపేరిట ఆకులను సమర్పించేవారున్నారు, అలంకరణకై పూవులను సమర్పించేవారున్నారు. నైవేద్యముగా ఫలములను సమర్పించేవారున్నారు. అభిషేకాదుల రూపమున, తీర్థాదుల రూపమున నీటిని సమర్పించేవారున్నారు. అది పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, జలముగాని భక్తితో అనగా అనన్యచింతతో సమర్పించిన చాలు. దేవదేవుడు ఆ సమర్పణను నిండుప్రేమతో అందుకొని, పరితృప్తిని చెందగలడు. మనకు పరిపూర్ణతను అనుగ్రహించగలడు.

నిజానికి ఈ పూజలన్నీ దేవునికి అవసరమా ! లేదు. ఇవి మానవుని అవసరం. ఆ దినచర్యను దేవునికి అర్చనగా నిర్వహించడమన్నది మానవ జీవితానికి పరమార్థంగా చెప్పుకొన్నాం. ఆ దినచర్యను దేవుని అర్చనగా రూపొందించుకొనేటందుకుగాను కావలసిన శిక్షణను శ్రద్ధగా పొందేటందుకే నిత్యజీవితంలో దేవతార్చన అన్నది పెద్దలచేత రూపొందింపబడింది. కనుక దేవతార్చన మన దినచర్యను దేవునికి అర్చనగా రూపొందించుకోవడంలో తోడ్పడుతుందనీ, అందుకే అది ఉన్నదనీ మనకు తెలియాలి ! దినచర్యమీద ప్రభావం చూపలేని దేవతార్చన, దినచర్యను మలచలేని దేవతార్చన, దినచర్యను దేవుని పూజగా రూపొందించలేని దేవతార్చన అది కేవలం వృథా ! దేవదేవుడు దానిని మెచ్చడు. దేవదేవుడు దానికి అంగీకరించడు.

అందుకనే అతడంటున్నాడు. 'నీవు చేస్తున్నదల్లా నాకొరకని చేయి. అగ్నిని రగిలించినపుడెల్ల అది నాకొరకేయని రగిలించు ! ఆ అగ్నిలో వేల్చిన దెల్ల నాకొరకేయని స్మరించు ! ఎవరికయిన ఏదయినా ఇచ్చినప్పుడు ఆ ఇచ్చేది నాకేనని దర్శించు ! ఇలా నీ దినచర్యను నామయము చేయి ! అప్పుడు దినచర్యయే నాకు నీవొనరించు పూజ కాగలదు. నిజమగు పూజ ఇదే ! ఈ పూజ కొరకే నిత్యజీవితంలో మీరనుష్ఠించే అనుష్ఠానాలు, అర్చనలు, ఉపాసనలు, జపతపాదులు మొదలయినవన్నీ !' ఇది దేవదేవుని ఉపదేశం.

దినచర్య ఇలా దేవుని పూజగా సాగినప్పుడు, దేవదేవుని నిర్దేశం ప్రకారం సన్నివేశాలు నిర్వహింపబడుతున్నప్పుడు ఇక పుణ్యపాపముల ప్రసక్తి ఉండదు. ఎందువల్లననగా కర్మాచరణకు కావలసిన నిర్దేశము అతడినుండి అందుతున్నది. కర్మాచరణకు సంబంధించిన ఫలితము అతడికే సమర్పింపబడుతున్నది. మొత్తము కర్మాచరణమే అతడి స్మరణలో, అతడి కొరకని, అతడి ప్రకారము జరుగుతున్నది ! మరి అటువంటప్పుడు ఇక పుణ్యపాపముల ప్రసక్తి ఎక్కడ !

అలాగుననే కర్మబంధమునకు కూడ ఇక చోటులేదు. కర్మఫలితమును మనము అపేక్షించినప్పుడుకదా కర్మబంధమునకు అవకాశమేర్పడేది. కర్మఫలాన్ని

మనం దేవదేవునకు సమర్పిస్తున్నవేళ, ఫలితముల ప్రసక్తి అటడికే వదిలివేస్తున్న వేళ ఇక కర్మబంధమునకు చోటెక్కడ?

దినచర్యను దేవునిపూజగా నిర్వహించడం వలన పుణ్యపాపములను పొందుట అనునది ఇకలేదు. కర్మబంధమును పొందుట అన్నది ఇక జరుగదు. మరి ఇక మనం పొందునది ఎవరిని? ఇక మనము పొందునది దేవదేవుని మాత్రమే!

సన్న్యాసము అనగా ఇది! సన్న్యసించవలసినది కర్మలనుకాదు, కర్మ ఫలితాలను! తెలియక కర్మలను సన్న్యసించే ప్రయత్నాన్ని చేసేవారున్నారు. అది పద్ధతికాదు. సాధ్యమూ కాదు!

సన్న్యాసము అంటేఏమిటి? సత్ + న్యాసము. 'సత్' అంటే ఉన్నది. న్యాసము అంటే ఉంచబడినది. ఉన్న దానియందు ఉంచబడినది అని అర్థం. ఈ సృష్టికిమూలము ఏమైఉన్నదో, దానియందుఉంచడము. అనగా దానికిసమర్పించడముసన్న్యాసము. ఈసృష్టికి మూలము దేవదేవుడు కనుక అతనియెడల సమర్పణ బుద్ధి కలిగియుండుట సన్న్యాసము. కర్మాచరణలో నిమగ్నులమై ఫలితములు మొత్తము దేవదేవుని ఇచ్ఛకు వదలగలిగినపుడు అది ఫలసన్న్యాసము. ఇదియే నిజమయిన సన్న్యాసము. ఆ సన్న్యాసస్థితిలో జరిగేటటువంటి కర్తవ్యనిర్వహణనుండి మనకు లభించేదే దివ్యమయిన యోగానుభూతి। యోగమనగా కలయిక. యోగస్థితి అనగా దేవదేవుని తోడి తాదాత్మ్యస్థితి.

అట్టి దివ్యస్థితిలో జీవితము సాగుచుండగా దేవుని పూజలో పత్రము, పుష్పము, ఫలము, తోయము సమర్పించినపుడేకాదు. దినచర్యనిర్వహణలో ఎవరికి ఎప్పుడు పత్ర పుష్ప ఫల తోయాలను సమర్పించడమన్నది జరుగుతూఉన్నప్పటికీ అదే అనుభూతి, ఒకే అనుభూతి అందిరాగలదు. అది ఏమిటనగా 'అందింపబడుతున్నది ఆ దేవదేవునికేననీ, అందుకొంటున్నదీ అతడేననీ!

ఈ స్థితి మనకు అందివస్తున్నకొద్దీ దేవదేవుడు పత్ర,పుష్ప, ఫల,తోయాల స్వరూపానికి ఒక పరిపూర్ణత నందిస్తాడు. ఒక పరమార్థాన్ని అనుగ్రహిస్తాడు. ఆ దివ్యస్థితిలో ఈ మన శరీరమే పత్రము. ఈ మన సద్గుణములే పుష్పములు. మన కర్మఫలమే ఫలము. మన జీవనగమనమే తోయము.

చూశారా! దేవదేవుని అభయమెంతటిదో। "పత్ర పుష్ప ఫలతోయాలను భక్తితో సమర్పిస్తేచాలు. నేను తృప్తిగా అందుకొంటాను. దినచర్యను నాకు సమర్పణగా నడిపితేచాలు. నేను నిన్నందుకొంటాను. శుభాశుభాలకు, పుణ్యపాపాలకు, కర్మఫలితాలకు అతీతమయిన స్థితిలో నిన్ను నాలో నిలుపుకొంటాను. ఆ నిలుపుకొన్నవేళ నీ శరీరమే ఇక పత్రము. నీ సద్గుణాలే ఇక పుష్పాలు. నీ కర్మఫలమే నాకు ఫలము నీ జీవనప్రవాహమే నాకు తోయము. అవుతున్నాయి. అవుతూ అందుతున్నాయి. అందుతూ చెందుతున్నాయి. చెందుతూ పరవశిస్తున్నాయి. పరవశిస్తూ పరమప్రేమగా పర్యవసిస్తున్నాయి.' అంటున్నాడు దేవదేవుడు!



# 12. నన్నే శరణు పొందు- ఏ దుఃఖమూ నిన్ను దరిచేరదు!

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥
(18అ॥ - 66 శ్లో)

సర్వ ధర్మములను పరిత్యజించు. నన్నే శరణు పొందు! సకల పాపముల నుండి విమోచనమును అనుగ్రహింతును. దుఃఖించవద్దు. దిగులు పడవద్దు!

'నేను' అను దివ్యప్రజ్ఞకు 'నాది' అను దేహప్రజ్ఞ శరణు పొందాలి. అని తెలుసుకొన్నాం. పెద్దల భాషలో ఈ 'నేను'ను గురువు అంటారు,

ఆ 'నాది'ని శిష్యుడు అంటారు. శిష్యుడు గురువునకు శరణాగతి చెందాలి అతడు చెప్పినట్లు నడుచుకోవాలి. అతడి సారథ్యంలో జీవనయాత్ర సాగించాలి!

ఇక్కడ ఒక సూక్ష్మముంది ఆ సూక్ష్మాన్ని మనం గమనించుకోవడం అవసరం. ఎవరికి వారు తమలోని 'నేను'కు శరణాగతి చెందడం అన్నది అంత సులువైన అంశంకాదు. ఎందువల్లననగా మనలోని ఏ కక్ష్యకాకక్ష్య నేను, నేను- అంటూ ఉంటుంది. అందువల్ల అసలు 'నేను' ఎవరు అన్నది అంత తేలికగా అంతుపట్టదు. ఇంతకూ మనము అసలు 'నేను'నే ఆశ్రయిస్తున్నామా? మనస్సులోని పై పొరలను ఆశ్రయిస్తున్నామా అనేది అంతుపట్టదు.

క్రొత్తగా ఒకడు వైష్ణవాలయానికి వెళ్ళాడు. అంతకు ముందెన్నడూ అతడు వైష్ణవాలయాన్ని చూచి ఉండలేదు. అతడు చూస్తూ వెళుతున్నాడు. గుడిని సమీపించగానే ద్వారం దగ్గర అచ్చం విష్ణుమూర్తిలాగే చతుర్భుజాలతో ఇద్దరు కనబడ్డారు. ఇక్కడే విష్ణుమూర్తి ఉన్నాడు అనుకొని రెండు కొబ్బరికాయలు కొట్టాడు. మళ్ళీ లోపలికి ప్రవేశించాడు. మరొకద్వారం వచ్చింది. మళ్ళీ ఇద్దరు మూర్తులు కనబడ్డారు. వీరే 'అసలు విష్ణుమూర్తి' అనుకొంటూ, మరో రెండు కొబ్బరికాయలు కొట్టేశాడు. ఇలా ఉన్న కొబ్బరికాయలన్నీ ద్వారాలదగ్గరే అయిపోయాయి. అప్పుడు ఆ లోపల గర్భగుడిలో విష్ణుమూర్తి లీలావిలాసంగా నిలబడి కనబడ్డాడు. 'అరెరే! అనుకొన్నాడు భక్తుడు. ఆ లోపలివాడు అసలయిన విష్ణుమూర్తి అని అప్పుడు తెలిసికోగలిగాడు మరి ఇప్పటివరకూ కనబడినవారెవరు! వారూ అచ్చం విష్ణుమూర్తిలాగానే ఉన్నారే! వారు విష్ణుదేవుని ద్వారపాలకులు. విష్ణుదేవుని మరిపించగలరు. ఆ వైభవం అలాంటిది. విష్ణుమూర్తి కొలువులో వైభవానికి ఏమి తక్కువ చెప్పండి!

ఇక్కడ మన భక్తుడు క్రొత్తవాడవడం చేత ఎవరు ద్వారపాలకుడో, ఎవరు దేవదేవుడో గుర్తుపట్టలేకపోయాడు. అలాగే సాధనకు క్రొత్తవాడైనవాడు ఇన్ని 'నేను'లలో ఏది అసలు 'నేనో' అంత తొందరగా గుర్తుపట్టలేడు. మనసులోని పొరలలో ప్రతిపొర నేను, నేను అంటూనే ఉంటుంది. కనుక సాధకుడు ఏ పొర దగ్గరయినా పొరపాటు పడవచ్చు. అక్కడనే కొంతకాలముండిపోవచ్చు.

సాధనలో ఒదుపు కుదిరిన తరువాత తప్ప 'నేను', 'నాది' అన్న విభాగం సాధకునకు తనలో తనకు స్పష్టపడదు. మరి స్పష్టపడేలోపున ఏం చేయాలి ! ఇక్కడే సాధకునకు గురుమూర్తి యొక్క అవసరం ఏర్పడుతుంది.

లోకంలో 'నేను'గా జీవించగలిగిన మహనీయులుంటారు. కాలకాలాలలో దేశదేశాలలో వీరు వ్యక్తమవుతూనే ఉంటారు గోచరిస్తూనే ఉంటారు. తమలోని 'నాది' అనబడు దేహరాజ్యాన్ని శిష్యునిగా స్వీకరించి, శిక్షణనిస్తూ ఉంటారు. ఆ శిక్షణయే వారిలో జరిగే సాధన. ఆ సాధననుండే వ్యక్తమవుతూ ఉంటుంది వారి దినచర్య అలాంటి మహనీయులలో మన మనస్సుకు నచ్చినవారిని మన గురుమూర్తిగా ఆశ్రయించి, వారిలోని 'నేను'కు శరణాగతి చెందడమే మనం తరించేటందుకుగాను ఉన్న సులభోపాయం. వారిలోని 'నేను'కు శరణాగతిచెంది వారు తమ దేహరాజ్యానికి ఇస్తున్న శిక్షణను గమనించుకొని, అలాంటి శిక్షణనే మనము కూడ మన దేహరాజ్యానికి ఇచ్చుకొంటూ రావాలి ! ఈ శిక్షణను పొందడంలో ఎక్కడ ఏమాత్రం సంశయం కలిగినా, శంకకలిగినా, అనుమానంవచ్చినా వివరణ అవసరమనిపించినా ఆ మహనీయుని కోరి అడగాలి ! ఆయన చెప్పినట్లు నడుచుకోవాలి ! ఆయన నిర్దేశానికి కట్టుబడాలి । క్రమంగా మనకు కలిగిన సకల సంకల్పాలను ఆ మహనీయుని ముందు ఉంచాలి ! ఆ సంకల్పాలలో ఆయన ఆమోదించిన వాటిని మాత్రమే మనం ఆచరించాలి ! చూస్తున్నవారికి ఈ గురుశిష్యసంబంధం ఒకపట్టాన బోధపడదు. ఆయన చెప్పడమేమిటి ఇతడు చేయడమేమిటి ? ఏ మాత్రం స్వేచ్ఛకు అవకాశం లేకపోవడమేమిటి ? ఇది శిష్యుడుగా ఉన్నవాడి వ్యక్తిత్వాన్ని హరించడంకాదా! అతడినొక అనామకుడిగా, వ్యర్థజీవిగా రూపొందించడం కాదా! ఇది తగునా!_ అని అనిపించవచ్చు ఎవరికయినా అలా అనిపించిందీ అంటే వారికి అనుభవం లేదన్నమాట. గురుశిష్య సంబంధంలోని వైభవం వారికి అనుభవంలోనికి రాలేదన్నమాట !

ఇక్కడ శిష్యుడుగా నున్నవాడు శరణాగతి చెందుతున్నది ఒక వ్యక్తిని కాదు, ఆ మహనీయుని నుండి వ్యక్తమవుతున్న 'నేను' అను వెలుగును. నిర్దేశం లభిస్తున్నది కూడ వ్యక్తినుండి కాదు వ్యక్తిత్వం నుండీ కాదు. 'నేను' అను దివ్యప్రజ్ఞ నుండి ! ఆ 'నేను' తనలో తనకు అప్పుడే పొడగట్టడం కష్టం కనుక, గురుమూర్తిలో అది స్పష్టంగా కనబడుతోంది కనుక, అక్కడనుండి నిర్దేశాన్ని

పొందుతున్నాడు శిష్యుడు. కొంతకాలానికి తనలో తనకు కూడ 'నేను' అను వెలుగు స్పష్టమవుతుంది. అప్పుడా 'నేను' అను దివ్యప్రజ్ఞ తననుండే తనకు నిర్దేశాన్ని అందిస్తున్నట్లుగా అతనికి అనుభవమవుతుంది. అప్పుడిక, గురువే తాను, తానే గురువు! గురువు శిష్యుండాయె, శిష్యుండు గురువాయె.. అన్న పెద్దల మాటకు అర్థమిదే!

ముందు గురుమూర్తిలోని 'నేను' స్పష్టమైంది. అటుపైన తనలోని 'నేను' స్పష్టమైంది. ఇక ఆపైన సర్వజీవరాసులలోని 'నేను' క్రమంగా స్పష్టమవుతుంది. ఆ 'నేను' యొక్క సర్వాంతర్యామిత్వం దర్శనమిస్తుంది. అనుభవానికి వస్తుంది. అతడినుండి అనగా ఆ అంతర్యామినుండి ఆదేశాన్ని అందుకోవడం చేతనవుతుంది. దాని ప్రకారం నడుచుకోవడం సాధ్యమవుతుంది. సరిగా అర్జునుడి విషయంలో కూడా జరిగినదిదే! విషాదస్థితిలో ఉన్న అర్జునుడు, 'నా కర్తవ్యమేమిటో బోధపడటంలేదు. నాకు బోధపరచవలసింది' అన్నాడు. కర్తవ్యాన్ని బోధపరచుకోవడానికి కావలసిన తత్త్వజ్ఞానమంతటినీ సరసంగా, సమగ్రంగా ఉపదేశించాడు శ్రీకృష్ణుడు. చెప్పటవలసినదంతా నీకు చెప్పడం జరిగింది. కావలసిన జ్ఞానమంతా నీకందించబడింది. ఆ వెలుగులో కర్తవ్యాన్ని నిర్ణయించుకొని, ముందుకు సాగడమే నీవు చేయవలసిన పని.. అన్నాడు శ్రీకృష్ణుడు. తత్త్వమైతే బోధపడిందికాని, కర్తవ్యాన్ని గ్రహించడం అంత సులువుగా గోచరించడంలేదు. అన్నట్లు చూశాడు అర్జునుడు. పరిస్థితిని గమనించిన శ్రీకృష్ణుడు అపారమయిన కరుణతో, 'అయితే ఒక పని చేయి. నన్ను శరణువేడు. సర్వధర్మములను నాయందు సమర్పించు! నేను నీకు కర్తవ్యాన్ని నిర్దేశిస్తాను. ఇక పాపపుణ్యాలతో నీకు పనిలేదు. సకల పాపాలనుండి విమోచనాన్ని అనుగ్రహించి, నిన్ను పునీతుడనుచేసి నిలబెడతాను. దిగులుపడవలసిన పనిలేదు.' అని అభయమిచ్చాడు అనగా అర్జునుని శిష్యునిగా స్వీకరించుటకు ఇచ్ఛగించాడు. 'అమ్మయ్య' అనుకొన్నాడు అర్జునుడు. తన పని తేలిక పడిందని తెలుసుకొన్నాడు. ఇక ధర్మాధర్మాలవిషయమై తనలోతాను మాటిమాటికి విచికిత్స పడవలసిన అవసరంలేదు. ఏది ధర్మమో నిర్ణయించి చెప్పేటందుకు అతడున్నాడు.' అంటూ, అనుకొంటూ, శ్రీకృష్ణునిలోని 'నేను' అను దివ్యప్రజ్ఞకు శరణాగతి చెందాడు.

అటుపైన కురుక్షేత్రం ప్రారంభమయింది, శ్రీకృష్ణుడు మామూలుగా కనబడే ధర్మాలకన్నా పరమధర్మాలనూ, ధర్మ సూక్ష్మాలనూ కర్తవ్యంగా నిర్దేశించాడు. అర్జునుడు మారుమాటాడలేదు. వినమ్రుడై చెప్పినది చెప్పినట్లుచేశాడు. శరణాగతి అంటే ఏమిటో తన ఆచరణలో చూపాడు. 'నేను'ను ఒదిగి ఉండటం ఎలాగో మన కనులకు కట్టించాడు. గురుశిష్యులెలా వర్తించాలో కురుక్షేత్రగాథ మనకు ఉపదేశిస్తూ ఉన్నది.

లోపలికి చూడలేనివారికి కృష్ణుడు తన సారథ్యంలో అధర్మాలనెన్నింటినో ధర్మాలుగా నిర్దేశించి, కథను ముందుకు నడిపినట్లు కనిపిస్తుంది. బలరాముడంతటివాడు కూడ కృష్ణుని సారథ్యం పక్షపాతంతో కూడినది అనుకొన్నాడూ అంటే ఇక మిగిలిన వారి సంగతి చెప్పవలసిన దేమున్నది ? అందుకే కృష్ణుడు ముందుగానే చెప్పాడు. "నేను చెప్పినట్లు చేయి. పుణ్యపాపాల ప్రసక్తి నాకు వదులు ! ధర్మాధర్మాల ప్రసక్తి నాకు వదలు ! వాటి విషయమై నీకేవిధమయిన దిగులూ అక్కరలేదు. నీకే మాత్రం పాపమంటకుండా నేను చూచుకొంటాను. ఆ బాధ్యత నేను వహితాను !' అన్నాడు. అలాగే చూచుకొన్నాడు.

అయితే ఏ ధర్మసూక్ష్మం ప్రకారం కురుక్షేత్రగాథను చిత్రమయిన మలుపులు త్రిప్పుతూ నడిపాడో, యుద్ధరంగంలో తొడలు విరిగిపడియున్న దుర్యోధనుడికి వివరించాడు. "మేము ఆచరించినది అధర్మమన్నావు. మరి నీవు ఆచరింప జేసిన దేమిటి ? ఈ నీ సారథ్యంలో ధర్మబద్ధమయిన సన్నివేశమొక్కటిఉన్నదా?— అని దుర్యోధనుడడిగినప్పుడు వివరించాడు శ్రీకృష్ణుడు. 'మీరింతవరకు ఎలా ప్రవర్తించారో చెబుతాను వినండి'.- అంటూ ' వారి చరిత్రను సమీక్షించాడు, 'అలాంటి మీరు వధింపబడటానికి అర్హులు అవునా, కాదా !- అని అడిగాడు. ఒకసారి వధింపబడవలసినవారుగా నిర్ణయమయిన తరువాత ఇక ఎవరెవరు ఎలావధింపబడతారు అని, ఆ సూక్ష్మములను చూసినది నేను.' అంటూ వివరించాడు. దుర్యోధనునికి మాట పెగలలేదు. ఇలా బదులు ఎవరికి చెప్పాలో వారికే చెప్పేశాడు భగవంతుడు. కనీసం బదులువిన్న తరువాతయినా అతడు సర్దుకొంటాడేమోననిచాలా ఓర్పుగా చాలా సేపటిపాటు చెప్పాడు. అర్జునునకు చెప్పినంతటి బాధ్యతతోనూ చెప్పాడు. అటువంటి ప్రేమ అంతటిది ! రక రకమ భేదాలు అన్నది ఎరుగనిదది.

ధృతరాష్ట్రునకు రాయబార సమయాన తెలియజెప్పే ప్రయత్నించేశాడు. దుర్యోధనునకు యుద్ధం పరిసమాప్తమయ్యేవేళలో తెలియజెప్పే ప్రయత్నం చేశాడు. ఇటు ధర్మరాజుకూ, అర్జునునకూ ఎంతటి బాధ్యతతో తెలియజెప్పాడో అటు ధృతరాష్ట్రునకూ, దుర్యోధనునకూ అంతటి బాధ్యతతోనూ తెలియజెప్పాడు. ధర్మజాదులు విన్నారు విజయాన్ని పొందారు. ధృతరాష్ట్రాదులు వినలేదు. విధ్వంసాన్ని పొందారు.

ధర్మజుడు, అర్జునుడు 'నేను' అను దివ్యప్రజ్ఞకు శరణాగతి చెందిన వారు. ఆ 'నేను'ను శ్రీ కృష్ణునిలో పొడగట్టించుకొని, అతడిని శరణాగతి చెంది తమ ఆలోచనలను, సంకల్పాలను అతడిముందు పరచి, అతడి ఆజ్ఞమేరకు కర్తవ్యాన్ని నిర్వహించారు. సర్వపాపములనుండి విమోచనము చెందినవారై, పాప పుణ్యాలకు, శుభాశుభాలకు అతీతమైనస్థితిలో నిలబడినవారై ధన్యతను చెందారు.

ధృతరాష్ట్రుడు, దుర్యోధనుడు 'నాది' అనబడు దేహరాజ్యంలో చిక్కుకొని 'నేను' అనబడు దివ్యప్రజ్ఞపైపు తేరిపారచూడలేక, అలా చూడటానికి ఇచ్చగించక, చూడాలనికూడ అనిపించక, గిలగిలలాడుతూ, విలవిలలాడుతూ, నరక స్థితిని అనుభవించారు. 'నేను' అనబడు దివ్యప్రజ్ఞ శ్రీకృష్ణునిగా నిలబడి 'ఇదీ కర్తవ్యమని చెబుతున్నప్పటికీ వారికి వినబడలేదు. వారు వినిపించుకోలేదు. వారు వినిపించుకోదలచలేదు. దేహరాజ్యమే వారికి పరమావధి అనిపించింది. 'నేన'ను దివ్యప్రజ్ఞతో మనకి పనేమిటి అనిపించింది. 'నేను'ను అంగీకరించవలసిన అవసరం ఏమిటి ? ఆమోదించవలసిన అగత్యమేమిటి ? దేహరాజ్యం ఇంత బలవత్తరమై ఉండగా, ఆ 'నేన'ను ప్రజ్ఞను శరణు వేడకపోతే నష్టమేమిటి ?. అని వారికి అనిపించింది. ఎవరి ప్రాణానికి వారి కనిపించింది వారికి నిజం అనిపిస్తుంది కదా ! నిజంగా కనిపిస్తుందికదా ! అటుపైన అది నడిపిస్తుందికదా ! ఇక వారు తమకు తోచినట్లు జీవించారు. దేహరాజ్యానికి అనుగుణంగా సాగిపోయారు.

దేహరాజ్యంలో చిక్కుకొన్నపుడు అర్థకామాలు ప్రాధాన్యం వహిస్తాయి. అర్థకామాలే మనిషిని నడిపిస్తాయి. ధర్మం దెబ్బ తింటుంది. బంధం చుట్టుకొంటుంది. ధృతరాష్ట్రాదుల జీవితంలో జరిగింది అదే !

'నేన'ను దివ్యప్రజ్ఞను శరణాగతి చెందినపుడు ధర్మం ప్రాధాన్యం వహిస్తుంది. అర్థకామాలు దానికి ఒదిగి ఉంటాయి. దానితో మోక్షస్థితి కరతలామలకమవుతుంది. ధర్మజాదులు 'నేను' అను దివ్యప్రజ్ఞను శరణుపొంది ఈ దివ్యస్థితిని అందుకొన్నవారు.

'నేన'ను దివ్యప్రజ్ఞకు శరణాగతి చెందినవారు ఎలా ఉంటారు? అలా శరణాగతి చెందక దేహరాజ్యాన చిక్కుకొన్నవారు ఎలాంటి స్థితిని అనుభవిస్తారు? అన్నది పెద్దయెత్తున మన కనులకు కట్టించడానికిగాను మహాభారతమనే మహేతిహాసం వ్యాసభగవానునిచేత మనముందు ఉంచబడింది. శ్రీకృష్ణుని మహోపదేశానికి ఒక మహత్తరమయిన ఉదాహరణగా మహాభారతాన్ని నిర్మించి అందించాడు వేదవ్యాసుడు. భగవద్గీతను హృదయంగా నిలిపి, భారత మహేతిహాసాన్ని దేహంగా రూపొందించుకొంటూ వచ్చాడాయన. కనుక మహాభారతం 'నాది', 'నేను'ల కథ !

మనస్సు 'నాది' అను దేహరాజ్యం వైపు మొగ్గుతున్నకొద్దీ జీవితం బరువనిపిస్తుంది. మనస్సు 'నేను' అను దివ్యప్రజ్ఞకు దగ్గరవుతున్నకొద్దీ జీవితం తేలిక పడుతుంది మనస్సు దేహరాజ్యంవైపుకు మొగ్గుతున్నకొద్దీ మనస్సుకు వత్తిడి పెరుగుతుంది. మనస్సు 'నేన'ను దివ్యప్రజ్ఞకు దగ్గరవుతున్నకొద్దీ మనస్సుకు హాయి లభిస్తుంది. మనస్సు దేహరాజ్యాన చిక్కుకొంటున్నకొద్దీ జీవిత మొక సమస్య అవుతుంది. మనస్సు 'నేన'ను ప్రజ్ఞకు దగ్గరవుతున్నకొద్దీ జీవితాన సమన్వయం భాసిస్తుంది. ఈ సత్యాన్ని తెలియజెప్పడానికే ఏసుప్రభువు "ప్రయాసపడి భారము మోయుచున్న నరులారా ! నా యొద్దకు రండు ! విశ్రాంతి నిచ్చెదను' అన్నాడు. దేహరాజ్యాన చిక్కుకొన్నవారు ప్రయాసపడి భారముమోయుచున్నవారు. 'నేను' అను ప్రజ్ఞను సమీపించినవారు విశ్రాంతిని పొందగలవారు. ఈ ఉపదేశమందలి ఈ సూక్ష్మాన్ని గ్రహించలేక "నా యొద్దకు" అన్నప్పుడు ఏసుప్రభువు యొద్దకు అని వ్యక్తిగతంగా, వ్యక్తిపరంగా చెప్పుకొనేవారున్నారు. అది తెలియనితనం అవుతుంది. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం

వ్రజ ———— అన్న శ్రీకృష్ణుని ఉపదేశమే తరువాతికాలాన ఏసుప్రభువు నోట నుండి మరొకసారి ఇలా వెలువడింది.

అలాగే 'అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మా శుచః। సకల పాపములనుండి నేను నీకు విమోచనాన్ని అనుగ్రహిస్తాను. నీవు దుఃఖ పడవద్దు. దిగులు చెందవద్దు_ అన్న శ్రీకృష్ణుని ఉపదేశ వాక్యమే, ఏసుప్రభువు గాథలో పాపుల పాపాలను అతడు మోసినట్లుగా, ఆ పాపాలను తాను భరించి నట్లుగా, తాను శిలువపై రక్తాన్ని చిందించి, వారి పాపాలను కడిగినట్లుగా, చెప్ప బడింది, చూపబడింది.

ఆధునికకాలంలో గాంధీమహాత్ముడు 'నేను' అను దివ్యప్రజ్ఞను ఆశ్ర యించి, భారతదేశ స్వాతంత్ర్య సమరాన్ని నడిపినవాడు. గాంధీమహాత్మునికి ముందుకూడ నాయకులెందరో ఉన్నారు. అందులో హేమాహేమీలున్నారు. వారె వరూ వహించని ప్రధానపాత్రను గాంధీమహాత్ముడు వహించగలిగాడు. దానికి కారణం అతని రూపంకాదు. అతని తెలివితేటలు కావు. అతని సామర్థ్యమూ కాదు. 'నేన'ను దివ్యప్రజ్ఞను ఆశ్రయించి, జీవితాన్ని తీర్చిదిద్దుకోవడంలో అతడు చూపిన దీక్ష. ఆ దీక్షకే ఆనాటి నాయకులందరూ ఆయనకు శిరస్సు వంచారు. ఆయనంటే నచ్చినవారూ, నచ్చనివారూ కూడ ఆయనకు నమస్కరించారు. ఆ 'నేన'ను వెలుగునుండి కర్తవ్యాన్ని ఎప్పటికప్పుడు అందుకొనే ప్రయత్నం చేశాడు గాంధీ మహాత్ముడు. ఆ అందుకోవడంలో ఎప్పుడయినా స్పష్టత కొరవ డితే వెంటనే భగవద్గీతను తెరిచేవాడు. అలా తెరిచేటప్పటికి ఆ 'నేను' అంది వచ్చేది. కర్తవ్యం స్పష్టమయ్యేది. ఆ స్పష్టమయిన కర్తవ్యాన్ని నిర్వహించే వాడాయన. అనుయాయులచేత నిర్వహింప చేసేవాడు. ఎప్పుడయినా ఆ 'నేను' అంది రాకపోతే మథనపడేవాడు. తపన పడేవాడు. ఆ తపనకు మెచ్చి ఆ 'నేను' ఇక అంది వచ్చేది. కథ మళ్ళీ సాగిపోయేది.

'నేను'గా నిలబడే ప్రయత్నం చేశాడు కనుకనే సకల సంప్రదాయాలను అతడు గౌరవించాడు. సకల సిద్ధాంతాలను అధ్యయనం చేశాడు. విభిన్న మనస్త

త్వాలు గలవారిని 'ఏకత్రాటి' మీద నడిపించగలిగాడు. 'నేను'గా అతడు నిలబడుతున్నాడని గ్రహించిన పెద్దలందరూ అతడిని 'మహాత్ముడు' అని కీర్తించారు. అంటే అందరిలోని 'ఆత్మ'గా, అందరిలోని 'నేను'గా అతడు వర్తిస్తున్నాడని అర్థం. వర్తించగలుగుతున్నాడని అర్థం.

ఒకవైపు బానిసత్వపు సంకెళ్ళను ఛేదిస్తూనే మరొకవైపు ఆ బానిసత్వానికి జాతి బలికావడానికి జాతిలోని ఏ పాపాచరణలు కారణమో గ్రహించి, ఆ పాపాచరణలనుండి జాతికి విమోచనం కలిగించడానికి దీక్షతో పనిచేశాడాయన. కొన్ని వందల సంవత్సరాలుగా మాల, మాదిగలను మనం అస్పృశ్యులు అంటూ వచ్చాం. ఆ తరువాత మనదేశం వచ్చిన ఆంగ్లేయులు మొత్తం మన జాతి జనులనే అస్పృశ్యులుగా భావించారు. ఒకరకంగా ఇది మన జాతి పాపఫలితంకాదా! అని ప్రశ్నించుకొన్న గాంధీ మహాత్ముడు ఆంగ్లేయులను తరిమికొట్టడానికి ఎంత ప్రయత్నించాడో, హరిజనోద్ధరణకు కూడ అంతగానూ ప్రయత్నించాడు. పైగా ఈ రెండు ప్రయత్నాలూ ఏకకాలంలో నిర్వహించాడు. ఒకవైపు జాతిజనుల పాపాలను కడుగుతూ, మరొకవైపు జాతిజనులకు పరాయిపాలననుండి విముక్తిని కలిగించాడు. గీతాసందేశం మహాత్ముణ్ణి అంతటిస్థితిలో నిలబెట్టింది. అంతటి కార్యాన్ని సాధింపజేసింది!

ఒక పనిని మనం చేయవలసి వచ్చినప్పుడు, ఒక నిర్ణయాన్ని మనం తీసికొనవలసి వచ్చినప్పుడు ఎన్నెన్నో ఆలోచనలు వస్తాయి. ఎన్నెన్నో విధానాలు మనకు తోస్తాయి. రకరకాల సంకల్పాలు మనలో కలుగుతాయి. అనేక విధాలయిన ధర్మవిచికిత్సలు మనలో కదులాడతాయి. మరప్పుడేం చేయాలి? సాధారణంగా మానవుడు తన పూర్వసంస్కారాన్ని అనుసరించి ఏదో ఒకవైపుకు మొగ్గుతాడు. ఇది కూడని పని. జరుగవలసినది ఏమంటే ఆ మనస్సులో మెదులుతున్న వాటన్నింటినీ 'నేను' ముందు సమర్పించాలి। అప్పుడా నేను ఆ సమర్పించబడిన వాటిలో దేనినో ఒకదానిని ఆమోదించవచ్చు. లేదా సరిక్రొత్త పరిష్కారాన్ని సూచించవచ్చు. ఆ 'నేను' చేసిన నిర్ణయానికి మన మనస్సు కట్టుబడాలి! దానిని అమలుపరచడంలో చిత్తశుద్ధి కలిగి ప్రవర్తించాలి! చిత్తశుద్ధి గలిగిదీక్షతో

దానివి అమలుపరచినప్పుడే మరొకసారి మనం 'నేను'ను సంప్రదించడానికి వీలు కలుగుతుంది.

ఒక్కొక్కసారి నిర్ణయం తీసికోవలసి వచ్చినప్పుడు ఇటుచూస్తే ఇది ధర్మమనిపిస్తుంది. అటుచూస్తే అది ధర్మమనిపిస్తుంది. ఎటుచూస్తే అటు ధర్మం కనిపిస్తుంది. వీటిలో వేటికవి ధర్మాలే! మరి ఈ ధర్మాలన్నింటిలో మనం ఆచరించవలసిన ధర్మం ఏమిటి ? అన్న సందిగ్ధస్థితి మనసుకు ఏర్పడుతుంది. అప్పుడా అనిపిస్తున్న ధర్మాలన్నింటినీ 'నేను' ముందుపెట్టాలి! 'నేను'కు సమర్పించాలి! 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అన్నమాటకు అర్థమిదే! మనకు అనిపించడంలో తప్పు లేదు. కాని అనిపించినవన్నీ ఆచరించకూడదు. కాని ఆ అనిపించినవన్నీ 'నేను'కు సమర్పించాలి! అప్పుడు సర్వసంకల్ప సన్న్యాసి అన్న స్థితి మనకు లభిస్తుంది. మనలో కలుగుతున్న సర్వసంకల్పాలను, వాటినిగూర్చి మనలో మెదులుతున్న సర్వధర్మాలను ఆ 'నేను' ముందు సమర్పణ చేయాలి! అటుపైన ఆనేను యొక్క ఆమోదం మేరకు, ఆదేశం మేరకు మన కర్తవ్యనిర్వహణ సాగాలి! అప్పుడది సృష్టికర్మ అవుతుంది. సృష్టికర్మగా అది నిర్వహింపబడుతున్నప్పుడు పుణ్య పాపాల ప్రసక్తి ఉండదు. కర్మబంధాలకు ఆస్కారముండదు.

అలాకాక, నేను వరకూపోక, ఆ 'నేను' యెడల సమర్పణ బుద్ధి కలుగక, మనం మనస్సుతోనే కర్తవ్యాన్ని నిర్ణయించుకొన్నప్పుడు అది స్వంతకర్మ అవుతుంది. పుణ్యపాపాలు దానికి ఉంటాయి. అంటుతాయి. కర్మబంధం దానివలన ఏర్పడుతుంది.

మనస్సుతో నిర్ణయిస్తే అది సొంతకర్మ అలాకాక 'నేను' యొక్క ఆమోదాన్ని పొందితే అది సృష్టికర్మ. ఇంతకూ మన జీవితం సొంతకర్మగా సాగుతున్నదా ? సృష్టికర్మగా వ్యక్తమవుతున్నదా! అన్నది మనకు తెలియాలి! ఆ గమనిక మనలో ఉండాలి!

ఎవరికి వారు తమలోని నేనును సూటిగా ఆశ్రయించగలగడం అంత సులువుకాదని చెప్పుకొన్నాం. గురుమూర్తిని ఆశ్రయించడంవల్లనే 'నేను'ను

అందుకోవడం సుళువుగా సాధ్యమవుతుందని కూడ చెప్పుకొన్నాం. ఈ విధంగా సాధనలో గురుశిష్య సంబంధమనునది తప్పనిసరి అనికూడా తెలిపికొన్నాం. తెలియని వారు కొందరు సామాన్యులకు గురువు కావాలిగాని, ఒకస్థాయి దాటినవారికి గురువుతో పనిలేదని అంటూ ఉంటారు. మనలోమాట. ధర్మరాజు, అర్జునుడుకన్న స్థాయిగలవారెవరు ? భీష్మ విదురులకన్న స్థాయిగలవారెవరు ? ఆలోచించండి. ఎంతటి మహనీయుడయినా అతడు భూమిమీదకు దేహధారిగా దిగి రావడానికి తల్లిదండ్రులెలా అవసరమో, సాధకుడు ఎంతటి స్థాయిగలవాడయినా అతడు ఊర్థ్వగతినిపట్టి 'నేను'గా నిలబడటానికి గురుమూర్తి అలా అవసరం ! ఇది సృష్టిలో దేవదేవుడు తానుగా చేసిన ఒక ఏర్పాటు. మానవుని తరింపజేయగోరి దేవదేవుడే గురుశిష్య సంప్రదాయానికి ఇలా రూపుదిద్దాడు, అపారమయిన ప్రేమతో ఆ దేవదేవుడే మానవుడిని తరింపజేసే గురుమూర్తిగా వ్యక్తమవుతూ ఉంటాడు. ఒక్కసత్యం గమనించండి. దేవుడు దిగివస్తే గురువనబడతాడు. గురువునకు నమస్కరిస్తే దేవుడే కనబడతాడు. ఇంకా చెప్పాలంటే దేవుడు, గురువు, శిష్యుడు-అన్నవి దేవదేవునియొక్క మూడుస్థితులు. మనకివి వేరుగా కనబడతాయి. కాని దేవదేవునకివి తనస్థితులే !

గురుశిష్య సంబంధాన్ని రుచిచూసిన శిష్యునకు ఒకసత్యం అనుభవానికి వస్తుంది. అదేమిటంటే గురువు తనకన్న వేరుకాదని ! ఇంకొంచెం పైకి చూడ గలిగినప్పుడు మరొకసత్యం అనుభవానికి వస్తుంది. అదేమిటంటే- దైవం తన గురువుకన్న వేరుకాదనీ, వేరుగాలేడనీ ! దేహములు వేరుగా కనబడవచ్చు. స్థితులు వేరుగా గోచరించవచ్చు, కాని ఉన్నది ఒక్కడేనని అనుక్షణం అనుభవానికి వస్తూ ఉంటుంది. అటుపైన మరొకసత్యం దర్శనమిస్తుంది. అదేమిటంటే గోచరిస్తున్న ఈ సృష్టి రూపంగా ఉన్నది కూడా ఆ దైవమేనని ! నిజానికి అతడు అంతర్యామియనీ, తానుకూడ ఆ అంతర్యామిలో భాగమేననీ, దానితో గురువు దైవమై, దైవమంతర్యామియై, అనుభవానికి అందుతాడు. ఆ అనుభవాన్ని అందుకొంటూ శిష్యుడుకూడ క్రమంగా అంతర్యామిత్వాన్ని పొందుతాడు. గురుశిష్య సంబంధంగా ప్రారంభమయిన సాధన ఇలా అంతర్యామిత్వ అనుభవంగా పర్యవసిస్తుంది. పరిమళిస్తుంది.

సాధకుడు ఇలా అంతర్యామిత్వాన్ని అనుభవిస్తూ, దేహరాజ్యాన్ని పరిపాలిస్తూ, దినచర్యను దేవునిచర్యగా వ్యక్తం చేయగలగాలి ! అప్పుడు అతని జన్మకర్మలు దివ్యములయినవి అవుతాయి. కర్మాచరణమన్నది అతనిద్వారానిర్వహింపబడుతుంది తప్ప, అతనివలన నిర్వహింపబడదు. నిమిత్తమాత్రంగా నిలబడటముంటుంది తప్ప, కర్తృత్వమిక అతనికి ఉండదు నడిచేది నిష్కామకర్మ కనుక భోక్తృత్వమూ ఉండదు. అనగా కర్మఫలానుభవమూ ఉండదు. కర్మఫలముల ప్రసక్తికూడా ఉండదు. సృష్టి ప్రణాళిక నుండి కర్మాచరణ వ్యక్తమవుతుంది. సృష్టి యజ్ఞానికి కర్మఫల సమర్పణ జరుగుతుంది. నడుమనున్న కర్మాచరణలో కౌశలం అందివస్తుంది. ఆ కౌశలం అందిరావడంతో దేహ పర్యంతమూ తరుగని హాయి ఒకటి అనుభవానికి వస్తుంది. మనస్సు ఆ హాయిలోనుండిహాయిగా కర్మాచరణను నిరంతరం నిర్వహించ గలుగుతుంది. దివ్యమయిన విశ్రాంతి ఒకటి అనుభవానికి వస్తూఉండగా, కర్మాచరణమన్నది నిర్విఘ్నంగా, నిరంతరం సాగిపోతూ ఉంటుంది. పనిని చేస్తున్నానన్న భావన అక్కడ ఉండదు. పని జరుగుతున్నదని మనకు తెలిసివస్తుంది. ఆ స్థితిలో పనులు మనమీదుగా జరగడం ఉంటుందితప్ప చేయడమన్నది ఉండదు. సూర్యునిమీదుగా వెలుగు వ్యక్తమవుతున్నదా, లేక సూర్యుడు వెలుగును వ్యక్తం చేస్తున్నాడా । చంద్రునిమీదుగా వెన్నెల వ్యక్తమవుతున్నదా ? చంద్రుడు వ్యక్తం చేస్తున్నాడా ? అలాంటిదే మనమీదుగా వ్యక్తమవుతున్న కర్మాచరణకూడా !— అన్న దర్శనం లభిస్తుంది. దానితో దివ్యమయిన ఆనందస్థితిలో దినచర్య అలవోకగా సాగిపోతుంది. ఆ సాగిపోతున్న దినచర్య దేవదేవుని లీలావిలాసంలోని భాగంగా పరిణమిస్తూ, పర్యవసిస్తుంది.

పరమగురువులు మాస్టర్ సి. వి. వి. వైభవోపేతమయిన జీవితాన్ని గూర్చి వర్ణిస్తూ నాడీగ్రంథం "ప్రణుత నిజజనాన్ స్వాత్మతుల్యాన్ కరోతి" అని అన్నది తనను నమ్మినవారిని తనంతవానిగా తీర్చిదిద్దుతానని— దీనిభావం. మాస్టర్ సి. వి. వి. తాము 'నేను'గా నిలబడి, తమకు నమస్కరించిన వారిని ఆ 'నేను'గా నిలబెట్టడమే ఒకవ్రతంగా స్వీకరించారు. భౌతికదేహంతో నిమిత్తంలేకుండా ఇప్పటికీ వారు ఆ వ్రతాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ— అన్న శ్రీకృష్ణుని అభయవచనమే మాస్టర్ సి. వి. వి. నుండి 'నాకు నమస్కరించు చాలు, మిగిలినది నేను చూచుకొంటాను.' నిన్ను

నుగా నిలబెట్టుకొంటాను. నా వాహికగా నీ దేహాన్ని సద్వినియోగపరుస్తాను! న్న ప్రేమపూర్వకమయిన ఆదేశంగా అందించబడింది, అన్నట్లుగానే ఆత్మా పణ చెందినవారికి అంతటిస్థితిని అందించారు, అందిస్తున్నారు. అందిస్తూనే ంటారు.

శ్రీకృష్ణుడు సమన్వయించి, అందించిన రాజయోగమార్గాన్ని ఇప్పటి యుగధర్మానికి, యుగపరిణామానికి తగినట్లుగా మలచి 'భక్తిరహిత తారక రాజయోగం'గా రూపొందించి అందించారు మాస్టర్ సి. వి. వి. శ్రీకృష్ణుని వరకు నడచి వచ్చిన కథను తగినవిధంగా ఆయన కొనసాగించారు అని చెప్పవచ్చు.

ఇక, ఇ. కె. మాస్టరుగారు చిన్నతనంలోనే మాతృవియోగాన్ని అనుభవించారు. ఆ తల్లి శరీరాన్ని విడిచిపెట్టబోతూ తనకు పెద్దబిడ్డ అయిన మాస్టరుగారిని దగ్గరకు తీసికొని శ్రీకృష్ణుని విగ్రహాన్ని చేతబెట్టి 'నాన్నా! నేను ఇక శరీరాన్ని విడిచిపెడుతున్నాను. ఈ శ్రీకృష్ణుడిని నాకు బదులుగా నీకు అందిస్తున్నాను. ఇతడు చెప్పినట్లు విను. ఇతడు చెప్పినట్లు చేయి! ఇక అన్నీ ఇతడే! ఇతడి తత్త్వమే నీలో నిండి ఉంది. ఆ కారణంచేతనే నాన్నగారు నీకు 'కృష్ణమాచార్య' అనిపేరు పెట్టారు. ఇతడిలా నడుచుకో! ఇతడిలా వర్తిల్లు! ఇతడి ప్రణాళికను నిర్వహించు!'— అని చెబుతూ పరలోకంలోనికి ప్రవేశించింది. మాస్టరుగారు ఆ చిన్నవయస్సున ఆ విగ్రహంతో అలా ఉండిపోయారు.

అటుపైన ఆ తల్లిమాట ప్రకారం మాస్టరుగారి జీవితం నడిచింది. కృష్ణుడి అడుగుజాడలలో ఆయన జీవితం సాగింది. కృష్ణతత్త్వంతో ఆయన జీవితం నిండింది. కృష్ణుడే ఆయన. ఆయనే కృష్ణుడు. అన్న తీరులో ఆయన జీవితం పరిమళించసాగింది.

వారి జీవితం అలా పరిమళాలను వెదజల్లుతూ ఉండగా ఆ శ్రీకృష్ణుడే మాస్టర్ సి.వి.వి.గా వారికి ధ్యానంలో సాక్షాత్కరించారు. దానితో మాస్టరుగారి జీవితం ఒక పెద్దమలుపు తిరిగింది. కృష్ణతత్త్వంతోపాటుగా మొత్తం సనాతన

ధర్మాన్ని, నవీనయుగానికి తగినట్లుగా సమన్వయించి, నరజాతికి అందించవలసిన బాధ్యత ఇ. కె. మాస్టరుగారికీ, వారి శిష్యపరంపరకూ అప్పగించబడింది. దానితో ఇ. కె. మాస్టరుగారు నవీనయుగానికి ఆధ్యాత్మిక వారధిగా, సారథిగా రూపొంది వర్తించారు.

నవీనయుగానికి అనన్యచింతనను అలవరచి, ఈ యుగజనులను అంతర్యామిత్వంలోనికి మేల్కొల్పడంలో ఇ. కె. మాస్టరుగారు వహించిన పాత్ర అద్వితీయం. దేవదేవుని కార్యక్రమం ఇ. కె. మాస్టరుగారి మీదుగా ఇలా కావలసిన రూపాన్ని సంతరించుకొంటూ ఉన్నది.

చూడగా శ్రీకృష్ణుడు, మాస్టర్ సి. వి. వి. మాస్టర్ ఇ. కె. అన్నవి దేవదేవుని మూడు స్థితులుగా, మూడు మూర్తులుగా మనకు గోచరిస్తాయి.

దేశకాల పాత్రలనుబట్టి ఆ దేవదేవుడు ఇలా వివిధమూర్తులుగా వ్యక్తమవుతూ నరజాతిని నారాయణస్థితిలోనికి మేల్కొలుపుతూ ఉంటాడు. అనన్యచింతన అలవరచి, అంతర్యామిత్వంలోనికి వారిని నడుపుతూ ఉంటాడు. తనలో నిలుపుతూ ఉంటాడు.



# సారథి రచనల సంక్షిప్త పరిచయం

**స్వామి గేయాలు :**

తీయగా హాయిగా సాగుతూ మనలను ప్రేమగా వెలుగుగా రూపొందిస్తాయి ఈ గేయాలు. మాస్టర్ ఇ. కె., మాస్టర్ సి.వి.వి. వంటి పరమ గురువుల దివ్యరూపాలను మనకు అనుభవానికి తెస్తాయి. అలసటను పోగొట్టి, ఉత్తేజితులను చేస్తూ ఆచరణ పథంవెంట, ఆనందధామం పైపునకు మనలను ఇట్టే నడిపిస్తాయి

**దర్శనాలు - నిదర్శనాలు :**

(1, 2 భాగాలు)

తెలిసిన దృశ్యాలను చూస్తూ, తెలియవలసిన సత్యాలను మనమందుకొనే లాగున చేస్తారు. ఇ. కె. మాస్టరుగారు ఇందులో. పతంజలి, భగవద్గీత మనకు అందిస్తున్న రాజయోగమార్గాన్ని వెన్నతో పెడతారాయన ఈ భాగాలలో. యోగ మంటే ఏమిటి ? సాధనంటే ఏమిటి ? సమాజమంటే ఏమిటి ? జీవితమంటే ఏమిటి ? అన్నది ఈ గ్రంథాలలో ఆయన చక్కగా తెలియజెబుతారు

**అన్వేషణ - అనుభూతి :**

శ్రీ కృష్ణస్వామి సంక్షిప్త జీవిత చరిత్ర ఇది. చిన్ననాటితో ప్రారంభ మయి ఇ. కె. మాస్టరుగారి సన్నిధికి చేరుకొనే వరకూ జరిగిన దివ్యగాథను సూటిగా మన హృదయాలలో నాటుకొనేటట్లుగా చెబుతారు శ్రీ కృష్ణస్వామి. మనస్సున్న ప్రతి మనిషి చదవవలసిన ప్రత్యేకమైన గ్రంథమిది.

**అక్షరాల్లో అనుభూతులు :**

(1, 2, 3, 4 భాగాలు)

ఇ.కె. మాస్టరుగారు పరిచయమయిన తరువాతనుండి దివ్యమయినవారి సహచర్యంలో శ్రీ కృష్ణస్వామి పొందుతూ వచ్చిన సార్థకమయిన అనుభూతులకు సరస మయిన అక్షరరూపాలివి. వారినుండి పొందినచేయూతను మొదటిభాగంగానూ, రక్షణను రెండవ భాగంగానూ, ప్రోత్సాహాన్ని మూడవభాగంగానూ, విశ్వరూప సందర్శనాన్ని నాలుగవ భాగంగానూ శ్రీ కృష్ణస్వామి మనకు అందించారు. ఈ గ్రంథాలను మనసుపెట్టి చదివినప్పుడు నరునికి కావలసిన ఆ నాలుగు అంశాలను మనం కూడా నిండుగా పొందగలుగుతాం.

**మానవసేవలో మాస్టర్ ఇ. కె. :**

మాస్టర్ ఇ. కె. హోమియో వైద్యునిగా రూపొంది సమాజ సేవక
నడుము కట్టిన దివ్యచరితను విందుగా వర్ణిస్తుంది ఈ గ్రంథం. గ్రంథం చదువ
తున్నంతసేపూ వారి సాక్షాత్కార సాహచర్యాలు మనకు అలవోకగా లభిస్తాయి
వ్యాధి బాధలు తొలగిపోవడానికి ఈ దివ్యచరితను మనసుపెట్టి చదువుకొంటేచాలున
మనకు తెలుస్తుంది. మనలో అంతటి మార్పు వస్తుంది.

**సంభాషణలు - సమన్వయాలు :**

సగటు మనిషికి సాధారణంగా మనస్సులో మెదులుతూ ఉండే రకరక
లయిన సంశయాలన్నింటికీ ఈ గ్రంథంలో మాస్టర్ ఇ. కె సమన్వయాత్మ
మయిన సమాధానాలనందిస్తారు. స్త్రీ, పురుష విభాగాన్ని గూర్చి, మృత్యువుయొక్క
పూర్వాపరాలను గూర్చి, స్వర్గ నరకాలయొక్క స్వరూప స్వభావాలను గూర్చి, పిత
కర్మల పరమార్థాన్ని గూర్చి, చేతబడులు, చిల్లంగులను గూర్చి, నిత్యపూజల
సంశయాలను గూర్చి, మహానుభావుల మర్మాలనుగూర్చి, సామాజిక సమస్యలక
పరిష్కారాలను గూర్చి- ఒకటేమిటి మనలో మెదిలే ప్రతి సంశయానికీ ఇదిగిదిగ
నని వెంటనే బదులు పలికే ఈ దివ్యగ్రంథం నిజంగా ఒక కల్పవృక్ష
లాంటిది.

**సరసాల్లో నవరసాలు :**
(1, 2, 3 భాగాలు)

ఒక ప్రవక్త మనతో సరసమాడితే ఎలా ఉంటుంది. అది ఎంత స
సంగా, సార్థకంగా నడుస్తుంది- అన్నది ఈ గ్రంథాలలో మనకు అనుభవాని
వస్తుంది. ఇ. కె. మాస్టరుగారు మానవజాతి మనస్సునకు పెట్టిన గిలిగింతలను ర
గ్రంథాల నుండి మనంకూడా అందుకోవచ్చును. మధురమయిన ఆ సరసంలో
వెనుకనుండి అలా అలా ఒక గంభీరమయిన సందేశం- ఎలా ఎలా కొంటెగ
దోబూచులాడుతూ ఉంటుందో ఈ మూడు భాగాలలో మనం గమనించవచ్చును.

**మాటలు - మంత్రాలు :**
(1, 2 భాగాలు)

మాటలలోని మంత్రాలు. మంత్రాల వంటి మాటలు మనకీ గ్రంథా
నిండా కనబడతాయి. కృష్ణస్వామిగారి మాటలే మంత్రాలు. అవి ఎంత అ

సంతంగా ఉంటాయో అంత నాజూకుగా ఉంటాయి. మనకు తెలియకుండానే మన చేత మననం చేయబడతాయి, మనలో నిలబడతాయి. మనను నిలబెడతాయి.

**స్వామి పలుకులు - స్వాతి చినుకులు :**
(1, 2 భాగాలు)

శ్రీ కృష్ణస్వామి ఆడిన మాటల ఆటలు. మాటలతోడి ఆటలు. సరస మైన ఆటలు. సరదా సరదా ఆటలు. మనను కూడ ఆడిస్తాయి. బాగా ఆట పట్టిస్తాయి. ఆట పట్టిస్తూనే కథను రక్తి కట్టిస్తాయి. అన్నిటినీ మించి మనను కడుపుబ్బ నవ్విస్తాయి.

**మాటల మధ్యలో రాలిన ముత్యాలు :**
(1, 2 భాగాలు)

పేరు చెబుతోంది మనం కూడ ఆ ముత్యాలను ఏరుకోవచ్చని. ఈ భాగాలలో వాటిని ఏర్చి కూర్చి పెట్టామని. మన జీవిత సన్నివేశాల మధ్యలో ఈ ముత్యాలు అక్కరకు వస్తాయని !

**స్వామి లేఖలు - శాంతి రేఖలు :**
(1, 2 భాగాలు)

మనకందరికీ కావలసిన లేఖలన్నీ ఈ భాగాలలో వ్రాసిపెట్టబడిఉన్నాయి. ప్రతి లేఖా జీవితంలో ఏదో ఒక సన్నివేశంలో మనకో, మన తోటివారికో పనికి వచ్చేదే ! ఏ లేఖకు ఆ లేఖ ఎంత అర్థవంతంగా ఉంటుందో, అంత ఆత్మీయం గానూ సాగుతుంది. మన గుండెల్ని తాకుతుంది,

**పునర్నిర్మాణానికి శంఖారావం :**
(1, 2 భాగాలు)

జాతి పునర్నిర్మాణ సూత్రాల నందించే స్వామి ప్రవచనాలసంకలనమిది. మనమిప్పుడు ఎక్కడున్నామో, ఇప్పుడు మనం ఏమి చేయాలో సూటిగా, సున్నితంగా వివరిస్తుంది ఈ గ్రంథం.

**ఇది మన సంస్కృతి - ఇది మన సంప్రదాయం :**

వివిధ పర్వదినాలను గూర్చి, ఉత్సవ సమయాలను గూర్చి తెలిసికోవాలని మనకు అనిపిస్తూ ఉంటుంది. ఆయా పవిత్రదినాల యొక్క సందర్భమేమిటి

ఔచిత్యమేమిటి, పరమార్థమేమిటి. అన్నది తెలిసికొంటే బాగుండును అనిపిస్తుంది అందుకు తగిన గ్రంథమిది. వాటన్నింటినీ ఇముడ్చుకొన్న గ్రంథమిది. ఆయా విశిష్ట సమయాలలో శ్రీ కృష్ణస్వామి చేసిన విలువైన ప్రవచనాల సంకలనమిది !

**కామధేనువు కనికరించినవేళ :**

కాళిదాస మహాకవి రచించిన రఘువంశ మహాకావ్యంలోని మొదటిరెండు సర్గలకు అనగా దిలీప ఖండమునకు దివ్యమైన భావానువాదాన్ని అందించే గ్రంథమిది. దీనిని అనువాదం అనడంకన్నా కమ్మని తెలుగువచనంలో జరిగిన అవతరణం అనడం ఎంతయినా సముచితం.

**నిత్యసత్యాలు - ఆణిముత్యాలు :**

(1, 2 భాగాలు)

బాలబాలికలను తీర్చిదిద్దడం కోసం ప్రత్యేకంగా రూపుదిద్దుకొంటున్న ప్రయోజనకరమైన సంకలన గ్రంథాలివి. మనకు ప్రసిద్ధిచెందిన శతకాలెన్నో ఉన్నాయి. వీటన్నింటినుండి బాల బాలికలకు ఎల్లకాలము పనికివచ్చే లాగున తగిన పద్యాలను ఎంచి, తగినట్లుగా వాటికి భావాలను జతగూర్చి, ప్రత్యేకమైన శ్రద్ధతో భావిభారతంపై దృష్టినిడుకొని ఈ సంకలనాలకు రూపునిద్దుతున్నారు శ్రీకృష్ణస్వామి.

**నిత్యజీవితానికి నియమావళి :**

నిత్యజీవిత నిర్వహణానికి కావలసిన నియమావళి నందిస్తుంది గ్రంథం. మేలుకొలుపుతో ప్రారంభించి ఆహారస్వీకరణం, విధి నిర్వహణం, విశ్రాంతి విహారాలు, దాంపత్యానుబంధం, నిద్ర-తీరుతెన్నులు, గృహ వాతావరణం మొదలైన అంశాలను ఆచరణకు అనువైనరీతిలో, అనుభూతిప్రదంగా వివరిస్తుంది గ్రంథం. చదువరి ఈ గ్రంథాన్ని ఒక ఆదర్శంగా, ఒక పెద్దదిక్కుగా స్వీకరిస్తాడు అన్నది అనుభవంలోని అంశం.

**ప్రథమచికిత్స - తరుణవార్ధక్యాలు :**

ఈ గ్రంథం పరిమాణంలో చిన్నది అయినా, ప్రయోజనంలో చాలా దొడ్డది. అడుగడుగునా అక్కరకు వస్తుంది. ఆప్తమిత్రునిలా రక్షణను అందిస్తుంది. ప్రతి చిన్న విషయానికీ వైద్యాలయాల పాలుకాకుండా మనను రక్షిస్తుంది. అనారోగ్య స్థితులను గోటితోనే తీసివేసి, గొడ్డలికి పని చెప్పవలసిన అవసరం రాకుండా చూస్తుంది. హోమియో విధానాన్ననుసరించి ఈ గ్రంథం రూపొందించబడింది. ద్వాదశ లవణ చికిత్సకూడా ఇందులో చేర్చబడింది.

## హోమియో విధానము - ఒక అవగాహన :

ఈ గ్రంథం హోమియో గురించి జనసామాన్యంలో ఉన్న అపోహలను తొలగిస్తుంది. వారి అభిప్రాయాలను సరిచేస్తుంది. వారికి కావలసిన అవగాహనను అందిస్తుంది. నిత్య జీవిత నిర్వహణలో హోమియో యొక్క ఆవశ్యకతను తెలియజెబుతుంది

ఈ గ్రంథం తమతో ఉన్నవారు తమ ఆరోగ్యాన్ని సకాలంలో సక్రమంగా గమనించ గలుగుతారు. సరైన చికిత్స పొందడానికి సన్నద్ధులవుతారు. వ్యాధిని అణచిపెట్టే స్థితినుండి, వ్యాధిని సాగనంపే స్థితికి ఎదిగి ప్రవర్తిస్తారు. అంతటి అవగాహనను ఈ చిన్న గ్రంథం నుండి అందుకొంటారు.

పరిమాణంలో చిన్నదే అయినప్పటికీ ఇది తరచు అధ్యయనం చేయవలసిన గ్రంథం. శాశ్వతమైన నివారణకు దారిచూపి, పరిపూర్ణమైన స్వస్థతకు సింహ ద్వారాన్ని తెరిచే గ్రంథం.

## ప్రేయరు - పద్ధతి :

ఇది ఒక దివ్య గ్రంథం. మాస్టరు సి. వి. వి జాతి కనుగ్రహించిన ప్రేయరును గూర్చి, దానిని నిర్వహించుకొనవలసిన పద్ధతిని గూర్చి ఈ గ్రంథం చాలా చక్కగా వివరిస్తుంది. ప్రేయరులోని వివిధాంశాలను గూర్చిన వివరణను అనుభూతిప్రదంగా అందిస్తుంది, గాయత్రి, శాంతిపారం, మైత్రేయస్తోత్రం మొదలైన ప్రేయరులోని అంశాలన్నీ పూర్వాపరాలతోసహా ఈ గ్రంథంలో వివరించబడ్డాయి. మాస్టరు సి. వి. వి. గారి ప్రణాళికను గూర్చి, ఆ ప్రణాళికలో మాస్టర్ ఇ. కె. గారి పాత్రగూర్చి ఈ గ్రంథం కావలసినంతగా తెలియజెబుతుంది.

## రామాయణము - మానవ ధర్మము :

దేవుడు మానవుడై, రామునిగా నిలచి, తన జీవిత విధానంద్వారా ఈ భూమి జనులకు స్పష్టంచేసిన మానవధర్మ వైఖరులను వివిధ కోణాలనుండి ఒడుపుగా పట్టి చూపిస్తారు శ్రీ కృష్ణస్వామి ఈ గ్రంథంలో. గురుశిష్యులుగా, తల్లిదండ్రులు-బిడ్డలుగా, అన్నదమ్ములుగా, ఆలుమగలుగా, స్నేహితులుగా, శత్రువులుగా ఒకరికొకరు దగ్గరైన వేళలలో మానవులైన వారు ఎలా మసలుకోవాలి అన్నచోట- రామాయణం ఏమని చెబుతున్నది, దారిని ఎలా చూపుతున్నది- అన్నది ఈ గ్రంథం మనకు తృప్తిగా అందిస్తున్నది.

## భారతం ధర్మాద్వైతం :

మానవులై జన్మించినవారు భూమిపైన సాధించవలసినదీ, అనుభవించవలసినదీ నాలుగే అంశాలు. అవే ధర్మార్థ కామమోక్షాలు. ఆ ధర్మార్థకామమోక్ష

యొక్క స్వరూపస్వభావాలను మనకు తేటతెల్లంజేస్తూ మహాభారతగాథలో అవి ఎలా సమగ్రంగా సమన్వయించబడ్డాయో ప్రబోధాత్మకంగా వివరిస్తుంది ఈ గ్రంథం. నిత్యజీవిత నిర్వహణలో పురుషార్థాల విషయంలో మనం సాధించుకోవలసిన సమన్వయ మేమిటీ అన్నది మనకు కరతలా మలక మవుతుంది ఈ గ్రంథం చదువుతున్నప్పుడు. ప్రతిష్ఠాకరమైన ఈ గ్రంథాన్ని సమర్పించే పిహెచ్‌డి. పట్టాన్ని స్వీకరించారు శ్రీ కృష్ణస్వామి. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి.

## శ్రీమద్భాగవతము - దివ్యజీవనమార్గము :

షుమారు రెండు సంవత్సరాలపాటు ఆంధ్రపత్రికలో వారం వారం ప్రచురింపబడుతూ వచ్చిన పవిత్ర గ్రంథమిది. శ్రీ మద్భాగవతములోని ప్రథమస్కంధానికి అపూర్వమైన ఉపబృంహణము. తేట తెనుగులో అవతరించిన మృదుమధుర వచన రూపము.

ఇది అక్షరధార— ఇది అమృతధార అంటున్నారు రజని. ఇది వెన్నముద్ద ఇది వెలుగుముద్ద అంటున్నారు కందర్ప. ఈ బాణి ఈ వాణి దివ్యమైనవి అంటున్నారు పరాశరం. ఇది అనుభూతి ఇది అభినందన అంటున్నారు మంత్రి. మరి మీరేమంటారు ! చదివి చూడండి. చదివి.... చూడండి ।

## పూజావిధానము — రుద్రాభిషేకము:

పూజ చేయుట దేవునికొరకు కాదు, దేవుని సన్నిధిలో అతని సారథ్యంలో మనను మనం పవిత్రీకరించుకొనుట కొరకు. అట్టి పూజ ఎంత శ్రద్ధగా చేసిన అంతగా ధన్యులము కాగలము. అందులకు మనకు పూజా విధానము తెలియవలెను. అది ఈగ్రంథమున ఉన్నది. షోడశోపచారపూజావిధానము, నిత్యాగ్నిహోత్ర విధానము, రుద్రాభిషేక విధానము ఈ గ్రంథము మనకు చక్కగాఅందంచగలదు. వేద భాగములైన శ్రీ సూక్త, పురుషసూక్త, నమక చమకము, మంత్ర పుష్పము, సస్వరముగా, ప్రామాణికముగా ఈ గ్రంథమునందు మనకు దర్శనమీయగలవు

## మాస్టర్ ఎమ్. కె. హోమియో తత్త్వశాస్త్ర ప్రవచనాలు :

భారతీయ తత్త్వశాస్త్రం ప్రాతిపదికగా సామాన్యునకు గూడ బోధపడు నట్లుగా సంతరించబడిన హోమియో గ్రంథం. సరళమైన భాష, సరసమైన రచన, సార్థకమైన నిర్వహణ, సమగ్రమైన వివరణ, అనుభూతి ప్రదమైన అభిభాషణ ! హోమియో తత్త్వశాస్త్రాన్ని వెన్నతో మెదిపి పెట్టగల అనన్య సామాన్యమైన గ్రంథం. 20వ శతాబ్దం మానవజాతికి అందిస్తున్న అపురూపమైన కానుక ఇది.

**మాస్టర్ ఎమ్. కె. హోమియో ఔషధశాస్త్ర ప్రవచనాలు :**

ప్రముఖమయిన హోమియో ఔషధాలను గూర్చి మనదైన వాతావరణంలో, మనమాటల్లో, కథా కథనశైలిలో పరిచయాన్ని ఒక దర్శనంగా అనుగ్రహించగలిగిన విశిష్టమైన రచన ఇది. వందల మానవ జీవితాల పోకడలను మనకు పొడగట్టిస్తూ, వారియెడల మనకు కావలసిన మేలుకొలుపును అనుగ్రహిస్తూ సాగిపోతుంది ఈ గ్రంథం. హెర్రింగు, ఎలనుల నుండి, జె. టి. కెంటు మాస్టర్ ఇ.కె.ల వరకు మహామహులందరూ ఈ రచనలో సమన్వయింపబడటం ఒక విశేషం. ఔషధాలు, ఔషధాలుగానేగాక, అస్త్రాలుగా, అస్త్ర అధిదేవతలుగా మనకు సాక్షాత్కరిస్తారు. ఔషధాలను ప్రజ్ఞామయమూర్తులుగా మనం దర్శించ గలుగుతామిందులో ! ఈ గ్రంథం యొక్క ప్రజ్ఞ అలాంటిది.

**జీవన యాత్రకు జ్యోతిషశాస్త్రం :**

పంచాంగాన్ని పరిచయం చేయడం ఈ చిన్ని గ్రంథానికి పరమావధి. ఈ గ్రంథం వలన పంచాంగాన్ని వినియోగించుకోవడం తెలుస్తుంది. తిథి, వార, నక్షత్రాదులను ఏకరువుపెట్టే స్థితినుండి, ఏ కరువూ లేకుండా వాటిని నిండుగా వినియోగించుకోగల సామర్థ్యం ఈ గ్రంథంవల్ల అబ్బుతుంది. పంచాంగాన్ని చూడటమేగాక, పంచాంగం ప్రకారం జీవితాన్ని నడిపి చూడడం చేతనవుతుంది. ఈ గ్రంథం జీవనయాత్రకు చుక్కాని వంటిది.

**భాగవత కథాసుధ :**

ఆకాశవాణిద్వారా అశేష ఆంధ్రజనులను పది వారాలపాటు అలరించిన భాగవత కథాసుధ ఇది. మధురమైన భాష, గంభీరమైన భావప్రకటన, శ్రోతలను తడిమిచూపే దర్శనం, ఎత్తులకు తీసుకువెళ్ళే వైభవం, అడుగడుగునా వెల్లివిరిసే గురుదేవుని దివ్యానుగ్రహం. ఈ కథాసుధకు పంచప్రాణాలు ! ఇప్పుడివి ఈ గ్రంథరూపంలో అందరికీ ఇలా పంచబడుతున్నాయి.

**కులపతి కృష్ణమాచార్య :**

ఇ. కె. మాస్టరుగారి జీవితచరిత్ర- సందేశము పడుగుపేకలుగా సాగిన సంక్షిప్త శబ్ద చిత్రమిది. పరిమాణంలో చిన్నదయినప్పటికీ ఎన్నెన్నో వన్నెచిన్నెలు చూపిన దివ్యగ్రంథమిది.

**తలపులు - మెరపులు :**

ఈ భూమినంతా తనరంగంగా స్వీకరించి, తన పాదస్పర్శతో దీనినొక శ్రీరంగంగా రూపొందించి విశ్వవ్యాప్తంగా, అన్నివైపులనుండీ ఏకకాలంలో వెలుగలను నింపుతూవచ్చిన కృష్ణమాచార్య ఒక గంభీరమూర్తి. ఒక నాయకశ్రేష్ఠుడు ఒక ఉద్యమకారుడు. అలాంటి దివ్యమూర్తి యొక్క అంతరంగమెలా ఉంటుంది

ఆ అంతరంగమెలా అంటుందో ఈ తలపులు-మెరపులలో మనం చూడవచ్చు. రంగమంతా ఆయనను చూచిన ప్రజలు ఆయన అంతరంగాన్ని చూచి, ఆ లోనికి ప్రవేశించే అవకాశమిచ్చే అనుభూతిప్రదమయిన దివ్యగ్రంథమే తలపులు-మెరపులు.

**ఇ. కె. మాట - జాతికి బాట :**

ఏ వాక్కులు గురుమూర్తి వేదికపైనుండి పలుకుతున్నప్పుడు నిద్రాణమైన స్థితిలోఉన్న మానవజాతి క్రమంగా మేలుకొంటూ వచ్చిందో అలా మేలుకొలుపు చెందుతూనే ఏ వాక్కుల ఊతంతో వెన్నెముక కలిగి ఈ జాతి నిలబడిందో, నిలబడిన జాతి ఏ వాక్కులను ప్రేరణగా తీసికొని జాతిహిత కార్యక్రమాలవైపు ఒక సేవాసైన్యంగా కదిలిందో, ఏ వాక్కులను గుండెలలో నిలుపుకొని, ఈ వసుధను ఒక కుటుంబంగా వసుధైక కుటుంబంగా దర్శిస్తూ, సకల భేదాలకూ అతీతంగా నిలచి, దివ్యత్వంతో వెలుగొందుతూ జాతిపునర్నిర్మాణాన్ని సాధించడానికై నడుంకట్టి, కదం త్రొక్కుతూ సాగిందో, వదంపాడుతూ పరవశించిందో అలాంటి వాక్కులకు, అలాంటి శక్తిమంతములయిన వాక్కులకు, అలాంటి జీవవంతమయిన వాక్కులకు, మానవజాతిని ఎప్పటికీ పునరుజ్జీవం చేయగలిగిన అపౌరుషేయమయిన ఆ వాక్కుల రూపకల్పనే ఈ ఇ. కె. మాట - జాతికి బాట !

**Initiations with Illustrations :**

*It is grand transmission of 'Darsanalu - Nidarsanalu' of English by Master M. K. himself. It is a special feature that this work is his first prose work both in Telugu and in English also. His stile shines forth in English also as it is in Telugu. Another feature it is throughly explained and expanded from Telugu in View of Universal citizen. May readers are enriched. enlightened and enjoyed the work.*

**'వేణునాదం' [మాసపత్రిక] :**

భారతజాతి పునర్నిర్మాణమునకు, ప్రపంచ జాతులకు సహజీవన మార్గమును ఉపదేశించుటకు ఉద్దేశించిన దివ్య మాసపత్రిక.

విడిప్రతి-3/-, సంవత్సర చందా-30/-, జీవిత చందా-600/- పోషకులు-2,300/-, రాజపోషకులు-4,000/-, మహారాజపోషకులు-6,000/- సభ్యత్వరుసుము ఎమ్. ఓ. లేక డి.డి.ల ద్వారా కూడా స్వీకరింపబడి, రసీదులు మీకు పంపబడతాయి. డ్రాఫ్టులు ది యూనివర్సల్ హ్యుమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్టు, విజయవాడ పేరిట పంపవలెను.

దినచర్యను దిద్దుకోనివాడు దేవుడితోడి అనుసంధానాన్ని కోరడం అది అత్యాశే కాగలదు. దినచర్యను తగిన విధంగా దిద్దుకొంటున్నవానికి దైవమే తానుగా దగ్గర కాగలడు.

* * *

పవిత్రగ్రంథాన వ్యక్తమవుతున్నదేమిటి ? ఋషివాక్కు. అది అయస్కాంతం లాంటిది. అయస్కాంతం ఇనుపముక్కను ఏం చేస్తుంది ? మరొక అయస్కాంతంగా మేల్కొలుపుతుంది. అలాగే ఋషివాక్కు మన వాక్కును కూడ అంత ఉదాత్తమయిన స్థితిలోనికి మేల్కొలుపుతుంది. అలా మేల్కొలుపబడిన వాక్కు అనుద్వేగకరంగా వరిల్లుతుంది. సత్యమై తీరుతుంది. ముచ్చట కలిగిస్తుంది. శ్రేయస్సును సాధిస్తుంది. ధన్యతను అందిస్తుంది.

* * *

నిజానికి ఈ పూజలన్నీ దేవుడికి అవసరమా ? లేదు. ఇవి మానవునికి అవసరం. దినచర్యను దేవునికి అర్చనగా నిర్వహించడమన్నది మానవ జీవితానికి పరమావధి.

* * *

నన్ను పొందేటందుకుగాను సాధకుడు చేసే ప్రయత్నం ఎన్నడూ దెబ్బ తినదు. దానికి ఆగిపోవడమన్నది ఉండదు. నన్ను శరణువేడు. సర్వధర్మాలను నాయందు సమర్పించు ! నేను నీకు కర్తవ్యాన్ని నిర్దేశిస్తాను. ఇక పాపపుణ్యాలతో నీకు పనిలేదు. సకల పాపాలనుండి విమోచనాన్ని అనుగ్రహించి, నిన్ను పునీతుడనుచేసి నిలబెడతాను. దిగులు పడవలసిన పనిలేదు.